శ్రీరామచంద్రాయనమః

# శ్రీ కృష్ణావతార తత్త్వము



వావిలికొలను సుబ్బరాయ

విరచితము

శ్రీకృష్ణావతార తత్త్వము

యను

చతుర్థ చుళుకము.

నాల్గవ కూర్పు.

ప్రకాశకులు :

శ్రీ కోదండరామ సేవక ధర్మ సమాజము

దాసకుటి - అంగలకుదురు



1994

[వెల : రు. 30-00

శ్రీరామచంద్రాయనమః

# శ్రీ కృష్ణావతార తత్త్వము.

వావిలికొలను సుబ్బరాయ
విరచితము

శ్రీకృష్ణావతార తత్త్వము
యను
చతుర్థ చుళుకము.

నాల్గవ కూర్పు.

ప్రకాశకులు:
శ్రీ కోదండరామ సేవక ధర్మ సమాజము
దాసకుటి - అంగలకుదురు

1994

 [వెల : రు. 30-00

# విషయసూచిక

## పీఠిక కృష్ణావతారతత్త్వము లోనగునవి గల నాల్గవభాగము.

### పీఠిక

| విషయ సంఖ్య | | పుట సంఖ్య |
|---|---|---|

శ్రీరామాయనమః

# శ్రీ కృష్ణ లీలామృత పీఠిక.

## కృతజ్ఞత.

ఉపకారికిఁ బ్రత్యుపకారముఁ జేయ శక్తిచాలనపుడు తదుపకారము స్మరించుటయైనఁ దగు. అటు చేయనివాఁడు కృతఘ్నుఁడు. ఏ పాతకమునకైనఁ బ్రాయశ్చిత్తము కలదుగాని మేలు మఱచువాని పాపమునకుఁ బ్రాయశ్చిత్తము లేదు. కావున నట్టి దోషమునకుఁ బాలుపడకుండుటకై యొకవిషయము లోకమునకు విన్నవింపఁ దలఁచితి.

కోలంక వీరవర గ్రామాదులకుఁ బ్రభువులైన మ-రా-శ్రీ, రాజా రావు చెల్లాయమ్మారావు బహద్దరుగారు సన్నుతులై యీ గ్రంథము ముద్రించుటకై రూ. ౧౦౦౦-౦౦ లొసంగిరనియు నీ విషయము పీఠికయందు విశదీకరించెదననియు రెండవభాగము ముఖపత్రమందు విన్నవించుకొని యుంటిని. వీరి కీర్తిప్రతిష్ఠ లుత్తర సర్కారు మండలములందు నవ్యాహతముగ వ్యాపించియున్నవి గాని వీరి సౌజన్య సౌశీల్య వదాన్యతా భక్తులగుఱించి తక్కువా రెఱుఁగరు. వీరు తొలుత శ్రీ కౌసల్యాపరిణయమును ముద్రించి ప్రకటించిన శ్రీమద్వినిగడప ఉంగ్రాజవరము జమీందార్ గారగు మ-రా-శ్రీ, వెల్లంకి వేంకటరామారావు బహదర్ వారి సోదరిగారు, ఆంధ్రవాల్మీకి రామాయణ సుభద్రావిజయంబుల ముద్రించి నా కుభయలోకసిద్ధి స్థిరపఱిచిన ప్రస్తుత పిఠాపురపు జమీందారుగారగు, మ-రా-శ్రీ, రాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహదర్ గారికిఁ జిన్నతల్లిగారు. వీరి కోడలుగారే శ్రీ రాజా రావు రామాయమ్మారావు బహదర్ వారు. ఈ గ్రంథమునకు ధనసాహాయ్య మొనర్చిన

దాత్రులు వీ రిరువు రే. వీరి పోష్యవర్గములోనివారే నాకుఁ బరమ మిత్రులయి యుండిన క్రొత్తపల్లి వేంకటపద్మనాభశాస్త్రి. ఈ శాస్త్రి గారి యర్భకుఁడును వీరి పోషణమందున్నవాఁడు. ఇప్పటి పీఠాపుర ప్రభువులు బాల్యావస్థయందుండునపుడు వారికిఁ దల్లియుఁ దండ్రియుఁ దామేయై వారి యోగక్షేమము లారయుచుఁ జెన్నపురినుండిన కాల మున నస్మన్మిత్రులు వీరి సుగుణముల వర్ణించి చెప్పుచు వారి స్వామి భక్తి వెలయించుచుండిరి. కౌసల్యాపరిణయ పీఠికలోని

సీ. రాజకళాంభోధి రాకాసుధాంశుభా
 వుక శీల గుణజాలు సుకలుఁ బెంపు
చెలఁగ సంతతబుధాశీర్వచనకలితో
 ల్లాసమానసు దయాభాసమాను
యాదుకులప్రవర పాదాంబుజాసక్త స
 వజ్ఞానిత చరితు దుర్జ్ఞాన రహితు
రాజతనిర్జరాంధ్రకళాబ్ధి మథనభ
 వ్యకసుధాస్వాదన పూతచిత్తుఁ
గీ. ప్రేమ వెల్లంకి వేంకట రామరాయ
మహిపవర్యుని నసమాన మహిముగాఁగఁ
బ్రోచుఁ గావుత నిరతంబు బుధ వినుతుఁడుం
చుట్టుఁగైదువు వలమురిఁ బట్టుప్రోడ.

అను నీపద్యమునకు వారే కారణభూతులు.

గతసంవత్సరమునఁ బద్మనాభశాస్త్రులవారి కుమారుని యుప నయనమునకై యా బాలునిఁ దోడ్కొని వీరి దర్శనమునకై పోయి

నపుడు బహువిధముల వీరు నన్ను సమ్మానించి యాదరించుచో
మద్గ్రంథముల ప్రస్తావన రాఁగా శ్రీకృష్ణలీలామృతము ముద్రింపఁ
బడుచుండుట తెలిపితిని. ముద్రణమైనంతవఱ కా గ్రంథమును బంపుఁ
డని వారు సెలవొసంగిరి నే నల్లే యప్పటికి ముద్రితమైయుండిన
౨౩ ఫారములు వారి మంత్రియగు బ్ర-శ్రీ, రా-శ్రీ, ఆకొండి వేంక
టరత్నము పంతులవారి పేరఁ బంపుకొంటిని. ఆవల నేను ఘటికాచల
నృసింహస్వామి సేవ సేయుచు నందుండి యొక శుక్రవారమునాఁడు
"ఘటికాచలవాస నృసింహ కేశవ" యను మకుటముతో నేఁబది
పద్యములు చెప్పి సాయంకాలమునఁ గొండ దిగిరాఁగా బ్ర-శ్రీ,
ఆకొండి వేంకటరత్నముపంతులవారి బరువైన యుత్తరము నాకొసఁ
గఁబడియె. అది విప్పిచూడ "మ-రా-శ్రీ, రాజారావు చెల్లాయమ్మా
రావు బహదర్ వారియొక్కయు, వారి కోడలు మ-రా-శ్రీ, రాజా
రావు రామాయమ్మారావు బహదర్ వారి యొక్కయు నాజ్ఞమేరకు
శ్రీకృష్ణలీలామృతము ముద్రణమునఁ గొంత సహాయపడునట్లు రూ.
౧౦౦౦-౦-౦ లు మీకుఁ బంపుకొంటి" నని యందు వ్రాయఁబడియుండె.
కృష్ణార్పణమస్తని గ్రహించితిని. ఈనాఁటి దైవచర్యచిత్రము.

ఈ రాత్రి యుషఃకాలమందే "యింకను నిక్కడ నేమి చేయు
చున్నాఁడవు. ఎన్నాళ్లుండెదవు? ఒంటిమిట్టకు రారాదా" యని
యిద్దఱు బైరాగి వేషధారులు పిలిచిరి. ఆ యుదయముననే సిద్ధ
వటము తహశీల్దారుగారగు మ-రా-శ్రీ, జయరామరావునాయఁడు
గారి యొద్దనుండి యొంటిమిట్ట దేవాలయవిషయమై యుత్సాహకరం
బైన యాహ్వానలేఖ యొకటి వచ్చెను. ఏకకాలమున నిన్ని సమ్మే
ళనమగుటచేతను, నప్రస్తుత గ్రంథవిస్తరభీతిని వచింపక విరమించిన
కొన్ని సందర్భములచేతను, నిది యంతయు దైవతంత్రమని నిశ్చ
యించుకొంటిని.

ఆంధ్రవాల్మీకి రామాయణ ముద్రణమునకై తొలుత శ్రీపిఠా
పుర ప్రభువులవా రిచ్చియుండిన ధనముతోఁ గాగితముల వెలలు మితి
మీఱి యుండుటచే నిప్పుడది ముద్రింప సాధ్యపడమి యోజించి

దానితో దీనినైన ముద్రింతమని వ్రాసుకొంటినిగాని కార్యమునకు దిగినవెనుక నామొత్తము దీనిని ముద్రించుటకును జాలదని తెల్లమగుట తెల్లఁబోయి యేమిరా దైవమాయని విచారపడుచుంటిని. అట్టి సమయమున భగవంతుఁ డీ సాధ్వీమఃతల్లుల హృదయముఁ బ్రవేశించి సాయపడఁజేసెను. ఈ సాహాయ్యమే లేకున్న నాల్గవభాగము ముద్రింపక యుండవలసి వచ్చియుండును. ఇప్పటికిని గొంత గ్రంథము ముద్రింపక మానవలసివచ్చెను.

శ్లో॥ తైర్దత్తాన ప్రదాయైభ్యో, యోభుంక్తే స్తేన ఏవస॥

యను భగవద్గీతావాక్యము చొప్పున, భగవంతుఁ డిచ్చినదానిని భగవత్కైంకర్యమందే వినియోగించుట ధనదాత్రులగు నీ పతీమతల్లులకుఁగూడ శ్రేయస్కరంబనియు, సింహాచల వరాహనృసింహస్వామికి సంవత్సరమునకు ౧౦౦౦-౦-౦ లు వరుమానమువచ్చు కేదారముల నొసఁగిన వీరికిఁ బిలిచినఁ బలుకు నొంటిమిట్ట కోదండరాములవారి కిచ్చుట సమ్మతంబుగ నుండక యేల పోవుననియుఁదలఁచి ౧౦౦౦-౦-౦ లు వెలగల యీ కృష్ణలీలామృత గ్రంథములను నొంటిమిట్ట కోదండ రాములవారి కైంకర్యమునకుఁ గా నిచ్చుటయ్యెను. ఈ విధముగ వీరిచ్చిన యీవి గ్రంథప్రకటనమునకు, గ్రంథమువెల కొంత తగ్గించి లోకుల కుపకారమొనర్చుటకు, భగవత్కైంకర్యమునకు సాయపడెను.

సీ. "అనఘు వెల్లంకవ్వాయశశి, జగన్నాథ
జలపాల శేఖరు చంకనిడిమి
పరమ వేంకట మహీపతి సూర్యరాయ నృ
పాలకఁ తీరవు కేలుపట్టి
సురుచిన వేంకట సూర్యకుమార మ
హీపతి కుమారకు నెత్తిపెంచి
ప్రథిత రామాంబికా రాజ్ఞి శిరోమణి
మూర్ధభాగమ్మును మూరుకొనుచు
నేలుబడినెల్ల నొకకంట నెపుడుఁజూచు
చలఘు చెలికాని సూర్యరా ట్తిలకుమాట

శ్రీరామ శ్శరణం మమ

# శ్రీమద్వేంకటేశ్వర రామాయణ ద్వితీయ సంపుటమునకు విరాళములిచ్చిన వదాన్యులు

## మహారాజ పోషకులు

1) శ్రీ శ్రీ శ్రీ సీతారామాంజనేయస్వామి
2) శ్రీ శ్రీ శ్రీ మత్తిరుపతి-తిరుమల దేవస్థానమువారు తిరుపతి
3) శ్రీ భైరవభట్ల చిననరసింగరావు, శకుంతలా దంపతులు హైదరాబాద్
4) శ్రీమతి గొల్లపూడి లలితాంబగారు అనకాపల్లి
5) శ్రీ డా॥ భైరవభట్ల వేంకట విశ్వనాథముగారు ,,
6) శ్రీ డా॥ జె. వి. యస్. యన్. రాజు, డా॥ విజయలక్ష్మి దంపతులు అనకాపల్లి
7) శ్రీ పల్లపోతు నూకరాజు, రత్నకుమారి దంపతులు అనకాపల్లి
8) శ్రీ కడ్మిసెట్టి సూర్యప్రకాశరావు, పాపరత్నం దంపతులు అనకాపల్లి
9) శ్రీ కొయ్యా చినసత్యనారాయణరెడ్డి, కాంతమ్మ దంపతులు అగనంపూడి
10) శ్రీ మెలవర్తి వరాహనరసింహము, సన్యాసమ్మ దంపతులు లంకెలపాలెం

కు మతిప్రతిభాభియోగ్యతలఁ దలయూఁచు
చతిశయిలు చెల్లమాంబ సన్నుతికిఁ దగదె."

సీ. "వితరణ విద్యలఁ బెట్టినపేరు స
మ్మాన్యశీలమునకుఁ మార్గదర్శి
ప్రథితధైర్యమునకు బంగరుకొండ స
ద్భక్తసంఘమునకుఁ బట్టుగొమ్మ
పుణ్యపుంజమునకుఁ బుట్టినయిల్లు యో
షిజ్జన ప్రతతికి నొజ్జబంతి
దైవభక్తిరతి కాద్యనిదర్శనంబు శ
స్తగుణరత్నములకుఁ దావలంబు
దీనజనకల్ప లతిక సాధ్వీమతల్లి
రావు సద్వంశ కలశ వారాశిపూర్ణ
సోమ వేంకటమహిపతి సూర్యరాయ
పత్ని యాచెల్లయాంబ కెవ్వారుసాటి."

సీ. "స్థాపించె నేయమ్మ తన పేరఁ బీఠికా
పట్టన ప్రోన్నత పాఠశాలఁ
గట్టించె నేధన్య ఖ్యాతిమై నత్తపే
ర మహిత లక్ష్మీనరసపురమ్మ
నెలకొల్పె నేదేవి నిజహృదయాబ్జంబు
నను భక్తిసింహాద్రి నారసింహు
వెలయించె నేరాజ్ఞి యలరత్న నగమున
సత్యనారాయణస్వామి భక్తి
నట్టి శ్రీచెల్లయాంబిక యనఘచరిత
నారవిశశితారక మగు యశముఁగోరి
ధర్మకార్యమ్ము లొనరించి తద్దనిగడు
వారిలో మునుమున్న చెప్పంగరాదె."

అను సర్వేశ్వరీయములోని పద్యములే యీప్రభువుల గుణగణములు చాటుచున్నవి. సర్వేశ్వరీయము పిఠాపురములోని సర్వేశ్వరునిపైఁ

జెప్పఁబడిన గ్రంథము. ఈ సర్వేశ్వరాలయమును మ-రా-రా-శ్రీ, రాజా రావు చెల్లాయమ్మరావు బహదర్ వారును వారి మంత్రియు సాధుజనోత్తముఁడునగు, బ్ర-శ్రీ, ఆకొండి వేంకటరత్నము పంతులు వారును నుద్ధరించిరి. ఈవిధముగఁ దల్లియగు మ-రా-రా-శ్రీ, రాజా రావు చెల్లాయమ్మరావు బహదర్ గారియుఁ, గుమారుఁడగు మ-రా-రా-శ్రీ, రాజా రావు వేంకటకుమారమహిపతి సూర్యారావు బహదర్ వారియు సాహాయ్యంబున నీ గ్రంథంబు లోకంబున వెలయింపఁ గలుగుటయ్యె.

ఇఁక నాంధ్రవాల్మీకిరామాయణము మూఁడవకూర్పు ముద్రితమగుటెట్లో తోఁపకున్నది. నీవు జీవించియుండఁగానే నీ గ్రంథము నకు నాస్తిశబ్దము పుట్టుట శోచనీయమని కొందఱెమరుగను గొంద ఱుత్తరముల మూలముగను జెక్కొట్టుచున్నారు. అనేకులు గ్రంథములకు వ్రాయుచున్నారు. "దారిద్ర్యమునఁ బెక్కు తనయులైన" నన్న సామెత నాయందును నన్వయించుచున్నది. దీని ముద్రించు నదుపాయ మేమి భగవంతుఁడు కల్పించునో తెలియదు. కాగితముల వెలలు చూచిన గుండెలు వ్రీలుచున్నది. పూర్వము పవుండు ౦-౨-౫ లకుఁ గొన్న కాగిత మిప్పుడు ౦-౧౨-౦ లకు నమ్ముచున్నారు. అదియు దుర్లభముగా నున్నది. "మూలపెరుమాళ్లు ముష్టికిఁబోఁగా నుత్సవ విగ్రహములు దధ్యోదనమునకై మూలిగె" నన్నట్లు రామాయణ ముద్రణమే కష్టసాధ్యముగనుండ నిఁక దానివ్యాఖ్యాన ముద్రణ మునుగుఱించి ప్రస్తావించుట సిగ్గుల చేటుగదా.

## గ్రంథమహిమ.

సాధుసత్తములారా!

శ్రీభగవత్కరుణాకటాక్షవీక్షణంబునను, భాగవత కృపాలేశంబునను, సుజనసేవ్యంబును, భవ్యంబును, సంసార తాపత్రయాతురులకు జీవాతువును, భక్తులకు జీవనంబును, యోగనిష్ఠులకు నిష్టంబును, సతీమతల్లుల కుల్లాసంబును, దపస్వులకు ధ్యేయంబును, సజ్జనుల కుపాదేయంబును, నపవర్గమార్గ గాములకుఁ బాథేయంబును, భవభయాప

హంబును, నభయము దావహంబును గర్ణరసాయనంబును నగు శ్రీకృష్ణ లీలామృతంబును మీఁకుఁ బేయంబుగఁ గరగతంబుఁ గావించి వీఁడు కృతార్థుండు గాఁగలిగె, ఏత దమృతాస్వాదనంబునకు క్షీరపారావార మథనంబు వ్యర్థంబు అమృతకరమండల గమనంబు నిరర్థకంబు. స్వర్గ యాత్ర ప్రయాసమాత్ర ఫలంబు లభించినను దత్ఫలబంధనంబు దంధ నంబు. స్వర్గవాసు లమృతాసులు దీని సేవింప నాసపడుటచే నుభయా మృతములకుఁ గలవాసి విశదంబు. కావున నిశ్శ్రేయసాసక్తులు శ్రద్ధా భక్తియుక్తులై యవ్యయంబు సులభంబునగు దీని యథేచ్ఛం బాస్వా దించి నిరామయులై శాశ్వతానంద మనుభవింతురుగాక. దుర్భరవిష జ్వర పీడితులకుఁ జక్కెరవలెఁ గేవల సంసారాంధువునఁ ద్రెళ్ళిన దివాం ధముల కియ్యది చేఁదైన నగుఁగాక. అట్టివారుకూడ రుచ్యము నాధి వ్యాధి హరంబునగు దీని దివ్యౌషధమని విశ్వసించి సేవించిరేని సుఖి తులగుదురు. కలదు గదా

శ్లో॥ అచ్యుతానంద గోవింద, నామోచ్చారణ భేషజాత్
నశ్యంతి సకలా రోగాః, సత్యం సత్యం వదామ్యహమ్॥

మ్మను శ్రీమన్నారాయణావతారమూర్తి ధన్వంతరసూక్తి.

భగవత్పాద తీర్థంబు ముమ్మాఱు గ్రోలుట సదాచారంబు. అందుఁ బ్రథమంబునఁ గాయశుద్ధియగు. ద్వితీయంబు ధర్మసాధకంబు. తృతీయంబు మోక్షప్రదంబు. అని తీర్థగ్రహణ సమయంబున స్మరిం పఁబడు మంత్రంబునఁ గలదు. కాయశుద్ధి యనుటచే ననాత్మ సంబంధ మంతయు గ్రహింపనగు. జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులే గాక మన స్సుకూడ ననాత్మవస్తువే కదా. ఆహారము మూఁడుగుణము. సాత్త్వి కాహారము భుజించువాని దేహము తొలుత శుద్ధమగు. ఆహార పదార్థములేగదా దేహముగాఁ బరిణమించుట. దేహతత్త్వమును బట్టియే కదా పదునొకొండింద్రియము లేర్పడును. కావునఁ దొలు తొల్త దేహమును బరిశుద్ధముగ నుంచుకొనినచో మనస్సు పరిశుద్ధ మగును. పరిశుద్ధమైన మనస్సుగలవాఁడే స్థిరమతియై మోక్షంబు సాధింపఁ జింతించును యత్నించును సాధించును.

శ్లో॥ యజ్ఞోదానంతపశ్చైవ, పావనాని మనీషిణామ్
ఏతాన్యపితు కర్మాణి, సంగంత్యక్త్వా ఫలానిచ
కర్తవ్యా నీతిమేపార్థ, నిశ్చితం మతముత్తమమ్॥
భగవద్గీత ౧౮-౫.౬. కృష్ణలీల సం-౨. పుట. ౪-౧౧. ౬.

యజ్ఞము (దేవపూజ) దానము (కృష్ణార్పణమని యిచ్చు నీవి) తపస్సు (భగవత్ప్రీతిగఁ జేయు వ్రతాదికము) లివి మమకారము మాని ఫలము గోరక కావించిన దేహి పవిత్రుఁడగును. ఇట్టివానిని మనస్సే సర్వదా యోగయుక్తమగును. "తపస్స్వాధ్యా యేశ్వరప్రణిధానాని క్రియాయోగ" యని కదా పతంజలి వచించెను. తపస్సనఁగా దేహమును దపింపఁజేయు వ్రతాదికము ఉపవాసాదులు. 'నతపస్వినో యోగః సిధ్యతి' యను వ్యాససూక్తివలనఁ దపస్సు లేనివాని కేయోగము సిద్ధింపదు. ఇష్టాహారము భుజించుచు నిష్టభోగము లనుభవించువానికి రోగము లభించునుగాని యే యోగము లభింపదు. స్వాధ్యాయమనఁగా మంత్రజపము. మోక్షశాస్త్రాధ్యయనమును, ఈశ్వరప్రణిధానమనఁగా సమస్తకర్మములు భగవంతునం దర్పించుచు నాయన నుద్దేశించి కార్యములు చేయుట. ఈవిధముగ నిష్ఫలముకానిదై, నిర్దుష్టమైనదై, యుత్తరోత్తరాభివృద్ధి గనుచు నెన్నఁడును జెడక సత్యమైన మహాఫలమునొసఁగు భగవత్సేవా ధర్మము నెవ్వఁడు నిర్వహించునో వానికి ముక్తి కరబదర సమానము.

ఈ సంప్రదాయము ననుసరించియే శ్రీకృష్ణలీలామృతంబు చులకత్రయంబుగఁ బ్రోల లోకులకు ముమ్మాటుగ నొసంగఁబడియె. అందుఁ బ్రథమంబైన మధురలీలామృతా స్వాదనంబుల దేహము మనస్సు గోపికలకువలె భగవదాభిముఖ్యంబు వహించి పరిశుద్ధంబగు. ఇష్టదేవతారాధనంబుఁ గావించి, మానప్రాణములు కృష్ణున కర్పించి నిద్రాహారాదుల రోసి, సంతతనందనందన కథాలాపలాలసలై కదా గోపకన్యకలు ముక్తి కన్యాసహవాసంబు గాంచఁగలిగిరి. కావుననె కదా "విష్ణుండు గోపికలతోఁ గ్రీడించిన కామవిజయ రూప రాసక్రీడను శ్రద్ధతో వినువాఁడును వినిపించువాఁడును, భగవంతునందుఁ

గామంబు జయింపఁగల పరభక్తినొందిి శీఘ్రకాలంబునఁ బూర్ణంబుగ హృదయ తాపంబులెల్లఁ బాయు"నని శ్రీశుకమహర్షి వచించె.

కావున శ్రద్ధతోఁ గ్రంథమముముక్షువు గ్రహించువాఁ డన్యో పాయముల జయింప సాధ్యముగాని కామమును జయించును. కామ మును జయించినవారు సర్వము జయించినవారే. గోపకన్యకలు స్త్రీలు బాలికలు పామరజాతిలోఁ జేరినవారగుటచే భగవత్సేవా రూపమున మోక్షమునొందుటకు నధికారనియతి లేదనియు, బాలుకు బాలికలు స్త్రీలు పురుషులు సర్వవర్ణములవారు పామరులు నధికా రులేయనియు నేర్పడుచున్నది.

ద్వితీయంబైన భూభారావతరణ లీలామృతంబు నాస్వాదించు వాఁడు నిజకరతలగత రాజ్యలక్ష్మినొల్లని శ్రీకృష్ణుండువోలె నర్థదా సుఁడు గాక ఫలాభిసంధి రహితంబుగ ధర్మార్థకామకర్మంబు లాచరిం చుచు భగవద్గీతార్థంబు గ్రహించి సూక్ష్మరూపియై హృదయాంతర్గ తుండైన భగవంతుని మనస్సుచేతను, జగద్రూపంబున స్థూలరూపియై గోచరించు నమ్మహాత్మ్మఁ దకరణంబులచేతను సేవించుచు భాగవత ధర్మం బనుష్ఠించు. ఇట్టివాఁడు స్వవర్ణాశ్రమోచిత ధర్మంబుల రోయక సమస్త కర్మంబులు ధర్మమూలంబులని భగవదాజ్ఞలని భావించుచు సర్వము భగవత్కళానిశేషంబని నిశ్చయజ్ఞానముగలవాఁడై లోక సేవయు గేహసేవయుఁ గావించుచుండు. భగవదుపదేశంబున గోపిక లెల్ల నిశ్శోకదా కృష్ణవియోగకాలంబునఁ గావించిరి.

తృతీయంబైన భవతారణలీలామృతాస్వాదనంబు చతుర్థపురు షార్థప్రదంబు. ప్రథమ వయస్సున దేహంబు శుద్ధంబుగావించుకొని దుష్కామంబు జయించి రెండవ వయస్సున ధర్మసహితంబుగ నర్థకా మంబుల సేవించువానికి నుద్ధవునకుఁ గృష్ణుఁడువోలె మోక్షమార్గం బుపదేశింప గురువు లభించును. 'నగురోరధికమ్' గురువునకంటె నధికుఁడు లేఁడు 'నాస్తితత్త్వం గురోఃపరమ్' గురువును మించిన తత్త్వములేదని నమ్మి నిర్వంచనముగ గురూపదేశ మభ్యసించువాఁడు భక్తి వైరాగ్యములకు నెలవై మననశీలుఁడై యోగమభ్యసించి భగవ

త్కటాక్షంబునకుఁ బాత్రుఁడై పరమపదంబు ప్రాప్తించు. ప్రతిజీవి దేహయాత్రకుఁ బరమోద్దేశ మిదియకదా. కావున శ్రేయస్కాములగు పుణ్యాత్ములు దీని శ్రద్ధాభక్తులతోఁ బలుమాఱు పఠింతురుగాక. యథాశక్తి యభ్యసింతురుగాక. వ్యక్తంబుగ నుక్తంబులుగాని రహస్య విషయంబులు మననశీలురకు నందం దప్పుడప్పుడు మనోగోచరంబగుచుండును గావున నొకతఱి పఠించి యావలనైవఁదగిన గ్రంథం బిది గాదు. ఈ విషయమున సహాయపడ "విశేషవిషయంబు" లను పేరఁ గొంత గ్రంథముఁ బ్రకటింప సమకట్టియు ధనాభావంబున గ్రంథబాహుళ్యమునకు వెఱచి విరమింపవలసి వచ్చెను. ఈ కారణంబుచేతనే శ్రీకృష్ణ జీవితకాలప్రశంసయు రాజయోగాభ్యాసవిషయ చర్చయుఁ బ్రకటింపక మానవలసివచ్చెను. 'యావత్తైలం తావద్వ్యాఖ్యాన'మ్మని కలదుగదా. ఈ మాత్రము లోకగోచరము కావలయుననియే భగవత్సంకల్పము కాఁబోలు.

ఈ గ్రంథమున 11-వ పుటయందుఁ గడపటఁ జెప్పినచొప్పున నిది యన్నితరగతులవారు పఠింపఁదగినది. అన్ని వర్ణాశ్రమముల వారు నన్ని వయస్సులవారు బాగుపడ నెఱుఁగఁదగు విషయములిందుఁ గలవు. అయిననేమి? 'అంగడిలో నన్నియున్నవి. అల్లుని నోర శనియున్నది' యను సామెత కలదుకదా. అనేకజన్మార్జిత పాపరాసులు క్షయించుకాలము వచ్చినఁగాని యెట్టివారును రామ కృష్ణ యనఁజాలరు. అట్టికాలము రానప్పుడు తన్నామోచ్చారణము చేఁదు ద్రింగుటవలెనుండును.

ఉ. అచ్చపుఁజీఁకటిం బడి, గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణులైన వారికిన్
జెచ్చెరఁ బుట్టునే యొకఁడు చెప్పిననైన, నిజేచ్ఛనైన, నే
మిచ్చిననైనఁ, గానలకు నేగిననైన, హరిప్రబోధముల్.

అని బమ్మెర పోతనామాత్యుఁడు వచించెఁగదా. ఇటివారి కిది బధిర శంఖారావము.

లోకమున లక్షణైకచక్షుస్కులు కొందఱు. కొందఱు లక్ష్యైక చక్షుస్కులు. లక్ష్యైక చక్షుస్కులు లక్ష్యములనెల్లఁ బరామర్శించి లక్షణములు గ్రహింతురు. దీనికి విశేషప్రతిభ వలయును. ఇది యందఱకు సుసాధము గాదు. లక్షణమునుబట్టి లక్ష్యముల నెఱుఁగువారు లక్షణైక చక్షుస్కులు. శ్రీరామావతారము త్రేతాయుగమునఁ గావునఁ ద్రేత యుగమునాఁటికి ధర్మమున నొక్క పాదమే లుప్తమైయుండుటను, నప్పటి జనులు జ్ఞానవంతులగుట నట్టివారికి నవతారమూర్తులగు శ్రీసీతా రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు తమ చర్యలచేతనే ధర్మవిధానం బుపదేశించిరి. వారి నడవడియే తమకుఁ బ్రమాణముగఁగొని యప్పటివారు లక్ష్యమునుబట్టి ధర్మలక్షణజ్ఞానము సంపాదించుకొనిరి.

ద్వాపరయుగమునాఁటికి ధర్మమున రెండుపాదములు లోపించుటఁజేసి లోకుల జ్ఞానము విశేషముగ సంకుచితమై యుండెను. కావున లక్ష్యమునుండి లక్షణము గ్రహింపఁజాలు శక్తి లేనివారగుటయే గాక పెద్దవారి చర్యయందే సందేహములుగలవా రగుచుండిరి. ద్వాపరమనఁగా సందేహము. కావున నల్పబుద్ధులకుఁ బెద్దవారి చర్యయే సాధువో తమ చర్యయే సాధువో యను సందేహము కలుగఁజొచ్చెను. అట్టి సమయంబునఁ బెద్దవారు ధర్మవిధానము నోరువిచ్చి చెప్పవలసివచ్చుటచేతనే యవతారమూర్తియగు శ్రీకృష్ణభగవాను లర్జునుని నుద్ధవుని నెపముగాఁగొని యోగవిద్యయంతయు నుపదేశించెను. వారికేధర్మము నేయోగము నుపదేశించెనో దానినే తాను నాచరణమునకుఁ దెచ్చెను. తన వాక్యములందు లోకులకు గౌరవబుద్ధి నిలుచుటకై బాల్యమునుండి నిజమాహాత్మ్యము నప్పుడప్పుడు ప్రకాశింపజేయుచుండెను.

కలికాలజను లితర యోగాధికారులు కాఁజాలమి నెఱింగి సర్వజన సుసాధనమైన భక్తియోగమునే కృష్ణుఁడు స్థాపించెను. ఉత్తమ జాతివారికిఁగాని నీచజాతివారికిఁగాని స్త్రీలకుఁగాని పురుషులకుఁగాని సద్గుణ సంపన్నులకుఁగాని దుర్గుణ పూర్ణులకుఁగాని భక్తియోగమే

శ్రేయోదాయకమని బోధించి యాచరింపఁజేసి దానిఫల మనుభవింపఁజేసెను. కలియుగ జనులకుఁ గామక్రోధాదులు త్యజింప సాధ్యము గామి తలపోసి యవియే ముక్తిసాధనములగు మార్గమును బోధించెను.

శ్రీమద్రామాయణము లక్ష్యగ్రంథము. శ్రీకృష్ణచరిత్రమున లక్ష్య లక్షణములు రెండును గలవు. శ్రీరామాయణమున యోగ విధానాదులు గూఢములు. శ్రీకృష్ణచరిత్రమునఁ బ్రకాశితములు. రెంటికిని భేద మింతియే. కావున శ్రీకృష్ణలీలామృతము స్త్రీలకుఁ బురుషులకుఁ జ్ఞానయోగులకుఁ గర్మయోగులకు రాజయోగులకు భక్తులకుఁ గులస్త్రీలకుఁ గులటలకు వేశ్యలకు నన్నివర్ణములవారికి భోగ్యమై యున్నది. పుణ్యాత్ములు సేవించి సుఖింతురుగాక.

ఆర్యులారా! సాక్షాద్భగవంతుఁడైన శ్రీకృష్ణమూర్తి వేణు నాదము గావించుటయు గోపికలచ్చటికిఁ బరువెత్తుటయు ద్వాపర యుగమునాఁటి వార్తయని తలంపకుఁడు. భగవంతుఁ డానాఁ డీనాఁ డననేల యన్ని కాలములందును వేణునాదమును గావించుచునే యున్నవాఁడు. "నామసమేతం కృతసంకేతం వాదయతే మృదువేణు" మ్మన్నట్టు మనపేరుపెట్టి పిలుచుచునే యున్నవాఁడు. వినుటకుఁ జెవులు గలవారికి వినవచ్చును. అట్లు వినువా రట్లుపోవువారు నేఁటికిని గలరు. ఆ నాఁడైనను గొందఱు గోపికలేకదా వినిరి పోయిరి. ఇంటిలోఁ గూర్చుండి తలుపులు మూసికొని పరధ్యానపరులై యుండువారికిని, విషయకోలాహలమున మునిఁగి యుండువారికిని నిద్రించువారికిని దమ్ము బిలుచువారి ధ్వని వినరానట్లు దేహమందలి ద్వారములు మూసికొనుటచేతనో విషయవాంఛల కోలాహలముచేతనో యన్య విషయాసక్తమైన మనస్సుగలవారికి భగవంతుని వేణునాదమునఁ బిలుపు వినరాదు. అంతరకోలాహల మణఁచి మనస్సును భగవదభి ముఖము గావించినయెడల నా నాదము వినవచ్చును. ఒక్కసారి యా నాదము చెవిలోఁబడెనా మరల దానినుండి మనస్సును ద్రిప్ప నెవ్వరి తరముగాదు.

కం. తలఁకెను గొబ్బునఁ జిత్తము
నలినాక్షుని మధుర వేణునాదము నా వీ
నులు సోఁకి నంత మాత్రన
చెలియా! యిఁకనేటి వెఱవు చింతింపఁగదే. భాగ.

యనునది యథార్థముగ ననుభవమునకు వచ్చుటయేగాక గోపిక లాచరించినట్లు తప్పక యాచరించువా రగుదురు. ఇట్లు వినిన వారు పీడు పాడుగానీ, సుతులు మృతులుగాని, పతులు గతులు చెడి పోనీ, దారలు చోరుల పాలుకానీ విత్తము పరాయత్తముగాని లక్ష్యము సేయరు. నిలువరు. వెను తిరిగిచూడరు. వారి మనఃప్రవాహము నాఁపుట కెట్టివారికి వశముగాదు.

పై యర్థము నీ శ్రుతివాక్యములు దృఢపఱుచుచున్నవి.

శ్లో॥ అహశ్చ కృష్ణ మహ రర్జునంచ
వివర్తతే రాజసి వేద్యాభిః
వైశ్వానరో జాయమానో నరాజా
అవాతిరత్ జ్యోతిషా తమాంసి॥

కృష్ణజ్యోతి (నల్లని వెలుతురు) అర్జునజ్యోతి (తెల్లని వెలుతురు) యని రెండు జ్యోతులు గలవు. ఈ రెండు వెలుతురులు నానావిధులఁ గార్యములు చేయుచుండును. ఈ వెలుతు రందఱ మనుష్యుల యందు వసించియుండును. వైశ్వానరుఁడను కృష్ణజ్యోతి రాజువలె నాజ్ఞాపింపఁ బుట్టినవాఁడు. (ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥ కృష్ణలీల సం-౨. పుట 429 పంక్తి 11-13 ) అర్జునజ్యోతి తన కిరణములచేఁ జీఁకట్లను బాఱఁదోలును.

శ్లో॥ అయం హోతా ప్రథమః పశ్యతేమామ్
ఇదంజ్యోతి రమృతం మర్త్యేషు
అయం సజజ్ఞే ధ్రువ ఆనిమత్తః
అమర్త్య స్తన్వా వర్ధమానః॥

ఈ కృష్ణజ్యోతియే మర్త్యులనందఱను దన వంకకుఁ బిలుచు ప్రథమహోత. లోకులారా! యాయనను వీక్షించుఁడు. అందఱాయనను బూజింపుఁడు. మర్త్యులం దీయనయే నిత్యమైన వెలుఁగు. ఆయనయే మనుష్యుల హృదయమందు ధ్రువమై చలింపనికాంతి (జ్ఞానమై)యై ప్రకాశించుచున్నవాఁడు. అది యమర్త్యమైనను దేహము వృద్ధియగు కొలఁది నదియు వృద్ధియగును. (పరిణామక్రమంబున జ్ఞానాభివృద్ధియు నగుచుండును) ఈ వైశ్వానరుఁడు పరమాత్మయని "వైశ్వానర సాధారణ శబ్దవిశేషాత్" బ్రహ్మసూత్రము ౧-౨-౨౪ చెప్పుచున్నది. లోపల ధ్వనించువాఁడు వైశ్వానరుఁడే యని "అయమగ్నిర్వైశ్వానరో యేనేదమన్నంపచ్యతే యదిదమద్యతే తస్యైషఘోషో భవతియమే తత్కర్ణావపిధాయశృణోతి సయదోత్క్రమిష్యన్భవతినైనం ఘోషం శృణోతి" బృహ. ౭-౯. ఈ వాక్యమువలనఁ గృష్ణుఁడు మనలఁ దొలుతఁ దానే పిలుచుచుండుట స్పష్టమయ్యెఁగదా. ఆయన పిలుపు వినువాఁడు కోటికొక్కఁ డెవ్వఁడో పుణ్యాత్ముఁడు. తక్కిన చోటులఁ జెవిటివానియెదుట శంఖమూఁదినట్లే యగుచున్నది. అయినను మనల రక్షింప దీక్షవహించినవాఁడు కావున విసుఁగు వేసట లేక యాయన వేణువు వాయించుచునే యుండును, విని వచ్చినవారితో రాసక్రీడ సలుపుచునే యుండును. 'నాదాకృష్ణ జగత్త్రియ' యని కదా కృష్ణునకు విశేషణము.

ఆర్యులారా! దీనివలన భగవంతుఁ డెంతటి కృపాళుఁడో మనల నెట్టులైన రక్షింప నెంత శ్రమించుచున్నాఁడో తెలియలేదా. మన మాయనను భజించుట కెంతోకాలము పూర్వమునుండియు నాయన మనల భజించుచున్నాఁడుకదా. మన మేలుకోరి మనలఁ జేరఁ బిలుచు రక్షకు నుపేక్షించువానికంటెఁ గృతఘ్నుఁడు నిర్భాగ్యుఁడు మఱి యెవ్వరు?

గీ. హరి రభిమానీ రజని రిదానీ మిద మపి యాతి విరామమ్
కురు మమ వచనం సత్వరరచనం పూరయ మధురిపుకామమ్॥

కృష్ణుఁడు ప్రేమగలవాఁడు. ఈరాత్రి(వలె జన్మము)కూడ వ్యర్థముగఁ గడచిపోవుచున్నది. నా మాట వినుము. శీఘ్రముగఁ దగిన ప్రయత్నముచేసి కృష్ణుని కోరిక నెఱవేర్పుము. (నీ వాయన పిలుపు విని యాయన యొద్దకుఁబోవుటే యాయన కోరిక) అని జయదేవుఁడీయర్థమునేకదా దూతీముఖమున బోధించెను. ఇంద్రియములసందడి మాని చిత్తమేకాగ్రముగ నుండినఁగాని యీ పిలుపు వేణునాదము వినరాదు.

ఈ వేణునాదమును గుఱించి యించుక ముచ్చటింపవలసి యున్నది.

గీ. ధీరసమీరే యమునాతీరే వసతివనే వనమాలీ
గోపీ పీనపయోధర మర్దన చంచల కరయుగశాలీ॥
నామసమేతం కృతసంకేతం వాదయతే మృదు వేణుమ్॥

మందమారుతము వీచు యమునాతీరమునఁగల వనంబున గోపికా కుచములఁ బీడించు కృష్ణుఁడు గోపికల సంకేత నామములఁ బెట్టి మెల్లగ వేణునాదమునఁ బిలుచుచున్నాఁడు. అని జయదేవుఁడు భాగవతము ననుసరించి వచించెను. ఇచ్చట నిర్జనవనమే హృదయాకాశము. యమునాతీరము సుషుమ్నానాడి

శ్లో॥ ఇడా భాగీరథీగంగా, పింగళా యమునానదీ
ఇడాపింగళయోర్మధ్యే, బాలరండా చ కుండలీ
గంగాయమునయోర్మధ్యే, బాలరండా తపస్వినీ
బలాత్కారేణ గృహ్ణీయా, త్తద్విష్ణోః పరమంపదమ్॥

అన్నట్టు యమునయనఁగా పింగళ. దాని తీరమనఁగా దానికిని నిడకును మధ్యదేశము గ్రహింపవలయును. ఇడా పింగళలకు నడుమ సుషుమ్నానాడి. మందమారుతము ప్రాణవాయువు. పూరక రేచకములు మెల్లగానేకదా కావింపవలయును. గోపికల స్తనము లనఁగా గోపికల హృదయములు. శ్రీకృష్ణుఁడే మీఁదఁ జెప్పిన కృష్ణజ్యోతి. ఈయన వేణునాదముచే గోపికలను బిలుచుచున్నాఁడు. వేణునా

దము గుఱించి యోగశాస్త్రంబు లిట్లు చెప్పుచున్నవి. ఈ నాదమే యోగులు గావించు నాదానుసంధానమును దెలుపుచున్నది.

శ్లో॥ శ్రూయతే ప్రథమాభ్యాసే, నాదో నానా విధో మహాన్
తతోభ్యాసే వర్ధమానే, శ్రూయతే సూక్ష్మ సూక్ష్మకః॥

రెండు చెవులలో నంగుష్ఠములఁ జొనిపి తొలుత నాదాను సంధానము చేయునపుడు నానావిధములైనమహాధ్వనులు వినవచ్చును. ఆవల నభ్యాస మధికమగు కొలఁది సూక్ష్మ మతిసూక్ష్మముగ ధ్వనులుం వినవచ్చును.

శ్లో॥ ఆదౌ జలధిజీమూత, భేరీ ఝుర్ఝర సంభవాః
మధ్యే మర్దలశంఖోత్థా, ఘంటాకాహళ జా స్తథా॥

తొలుత సముద్రము, మేఘము, భేరీ, ఝుర్ఝరము ధ్వనులవంటి ధ్వని వినవచ్చును. నడుమ మద్దెల. శంఖము ఘంట, కొమ్ము వీని వలనఁ గలిగిన ధ్వనులవంటి ధ్వనులు వినవచ్చును.

శ్లో॥ అంతేతు కింకిణీ వంశ, వీణాభ్రమర నిస్వనాః
ఇతి నానావిధా నాదాః శ్రూయంతే దేహమధ్యగాః॥

కడపట మువ్వలు, వేణువు, వీణ, తుమ్మెదలు వీనివలనఁగలుగు ధ్వనులవంటి ధ్వనులు వినవచ్చును. ఈ విధముగ నానావిధ నాదములు దేహమధ్యమున నుండునవి వినవచ్చును.

ఈ వాక్యములవలన నాదానుసందానము చేయు యోగికి నభ్యాసము ముదుర ముదురఁ గడపట వేణునాదము వినవచ్చునని యేర్పడుచున్నది. కావున నీ నాదము వినవచ్చునప్పటికి నాదమునఁ జిత్తము లయించి యుండును.

శ్లో॥ మకరందం పిబన్ భృంగో, గంధం నాపేక్షతే యథా
నాదాసక్తం తథాచిత్తం, విషయాన్నహికాంక్షతే॥హఠ.ప్రదీ.

తేనెను ద్రావినతుమ్మెద వాసనను గోరనట్టు నాదాసక్తమైన చిత్తము విషయములం గాంక్షింపదు. కృష్ణసక్త గోపికల మనస్సిట్టిదే కదా యయ్యెను.

శ్లో॥ యత్రనాదే యదాచిత్తం, రమతే యోగినో భృశమ్
విస్మృత్య సకలం బాహ్యం, నాదేన సహ శామ్యతి॥ శివసం.

నాదమందు రమించు యోగిచిత్తము బాహ్యవిషయముల నెల్ల మఱచి నాదమునందే లయించును. వేణునాదము వినిన గోపికల కీయవస్థ సంభవించెఁగదా.

శ్లో॥ ఏతదభ్యాస యోగేన, జిత్వాసమ్య గ్గుణాన్ బహూన్
సర్వారంభ పరత్యాగీ, చిదాకాశే విలీయతే॥

ఈ విధముగ నభ్యసించు యోగి గుణత్రయముల గెలిచి సర్వ కార్యములు వదలి చిదాకాశమందు లయించును. గోపికలు గుణ ములనెల్ల నతిక్రమించిరని శుకయోగి వచించెఁగదా. (చూ. కృష్ణ లీల పుట 180.)

"న నాదసదృశోలయు" యన్నట్లు మనోలయము గోరువారికి నాదాను సంధానముతో సమానమైనది వేఱొండు లేదు.

నాదాను సంధాన ఫలమిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో॥ అనాహతస్య శబ్దస్య, ధ్వనిర్య ఉపలభ్యతే
ధ్వనే రంతర్గతం జ్ఞేయం, జ్ఞేయస్యాంత ర్గతం మనః
మన స్తత్ర లయంయాతి, తద్విష్ణోః పరమంపదమ్॥

అనాహతధ్వని వినువాఁడు ధ్వనికి నంతర్గతమైన జ్ఞేయమును= స్వప్రకాశచైతన్యమును గాంచును ఇట్లు గాంచఁగా మనస్సు జ్ఞేయా కారమునుబొంది యందు లయించును. అదియే విష్ణుదేవుని పరమ పదము. వేణునాదాను సంధానముచేసిన గోపికలకు మనోలయము లభింపఁ దన్మయత్వంబు నొందిరిగదా.

"తద్విష్ణోః పరమంపదం, సదాపశ్యంతి సూరయః" యన్నట్లు గోపికలు విష్ణు పరమపదమును జూడఁ గలిగిరిగదా. గోపికా కృష్ణ చరిత్రము చదువునపు డీ నాదానుసంధానరహస్యము మనస్సులం దుంచుకొని పాఠకులు పఠింతురుగాక. తక్కిన విషయంబులు కృష్ణావ తార తత్త్వంబునఁ జర్చింపఁబడినవి.

విష్ణు పరమపదముఁ జూడఁ గోరువారు 'తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య' యని శ్రీకృష్ణుఁడు చెప్పినటు లింద్రియములను స్వాధీనమునకుఁ దెచ్చుకొనవలయును. ఇంద్రియము లాహారపోషితములు గావున నింద్రియజయము గోరువాఁ డాహారనియమము కలవాఁడు కావలయును.

శ్రీకృష్ణుఁడు వచించినట్లు జిహ్వను జయింపనివాఁడు దేనిని జయింపలేఁడు. జిహ్వను జయించినవాఁడు దేనినైన జయించును.

కావున నార్యవంశ సంభూతులగు మిత్రులారా! మీరు స్వశ్రేయస్సాధనముల రయితిరేని యాహారనియతిని బాటింపుడు. ఆఁకలి నణఁప సాత్త్వికాహారమును గొందురుగాని భోగార్థము భోజ్యాభోజ్యములు వేళావేళలు పాటింపక యేకశ్మలమైన నోరఁ గొట్టుకొనకుఁడు. ఇది తత్కాలమున భోగముగఁ గానవచ్చినను రోగహేతువు. భోజ్యాభోజ్య, మేధ్యామేధ్య, వేళావేళ విచారములేక గతుకు మనుష్యునకుఁ బందికి నేమి భేదము? అనావశ్యకముగ భుజించుటవలన నెన్నియో గీడులు గలవు. ఆరోగ్యము నష్టము, వృథా ధననష్టము. ఇంద్రియలోలత్వము లాభము ఒకప్రక్క నొకపూఁట నంబలికైన లేక బీదలు కృశించుచుండఁ జూచుచు మనము వ్యర్థభోజనము చేయవచ్చునా? మనము వ్యర్థభుక్తి మానినయెడల బీదలకుఁ గొంత ప్రత్యక్షముగనో పరోక్షముగనో యాహారమును గల్పించినవార మగుదుముకదా. లోకసేవ యిదియో లోకసేవ లోకసేవ యని దేశభక్తి దేశభక్తి యని గంతులు పెట్టుటో యాలోచింపుఁడు.

దృష్టాంతము నిమిత్తమై మహామారివలె మన వారియందు వ్యాపించియుండు నొక తెగులు గుఱించి చెప్పెదను.

ఇప్పుడు మనవారు విధినిషేధములు పాటింపక మేలు గీళ్లరయక లాభనష్టము లాలోచింపక పిన్నలు పెద్దలు మగవారాఁడువారు ముత్తైదువలు ముండమోపులు ధనులు నిర్ధనులు వేలాము వెఱ్ఱిగఁ ద్రాగు టీకాఫీసీళ్ల గుఱించి యాలోచింతము.

టీ కాఫీనీళ్లవలని లాభము.

విషపదార్థము లెట్లు మందులోఁజేర్చి రోగుల కియ్యవచ్చునో యట్లు వీనిని నౌషధములుగా నీయవచ్చును.

నష్టములు.

ఆహారములా? కావు. అన్నమువదలి వీనినే త్రావి జీవించు వాఁడు లేఁడు.

ఆరోగ్యకరములా? కావు. ఇది తొలుత జీర్ణకోశమును దుర్బలమును జేయును. జీర్ణకోశము చెడినప్పు డేయేరోగములు పుట్టవలయునో యాయా దేహతత్త్వముకొలఁది మలలు మధుమేహము శూలలు నేత్రవ్యాధులు తలనొప్పులు లోనైనవి కలుగును.

బలకరములా? కావు. సారాయమువలెఁ దత్కాలమునకు నరముల కుద్రేకము కలిగించినను పిమ్మట నరముల నంతకంత దుర్బలములఁ జేయును.

రుచ్యములా? చల్లారినతరువాతఁ ద్రావినయెడల వాని రుచి తెలియును. ప్రత్యక్షముగఁ బేఁడనీళ్లే.

ఆవశ్యకములా? కావు సాధారణముగాఁ దొమ్మిది పదిగంటల లోపల భోజనములగును గనుక నీ లోపల నాహారముగొనుట యావశ్యకము గాదు.

ధనలాభముకలదా? లేదు. వీనికిఁ బెట్టు ద్రవ్యము పాశ్చాత్యులు తినిపోవుచున్నారు. దీని కుపయోగించు చక్కెరకై యిచ్చు ద్రవ్యము లక్షలకొలఁది పరదేశములకుఁ బోవుచున్నది. దేశములో నుత్పత్తియగు పాలు వీనికై యుపయోగించుటచేత పాలు పెరుఁగు నెయ్యి వెలలు మిక్కుటమై సహింపరాకున్నవి. ఆహార పదార్థములయిన పాలు పెరుగు నెయ్యి దుర్లభమగుటవలఁ గలుగు కీడు బుద్ధిమంతు లాలోచింపవచ్చును. అంతియగాక యీపాలమ్మువా రెన్ని దొంగతనములకు నసత్యములకు ద్రోహములకైన జంకకున్నారు. దూడలకుఁ బాలులేకుండఁ జేయుటచే వాని నోటిపాలు తీసిన పాపముకఁ టీ కాఫీనీళ్లు త్రాగువారు పోవుచున్నారు. మంచి దూడలు

కలుగుచున్నవి. ఇంతేకాదు. వీనిని త్రాగుటవలన సంభవించిన రోగములకై వైద్యులకు దండుగులకు చెల్లింపవలసియున్నది. కాఫీ హోటల్సనఁబడు బాఁపన కల్లుగుడిసెలలో నొకఁడు త్రాగిన యెంగిలి బోకితోనే యందఱు త్రాగుటవలన నాచారము మాలలపాలై పోవుట యటుండ నొకరిరోగము లొకరికి సంక్రమించుచున్నవి. ఈ గుడిసెలలోని బాఁపన యీడిగవాండ్రు కాఫీబదులు సీకాయ విత్తనములను జక్కెఱకుబదులు బెల్లపు గోతముల నానఁబెట్టిన నీళ్లను నుపయోగించుచున్నారు. దీనికిని బనికిరానివారీ గుడిసెలవలనఁ ద్రాఁగుబోతుల మూలమున ధనికులగుచున్నారు.

సారాయమునకు వీనికి నించుకైన భేదము లేదు. *బాలెంతలు త్రాగిరా బిడ్డలకుఁ జేటు. ఇట్టి విషపదార్థములను గొందఱు తమ చేతులార శిశువులకుఁ బోయుచున్నారు. వీరు పూతనలో రెండు కాళ్ల పశువులో.

దేవసేవకులమని వేషములు వేసికొని తిరుగు పుణ్యాత్ములారా! మీరు తొలుత నీయమేధ్యరసమును బానముచేయు దురభ్యాసమును జాలించిన దేశమున కెంత మేలుగలదో యాలోచింపుఁడు. అట్టులే యనారోగ్యకరములు ననావశ్యకములు ధననష్టికరములు విజాతీయములగు నుడుపుల మానుఁడు. ఈమాత్రము చేయువారు దేశప్రజల కెంతో మేలుచేసినవారగుదురు. కొంతవఱ కావశ్యకము వంశపరంపరాగతము ననిషిద్ధమునగు కల్లును హీనజాతులవారు తటాలున మానుకొనఁగా బ్రాహ్మణులీ టీ కాఫీనీళ్లను మానరేని యింతకంటె

---

* "There was a time when tea and coffee were considered harmless beverages but Mr Bernar Macfadden, Dr. Kellogg and others have shown that they are as harmful as alcohol in the long run. Dr. Kellogg thinks that 'more harm is done at the present time by tobacco, tea and coffee, than all forms of alcobolic drinks combined" and he deems it of the greatest importance that the efforts of temperance workers should be turned in that direction.

THE INDIAN HUMANITARIAN.,
*Jan. & Feb, 1912.*

నీచులెవరు? మతిహీనులెవరు? హీనజాతులవారు ఛీ కొట్టువటి కీ దుర్గుణములను బ్రాహ్మణులు మానరు.

అన్ని దుర్గుణములు మానుటకు నన్ని కార్యములు చక్కఁగ నెఱవేఱుటకు దేశసేవ ఫలవంత మగుటకు దేవసేవ తొలుతఁ గావింప వలయును. దేవసేవ చేయువారికి సకలకార్యములు సుకరములు సఫలములగుటయే కాక యైహికాముష్మిక సుఖంబులును గలుగు. దైవ సాహాయ్యములేక యే కార్యము నెఱవేఱదు. కావున దైవబలము మొదట సంపాదించుకొనవలయును. దేవసేవచేసి దేశసేవచేసిన సఫలము వశపడునని యాశబ్దముల విశేషాక్షరముల వరుసయే తెలుపుచున్నది. అటుగాక దేశసేవ ముందుంచి దేవసేవ వెనుకకు నెట్టిన నది శవసేవయని యాపదముల విశేషాక్షరముల వరుసయే తెలుపుచున్నది. కావున దేవసేవ చేయుచు దేశసేవ చేసినయెడల దానికిఁ గావలసిన బలధైర్యస్థైర్య సహాయసాధన సంపత్తులన్నియు దైవమే సమకూర్చును. నమేభక్తః ప్రణశ్యతి యని భగవంతుఁడు చెప్పెను.

కావున నవనాగరకతా పిశాచగ్రస్తులారా! టీకాపీనీళ్ల నవలఁ బాఱఁజల్లి కష్టరసాయనమును కామామృతమును బానము చేయుఁడు. టీ కాపీల కగువెలలో సగమునకు బీదలకన్నము పెట్టుఁడు. మెడపలుపులు ధరించుట పశుత్వ చిహ్నమనియు జుట్టు కత్తిరింపులు బానిసల చిహ్నమనియుఁ బూర్వులు చెప్పిన సూక్తిమఱవకుఁడు. పశుప్రాయులుగను బానిసలుగా మనమున్నను దానిని మనమే చాటించుకొనుటేల? మాంసము తినువాఁడు ప్రేగులు మెడలో వేసికొనునా? దినదినము మీరాయంతట మీరే గోఱుగుకొను కాలములోను దలలు దువ్వుకొను కాలములోను సగము కాలము దైవప్రార్థనకయి విడువుఁడు. అక్కఱమాలిన మేజోళ్లు కుత్తతిత్తులు లోనగు నుడుపులకగు వెలలోఁ బాతిక భాగమునకు బీదలకు వస్త్రదానము చేయుఁడు. అనావశ్యకము లనారోగ్యకరములగు వెఱ్ఱి విజాతీయ వేషములు తిండిపోతుతనములు దేశము నుద్ధరింపఁ జాలవు. మిమ్ముఁ జెఱుపక మానవు.

మీ భార్యలు బిడ్డలు మాలలయొద్ద మాలవిద్యలు మంగల విద్యలు దురాచారములు దుర్నీతులు నేరువకుండఁ గాపాడుకోనుఁడు. మీరు చెడినది చాలును. మతాచార క్షేమములకు నస్తిబారము వంటివారగు స్త్రీలను సహితము చెఱుపకుఁడు. వారిని మతహీనుల మతిహీనులఁ జేయఁ బ్రబలప్రయత్నములు చేయుచుండు క్రైస్తవ మత బోధకులకు మీరు తోడుపడకుఁడు. ఈ మాత్రము మీరు చేసితిరేని దేశము బాగుపడును. మీరును బాగుపడుదురు. శ్రీకృష్ణ రామ చరిత్రములను మీరు పఠించితిరేని మీ కర్త్వాకృత్యములు తెలిసికొన వేఱుగ్రంథములు చదువఁబనిలేదు. వాస్తవముగ బాగుపడ నభిలాష గలవాఁ డెఱుఁగఁదగిన విషయములన్నియు నీ రెండు గ్రంథములందుఁ గలవు. ఫలము శ్రద్ధాభక్తుల కొలఁదిగనుండును.

సతీమతల్లులగు తల్లులారా! మీశక్తి యత్యద్భుతము, లోకము చెఱుచుట బాగుపఱుచుట మీ చేతిలోని కార్యము. లంకారాజ్యము నాశము చేసినది స్త్రీగదా. కౌరవకులవన దావానలము స్త్రీగదా. మహమ్మదీయ రాజ్య వృక్షకుఠారము స్త్రీగదా. పురుషుని బతితుని జేయుటకుఁ బతితుని బునీతుని జేయుటకు మీరే సమర్థులు. బ్రతికిన మగనిఁజంపుటకుఁ జచ్చినమగనికిఁ బ్రాణమిచ్చుటకు మీరే కుశలలు. మగల సౌఖ్యము సిరి - కీర్తి - యాయువుఁ బెంపుటకుఁ ద్రుంచుటకు మీరే నిపుణలు. మీమగల యాయువు పెరుఁగుట మీ కరగతము. మీ పుణ్యప్రవర్తనము పురుషుల సుఖశ్రీకీర్తులను నాయువును బెంచి స్వర్గగాములఁ జేయును. మీ దుష్ప్రవర్తనము వారి నుభయలోక భ్రష్టులఁజేసి నరకగాములఁ జేయును. భార్య చేసిన పాపంబున భర్త వేగమ చచ్చునని సీతాదేవి చెప్పెఁగదా. భగవంతుఁడు బురుషులు పిలిచిన రాక యుండఁగలఁడుగాని స్త్రీలు పిలిచిన రాక యుండఁ జాలఁడు. స్త్రీల నుద్ధరించుటకై కదా భగవంతుఁడు శ్రీరాముఁడై శ్రీకృష్ణుఁడై యవతరించుట. శీలవతుల దుస్థితిఁ జూడఁజాలక రాముఁడయ్యెను. భక్తురాండ్ర దుస్థితిఁజూడఁజాలక కృష్ణుఁడయ్యెను. శీలము భక్తిగల మీకు సులభుఁడై వశుఁడైనట్టు భగవంతుఁడు పురుషు

లకుఁగాఁడు. శీలము భక్తిపురుషులకంటె మీకు సులభసాధ్యములు, ఎన్నియోగములైన నెన్నితపములైన నారెండొసఁగుఫలము నొసఁగఁ జాలవు. ఈ విషయము చక్కఁగ నాలోచించి తెలిసికొని చెప్పుచున్నాఁడను. శీలభక్తులు మీకు స్వభావసిద్ధములగుట సులభసాధ్యములు. కావలయునని మీరు ప్రయత్నపడి దుర్మార్గమునఁ బోవలయుననినఁ బోవలయునుగాని సహజముగఁ గాదు. స్త్రీ సాధువని వ్యాసులేల చెప్పెనో మఱవకుఁడు.

సోదరీమణులారా! యీ కాలమునను భరతఖండము మీవలననే యుద్ధారము కావలసియున్నది. జారస్త్రీల మరగిన దుర్వ్యసనులవలెఁ బురుషులు పాశ్చాత్యసంగతి సర్వభ్రష్టులగుచుండ నార్యవ్రతము మిమ్ము శరణొంది సురక్షితమై యింతవఱకుండినది. పాశ్చాత్య సహవాసమున మతిచెడిన కొందఱు పురుషులు కామాంధులై మిమ్ము వక్రమార్గమునకు నయభయముల నీడ్చుచున్నారు. వారి బెదిరింపులకు భయపడకుఁడు. ఇచ్చకములకుఁ జెవి నీకుఁడు. నక్కటక్కులకు బేలుపోకుఁడు. స్త్రీలు పుట్టినది పురుషుల కామతృప్తికి మాత్రమే కాదు. అసన్మార్గవర్తులగు పురుషులను జక్క దిద్దుభారము మీయందున్నది. ఆ నేర్పు మీకే కలదు. మీకు పూనిన నది గడియలోని కార్యము. స్వదేశ - వేష - మతాభిమానములు లేక దైవభక్తి శూన్యులై సదాచారసంపత్తిహీనులై శిశ్నోదర పరాయణులై పశువులవలె మీభర్తలు చరించిరేని కృష్ణలీలామృతంబున సం-3 49-50పుటలయందు భార్య భర్తనడిగిన ప్రశ్నమే మీరు నడుగుఁడు. అప్పటికి వారు కన్నులు తెఱచుకొనక పోయిగా మీరైనను వారి నుద్ధరింపఁ బ్రయత్నింపుఁడు. శీలమెట్టిదైనది యార్యచరిత్ర రత్నావళులందు విశదీకరింపఁబడినది. స్త్రీలు సహధర్మచారిణులు గాని సహాధర్మచారిణులు గారు. మగఁడు ధర్మకార్యము చేసెనేని మీరును దోడుపడవలయును గాని మగఁడు శాస్త్రవిరుద్ధకార్యము చేసిన మీరును జేయవలయునని నియతిలేదు. పురుషుఁడు కన్నుఁగానక బావిలో దూఁకిన స్త్రీయును దూఁకవలయునా? ఒడ్డుననుండి రక్షింపవలయునా? అట్టులే పురు

షుఁడు నరకము పాలగుచుండ స్త్రీయును నట్టులేయైన నిఁక వీరల రక్షించువా రెవరు ? పతితుఁడగు పతిని సతి విడువవచ్చును.

ముక్తులగువఱకు భార్యాభర్తృ సంబంధ మెన్ని జన్మములకైన వదలిపోవునదిగాదని చక్కఁగ మనస్సున నిలిపి సుఖయాత్రచే గమ్య స్థానము శీఘ్రముగఁ జేర నాలోచింపుఁడు. భర్తయందు సగము భార్య కావున నిమ్మతిక్రమించి పురుషుఁ డేకార్యముఁ జేయఁజాలఁడు. కర్మము మనచేతనుండ గుఱ్ఱమేమి చేయఁగలదు ?

మీఁద జెప్పఁబడిన భక్తి పతిభక్తియే. గోపికలకు సాక్షాద్భగవంతుఁడు లభించినట్లు మీకు లభించిన నాయనకై సర్వము పరిత్యజింప వచ్చునుగాని యిప్పుడు సాక్షాద్భగవంతుఁడు లేఁడు కావునఁ బతియే దైవమని భావింపవలయును. చంద్రమతి దమయంతి సావిత్రిలోనగు వారు పతిదేవతలని యీ కారణముచేతనే చెప్పఁబడిరి. పతి భక్తిలేని దైవభక్తివ్యర్థముదైవభక్తిలేనిదైనను బతినేదైవముగభక్తిచేభావించు నిల్లాలు కృతార్థురాలు. నిర్జీవములైన మృద్దారు శిలావిగ్రహము లును మీభక్తికిమెచ్చి మీ యభీష్టము లొసగూర్చు నేని ప్రాణయుక్తుఁ డైన భర్త మీరు భక్తిగలవారలైతి రేని మీ యభీష్టములు నెఱవేర్పఁ జాలకపోవునా ? ఎందైనను మీ కోరికల నెఱవేర్చునది మీ భక్తిగాని మీయెదుటి ప్రకృతి పదార్థములు గావు. సం-4. పుటలోని క్రైస్తవమత బోధకుని చర్య పఠింపుఁడు. గోపికలకుఁ గోరిక నెఱవేర్చినది వారు పూజించిన యిసుకకుప్పలా ? వ్యాసులవ్యాసకు విష్యనోసఁగినది మట్టిబొమ్మ యా ? మార్కండేయుని రక్షించినది రాతిలింగమా ? మఱియు నాం డాళు బీబీనాంచారు మీరాబాయి లోనగువారి చరిత్రములు స్మరిం పుఁడు. కావున ఫలము భక్తిని బట్టి యుండునుగాని వస్తుతత్త్వమునుబట్టి గాదు. తమయం దేదోషము లేకున్నను సీతా ద్రౌపదీ దమయంతీ దమయంతీ చంద్రమతులు పతులకై యెంత శ్రమించిరో యెన్నికష్ట ముల వహించిరో యాలోచింపుఁడు కులస్త్రీ ధర్మముమానక, కామ దాసులు కాయుకూఁతలు వినక, మీయందుఁగల శక్తిసామర్థ్యములు సద్వినియోగపఱిచి పాశ్చాత్యసంగతి కులనీతి మతాచారహీనులై

వర్తించు మీభర్తలను దన్మూలమున దేశమును సనాతనధర్మమును రక్షింపుడు. విశ్వస్తులారా! తమ కామసంతర్పణమునకై మీయం దత్యంతప్రీతి గలవారుపోలె మీకై కన్నీరుగార్చువారలను, మీపేరు పెట్టుకొని పత్రికలందు వగలేడ్పులేడ్చు మగముండలను శత్రువులవలె భావింపుడు. స్త్రీలకైనను బురుషులకైనను గామము (మందు దుష్కామము) శత్రువనిన కృష్ణువాక్యంబులు స్మరింపుడు. శీలసదాచారముల మానకుడు.

పతిభక్తి యావశ్యక మనినంతమాత్రమున దైవభక్తి కూడదని యర్థము గాదు. పురుషులకంటె స్త్రీలకు భక్తి కుదురుట సులువు. దానికిఁ గారణము గ్రంథమునఁ దెలుపఁబడియున్నది. భక్తి ప్రేమయే. బిడ్డలయందుఁ దండ్రికిఁగల ప్రేమకంటెఁ దల్లికిఁ బ్రేమ యెక్కువ. భార్యయందు భర్తకుండు ప్రీతికంటె భార్యకు భర్తయందుఁ బ్రీతి హెచ్చు. స్త్రీలు సహజముగ ప్రేమవతులు. కావుననే భక్తిమతులు. కాంతాసక్తి పరమవిరహాసక్తి స్త్రీల కలవడినట్లు పురుషుల కలవడవు. కావుననే యాళ్వారాదులు తమ్ము నాయికలుగాను భగవంతుఁడు నాయకుఁడుగాను భావించి గానంబొనర్చిరి. అయినను వారిలో సహజ స్త్రీత్వముగల యాండాళు (ఆముక్తమాల్యద) మాత్రమే కృతార్థురాలయ్యెను. కావుననే భక్తులగు పురుషు లిట్లు గానము చేయుదురు.

ఆనందభైరవి - రూపకతాళము.

ఏల పుట్టితినో - యీమగపుట్టు - వేలపుట్టితినో.
ఏలా పుట్టితి నేఁడు - ఈలాగు పాడుపుట్టువు
హేలావతిగనై నీ - లీలలు చూడక. ఏల.

చరణములు.

౧. మున్ను యశోదనైన, నిన్ను నేఁ గౌఁగిటఁ జేర్చి
చన్నులపాలిచ్చి - కృ, ష్ణన్నాయని పిలుతుఁగాదె. ఏల.
౨. స్వామీ! గోపికనైన, ప్రేమతో నిన్నుఁ గ్రుచ్చి
మోము మోమునఁ జేర్చి, ముద్దాడి యుందుఁగాదె. ఏల.

౩. అల్ల నందునిమంద, గొల్లపిల్లగ నైనఁ
బెల్లుగఁ జెక్కిలినొక్కి, పెదవిఁగొఱికి యలుకుదుఁగాదె. ఏల,

౪. గోపకుమారినైనఁ, గులుకుచుఁ గులుకుచుఁ గసిదీఱ
గోపమునఁ జన్నులఁ - గ్రుమ్మిగ్రుమ్మి యొత్తియుండని. ఏల.

౫. మువ్వంక కుబ్జనైన, మురియుచు మురియుచుఁ గేలుపట్టి
పువ్వులు గంధము, ముడువఁ బూయ నిడుదుఁగాదె. ఏల.

౬. నరకునింట బందినున్న, వరునిఁగ నిన్నుఁగోరి
పరిచర్య సేయుచును,బరమపద మొందుదుఁగాదె. ఏల.

ఈభావము స్త్రీలకు నైజమైనట్లు పురుషులకుఁ గాదుకదా. కావున మతిగల సతులకు ముక్తి కొంగుబంగారు,

ఇట్లు విన్నవించు
శ్రీరామ చరణానందుఁడు
భక్తచరణ పరిచరణుఁడు
వావిలికొలను సుబ్బాఁడు.

శ్రీరామాయనమః

# శ్రీకృష్ణతాండవ స్తోత్రమ్.

భజే వ్రజైకమండనం, సమస్తపాపఖండనం
స్వభక్తచిత్తరంజనం, సదైవనందనందనమ్
సుపింఛగుచ్ఛమస్తకం, సునాదవేణు హస్తకం
అనంగరంగసాగరం, నమామికృష్ణనాగరమ్॥ ౧

మనోజగర్వమోచనం, విశాలఫాలలోచనం
విధూతగోపశోచనం, నమామిపద్మలోచనమ్
కరారవింద భూధరం, స్మితావలోకసుందరమ్
మహేంద్రమానదారణం, నమామికృష్ణవారణమ్॥ ౨

కదంబసూనకుండలం, స్వచారుగండమండలం
వ్రజాంగనైకవల్లభం, నమామికృష్ణదుర్లభమ్
యశోదయా సమోదయా, సగోపయా దయానిధిః
ఉలూఖలే సుదుస్సహం, నమామి నందశంబహామ్॥ ౩

నవీనగోపనాగరం, నవీన కేళిమందిరం
నవీనమేఘసుందరం, భజేవ్రజైకమందిరమ్
సదైవపాదపంకజం, మదీయమానసే నిజం
దధాతినందబాలకః, సమస్తభక్తపాలకః॥ ౪

సమస్తగోపనాగరీ, హృదంవ్రజైకమోహనం
నమామికుంజమధ్యగం, ప్రసూనఫాలశోభినమ్
దృగంతకాంతరింగణం, సహాసబాలసంగినం
దినేదినే నవంనవం. నమామి నందసంభవమ్॥ ౫

గుణాకరం సుఖాకరం, కృపాకరం కృపానరం
త్వరాసుఖైకదాయకం, నమామి గోపనాయకమ్

సమస్తదోషశోషణం, సమస్తలోకతోషణం
సమస్త దాసమానసం, నమామి కృష్ణలాలనమ్॥ ౬
సమస్తగోపనాగరీ, నికామకామదాయకం
దృగంతచారుసాయకం, నమామి వేణునాయకమ్
భవోభవావతారకం, భవాబ్ధికర్ణధారకం
యశోమతీకిశోరకం, నమామి దుగ్ధచోరకమ్॥ ౭
విదగ్ధముగ్ధగోపికా, మనోమనోజదాయినం
నమామికుంజకాననే, ప్రవృద్ధవహ్నిపాయినం
యదాతదాయథాతథా, తథైవకృష్ణసత్కథా
మయాసదైవగీయతాం, తథాకృపావిధీయతామ్॥ ౮

ఇది శ్రీకృష్ణతాండవస్తోత్రం సంపూర్ణమ్.

---

# శ్రీకృష్ణాష్టకమ్

చతుర్ముఖాది సంస్తుతం, సమస్తసాత్వతానుతమ్
హలాయుధాది సంయుతం, నమామి రాధికాధిపమ్। ౧
బకాదిదైత్యకాలకం. సగోపగోపిపాలకమ్
మనోహరాఽసితాలకం, నమామి రాధికాధిపమ్॥ ౨
సురేంద్రగర్వరంజనం, విరించి మోహభంజనమ్
వ్రజాంగనానురంజనం, నమామి రాధికాధిపమ్॥ ౩
మయూరపిచ్ఛమండనం, గజేంద్రదంతఖండనమ్
నృశంసకంసదండనం, నమామి రాధికాధిపమ్॥ ౪
ప్రదత్తవిప్రదారకం, సుదామధామకారకమ్
సురద్రుమాపహారకం, నమామి రాధికాధిపమ్॥ ౫

ధనంజయాజయావహం, మహాచమూక్షయావహమ్
పితామహవ్యథాపహం, నమామి రాధికాధిపమ్ ౬
మునీంద్రశాపకారణం, యదుప్రజాపహారిణమ్
ధరాభరావతారణం, నమామి రాధికాధిపమ్॥ ౭
సువృక్షమూలశాయినం, మృగాదమోక్షదాయినమ్
స్వకీయధామమాయినం, నమామి రాధికాధిపమ్॥ ౮
ఇదం సమాహితో హితం, వరాష్టకం సదాముదా
జపఞ్జనో జనుర్జరాదితో ద్రుతం ప్రముచ్యతే॥ ౯

ఇతి శ్రీపరమహంసస్వామి బ్రహ్మానంద విరచితం
శ్రీకృష్ణాష్టకం సంపూర్ణమ్.

---

# జగన్నాథాష్టకమ్.

కదాచి త్కాలిందీతట విపినసంగీతకరవో
ముదాభీరీనారీ వదనకమలాస్వాదమధుపః ।
రమాశంభుబ్రహ్మాఽమరపతి గణేశార్చితపదో
జగన్నాథఃస్వామీ నయనపథగామీ భవతు మే॥ ౧
భుజేసవ్యే వేణుం, శిరసిశిఖిపిచ్ఛం, కటితటే
దుకూలం, నేత్రాంతే సహచరకటాక్షం విదధతే ।
సదా శ్రీమద్బృందావనవసతి లీలాపరిచయో
జగన్నాథఃస్వామీ నయనపథగామీ భవతు మే॥ ౨
మహాంభోధేస్తీరే కనకరుచిరే నీలశిఖరే
వసన్ప్రాసాదాంతః సహజబలభద్రేణ బలినా ।
సుభద్రామధ్యస్థః సకలసుర సేవావసరదో
జగన్నాథః స్వామీ నయనపథగామీ భవతు మే॥ 3

కథాపారావారః సజలజలదశ్రేణీరుచిరో
రమావాణీరామ స్ఫురదమలపద్మోత్కణముఖైః ।
సురేంద్రైరారాధ్యః శ్రుతిగణశిఖాగీతచరితో
జగన్నాథః స్వామీ నయనపథగామీ భవతు మే। ౪
రథారూఢో గచ్ఛన్పథి మిలితభూదేవపటలైః
స్తుతిప్రాదుర్భావం ప్రతిపదముపాకర్ణ్యసదయః ।
దయాసింధుర్బంధుః సకలజగతాం సింధుసుతయా
జగన్నాథః స్వామీ నయనపథగామీ భవతు మే॥ ౫
పరబ్రహ్మాపీడః కువలయదలోత్ఫుల్లనయనో
నివాసీనీలాద్రౌ నిహితచరణోఽనంతశిరసి ।
రసానందో రాధాసరసవపురాలింగనసుఖో
జగన్నాథః స్వామీ నయనపథగామీ భవతు మే॥ ౬
నవై ప్రార్థ్యంరాజ్యం నచకనకతాం భోగవిభవం
నయాచేఽహంరమ్యాం నిఖిలజనకామ్యాం వరవధూమ్ ।
సదా కాలే కాలే ప్రమథపతినా గీతచరితో
జగన్నాథః స్వామీ నయనపథగామీ భవతు మే॥ ౭
హరత్వం సంసారం ద్రుతతరమసారం సురపతే
హరత్వంపాపానాం వితతిమపరాం యాదవపతే ।
అహోదీనానాథం నిహితమచలం నిశ్చితపదం
జగన్నాథః స్వామీ నయనపథగామీ భవతు మే॥ ౮

ఇతి శ్రీజగన్నాథాష్టకం సంపూర్ణమ్.

---

# శ్రీగోపాలోత్తర తాపనీయోపనిషత్తు.



ఓం ॥ ఏకదాహివ్రజస్త్రియ స్సకామాశ్శర్వరీ ముషిత్వా సర్వేశ్వరం గోపాలం కృష్ణమూచిరే । ఉవాచతాః కృష్ణ అముకస్మై బ్రాహ్మణాయ భైక్షుందాతవ్యమితి దూర్వాసస ఇతికథం యాస్యామో జలంతీర్త్వా యమునాయాయత శ్శ్రేయోభవతి కృష్ణేతి । బ్రహ్మచారీత్యుక్త్వా మార్గంవోదాస్యతి । యంమాగ్ంస్మృత్వా అగాధాగాధా భవతి । యంమాగ్ంస్మృత్వా అపూతఃపూతోభవతి । యంమాగ్ంస్మృత్వా అవ్రతీవ్రతీభవతి । యాంమాగ్ంస్మృత్వా సకామోనిష్కామోభవతి । యంమాం స్మృత్వా అశ్రోత్రియః శ్రోత్రియోభవతి । యంమాం స్మృత్వా గాధతలస్పర్శరహితాపి సర్వాసరిద్గాధాభవతి । శ్రుత్వాతద్వాక్యం హివైరౌద్రం స్మృత్వా తద్వాక్యేన తీర్త్వా తత్సౌర్యాం హివైగత్వాశ్రమం పుణ్యతమం హివైనత్వామునిం శ్రేష్ఠతమం హివైరౌద్రఞ్చేతి తద్వాస్మై బ్రాహ్మణాయ క్షీరమయం ఘృతమయ మిష్టతమం హివైమృష్టతమం హితుష్టాస్స్నాత్వా భుక్త్వా హిత్వాశిష్టం । ప్రయుజ్యాన్నం జ్ఞాత్వాదాత్ । కథం యాస్యామో తీర్త్వాసౌర్యామ్ । సహోవాచముని ర్దూర్వాశినం మాం స్మృత్వా వోదాస్యతీతిమార్గం । తాసాంమధ్యేహిశ్రేష్ఠా గాంధర్వీహ్యువాచ । తంహివైతాభిరేవం । కథం కృష్ణోబ్రహ్మచారీ కథం దూర్వాసనోమునిస్తాం హిముఖ్యాం విధాయపూర్వ మనుకృత్వా తూష్ణీమాసుః । శబ్దవానాకాశ శ్శబ్దాకాశభ్యాం భిన్నస్తస్మిన్నాకాశ స్తిష్ఠత్యాకాశే తిష్ఠతి సహ్యాకాశస్తన్న వేద సహ్యాత్మాహం కథం భోక్తాభవామి। స్పర్శవాన్వాయుః స్పర్శవాయుభ్యాం భిన్నస్తస్మిన్వాయుస్తిష్ఠతి వాయౌ తిష్ఠతివాయుస్తం నవేదసహ్యాత్మాహం కథం భోక్తాభవామి । రూపవదిదం తేజోరూపాగ్నిభ్యాం భిన్నస్తస్మిన్నగ్ని స్తిష్ఠత్యగ్నిస్తం

నవేదసహ్యస్త్వామహం కథం భోక్తాభవామి । రసవత్య ఆపోరసాద్భ్యాం
భిన్నస్తాస్వప్సుతిష్ఠత్యప్సు తిష్ఠంత్యాపస్తన్నవిదు స్పర్శహ్యస్త్వామహం కథం
భోక్తాభవామి ! గంధవతీయంభూమి ర్గంధభూమిభ్యాం భిన్నస్తస్యాం
భూమౌతిష్ఠతి భూమిస్తిష్ఠతి భూమిస్తం నవేదసహ్యస్త్వామహం కథం భో
క్తాభవామి । ఇదంహిమనస్స వేదం మనుతేతావిదం హిగృహ్ణాతి
యత్రసర్వమాత్మైవాభూత్తత్రవాకుత్రమనుతేకథంవా గచ్ఛతీతిసహ్య
స్త్వామహం కథం భోక్తాభవామి । అయం హికృష్ణోయోవోహి ప్రేష్ఠ
శ్శరీరద్వయకారణం భవతి । ద్వాసుపర్ణా భవతో బ్రహ్మణోంహం
సంభూత స్తథేతరో భోక్తాభవత్యన్యోహిసాక్షీ భవతీతి వృక్షధర్మేతౌతిష్ఠ
త అతోభోక్తృభోక్తారౌ పూర్వోహిభోక్తాభవతి తథేతరో భోక్తా
కృష్ణోభవతీతి యత్ర విద్యావిద్యేనవిదామో విద్యావిద్యాభ్యాం
భిన్నో విద్యామయోహియస్సకథం విషయీభవతీతి । యోహవై
కామేనకామాన్ కామయతేసకామీభవతి యోహవై త్వకామేన
కామాన్ కామయతే సోకామోభవతి జన్మజరాభ్యాం భిన్నస్థాణురయ
మచ్ఛేద్యోయం యోసౌసూర్యేతిష్ఠతి యోసౌగోషుతిష్ఠతి యోసౌ
గోపాన్ పాలయతి యోసౌసర్వేషుదేవేషుతిష్ఠతి యోసౌసర్వైర్వేదై
ర్గీయతే యోసౌసర్వేషుభూతేష్వావిశ్యభూతాని విదధాతిసవోహి
స్వామీభవతి । సాహోవాచ గాంధర్వీ కథంవా స్వాస్మాసుజాతో గో
పాలః కథంవాజ్ఞాతోసౌత్వయామునే కృష్ణః కోవాస్యమంత్రః కిం
స్థానంకథంవా దేవక్యాంజాతః కోవాస్యజ్యాయాన్రామోభవతి కీదృశీ
పూజాస్య గోపాలస్యభవతి సాక్షాత్ప్రకృతిపరోయమాత్మా గోపాలః
కథంత్వవతీర్ణోభూమ్యాం హివైసాగాంధర్వీమునిమువాచ । సహోవా
చతాం హివైపూర్వం నారాయణోయస్మిన్ లోకా ఓతాశ్చప్రోతాశ్చ
తస్యహృత్పద్మాజ్జాతోబ్జయోనిస్తపస్తప్త్వా తస్మైహవరందదౌ సహోవా
చాబ్జయోనిర్యోవా అవతారాణాం మధ్యే శ్రేష్ఠోవతారః కోభవతి
యేనలోకాస్తుష్టా భవంతి యంస్మృత్వాముక్తా అస్మాత్సంసారాద్భ
వంతి కథం వాస్యావతారస్య బ్రహ్మతాభవతి సహోవాచతం హివై
నారాయణో దేవస్సకామ్యా మేరోశ్శృంగే యథాసప్తపుర్యోభవంతి

థా నిష్కామ్యా సకామ్యా భూగోళచక్రే సప్తపుర్యోభవన్తి తా
సాం మధ్యే సాక్షాద్బ్రహ్మగోపాలపురీభణరక్షివతి సకామ్యా నిష్కా
మ్యా దేవానాం సర్వేషాం భూతానాం భవతి అథాస్య భజనం
భవతి యథాహివై సరసిపద్మంతిష్ఠతి తథా భూమ్యాంతిష్ఠతి చక్రేతా
మథురా తస్మాద్గోపాలపురీ భవతి బ్రహ్మబృహద్వనం మధుర్మధువనం
తాళస్తాళవనం కామ్యంకామవనం బహుళాబహుళవనం కుముదః
కుముదవనం ఖదిరఃఖదిరవనం భద్రోభద్రవనం భాండీరఇతి భాండీర
వనం శ్రీవనం లోహావనం బృందావన మేతైరావృతాపురీభవతి తత్ర
తేష్వేవగగనేష్వేవం దేవామనుష్యా గంధర్వానాగాః కిన్నరాగా
యంతి నృత్యంతీతి తత్ర ద్వాదశాదిత్యా ఏకాదశరుద్రా అష్టావసవ
స్సప్తమునయో బ్రహ్మనారదశ్చ పఞ్చవినాయకా విశ్వేశ్వరో రుద్రే
శ్వరోంబికేశ్వరో నీలకంఠేశ్వరో గోపాలేశ్వరో భద్రేశ్వర ఇత్యష్టా
అన్యానిలింగాని చతుర్వింశతిర్భవంతి ద్వేవనేస్తః కృష్ణవనం భద్రవనం
తయోరంతర్ద్వాదశవనాని పుణ్యాని పుణ్యతమాని తేష్వేవదేవాస్తి
ష్ఠంతి సిద్ధాసిద్ధిం ప్రాప్తాస్తత్రహి రామస్య రామమూర్తిః ప్రద్యుమ్న
స్య ప్రద్యుమ్నమూర్తి రనిరుద్ధస్యానిరుద్ధమూర్తిఃకృష్ణస్య కృష్ణమూర్తి
ర్వనేష్వేవం మథురాసేయం ద్వాదశమూర్తయో భవంతి ఏకాంహి
రుద్రాయజంతి ద్వితీయాం బ్రహ్మయజతి తృతీయాం బ్రహ్మజాయ
జంతి చతుర్థీం మరుతోయజంతి పఞ్చమీం వినాయకాయజంతి
షష్ఠీం వసవోయజంతి సప్తమీం ఋషవోయజం త్యష్టమీం గంధర్వా
యజంతి నవమీ మప్సరసోయజంతి దశమీ వైహ్యాంతర్ధానేతిష్ఠ
త్యేకాదశీతి స్వపదానుగా ద్వాదశీతి భూమ్యాంతిష్ఠతి తాంహియే
యజంతి తేమృత్యుంతరంతి ముక్తింలభంతే గర్భజన్మజరామరణ తాప
త్రయాత్మక దుఃఖంతరంతి । తదప్యేతే శ్లోకాభవంతి॥ సంప్రాప్యమథు
రాంరమ్యాం సదాబ్రహ్మాదివందితాం । శంఖచక్రగదాశార్ఙ్గ రక్షి
తాం ముసలాదిభిః । యత్రాసౌ సంస్థితఃకృష్ణః స్త్రీభిశ్శక్త్యా సమా
హితః । రమానిరుద్ధ ప్రద్యుమ్న రుక్మిణ్యా సహితో విభుః । చతుశ్శబ్దో
భవేదేకో హ్యోంకారస్యఉదాహృతః । తస్మాదేవపరోరజసేతి । సోహ

మిత్యవధార్యాత్మానం గోపాలోహమితి । భావయేత్స మోక్షమశ్ను
స బ్రహ్మత్వమధిగచ్ఛతి స బ్రహ్మవిద్భవతి సగోపాన్జీవా నాత్మత్వేన
సృష్టి పర్యంతమాలాతి సగోపాలో భవతి హ్యోంతత్సోహం పరం
బ్రహ్మ కృష్ణాత్మకో నిత్యానందైకస్వరూపస్సోహ మోంతత్సద్గోపాలో
హమేవ పరం సత్యమబాధితం సోహమిత్యాత్మాన మాదాయమన
సైక్యం కుర్యాదాత్మానం గోపాలోహమితిభావయేత్ । సఏవావ్యక్తో
నంతో నిత్యో గోపాలః । మథురాయాంస్థితిర్బ్రహ్మన్ సర్వదా మే భవి
ష్యతి । శంఖచక్రగదాపద్మ వనమాలాధరస్యవై । విశ్వరూపం పరం
జ్యోతిః స్వరూపం రూపవర్జితం । మథురామండలేయస్తు జంబూద్వీప
స్థితోపివా। యోర్చయేత్ప్రతిమాంమాంచ సమేప్రియతరో భువి తస్యా
మధిష్ఠితకృష్ణ రూపీపూజ్యస్త్వయాసదా । చతుర్ధాచాస్యావతారా
భేద త్వేన యజంతిమాం । యుగానువర్తినోలోకా యజంతీ హసుమే
ధసః । గోపాలం సానుజంకృష్ణం రుక్మిణ్యాసహతత్పరం । గోపాలోహ
మజోనిత్యః ప్రద్యుమ్నోహం సనాతనః । రామోహమనిరుద్ధోహ
మాత్మానంచార్చయేద్బుధః । మయోక్తేనసధర్మేణ నిష్కామేణ విభా
గశః । తైరహంపూజనీయోవై భద్రకృష్ణనివాసిభిః। తద్ధర్మగతిహీనా
యే తస్యాంమయి పరాయణాః । కలినాగ్రసితాయేవై తేషాంతస్యా
మవస్థితిః । యథాత్వం సహపుత్రైస్తు యథారుద్రోగణైస్సహ।యథా
శ్రియాభియుక్తోహం తథాభక్తోమమప్రియః । సహోవాచాబ్జయో
నిః । చతుర్భిర్దేవైః కథమేకోదేవస్స్యా దేకమక్షరం యద్విశ్రుత
మనేకాక్షరం కథం సంభూతం । సహోవాచతంహి పూర్వ మేక
మేవాద్వితీయం బ్రహ్మాసీ తస్మాదవ్యక్త మేకాక్షరం తస్మాదక్షరాన్మహ
న్మహతో హంకారస్తస్మాదహంకారాత్పంచతన్మాత్రాణి తేభ్యోభూ
తాని తైరావృతమక్షరం అక్షరోహమోంకారో౽హమజరో మరో
భయోమృతో బ్రహ్మాభయం హి వై సముక్తోహమస్మ్యక్షరోహమస్మి।
సత్తామాత్రం చిత్స్వరూపం ప్రకాశం వ్యాపకంతథా । ఏకామేవా
ద్వయంబ్రహ్మ మాయయాచ చతుష్టయం । రోహిణీతనయోవిశ్వ
అకారాక్షరసంభవః తైజసాత్మకః ప్రద్యుమ్నః ఉకారాక్షరసంభవః ।

ప్రాజ్ఞాత్మకోనిరుద్ధోసౌ మకారాక్షరసంభవః। అర్ధమాత్రాత్మకఃకృష్ణో యస్మిన్విశ్వం ప్రతిష్ఠితం।కృష్ణాత్మికా జగత్కర్త్రీ మూలప్రకృతిరుక్మిణీ వ్రజస్త్రీజనసంభూత శ్రుతిభ్యో బ్రహ్మసంగతః। ప్రణవత్వేనప్రకృతిత్వం వదంతి బ్రహ్మవాదినః। తస్మాదోంకారసంభూతో గోపాలో విశ్వసంస్థితః। క్లీమోంకారస్యైకత్వం వదంతి బ్రహ్మవాదినః।మథురాయాం విశేషేణ మాంధ్యాయన్ మోక్షమశ్నుతే । అష్టపత్రం వికసితం హృత్పద్మం తత్రసంస్థితం। దివ్యధ్వజాతపత్రైస్తు చిహ్నితం చరణద్వయం। శ్రీవత్సలాంఛనంహృత్స్థం కౌస్తుభం ప్రభయాయుతం। చతుర్భుజశంఖచక్ర శార్ఙ్గపద్మగదాన్వితం । కేయూరాన్వితసద్బాహుం కంఠమాలాసుశోభితం। ద్యుమత్కిరీట మభయం స్ఫురన్మకరకుండలం। హిరణ్మయంసౌమ్యతనుం స్వభక్తాయాభయప్రదం। ధ్యాయేన్మనసిమాంనిత్యం వేణుశృంగధరంతువా ! మథ్యతేతు జగత్సర్వం బ్రహ్మజ్ఞానేనయేనవా। మత్సారభూతంయద్యత్స్యాత్ మథురాసానిగద్యతే। అష్టదిక్పాలకైర్భూమిం పద్మంవికసితంజగత్ । సంసారార్ణవసంజాతం సేవితం మమమానసే । చంద్రసూర్యత్విషోదివ్యా ధ్వజా మేరుర్హిరణ్మయః।ఆతపత్రం బ్రహ్మలోకం తదూర్ధ్వంచరణంస్మృతం। శ్రీవత్సంచ స్వరూపఞ్చ వర్తతేలాంఛనైస్సహ। శ్రీవత్సలక్షణంతస్తాత్కథ్యతే బ్రహ్మవాదిభిః। యేనసూర్యాగ్నివాక్చంద్ర తేజసాస్వస్వరూపిణా। వర్తతేకౌస్తుభాఖ్యం మణింవదంతీశమానినః।సత్వంరజస్తమ ఇతి అహంకార శ్చతుర్భుజః । పంచభూతాత్మకంశంఖం కరేరజసిసంస్థితం। బాలస్వరూపమిత్యంత మనశ్చక్రంనిగద్యతే । ఆద్యామాయా భవేశార్ఙ్గం పద్మంవిశ్వకరేస్థితం। ఆద్యావిద్యాగదావేద్యా సర్వదా మేకరేస్థితా। ధర్మార్థ కామకేయూరైర్దివ్యైర్దివ్య మయేరితైః। కంఠతు నిర్గుణంప్రోక్తం మాల్యతే ఆద్యయాజయా । మాలానిగద్యతే బ్రహ్మన్ తవపుత్రైస్తుమానసైః।కూటస్థం సత్వరూపంచ కిరీటంప్రవదంతిమాం। క్షరోత్తరంప్రస్ఫురంతం కుండలం యుగళం స్మృతం। ధ్యాయేన్మమప్రియంనిత్యం సమోక్షమధిగచ్ఛతి।సముక్తోభవతితస్మైస్వాత్మానంతు దదామివై। ఏతత్సర్వంభవిష్యద్వై మయాప్రోక్తం విధేతవ।

స్వరూపం ద్వివిధంచైవ సగుణంనిర్గుణాత్మకం । సహోవాచాబ్జయోనిః। వ్యక్తీనాం మూర్తీనాం ప్రోక్తానాం కథంత్వాభరణాని భవంతి కథం వా దేవాయజంతి రుద్రాయజంతి బ్రహ్మాయజంతి బ్రహ్మజాయజంతి వినాయకాయజంతి ద్వాదశాదిత్యాయజంతి వసవోయజంతి గంధర్వాయజంతి । సపదానుగా అంతర్ధానేతిష్ఠతి । కాంమనుష్యాయజంతి । సహోవాచతం హిత్వై నారాయణోదేవః । ఆద్యావ్యక్తా ద్వాదశమూర్తయ స్సర్వేషులోకేషు సర్వేషువేదేషు సర్వేషు మనుష్యేషు తిష్ఠంతీతి । రుద్రేషురౌద్రీ బ్రహ్మణిబ్రాహ్మీ దేవేషుదైవీ మనుష్యేషు మానవీ వినాయకేషు విఘ్నవినాశినీ ఆదిత్యేషు జ్యోతి ర్గంధర్వేషు గాంధర్వీ అప్సరస్స్వేవం గౌర్వసుష్వేవం కామ్యా అంతర్ధానేష్వప్రకాశినీ ఆవిర్భావ తిరోభావా స్స్వపదేతిష్ఠతి । తామసీ రాజసీ సాత్వికీ మానుషీ విజ్ఞానఘన ఆనంద స్సచ్చిదానందైక రసే భక్తియోగే తిష్ఠతి । ఓం ప్రాణాత్మనే ఓం తత్సద్భూర్భువస్సువ స్తస్మైప్రాణాత్మనే నమోనమః । ఓం కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ ఓం తత్స ద్భూర్భువస్సువ స్తస్మైవై నమోనమః । ఓం మపానాత్మనే ఓం తత్స ద్భూర్భువస్సువ స్తస్మై అపానాత్మనే నమోనమః । ఓం శ్రీకృష్ణాయ అనిరుద్ధాయ ఓం తత్స ద్భూర్భువస్సువ స్తస్మైవై నమోనమః। ఓం వ్యానాత్మనే ఓం తత్స ద్భూర్భువస్సువ స్తస్మై వ్యానాత్మనే నమో నమః । ఓం శ్రీకృష్ణాయ రామాయ ఓం తత్సద్భూర్భువస్సువ స్తస్మైవై నమోనమః। ఓముదానాత్మనే ఓం తత్స ద్భూర్భువస్సువ స్తస్మై ఉదానాత్మనే నమోనమః । ఓం శ్రీకృష్ణాయ దేవకీనందనాయ ఓం తత్స ద్భూర్భువస్సువ స్తస్మైవై నమోనమః । ఓం సమానాత్మనే ఓం తత్స ద్భూర్భువ స్తస్మై సమానాత్మనే నమోనమః । ఓం శ్రీగోపాలాయ నిజస్వరూపాయ ఓం తత్స ద్భూర్భువస్సువ స్తస్మైవై నమోనమః । ఓం యోసౌప్రధానాత్మా గోపాల ఓం తత్స ద్భూర్భువస్సువ స్తస్మైవై నమోనమః । ఓం యోసావింద్రియాత్మా గోపాల ఓం తత్సద్భూర్భువ స్తస్మైవై నమోనమః । ఓం యోసౌభూతాత్మా గోపాల ఓం తత్స ద్భూర్భువ స్తస్మైవై నమో

నమః ! ఓం యోసా వుత్తమ పురుషో గోపాల ఓం తత్స ద్భూర్భువ స్సువ స్తస్మైవై నమోనమః ! ఓం యోసా బ్రహ్మపరంవై బ్రహ్మ ఓం తత్స ద్భూర్భువస్సువ స్తస్మైవై నమోనమః । ఓం యోసా సర్వభూతాత్మా గోపాల ఓం తత్సద్భూర్భువస్సువ స్తస్మైవై నమో నమః । ఓం జాగ్రత్స్వప్న సుషుప్తితురీయాతీతోంతర్యామీ గోపాల ఓం తత్స ద్భూర్భువస్సువ స్తస్మైవై నమోనమః । ఏకోదేవ స్సర్వ భూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా । కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ । రుద్రాయనమః । ఆదిత్యాయనమః । వినాయకాయనమః । సూర్యాయనమః । విద్యా యైనమః । ఇంద్రాయనమః । అగ్నయేనమః । యమాయనమః । నిర్ఋతయేనమః । వరుణాయనమః । వాయవేనమః । కుబేరాయనమః। ఈశానాయనమః । సర్వేభ్యో దేవేభ్యోనమః । దత్వా స్తుతిం పుణ్యత మాం బ్రహ్మణే స్వస్వరూపిణే । కర్తృత్వే సర్వభూతానా మంతర్ధానే బభూవసః । బ్రహ్మణే బ్రహ్మపుత్రేభ్యో నారాదాత్తు శ్రుతం మునేః। తథాప్రోక్తంతు గాంధర్వీ గచ్ఛత్వాం స్వాలయాంతికమితి॥

భద్రంకర్ణేభిరితిశాంతిః

గోపాలోత్తర తాపనీయోపనిషత్సమాప్తా.

ఓం తత్సత్.

# శ్రీకృష్ణకర్ణామృత శ్లోకములు



శ్లో. పల్లవారుణ పాణిపంకజసంగి వేణురవాకులం
ఫుల్లపాటల పాటలీ పరివాదిపాద సరోరుహామ్,
ఉల్లసన్మధురాధరద్యుతి మంజరీ సరసాననం
పల్లవీకుచకుంభ కుంకుమ పంకిలం ప్రభుమాశ్రయే.

శ్లో. తరుణారుణ కరుణామయ విపులాయత నయనం
కమలాకుచ కలశీభర విపులీకృత పులకమ్,
మురళీరవ తరళీకృత మునిమానస నలినం
మమఖేలతి మదచేతసి మధురాధర మమృతమ్.

శ్లో. మయిప్రసాదం మధురైః కటాక్షై
ర్వంశీవినాదాను చరైర్విధేహి,
త్వయి ప్రసన్నే కి మిహాపరైర్న,
స్త్వయ్యప్రసన్నే కిమిహాపరైర్నః.

శ్లో॥ చికురం బహుళం విరళం భ్రమరం
మృదులం వచనం విపులం నయనమ్,
అధరం మధురం వదనం లలితం
చపలం చరితం కదాఽనుభవే.

శ్లో. మధురం మధురం వపురస్య విభో
ర్మధురం మధురం వదనం మధురమ్,
మధుగన్ధి మృదుస్మిత మేతదహో
మధురం మధురం మధురం మధురమ్.

శ్లో. మందారమూలే మదనాభిరామం,
బింబాధరా పూరితవేణునాదమ్,

గోగోపగోపీ జనమధ్యసంస్థం,
గోపంభజే గోకుల పూర్ణచన్ద్రమ్.

శ్లో. అభినవ నవనీతస్నిగ్ధ మాపీతదుగ్ధం
దధికణ పరిదిగ్ధం ముగ్ధ మంగం మురారేః,
దిశతు భువనకృచ్ఛ్ర చ్ఛేదితాపింఛగుచ్ఛ
చ్ఛవినవ శిఖిపింఛా లాంఛితం వాంఛితం నః.

శ్లో. మందం మందం మధురనినదై ర్వేణుమా పూరయంతం
బృందం బృందావన భువిగవాం చారయంతం చరంతమ్,
ఛందోభాగే శతముఖముఖ ధ్వంసినాం దానవానాం
హంతారం తం కథయరసనే గోపకన్యాభుజంగమ్.

శ్లో. వదనే నవనీత గంధవాహం
వచనే తస్కర చాతురీధురీణమ్,
నయనే కుహనాశ్రు మాశ్రయేథా
శ్చరణే కోమలతాండవం కుమారమ్.

శ్లో. రాధా పునాతు జగదచ్యుత దత్తచిత్తా
మంథాన మాకలయతీ దధిరిక్తపాత్రే,
తస్యాః స్తనస్తబక చంచల లోలదృష్టి
ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్.

శ్లో. అంగనా మంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరే ణాంగనా,
ఇత్థమాకల్పితే మండలే మధ్యగః
సంజగౌ వేణునా దేవకీనందనః.

శ్లో. కేకికేకాదృతా నేకపంకేరుహా,
లీనహంసావలీ హృద్యతా హృద్యతా,
కంసవంశాటవీ దాహదావానలః,
సంజగౌ వేణునా దేవకీనందనః.

శ్లో. క్వాపి వీణాభిరారావి కా కంపితః,
క్వాపి వీణాభిరాకింకిణీ నర్తితః,
క్వాపి వీణాభిరామాంతరంగాపితః,
సంజగౌ వేణునా దేవకీనందనః.

శ్లో. చారుచంద్రావళీ లోచనై శ్చుంబితో
గోపగోబృంద గోపాలికా వల్లభః,
వల్లవీబృన్ద బృన్దారకః కాముకః
సంజగౌ వేణునా దేవకీదేవనందనః.

శ్లో. మౌళిమాలావిళ న్మత్తభృంగీలతా,
భీతభీతప్రియా విభ్రమాలింగితః,
స్రస్తగోపీకుచా భోగసమ్మోభితః
సంజగౌ వేణునా దేవకీనందనః.

శ్లో. చారుచామీకరా భాసభామావిభు
ర్వైజయంతీలతా వాసితోరస్థ్సలః,
నందబృందావనే వాసితామధ్యగః
సంజగౌ వేణునా దేవకీనందనః.

శ్లో. బాలికాతాలికా తాలలీలాలయా
సంగసందర్శిత భ్రూలతా విభ్రమః,
గోపికాగీత దత్తావధానస్స్వయం
సంజగౌ వేణునా దేవకీనందనః.

శ్లో. పారిజాతం సముద్ధృత్య రాధావరో
రోపయామాన భామాగృహస్యాంగణే,
శీతశీతేవటే యామునీయేతటే
సంజగౌ వేణునా దేవకీనందనః.

శ్లో. అగ్రేదీర్ఘతరోఽయ మర్జునతరు స్తస్యాగ్రతో వర్తనిః
సాఘోషం సముపైతి తత్పరిసరే దేశే కళిందాత్మజా,

తస్యా స్త్రీరతమాల కాననతలే చక్రంగవాం చారయన్
గోపఃక్రీడతి సర్పయిష్యతి సఖే పంథానమవ్యాహతమ్.

శ్లో. ఉపాసతా మాత్మవిదః పురాణాః
పరంపుమాం సం నిహితం గుహాయామ్,
వయం యశోదా-శిశు బాలలీలా
కథా సుధాసింధుషు లీలయామః.

శ్లో. విక్రేతుకామా కిల గోపకన్యా,
మురారి పాదార్పిత చిత్తవృత్తిః,
దధ్యాదికం మోహవశా దవోచ
ద్గోవింద దామోదర మాధవేతి.

శ్లో. ఉలూఖలంవా యమినాం మనో వా
గోపాంగనానాం కుచకుట్మలం వా,
మురారి నామ్నః కలభస్య నూన
మాలాన మాసీ త్త్రిమమేవ భూమా.

శ్లో. కరారవిన్దేన పదారవిన్దం,
ముఖారవిన్దే వినివేశయ న్తమ్,
వటస్య పత్రస్య పుటే శయానం,
బాలం ముకుందం మనసా స్మరామి.

శ్లో. శంభో! స్వాగతమాస్యతామితఇతో వామేనపద్మాసన
క్రౌంచారే కుశలం సుఖం సురపతే వి త్తేశ నోదృశ్యసే,
ఇత్థం స్వప్నగతస్య కైటభజిత శ్శ్రుత్వా యశోదాగిరః
కిం కిం బాలక జల్పసీతిరచితం ధూధూకృతం పాతునః.

శ్లో. మాతః! కింయదునాథ? దేహిచషకం; కిం తేన? పాతుంపయ;
స్తన్నా స్త్యద్య, కదా స్తి వా? నిశి, నిశా కా? వాన్ధకారోదయః,
ఆమీల్యాక్షియుగంనిశాప్యుపగతా దేహీతిమాతుర్ముహు
ర్వక్షోజాంశుక కర్షణోద్యతకరః కృష్ణస్స పుష్ణాతునః.

శ్లో. కాళిన్దీపులినోదరేషు ముసలీ యావద్గతః ఖేలితుం
తావత్కార్పరికం పయఃపిబహరే వర్ధిష్యతే తే శిఖా,
ఇత్థం బాలతయా ప్రతారణపరాః శ్రుత్వాయశోదాగిరః
పాయాన్నః స్వశిఖాంస్పృశన్ ప్రముదితః క్షీరేఽర్ధ పీతేహరిః.

శ్లో. ఓష్ఠం జిఘ్రన్ శిశురితిధియా చుంబితో వల్లవీభిః
కణ్ఠం గృహ్ణ న్నరుణితపదం గాఢమాలింగితాంగః,
దోష్ణా లజ్జాపద మభిమృశ న్నంకమారోపితాత్మా
ధూర్తస్స్వామీ హరతుదురితం దూరతో బాలకృష్ణః.

శ్లో. రామోనామబభూవ, హుం, తదబలాసీతేతి, హుం; తాంపితు
రాచా పంచవటీతటే విహరత స్తస్యాహర ద్రావణః.
నిద్రార్థం జననీకథామితిహరే ర్హుంకారతః శృణ్వతః
సౌమిత్రే క్వధనుర్ధనుర్ధనురితి వ్యగ్రాగిరః పాంతునః.

శ్లో. కస్త్వం బాల? బలానుజః, కిమిహ తే? మన్మందిరాశంకయా,
యుక్తం తన్నవనీతపాత్రవివరే హస్తం కిమర్థం న్యసేః?
మాతః! కశ్చనవత్సకం మృగయితుం, మాగా విషాదం క్షణా
దిత్యేవం వరవల్లవీ ప్రతివచః కృష్ణస్యపుష్ణాతునః.

శ్లో. త్వయిప్రసన్నే మమకింగుణేన, త్వయ్యప్రసన్నే మమకింగుణేన,
రక్తేవిరక్తేచ వరేవధూనాం, నిరర్థకః కుంకుమపత్రభంగః.

శ్లో. ఉర్వ్యాంకోఽపిమహీధరో లఘుతరో దోర్భ్యాంధృతో లీలయా
తేనత్వం దివిభూతలేచ సతతం గోవర్ధనోద్ధారకః,
త్వాం త్రైలోక్యధరం వహామి కుచయో రగ్రేనతద్గణ్యతే,
కింవా కేశవ? భాషణేన బహునా పుణ్యైర్యశో లభ్యతే.

శ్లో. సంధ్యావందన! భద్రమస్తు భవతే, భోస్నాన! తుభ్యంనమో
భోదేవాః పితరశ్చ? తర్పణవిధౌ నాహంక్షమః క్షమ్యతాం,
యత్రక్వాపి నిషద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః
స్మారంస్మార మఘుంహరామి; తదలంమన్యే, కిమన్యేనమే.

శ్లో. కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుంకరే కంకణమ్,
సర్వాంగే హరిచందనంచ కలయన్ కంఠేచ ముక్తావళిం
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాలచూడామణిః.

శ్లో. జానుభ్యా మభిధావంతం, పాణిభ్యా మతిసుందరమ్,
సుకుండలాలకం బాలం, గోపాలం చింతయేదుషః.

శ్లో. సాయంకాలే వనాంతే కుసుమితసమయే సైకతేచంద్రికాయాం
త్రైలోక్యాకర్షణాంగంసురవరగణికా మోహనాపాంగమూర్తిమ్
సేవ్యం శృంగారభావై ర్నవరసభరితై ర్గోపకన్యాసహస్రై
ర్వందేఽహం రాసకేళీరత మతిసుభగం వశ్యగోపాలకృష్ణమ్.

శ్లో. అంగుళ్యాకః కవాటంప్రహరతి? కుటిలే! మాధవః, కింవసంతో?
నోచక్రీ, కింకులాలో? నహిధరణిధరః, కింద్విజిహ్వః ఫణీంద్రః?
నాహం ఘోరాహిమర్దీ కిమసిఖగపతి? ర్నోహరిః కింకపీంద్రః?
ఇత్యేవం గోపకన్యా ప్రతివచనజితః పాతువశ్చక్రపాణిః.

శ్లో. యాప్రీతి ర్విదురార్పితే మురరిపో కుంత్యర్పితే యాదృశీ
యా గోవర్ధన మూర్ధ్ని యాచపృథుకే స్తన్యే యశోదార్పితే,
భారద్వాజ సమర్పితే శబరికాదత్తేఽధరే యోషితాం
యాం ప్రీతిర్మునిపత్ని భక్తిచరితేఽప్యత్రాపి తాం తాంకురు.

శ్లో. సాష్టాంగపాత మభినంద్య సమస్తభావైః
సర్వాన్ సురేంద్రనికరా నిదమేవ యాచే,
మందస్మితార్ద్ర మధురానన చంద్రబింబే
వందస్య పుణ్యానిచయే మమ భక్తిరస్తు.

శ్రీరామాయనమః

# అధర్వణీ కృష్ణోపనిషత్

భద్రంకర్ణేభిరితి శాంతిః.

ఓం శ్రీమహావిష్ణుం సచ్చిదానందలక్షణం రామచంద్రం దృష్ట్వాసర్వాంగసుందరం మునయో వనవాసినో విస్మితా బభూవుస్తం హోచుర్నోవద్య మవతారాన్వైగణ్యంతే ఆలింగామో భవంతమితి భవాంతరే కృష్ణావతారే యూయం గోపికాభూత్వా మామాలింగథ - అన్యేయేవతరా స్తేహి గోపాన స్త్రీశ్చనోకురు - అన్యోన్య విగ్రహంధార్యం తవాంగ స్పర్శనాదిహ-శశ్వత్స్పర్శయితాస్మాకం గృణోమో వతారావయం - రుద్రాదీనాం వచశ్శ్రుత్వా ప్రోవాచ భగవాన్స్వయం-అంగసగం కరిష్యామి భవద్వాక్యం కరోమ్యహం * - మోదితాః తే సురాస్సర్వే కృతకృత్యా ధునావయం - యోనందః పరమానందో యశోదా ముక్తిగేహినీ - మాయాసాత్రి విధాప్రోక్తా సత్త్వరాజ సతామసీ-ప్రోక్తాచ సాత్త్వికీరుద్రే భక్తేబ్రహ్మణి రాజసీ- తామసీ దైత్యపక్షేషు మాయాత్రేధా హ్యుదాహృతా - అజేయా వైష్ణవీమాయా జప్యేనచ సుతాపురా - దేవకీ బ్రహ్మ పుత్రాసా యావేదై రుపగీయతే - నిగమో వసుదేవోయో వేదార్థః కృష్ణరామయోః - స్తువంతి సతతంయస్తు సోవతీర్ణో మహీతలే - వనే బృందావనే క్రీడన్ గోపగోపీ సురైస్సహ-గోప్యోగావ ఋచస్తస్య యష్టికా కమలాసనః - వంశస్తు భగవాన్రుద్రః శృంగమింద్ర స్సగోసురః-గోకులం వనవైకుంఠం తాపసాస్తత్ర తేద్రుమాః - లోభక్రోధ భయాదైత్యాః కలికాల స్తిరస్కృతః-గోపరూపో హరిస్సాక్షా న్మాయావిగ్ర హధారణః - దుర్బోధం కుహకంతస్య మాయయా మోహి

* దీనివలన గోపికాకృష్ణులకు దేహస్పర్శము గలిగెగాని సంభోగములేదని స్పష్టపడియెడిని

తేజగమ్-దుర్జయా సాసురై స్సర్వై ర్యష్టిరూపో భవేద్ద్విధిః - రు
ద్రో యేన కృతో వంశ స్తస్య మాయా జగత్కథం - బలంజ్ఞానం సు
రాణాంవై తేషాంజ్ఞానం హృతంక్షణాత్ - శేషోనాగో భవేద్రా
మః కృష్ణోబ్రహ్మైవ శాశ్వతం - అష్టావష్ట సహస్రేద్వే శతాధిక్యాః
స్త్రియ స్తథా-ఋచోప నిషదస్తావై బ్రహ్మరూపా ఋచఃస్త్రియః -
ద్వేషశ్చాణూరమల్లోయం మత్సరో ముష్టికోజయః - దర్పః కువల
యాపీడో గర్వోరక్షః ఖగోబకః - దయాసా రోహిణీమాతా సత్య
భామా ధరేతివై-అఘాసురో మహావ్యాధిః కలిఃకం సస్సభూపతిః -
శమోమిత్ర స్సుధామాచ సత్యాక్రూరో ద్ధవోదమః - యశ్శంఖస్య
స్స్వయంవిష్ణు ర్లక్ష్మీరూపో వ్యవస్థితః-దుగ్ధసిన్ధౌ సముత్పన్నో మేఘ
ఘోషస్తు సంస్మృతః - దుగ్ధోదధీ కృత స్తేన భగ్నభాండో దధిగృహే-
క్రీడతే బాలకోభూత్వా పూర్వవత్సు మహోదదౌ-సంహారార్థం చ
శత్రూణాం రక్షణాయచ సంస్థితః-కృపార్థే సర్వభూతానాం గోప్తారం
ధర్మమాత్మజం-యత్సృష్టమీశ్వ రేణాసీ త్తచ్చక్రం బ్రహ్మరూపధృత్-
జయంతి సంభవోవాయు శ్చమరో ధర్మసంజ్ఞితః-యస్యాసౌజ్వ లనా
భాస ఖడరూపో మహేశ్వరః - కశ్యపోలూ ఖలఃఖ్యాతో రజ్జుర్మాతా
దితి స్తథా-చక్రంశంఖం చ సంసిద్ధిం బిందుంవై సర్వమూర్ధని - యా
వంతి దేవరూపాణి వదంతి విబుధాజనాః - నమంతి దేవరూపేభ్య
ఏవమాది నసంశయః - గదాచ కాళికాసాక్షా త్సర్వశత్రు నిబర్హిణీ -
ధనుశ్శార్ఙ్గన్ం స్వమాయాచ శరత్కాల స్సుభోజనః-అబ్జకాండం జగ
ద్బీజం ధృతంపాణౌ స్వలీలయా - గరుడో వటభాండీర స్సుదామా
నారదోమునిః-బృందాభక్తిః క్రియాబుద్ధిః సర్వజంతు ప్రకాశినీ-తస్మా
న్నభిన్నంనాభిన్న మాభిర్భిన్నో నవై విభుః-భూమావుత్తా రితంసర్వం
వైకుంఠం స్వర్గవాసినా మిత్యుపనిషత్ ॥

శ్రీకృష్ణోపనిషత్సమాప్తా.

ఓం తత్సత్.

శ్రీకృష్ణాయనమః

# శ్రీ కృష్ణ నుతి

కమలభవార్చిత కృష్ణా కృష్ణా
యదుకులదీపక ,, ,,
వసుదేవాత్మజ ,, ,,
దేవకీగర్భజ ,, ,,
వంచితమాతుల ,, ,,
నందానందద ,, ,,
యశోదనందన ,, ,,
శాసితపూతన ,, ,,
శకటాసురహర ,, ,,
దధిఘృతచోరక కృష్ణా కృష్ణా ౧౦
మాయాగోపక ,, ,,
అర్జునభంజన ,, ,,
కాళియమర్దన ,, ,,
బృందావనచర ,, ,,
హతఖలబృందక ,, ,,
స్త్రీపటతస్కర ,, ,,
మురళీగాయక ,, ,,
హృతగోపీమన ,, ,,
భుక్తదవానల ,, ,,
దండితధేనుక కృష్ణా కృష్ణా ౨౦
వ్రజతరుణీప్రియ ,, ,,
సామగానరత ,, ,,
శక్రమదాపహ ,, ,,
మిత్రమదాపహ ,, ,,
విధిమదహరణా ,, ,,
సురనుతచరణా ,, ,,
గోవర్ధనధర కృష్ణా కృష్ణా

గోకులవర్ధన కృష్ణా కృష్ణా
రాధారమణా ,, ,,
తులసీభూషణ కృష్ణా కృష్ణా ౩౦
మన్మథమన్మథ ,, ,,
విప్రసతీనుత ,, ,,
బలరామానుజ ,, ,,
భద్రాగ్రజవర ,, ,,
స్వజనస్మయహర ,, ,,
అక్రూరపాలన ,, ,,
కుబ్జామోదక ,, ,,
వాయకముత్కర ,, ,,
మల్లాగ్రేసర ,, ,,
మదగజసింహ కృష్ణా కృష్ణా ౪౦
చాణూరాంతక ,, ,,
కంసధ్వంసక ,, ,,
హింసితహంసక ,, ,,
ముచుకుందావన ,, ,,
కాలయవనయమ ,, ,,
మాగధమదహర ,, ,,
ద్వారావతగృహ ,, ,,
భైష్మీవల్లభ ,, ,,
జాంబవతీధన ,, ,,
సత్యాప్రియవర కృష్ణా కృష్ణా ౫౦
కాళిందీధన ,, ,,
నాగ్నజితీశ్వర ,, ,,
నీలాలోలా ,, ,,
మాద్రీకువశ కృష్ణా కృష్ణా

భద్రాభద్రద కృష్ణా కృష్ణా
భస్మితకాశిక ” ”
ప్రాప్తసురాగమ ” ”
మురనరకాంతక ” ”
క్రతుసంరక్షక ” ”
శిశుపాలాంతక కృష్ణా కృష్ణా ౬౦
దంతవక్త్రహర ” ”
దారితసౌభక ” ”
కృష్ణామానద ” ”
అత్రిజభయదా ” ”
పాండవభయహార ” ”
దూషితకురుపతి ” ”
భూషితకురుపతి ” ”
నరరథచోదక ” ”
గీతాచార్యక ” ”
హలాపాదక ” ” ౭౦
విఫలితరిపుశర ” ”
నృగనృపరక్షక ” ”
వంచితవంచక ” ”
పరిపాలితశిశు ” ”
బాణకరాంతక ” ”
ప్రణతభవామర ” ”
ధర్మస్థాపక ” ”
అధర్మహననా ” ”
భక్తజనాశ్రయ ” ”
భూతహృదాలయ ” ” ౮౦
కురుయదునాశన ” ”
హృతభూమీభర కృష్ణా కృష్ణా

భక్తిసుగమ్యా కృష్ణా కృష్ణా
ప్రపత్తిసాధ్యా ” ”
ఓంకారాత్మక ” ”
శంఖచక్రధర ” ”
బాహుచతుష్కా ” ”
లీలామానవ ” ”
జ్ఞానమయాకృతి ” ”
ఆనందరూపక కృష్ణా కృష్ణా
కలిభవభయహార ” ”
అపహతపాప్మా ” ”
కారణపురుషా ” ”
సర్వజగన్మయ ” ”
జగదంతరాత్మక ” ”
స్వీకృతశుభగుణ ” ”
విగతాశుభగుణ ” ”
ఉద్ధవగురువర ” ”
యోగోద్ధారక ” ”
అఘహారనామక కృష్ణాకృష్ణా ౧౦౦
వటదళశయనా ” ”
సారసనయనా ” ”
భీష్మప్రసాదక ” ”
కుచేలవరదా ” ”
తనుగతమాధవ ” ”
ఆశ్రితవత్సల ” ”
వైకుంఠాలయ ” ”
సుబ్బరాయనుత కృష్ణాకృష్ణా ౧౦౮
కృష్ణకృష్ణహరి ” ”
కృష్ణకృష్ణహరి కృష్ణా కృష్ణా

శ్రీకృష్ణార్పణమస్తు

శ్రీరామచంద్రాయనమః
శ్రీసంతానగోపాల పరబ్రహ్మణేనమః

# సంతానగోపాల మంత్రము

అస్యశ్రీ సంతానగోపాల మహామంత్రస్య నారదభగవాన్ ఋషిః-గాయత్రీ ఛందః-సంతానగోపాల ఇష్టదేవతా - క్లాంబీజం - క్లీం శక్తిః-క్లూం కీలకం-శ్రీసంతానగోపాలకృష్ణ ప్రీత్యర్థే జపేవిని యోగః - దేవకీసుత అంగుష్ఠాభ్యాంనమః, గోవింద తర్జనీభ్యాంనమః, వాసుదేవ మధ్యమాభ్యాంనమః, జగత్పతే అనామికాభ్యాంనమః, దేహిమేతనయంకృష్ణ కనిష్ఠికాభ్యాంనమః, త్వామహం శరణంగతః కరతల.....నమః, ఏవంహృదయాదిన్యాసః, భూర్భువ స్వరో మితి దిగ్బంధః॥

ధ్యానం.

యశోదాంకగతం కృష్ణం, కుటిలాలకసంయుతమ్
పిబంతం స్తన్యమమృతం, వందే పుత్రప్రదం హరిమ్॥
ఇతిధ్యాత్వాలం ఇత్యాదిపంచపూజాంకుర్యాత్
ద్వాతింశదక్షరమంత్రం జపేత్ పునఃహృదయాదిన్యాసః
పూజాంకుర్యాత్ శ్రీసంతానకృష్ణ ప్రసాదసిద్ధిరస్తు
కృష్ణాయగోవిందాయ గోపీజనవల్లభాయస్వాహా॥
ఓం - హ్రాం - క్లీం - ఓం.

ఈ మంత్రము సంతానప్రదము. గురుముఖమున నుపదేశము నొంది భార్యాభర్తలు జపించిరేని భార్య స్వప్నమందు నొకనాఁడొక బాలకుఁడు కానవచ్చును. వాని నా యిల్లాలు లాలించి యెత్తుకొని ముద్దాడెనా సంతానము తప్పదు. అసహ్యించుకొని యెత్తికొని ముద్దాడకపోయెనా సంతానము లేదు. అధమపక్షము నలువది దినములైనను శుచివ్రతులై నియమముపాటించి నూటయెనిమిది మార్లు జపింపవలయును. ప్రతిబంధ బాహుళ్యమునఁ గాలయాపన మగుటయుఁ గలదు. శ్రద్ధాభక్తులకొలఁది ఫలము.

శ్రీకృష్ణార్పణమస్తు.
స్వస్తి.

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.

శ్రీ గోపాలకృష్ణ పరబ్రహ్మణే నమః.

శ్రీ శారదాయై నమః.



# శ్రీ కృ ష్ణా వ తా ర త త్త్వ ము.



## శ్రీ భాగవతకర్తృత్వ ప్రశంస.



భాగవతకర్త బోపదేవుఁడుకాని వ్యాసమహర్షి కాఁడని శాక్తేయుల యభిప్రాయము.

ఆంధ్రలిపిని శ్రీభాగవతమును దొలుత ముద్రించిన వారీవిషయమును బూర్ణముగఁ జర్చించి సవిస్తరంబుగ నొక వ్యాసమును రచించి యీ గ్రంథమునకుఁ బీఠికగఁ జేర్చియున్నారు. కావునఁ జర్వితచర్వణ మనావశ్యకము. వారు చెప్పని కారణములు బలిష్ఠమైనవి చెప్పఁబడును.

బోపదేవుఁడు హేమాద్రి సభాస్థాన విద్వాంసుఁడగుట నిశ్చయము. ఈప్రభువు గోపాలకృష్ణ భక్తుఁడు. ఒకనాఁ డీరాజు సభలో నుండి రెండు ముహూర్తములలో భాగవతాధ్యాయ సంగ్రహార్థముఁ

జెప్పఁగల పండితుఁ డెవఁడని ప్రశ్నించెను. అప్పుడు బోపదేవుఁడు రేపటి యుదయమున మీా కాగ్రంథము సమర్పించెదనని చెప్పి "శ్రీభాగవతాధ్యాయసార" మ్మను గ్రంథము రచించి యిచ్చెను. ఈ గ్రంథము నందలి ప్రథమశ్లోకమే యీావిషయమును స్పష్టీకరించుచున్నది.

"శ్రీమద్భాగవతాధ్యాయ, సారో హ్యత్ర నిరూప్యతే
విదుషా బోపదేవేన, మంత్రి హేమాద్రితుష్టయే."

ఈగ్రంథ మతిసంగ్రహముగ నుండుటచే నాప్రభువు తుష్టుఁడు కాఁడయ్యె. కావున నాయన సంతుష్టికై బోపదేవుఁడు భక్తిముక్తాఫలము, భక్తిలహరి యను రెండు గ్రంథములు శ్లోకరూపముగ రచించెను.

భక్తిముక్తాఫల గ్రంథటీకావసానమందు,

శ్లో॥ యస్యవ్యాకరణే వరేణ్యఘటనా ఖ్యాతాః ప్రబంధాదశ
ప్రఖ్యాతా నరవైద్యకేషు తిథిభి ర్వ్యాఖ్యాస్తథాషోడశ
సాహిత్యే త్రయఏవ భాగవత తత్త్వోక్తౌ త్రయస్తస్యతు
హ్యంతర్వాణి శిఖామణే రిహగుణాః కేకేనలోకోత్తరాః॥

ఆటీకయందే బోపదేవుఁడు శ్రీభాగవతమును నిరువదిరెండు మార్లధ్యయనముచేసినట్లు చెప్పఁబడియున్నది. కావున శ్రీభాగవతము బోపదేవరచిత మనుట దుర్వాదముకదా.

'జన్మాద్యస్యయత' యను శ్రీభాగవత ప్రథమ శ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు శ్రీధరస్వాములవారు

"యథోక్తం మత్స్యపురాణే పురాణదానప్రస్తావే
శ్లో॥ యత్రాధికృత్యగాయత్రీం, వర్ణ్యతే ధర్మవిస్తరః
వృత్రాసుర వధోపేతం, తద్భాగవతమిష్యతే॥
లిఖిత్వా తచ్చయోదద్యా, ద్ధేమసింహ సమన్వితమ్
ప్రోష్ఠపద్యాం పౌర్ణమాస్యాం, సయాతి పరమంపదమ్।
అష్టాదశసహస్రం తత్, త్పురాణం పరికీర్తితమ్
పురాణాంతరేచ,

శ్లో॥ గ్రంథోష్టాదశసాహస్రో, ద్వాదశస్కంధ సమ్మితః
హయగ్రీవబ్రహ్మవిద్యా యత్రవృత్ర వధస్తథా
గాయత్ర్యాచ సమారంభ, స్తద్వై భాగవతం విదుః రితి
కించ పద్మపురాణే అంబరీషం ప్రతి గౌతమవచనం
శ్లో॥ అంబరీష! శుకప్రోక్తం, నిత్యం భాగవతం శృణు
పఠస్వస్వముఖేనాపి, యదీచ్ఛసి భవక్షయ॥ మితి

* * 'అతఏవ భాగవతం నామాన్యదిత్యపి నశంకనీయమ్' అని తమ యభిప్రాయము వ్యక్తీకరించిరి అష్టాదశ పురాణాంతర్గతమైన భాగవతము శ్రీభాగవతముగాక వేఱొండుగాదను వీరి యభిప్రాయమే సాధువు

శ్రీభాగవతలక్షణము మత్స్యపురాణమునఁ జెప్పఁబడినపుడు మత్స్యపురాణమునకంటె శ్రీభాగవతము ప్రాచీనమైనదై యుండవలయును. ఇపుడు మనము *మత్స్యపురాణమని వాడుకొనుచుండు పురాణమే క్రీ. శ. ౨౨౫ కాని ౪౩౨ కుఁ గాని యీవల రచింపఁబడినది కాదని సిద్ధాంతము చేయంబడినది. అట్లైనచోఁ గ్రీస్తుపుట్టుటకుముందేకదా శ్రీభాగవతము పుట్టియుండవలయును పౌరాణికుల లెక్కప్రకారము ౫౦౦౦ లకు పూర్వమే. ఇఁక హేమాద్రియో క్రీ. శ. ౧౨-వ శతాబ్దమున నుండినవాఁడు. ఆయన మిత్రుఁడు బోపదేవుఁడాయన సమకాలికుఁడేకదా. బోపదేవుఁడు శ్రీభాగవతమును ౧౩-వ శతాబ్దమున రచియించియుండెనేని దాని లక్షణ మధమపక్షమున మూఁడవశతాబ్దమునఁబుట్టిన మత్స్యపురాణమునం దెట్లు చెప్ప సాధ్యపడును ? కావున బోపదేవుఁడు శ్రీభాగవత గ్రంథకర్తయనుట

---

*"As the chronology of Matsya Purana does not go beyond the Andhra Dynasty, so, in its present form, it cannot be posterior to the year 225 A D., if that date be taken as the termination of the Andhra according to Mr. V Smith. It would be 432 A. D. according to the Matsya Purana. It is, therefore, one of the oldest, if *not the oldest* of the Puranas."

SRISA CHANDRAVASU VIDYARNAVA.

నాంధ్రభాగవత గ్రంథకర్త యోరుగంటివాఁడను వాదము నట్టిద. శ్రీ భాగవత మేలగ్నములోఁ బుట్టినదో కాని గ్రంథకర్తల విషయమునఁ గలహామే, నాయకుని విషయమునఁ గలహామే. అయినను ధర్మోజయతి.

బోపదేవుఁడు ౧౧౫౨ క్రీ. శ. సంవత్సరమున నుండినవాఁడు. తాత్పర్యనిర్ణయమందు

శ్లో॥ బోపదేవకృతత్వేచ, బోపదేవపురాభవైః
కథం టీకాః కృతాః సంస్యు ర్హనుమచ్చిత్సుఖాదిభిః॥

హనుమచ్చిత్సుఖులనువారు బోపదేవునకుఁ బూర్వులు. వారు భాగవతమునకుఁ టీక వ్రాసిరి.

గణపతిలక్ష్మణసేనుఁడను పండితుఁడు ౧౧౭౦ శక సంవత్సరమున నుండినవాఁడు. ఆయన రచించిన "అద్భుతసార"మను గ్రంథమున శ్రీభాగవతమునుండి యనువదించి యున్నాఁడు.

ద్వారకా మఠమున శంకరాచార్యులవారికి రెండవవారైన చిత్సుఖాచార్యులు ౮౫౦ క్రీ. శ. మం దుండెనని చెప్పనగు. ఈయన శ్రీభాగవతమునకు వ్యాఖ్యవ్రాసెను. మధ్వాచార్యులు వీరి వ్యాఖ్య గురించి ప్రస్తావించి యున్నారు. వీరు విష్ణుపురాణమునకును వ్యాఖ్య వ్రాసియున్నారు.

హనుమంతుఁడను నాయన భాగవత విష్ణుపురాణములకు వ్యాఖ్య వ్రాయుటయే గాక నాటకము నొకటి రచియించెను. ఇది యిప్పుడు హనుమన్నాటక మను పేరఁ బరఁగుచున్నది. ఈ హనుమన్నాటకము భోజునికాలమున నుండెను. కావున హనుమంతుఁడు భోజునకుఁ బ్రాచీనుఁడై రమారమి క్రీ. శ. ౭౦౦, ౭౦౦ సంవత్సరముల వాఁడై యుండవలయును.

శంకరాచార్యులు పద్మపురాణములోని వాసుదేవ సహస్రనామావళికి వ్యాఖ్య వ్రాసినట్లును, నందు

"సఆశ్రయః పరం బ్రహ్మపరమాత్మాపరాత్పరః ఇతి శ్రీభాగవతే" యని శ్రీభాగవతమునుండి యనువదించినట్లు భాగవతభూషణ గ్రంథకర్తలైన గోపాలాచార్యకృష్ణమాచార్ అనువారు వ్రాసియున్నారు.

శంకరాచార్యులవారి పరమగురువగు గౌడపాదాచార్యుల వారు పంచీకరణమందు "జగృహేపరమంరూప"మ్మని భాగవత ముప న్యస్తమని వ్రాసిరి.

శౌనకుఁడు ఋగ్విధానాంతమందు

శ్లో॥ అస్యయామా ఋజం జప్త్వా, త్రివారం విష్ణుమందిరే
ఫలంభాగవతం తస్య, లభతే నాత్రసంశయః
జప్త్వా అథరతీ మంత్రం, త్రివారంచ దినేదినే
భారతాఖ్యాన మఖిలం, పారాయణ ఫలం లభేత్
రామాయణఫలం భద్రే, భద్రయాచ జపేదృచమ్
పారాయణ ఫలం సర్వం, శతకోటి ప్రవిస్తరమ్"

అని వచించెను.

గౌడపాదాచార్యు లుత్తరగీతకు వ్యాఖ్య రచించిరి. అందు "హన్యాన్ముష్టిభిరాకాశ"మ్మను (౨-౪౯) శ్లోకమునకు వ్రాసిన వ్యాఖ్య యందు నిట్లు వ్రాయఁబడి యున్నది.

"యోవేద శాస్త్రాణ్యధీత్య శ్రుత్వాపి నాహం బ్రహ్మేతి జానాతి తస్యసర్వాణి ప్రయాస ఫలాన్యేవ....యథావాతుషం ఖండ యేదవహన్యాత్ అవహననేన శ్రమ ఏవఫలం నతు తండులలాభః తద్వన్ముక్తి ర్నజాయతే ఇత్యర్థః తదుక్తం భాగవతే.

శ్లో॥ శ్రేయస్సృతింభక్తిము దస్యతేవిభో । క్లిశ్యంతియే కేవల మాత్మలబ్ధయే । తేషామసౌక్లేశల ఏవశిష్యతే । నాన్యద్యథా స్థూల తుషావఘాతినామ్॥"

జైమినిభారత మశ్వమేధపర్వమందు

శ్లో॥ భారతం హరివంశంచ, పుత్రదం ధనదం భవేత్
శ్రీమద్భాగవతం పుణ్యం, భుక్తిముక్తి ఫలప్రదమ్.

ఎట్లు చూచినను జైమిని భారతము క్రీ. శ. ౧౦౦౦కి నీవలిగ్రంథము గాఁజాలదు.

క్రీ. పూర్వము ౩౫౦-యందుఁ బుట్టిన చాణక్య నీతియందు

శ్లో॥ ప్రాతర్ద్యూత ప్రసంగేన. మధ్యాహ్నే స్త్రీ ప్రసంగతః
రాత్రౌ చోర ప్రసంగేన, కాలోగచ్ఛతి ధీమతామ్''
అని భాగవతము పేర్కొనఁబడెను.

కోల్‌బ్రూక్, విల్సన్, లోనగువారు శ్రీభాగవత గ్రంథకర్త బోపదేవుఁడు కాఁడని వ్రాసిరి. బోపదేవ పూర్వులెందఱో శ్రీ భాగవతమునుండి యనువదించుటచే బోపదేవుఁడు భాగవతకర్తగాఁ డనుట నిస్సంశయ సిద్ధాంతము. ఈ విషయ మింకను గోరువారు పురాణ నిరీక్షణమను మహారాష్ట్ర గ్రంథమును బఠింపవచ్చును.

—• శ్రీభాగవతోత్పత్తి ప్రశంస. •—

శ్రీ మహాభారత రచనానంతరము వేదవ్యాసు లోకనాఁడు తనలోఁ దానిట్లు వితర్కింపఁదొడంగె.

సీ. వ్రతధారినై వేద వహ్ని గురుశ్రేణి
మన్నింతు విహితకర్మములఁ గొఱఁత
పడకుండ నడపుదు, భారతమిషమునఁ
బలికితి వేదార్థ భావమెల్ల
మునుకొని స్త్రీశూద్ర ముఖ్యధర్మములందుఁ
దెలిపితి; నేఁ జెల్ల దీనఁజేసి
యాత్మ సంతస మంద దాత్మలో నీశుండు
సంతసింపక యున్న జాడ దోఁచె*
ఆ. హరికి యోగివరుల • కభిలషితంబైన
భాగవతవిధంబుఁ బలుకనైతి

*దీనివలన వేదాధ్యయన యజ్ఞగురు పూజాదులచేతను నిత్య కర్మానుష్ఠానముల చేతను, ధర్మోపదేశములచేతను భగవంతుఁడు సంతసింపఁడని యేర్పడుచున్నది.

• హరికియోగివరుల కభిలషితమనుటచే నిరువు రేకాభిప్రాయులు. యోగు లనఁగా జితేంద్రియులగు భక్తులు. హరికి హరిభక్తులకుఁబరస్పరసమాగమమే యుద్దేశము. హరినివిడిచి భక్తు లుండఁజాలరు భక్తులవిడిచి హరి యుండఁజాలఁడు. భాగవతము యోగివరుల కభిలషితమనుటచే ముముక్షువులే భాగవతపఠనమున కధికారులు గాని కామదాసులు గారని యేర్పడుచున్నది అనధికారులకు భాగవతపఠన మనర్థక హేతువనుటకుఁ గృష్ణలీలల నాక్షేపించువారే ప్రత్యక్ష ప్రమాణములు.

మోసమయ్యెఁ, దెలివి మొనయదు, మఱచితి
ననుచు వగచుచున్న యవసరమున. భాగ.

నారదుం డాయనను జూడవచ్చి యాయన విషాదకారణం బరసి యిట్లనియె.

ఉ. అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నిం
చించుకగాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు; ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁగాక? నీకు నీ
కొంచెము వచ్చునెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా. భాగ.

మునీంద్రా నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు హరిభక్తి లేకున్న శోభితంబు గాదు. భక్తి హీనంబులయిన జ్ఞానవాచా కర్మ కౌశలంబులు నిరర్థకంబులు. కావున స్వభావకామ్య కర్మంబులందు రాగంబుగల ప్రాకృతజనులకు ధర్మంబులు చెప్ప నియమించిన శాసకుండవగు నీ నడవడి తగ దది యెట్టులనిన వార లదియె ధర్మంబని జుగుప్సితంబులగు కామ్యకర్మంబులు సేయుచుఁ దత్త్వజ్ఞానంబు మఱతురు గావున బుద్ధి మోహంబు జనియింపకుండఁ దత్త్వప్రపదుండవై వ్యథావియోగంబు సేయుమని మఱియు నిట్లనియె.

చం. ఎఱిఁగెడువాఁడు కర్మచయమెల్లనుమాని హరిస్వరూపముఁ
నెఱయనెఱుంగు నవ్వలను నేరుపుఁ జూపు గుణానురక్తుఁడై
తెఱకువలేక క్రుమ్మఱుచు దేహధనాద్యభిమానయుక్తుఁడై
యెఱుఁగనివానికిం దెలియ నీశ్వరలీల మునీంద్ర చెప్పుమా.

ఎఱుకగలవాఁడు హరిసేవకుం బ్రయత్నంబు సేయందగు. కాలక్రమంబున సుఖదుఃఖములు ప్రాప్తంబు లయినను హరిసేవ విడువఁ దగదు. దానం జేసి బ్రహ్మస్థావర పర్యంతంబు దిరుగు జనులకు నెయ్యది పొంద రానట్టి మేలు సిద్ధించు. హరిసేవకుం డగువాఁడు నీచజన్మంబు

నొందియు నన్యుక్రియ సంసారంబునం జిక్కండు. క్రమ్మఱ హరిచరణ స్మరణంబుసేయు. భక్తిరస వశీకృతుండయి విడువ నిచ్ఛగింపండు.''*
భాగ.

అని భక్తియోగ విధానం బుపదేశించి చనియె. వ్యాసులకు నారదుం డుపదేశించిన భక్తివిధానమే నారదభక్తి సూత్రములను పేర వ్యవహరింపం బడుచున్నది. ఆ సూత్రతత్త్వమునకు లక్ష్యగ్రంథమే శ్రీభాగవతము. ఇట్లుపదేశంబు నొంది.

మ. అవనీచక్రములోన నేపురుషుం డేయామ్నాయముల్ విన్న మా
  ధవుపై లోకశరణ్యుపై భవములం దప్పింపంగాం జాలు భ
  క్తి విశేషంబు జనించు నట్టిభువనక్షేమం కరంబైన భా
  గవతామ్నాయము బాదరాయణుండు దాంగల్పించె నేర్పొప్పంగన్.

ముముక్షుజన సేవ్యంబయిన భాగవతం బిట్లు రచించి భక్తి విరక్తిజనకం బగు దీనిని బఠింప నధికారి యెవ్వండా యని యాలోచించి మహా యోగియు భక్తి వైరాగ్యనిధియు నగు తనపుత్రు శుకునిం బిలిచి యా యనచే దాని నధ్యయనంబు చేయించె. ఏ వంశమున యోగి జనించునో యా వంశమువారు తరింతురు. కావునం గొడుకునకే యుపదేశించెనని యెఱుంగనగు. ఆ శుకులు దానిని ధరించియుండి ప్రాయోపవిష్టుండై యాసన్నమరణుండైన పరిక్షిత్తున కెఱింగించె.

శృంగిశాప కారణంబునం బరిక్షిత్తు దా నేడుదినములలో సర్ప దష్టుండై మరణించుట యెఱింగి ప్రాయోపవేశంబు గావించి నిద్రాహార

---

*భక్తియోగరుచి మరగినవాడు దానిని విడువంజాలండు. ఒకవేళ వీడు జన్మాంతరమందు సంసారములోం జిక్కియుండినను నది వీనిని వదలదు. దానిఫల మది చూపువఱకుం దొలంగకయే యుండును. జ్ఞానయోగమున స్వరూపవిచ్ఛిత్తి గలిగినం గలుగవచ్చును గాని భక్తియోగంబునం గలుగదు.

చ. తనకులధర్మమున్ విడిచి దానవవైరి పదారవిందముల్
  పనివడి సేవచేసి పరిపాకము నొందక యెవ్వండేనిం జ
  చ్చిన మఱుమేననైన నది సిద్ధివహించును.... ... భాగ.

ములు విడిచియుండెను. ఆయనను జూడ ననేకులు మహర్షులరుదెంచిరి. వారిని గని పరీక్షిత్తు

కం. ఏడు దినంబుల ముక్తిం
గూడంగ నే రీతివచ్చు గురుసంసార
క్రీడన మేక్రియ నెఱదెగుఁ
జూడుఁడు మా తండ్రులార శ్రుతివచనములన్

అని ప్రశ్నించెను ఆయన పుణ్యవశంబున నా సమయంబున నచ్చటికి శుకయోగి వచ్చిన నాయనను బూజించి "నేఁ జెల్లి దేహంబు వర్జించు దేహధారి కేమి చింతించిన నేమి జపించిన నేమి గావించిన నేమి వినిన నేమి సేవించిన నెన్నఁడు సంసారపద్ధతిఁ బాసినపదవి గలుగు" నని ప్రశ్నింపఁగా

కం. కావున సర్వాత్ముండును మ
హావిభవుఁడు విష్ణుఁ డీశుఁ డాకర్ణింపన్
సేవింపను వర్ణింపను
భావింపను భవ్యుఁ డభవ భాజికి నధిపా.

సీ. ద్వైపాయనుఁడు నాదుతండ్రి ద్వాపరవేళ
బ్రహ్మసమ్మితమైన భాగవతముఁ
బఠనంబు సేయించె బ్రహ్మతత్పరుఁడనై
యుత్తమశ్లోక లీలోత్సవమున
నాకృష్టచిత్తుఁడనై పఠించితి నీవు
హరిపాద భక్తుండ వగుటఁ జేసి
యెఱిఁగింతు వినవయ్య యీ భాగవతమున
విష్ణుసేవా బుద్ధి విస్తరిల్లు

ఆ. మోక్షకాములకును మోక్షంబు సిద్ధించు
భవభయంబులెల్ల బాసి పోవు
యోగిసంఘములకు నుత్తమ వ్రతములు
వాసుదేవనామ వర్ణనములు

అని భాగవతమంతయు నుపదేశించె.

ఇందు వక్త శుకయోగి. స్త్రీపురుష భేదజ్ఞాన రహితుఁడు. దిగంబరుఁడు. జీవన్ముక్తుఁడు.

శ్రోతయగు పరీక్షిత్తు హరికృపాకటాక్ష పునర్లబ్ధ జీవితుఁడు. హరిభక్తుఁడు. హరిభక్తులవంశమునఁ బుట్టినవాఁడు.

కం. దామోదర పదభక్తిం,
 గామాదుల గెల్చినాఁడు గావునఁ గరుణన్
 భూమీశుఁ డలుగఁ డయ్యెను
 సామర్థ్యము గలిగి దోషసంగిన్ శృంగిన్

అని కామక్రోధముల జయించినవాఁడు. ఆసన్న మరణుఁడు. ముముక్షువు. విషయమా భగవద్గుణ వర్ణనము.

శుకమహర్షి యేఁడు దినములలో నైదుదినములు తొమ్మిదిస్కంధముల గ్రంథము చెప్పెను. ఇఁక దినమో యొకటిన్నర దినమో యున్నదన శ్రీ కృష్ణచరిత్రముఁ జెప్ప నారంభించెను. ఇట్టి సందర్భములలో నట్టివాని కట్టివాఁ డెట్టి చరిత్రము చెప్పియుండునో యాలోచింపుఁడు. గోపికా కృష్ణలీల లంకుపురాణ మైనచో నది చెప్పియుండునా? వినువారు వినియుందురా? ఈ మాత్ర మాలోచింపక గోపికా కృష్ణుల దూషించువా రెట్టి మతిమంతులో.

ఇప్పటి మహాశీలవంతులు భాగవతము చదివినవారు దుశ్శీలురై చెడుదురనినను బూర్వుల యభిప్రాయ మెట్టిదో చూడుఁడు.

శ్లో॥ భారతం హరివంశంచ, పుత్రదం ధనదంభవేత్
 శ్రీమద్భాగవతం పుణ్యం, భక్తిముక్తి ఫలప్రదమ్.

జైమిని–అశ్వమేధము.

ప్రాత ర్ద్యూత ప్రసంగేన, మధ్యాహ్నే స్త్రీప్రసంగతః
రాత్రౌ చోరప్రసంగేన, కాలో గచ్ఛతి ధీమతామ్.

చాణక్య నీతిశాస్త్రము.

సదా సేవ్యా సదాసేవ్యా, శ్రీమద్భాగవతీకథా
యస్యాః శ్రవణమాత్రేణ, హరి శ్చిత్తం సమాశ్రయేత్.
పురాణేషుచ సర్వేషు, శ్రీమద్భాగవతం పరమ్

యత్ర ప్రతిపదం విష్ణు, ర్గీయతే బహుధర్షిభిః
అర్థోయం బ్రహ్మసూత్రాణాం, భారతార్థ వినిర్ణయః
గాయత్రీ భాష్యరూపోసౌ, వేదార్థ పరిబృంహితః॥

'భక్తి విరక్తీ భాగవతేన' యన్నట్లు భాగవతమును బఠించు వారికి భక్తియు విరక్తియుఁ గలుగును కావుననే ఫలశ్రుతియందు "ముముక్షూణాం" మోక్షాసక్తులకై యిది వ్రాయఁబడెనని భాగవతము తుదఁ జెప్పఁబడెను. కావునఁ దదితరులు భాగవతపఠనమున కధికారులు గారు. కామదాసులు పఠించి విపరీతార్థములు చేసికొని చెడుచుండుట కనులారఁ జూచుచున్నారముగదా. అధికారులు గాని వారు చదువుటచే ననర్థకము తప్పదు. 'ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతిధారయ' న్నను భగవద్గీతావాక్యము జారులకుఁ బ్రమాణమయ్యెఁగదా. 'సోమపాః పూతపాపా' యను వాక్యమును బ్రాగుఁ బోతులకు నాధారముగ నొక మహానుభావుఁడు సమర్థించెఁగదా. ఇట్టి యనధికారులకు గోపికా కృష్ణచరిత్రము బూతుపురాణముగాఁ దోఁచు టేమివింత. కావుననే యిట్టివారికి భాగవత భగవద్గీతాదు లుపదేశింపరాదని శాసింపఁబడియె.

భాగవతమంతయు ద్వాదశాక్షరీ మంత్రార్థమును బోధించుచున్నది. పండ్రెండక్షరములకుఁ బండ్రెండు స్కంధములు. శ్రీమద్రామాయణ భారతములం దిట్టిది కానవచ్చెడినిగదా. అంతయు సమర్థించుటకు నిపుడు సమయముగాదు. ప్రణవార్థము ప్రథమస్కంధమునను, నమశ్శబ్దార్థము రెండుమూఁడు స్కంధములందును; ౪-౫-౬-౭ స్కంధములందు భగవచ్ఛబ్దార్థమును, ౮-౯ లయందు వాసశబ్దార్థమును, ౧౦-౧౧ నందు దేవశబ్దార్థమును, ౧౨ నందు విభక్త్యర్థమును గానవచ్చెడిని. దేవశబ్దమునకుఁ గ్రీడించువాఁడని యర్థము. ౧౦-౧౧ ఈ రెండు స్కంధములందును కృష్ణలీలలు కదా కీర్తింపఁబడెను. నృసింహాద్యవతారములు భగచ్ఛబ్దార్థమునే కదా బోధించు.

భగవంతునిచే నుపదేశముగొనిన నారదుఁడు పాంచరాత్రాగమమును వ్యాసుల కుపదేశించెను. మఱియుఁ బాంధరాత్రాగమ

విధానమును రచించెను. పాంచరాత్రమునకే సాత్త్వతమనియు, భాగవతమనియును పేర్లు గలవు. తా నుపదేశముగొనిన ప్రకారము వ్యాసులు గ్రంథమును రచించి దానికి శ్రీభాగవతమనియే పేరుంచెను. కావున నిది పాంచరాత్ర ధర్మమునే బోధించుచున్న దని యెఱుంగనగు. చూ. కృ. లీల పుట. ౧౦౦౭? కావుననే పాంచరాత్ర మందలి వాసుదేవ, సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధు లిందును గానవచ్చెదరు. ఆ పూజావిధాన మిందు విస్తరింపఁ బడినది. నారదుఁడు ధ్రువునకు ద్వాదశాక్షరిగజా యుపదేశించెను. సాత్త్వతవంశమందుఁ గృష్ణుఁడు జనించెనని గోపికా గీతలయందుఁ గలదుకదా. ఈవిషయమైన వాక్యములు ప్రతి స్కంధమందును గననగు.

## —♦ అవతారావశ్యకతా ప్రశంస ♦—

శ్రీమన్నారాయణుండు తా నెట్టిసందర్భముల భూమిపై నవతరించునది

శ్లో॥ యదాయదాహి ధర్మస్య, గ్లానిర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మానం సృజామ్యహమ్॥

(కృష్ణలీల ద్వితీ పుట ౩౪౧, పంక్తి ౧౮. భగవద్గీత ౪—౭) అను వాక్యంబునందు వచించెను. కృష్ణావతారకాలంబున దేశకాలస్థితు లెట్లుండెనో కొంచెము పరిశీలింతము.

ఆర్యావర్త మధ్యదేశమున నాయకమణివలెనుండు మథురయందుఁ బ్రభువు కంసుఁడు. వీఁడు పూర్వజన్మంబునఁ గాలనేమి యను రాక్షసుఁడు. వాఁడు మిగుల దుష్టుఁడై విష్ణువుచే నిహతుఁడయ్యెను. ఆకారణంబున నృశంసుఁడు సాధుజనద్వేషి. వీఁడు రాజ్యకాంక్షఁ దండ్రిని గారాగృహబద్ధునిఁ గావించినవాఁడు. జీవితకాంక్షఁ దోఁడఁ బుట్టినదానిఁ, బెండ్లికూఁతు, నట్టనడివీథిలోఁ దలవెండ్రుకలు పట్టి లాగి చంపఁబూనినవాఁడు. ఆమెను భర్తతోడ బందిమందిరమునఁ ద్రోచి కాళ్ళకు సంకెలలు వైచినవాఁడు, శిశుహంత. దుష్టరాక్షససహాయుఁడు. సాధుబాధకుఁడు. బంధువిరోధి. కేవల పౌరుషమే పర

మార్గమని భుజబలము నమ్మియుండువాఁడు. ప్రభు విట్టివాఁడైనచో వీని సేవకు లెట్టివారుగ నుందురో మీరే యాలోచింతురుగాక.

శ్లో॥ రాజా రాక్షసరూపేణ, వ్యాఘ్రరూపేణ మంత్రిణః
సేవకా శ్వానరూపేణ, యథారాజా తథాప్రజా॥

యను నార్యోక్తి కలదుగదా. ఇట్టివాని రాజ్యమందుఁ బ్రజ లెంత సుఖితురో.

వీని మామ జరాసంధుఁడు. మగధదేశ రాజు. మహా బలిష్ఠుఁడు. అశస్త్రవధ్యుఁడు. అపార సేనాసహితుఁడు. ఇంతటివాఁడు రాజులనోడించి పట్టితెచ్చి చెఱసాలనుంచి వారి శిరస్సుల ఖండించి శివునకు బలియిచ్చుచుండెను.* రాజులను బలియిచ్చుటకు ముందు వారిని బట్టితెచ్చుటకై రణరంగంబున నెందఱ యమునకు బలి యిచ్చుచుండునో యూహింపుఁడు. రాజహీనములైన యా రాష్ట్రము లెట్టి యిక్కట్టులపా లగుచుండునో.

నరకుఁడు ప్రాగ్జ్యోతిషాధిపతి. (ఇప్పటి ఆసామ్) వీఁడు పదునాఱువేల కన్యకలను జెఱసాలయందుంచి నిర్బంధించినవాఁడు. ఆఁడు దాని (అదితి) చెవులకమ్మలు త్రెంచికొని తెచ్చినవాఁడు. వీని వలననే వీఁడెంత కామాతురుఁడో ధనకాంక్ష గలవాఁడో యెఱుఁగ

*శ్లో॥ త్వయాచోపహృతా రాజన్, క్షత్రియా లోకవాసినః
తదాగః క్రూరముత్పాద్య, మన్యసే కిమనాగసమ్॥ ౮ ॥
రాజా రాజ్ఞః కథంసాధూన్, హింస్యా న్నృపతి సత్తమ
తద్రాజ్ఞః సన్నిగృహ్యత్వం, రుద్రాయోపజిహీర్షసి॥ ౯ ॥
అస్మా న్తదేనోపగచ్ఛే, త్కృతం బార్హద్రధ ! త్వయా
వయంహిశక్తాధర్మస్య, రక్షణే ధర్మచారిణః॥ ౧౦ ॥
మనుష్యాణాం సమాలంభో, నచదృష్టః కదాచన
సకథం మానుషైర్దేవం, యష్టుమిచ్ఛసి శంకరమ్॥ ౧౧ ॥
సవర్ణోహిసవర్ణానాం, పశుసంజ్ఞం కరిష్యసి
కోన్యఏవంయథాహిత్వం, జరాసంధ వృథామతిః॥ ౧౨ ॥
తేత్వాం జ్ఞాతిక్షయకరం, వయ మార్తానుసారిణః
జ్ఞాతివృద్ధి నిమిత్తార్థం, వినిహంతు మిహాగతః॥౧౩॥ సభా, అధ్యా. ౨౨,

నగు. పదునాఱువేల కన్యకలను జెఱపెట్టుటకై యెందఱ స్త్రీలను బురుషులను వధించియుండవలయునో కదా. వీరందఱు నరకాసురు పుత్రికలనియు నీచరిత్ర యవిశ్వసనీయమనియు నాంగ్లభాషయందుఁ గృష్ణచరిత్రము వ్రాసినవారు లిఖించిరికాని యది నిరాకరము.*

ఇఁక ధృతరాష్ట్రుఁడు హస్తినాపుర రాజు. గుడ్డిము గ్రుడ్డిదైనను దానాకుఁ దక్కువలేదు. ఇతఁడు గ్రుడ్డిరాజైనను నతిలోభదూషితుఁడు. మనస్సొకతీరు వాక్కొకతీరు. వీని కొడుకు దుర్యోధనుఁడు. కలిపురుషుని యవతారము. దుష్టసహాయుఁడు. భారతరణమునకు మన యిప్పటి దుర్గతికి నీ తండ్రికొడుకులే కారణభూతులు.♦

శిశుపాలుఁడు. సాధుద్వేషి. పరస్త్రీలను బలాత్కారముగఁ బట్టువాఁడు. యజ్ఞవిధ్వంసకుఁడు. జరాసంధ సహాయుఁడు. భగవద్ద్వేషి. జయవిజయులు సనకసనందనాదుల శాపంబునఁ దొలుత హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగాను, దరువాత రావణ కుంభకర్ణులుగాను, నిప్పుడు శిశుపాల దంతవక్త్రులుగాను జన్మించిరి. వీరు భగవదవతారమూర్తి చేఁ దప్ప నితరులచేఁ జచ్చువారు కారు.

ఈ షట్కోటి రాక్షసులుగాక ప్రత్యక్షరాక్షసులు మఱియెందఱో యుండిరి. వీరు మనుజాశనులు. దేవబ్రాహ్మణ ద్వేషులు. ఇట్టివారు దేశమున నిండియుండఁ బ్రజల క్షేమాత్రము సుఖముగలదో. ధర్మము గతి యెట్లుండినది ధర్మరాజాదుల చరిత్రమే చాటుచున్నది.

ఇఁక స్త్రీలగతి యెట్లుండెనో చూతము. నరకాసురుని చెఱసాలయందలి స్త్రీలను, శిశుపాలుఁడు చెఱచిన స్త్రీలను, నిండుసభలో

---

శ్లో॥ తత్రరాజన్యకన్యానాం, షట్సహస్రాధికాయుతమ్
భౌమాహృతానాం విక్రమ్య, రాజభ్యో దదృశే హరిః॥
కృ. లీ. ౩౯౦ పుట. భాగ. ౧౦. స్కం. ౫౯ అధ్యా.

♦ బ్రాహ్మణదూషణమే ముఖ్యోద్దేశముగాఁ గలిగి వ్రాయఁబడిన Sri Kristna The Soul of Humanity అను గ్రంథమున భారతరణమునకు బ్రాహ్మణులు ప్రేరకులని వ్రాయఁబడియున్నది. ఇట్టి తెలివిమాలిన వ్రాఁతలు విమర్శించుట యంతకంటెఁ దెలివితక్కువతనముగదా.

ద్రౌపదికిఁ గలిగిన మానభంగమును, కంసుని చేతిలో దేవకి పడిన పాటును నాలోచించినచో సామాన్యముగ స్త్రీల కాకాలమున విశేష గౌరవము లేనట్టే చెప్పఁదగియున్నది. గ్రుడ్డిధృతరాష్ట్రునకే వైశ్యస్త్రీ లంజగావలసివచ్చినపుడు తక్కినప్రభువు లెట్టివారై యుండిరో యిప్పటి మన స్వదేశప్రభువులను గొందఱఁజూచి యూహింపవచ్చును. భరణము దిను నీ కాలమందే యీ రీతినుండినచో స్వతంత్రులై యుండిన యాకాలమున నేపాటుపడిన నెవ్వ రడుగువారు? పెద్దలు పిన్నలు రాజులు నిండియుండిన సభలోనికిఁ గుణస్త్రీని, రజస్వలను, పాండవుల భార్య యంతటిదాని నీడ్చి తెచ్చి కట్టినగుడ్డ విప్పివేయుచుండ నిరువురు తప్పఁ దక్కినవారు వేడుక చూచుచుండిరి. ఇఁక మఱుఁగు మూలల నెవ్వతె నెవ్వ రేమిచేసిన విచారించువా రెవ్వరు? యథారాజా తథాప్రజా.

పాతివ్రత్యమహిమ రక్షించుటయందు విశేష నీతిరహితలను సన్మార్గమున శిక్షించుటయందుఁ గృష్ణుఁ డెంత శ్రమించెనో ద్రౌపదీ గోపికావృత్తాంతము లరసినఁ దెలియనగు. నరకాసుర నిబద్ధలైన కన్యకలఁ గృష్ణుఁడు వివాహమాడుటయు వారి దోషరాహిత్యమును లోకమున కెఱిఁగించి వారిని కృతార్థులఁ జేయుటకే. ఆయన వారిని గ్రహింపకుండిన వారిగతి యేమైయుండునో. అన్నిదినములు దుష్టకాముపీడితులైన రాక్షసుల స్వాధీనమందుండిన కన్యకలు మరల వారి యిండ్లకుఁ బోయియుండిన వారి నెవరు శీలవంతులని విశ్వసించి వివాహమాడియుందురు? సీతావృత్తాంతము స్మరణీయము. భగవంతుఁడు వారి కట్టిగండము తప్పించెను. కావున సాధూనామ్మనుదాని నేకశేషముగ గ్రహించి సాధుజనరక్షకై సాధ్వీజనరక్షకై భగవంతుఁ డవతరించునని గ్రహించు టొప్పు *

*భక్తులగు పురుషులు ప్రార్థించినఁ బ్రత్యక్షము గాకపోయినఁ బోవునుగాని భగవంతుఁడు సాధ్వులు ప్రార్థించిరా తప్పక ప్రత్యక్షమగును. దీనికి ద్రౌపదీ గోపి

ఇంక మతచర్య లెట్లుండెనో చూతము. బృందావనమున బ్రాహ్మణులు చేసిన యజ్ఞమువలనను, నందాదులు చేయఁబూనిన యింద్రయాగము వలనను,

శ్లో॥ యా మిమాం పుష్పితాం వాచం, ప్రవద న్త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ, నాన్యద స్తీతివాదినః॥ భ. ౨-౪౨.
కామాత్మాన స్స్వర్గపరా, జన్మకర్మ ఫలప్రదామ్
క్రియావిశేషబహుళాం, భోగైశ్వర్యగతిం ప్రతి॥ ౨-౪౩.
భోగైశ్వర్యప్రసక్తానాం, తయాపహృతచేతసామ్
వ్యవసాయాత్మికాబుద్ధి, స్సమాధౌ నవిధీయతే. ౨-౪౪.
కృష్ణలీల సం. ౨ పుట ౩౩౬.
త్రైగుణ్య విషయావేదా, నిస్త్రైగుణ్యో భవార్జున॥ ౨-౪౫.
త్రైవిద్యామాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే॥ ౯-౨౦.
సకాలే నేహ మహతా, యోగోనష్టః పరంతప॥ ౪-౨.

భగవద్గీత యందలి యిత్యాది వాక్యముల వలనను, నాకాలమునఁ గామ పరతంత్రులై యజ్ఞాదులు చేయుచుండిరని తెలియనగు. జరాసంధుని శివపూజా విధానముఁ జూచిన నా కాలమున నరబలి యిచ్చు నఘోరచర్యయు నున్నట్లు తోఁచెడి. ఇది యిప్పటికిని గొన్ని ప్రదేశములఁ గలదు. "దత్తపుత్రేషు పుత్రేచ్ఛా, మోక్షేచ్ఛా శాక్తికే మతే" యను వాక్యము దీనివలనఁ బుట్టినదే కదా.

---

కాదులే దృష్టాంతము. సాధ్వుల కంటినీరుగాఱు నెవరు చేయుదురో వారిని భగవంతుఁడు సమూలము ధ్వంసముచేయును. మనస్సుపెట్టినచో స్త్రీలకుఁగల చొఱవ నిబ్బరము దృఢచిత్తము సాహసము పురుషులకుఁ గలుగదు. కావున స్త్రీలు పరిహసనీయులుగారు. కాని భర్తృహరి చెప్పినట్టు వారు విషమయులు నమృతమయులు. వేనిచేత జీవింపఁజేయుదురో వానిచేతనే పురుషుల నరకములఁ ద్రోయుదురు. పురుషులకు వీరి యనుగ్రహము నిగ్రహముకూడ ననర్థకమే. కావుననే ముముక్షువులు వీరి కంటఁ బడరాదని బోధింపఁబడిరి.

మీఁదఁ జెప్పఁబడిన విధముగ దుష్ప్రభువులు తత్పరిజనములు పెట్టు బాధల సహింపఁజాలక యెందఱు స్త్రీపురుషులు హాహాకారం బులు గావించుచు "రాఁడా చూడ సమస్త భూతములలో రంజిల్లు వాఁడు. రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా. కలఁడు కలండనెడివాఁడు కలఁడో లేఁడో" యని భగవంతునిఁ గూర్చి మొఱలు పెట్టుచుండిరో. ఒక గజేంద్రుని మొఱకే వైకుంఠమువిడిచి పరువు పాఱివచ్చిన వాఁ డిందఱు మొఱలుపెట్ట నేల వారిని రక్షింప రాకుండును. ఇందఱు మొఱపెట్టలే భూదేవి మొఱపెట్టుట గాదా. తనకై తపస్సులు ధారవోసి తన్నుఁ బుత్రునిఁగఁగోరి వరమందిన దేవకీ వసుదేవులు తనకై కారాగృహంబున నవయుచుండిరి. తనచే మరణించి మరల వైకుంఠంబు ప్రాపింప వరమందిన శిశుపాల దంత వక్త్రులు భూమిపై జన్మించియుండిరి. తనవలన నలకూబర మణిగ్రీవ ముచుకుంద నృగాదులు కృతార్థులు కావలసి యుండిరి. ఇట్టి సమయ మునఁ గాక మఱి యెట్టి సమయంబున భగవంతుఁ డవతరింపవలయు.

ఇఁక స్త్రీ శూద్రాదులకు వేదాధ్యయనాధికారము లేదు. తపోధికారము లేదు. కర్మాధికారమును లేదు. కావున వారు జ్ఞాను లగు మార్గమే లేదు. ఇఁక వారెట్లు తరింపవలయునో? (కృ. లీ. పుట. ౧౫౩ పంక్తులు ౮-౧౦) వీరికిఁ దరణోపాయ మేర్పాటు చేయవలసి యున్నది. వీని నన్నిటి నాలోచించిన దేశమున దుర్మతములు దురా చారములు దుష్కర్మములు మెండుకొని యుండెననుట స్పష్టము.

ఎట్టి సమయమునఁ డా నవతరింతు నని 'యదా యదాహి ధర్మస్య' యను శ్లోకమున భగవంతుఁడు చెప్పెనో యట్టి సమయము తటస్థించెనని మీఁది సందర్భములవలన నేర్పడియె

## —♦ అవతార ప్రయోజన ప్రశంస. ♦—

ఇఁక నవతార ప్రయోజనముల నాలోచింతము.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి యుగేయుగే। భ. ౪-౮.
కృష్ణలీల. సం. ౨ ౩౫౧ పుట. ౧౭-౧౮.

అను భగవద్గీతా వాక్యమువలన, (౧) సాధుపరిత్రాణము (౨) దుష్కృతవినాశము, (౩) ధర్మసంస్థాపనము నను నీ మూడును నవతార కార్యములని యేర్పడు చున్నది. భగవంతుఁ డివి యెట్లు నిర్వహించెనో చూతము.

సాధుపరిత్రాణము.

ఆర్తులు జిజ్ఞాసువులు నర్థార్థులు జ్ఞానులు వీరందఱు స్త్రీలుగాని పురుషులుగాని సాధువులే యగుదురు. ఉదారాస్సర్వ ఏవైతే" యని భగవంతుఁడే వచించెఁ గదా.

ఆర్తులైన దేవకీ వసుదేవులఁ జెఱనుండి విడిచె. తన భక్తియుఁ దన సేవయుఁ బూర్వజన్మంబులఁ గోరిన జిజ్ఞాసువుల యశోదానందులను, గోపికలను గృతార్థులఁ గావించె. అర్థార్థులైన కుచేలాదులఁ గనికరించె. నలకూబర మణిగ్రీవ నృగుల శాపముక్తులఁ గావించె. జ్ఞానులగు నక్రూర ముచుకుందోద్ధవ మైథిల శ్రుతదేవాదుల ననుగ్రహించె. కారాబద్ధులైన రాజులను ముక్తులఁ గావించె. బంది మందిరంబునఁ గుందు నిందువదనల ప్రాణంబు మానంబు గాచె. విపద్దశనుండు ద్రౌపదిని రక్షించె. తన భక్తులనేగాక వారి యాప్తులను గూడ రక్షింతునను స్వనియమము ననుసరించి శరణాగతయైన ద్రౌపదినే గాక యామె భర్తలు నిజభక్తులును నగు పాండవుల మహారణ సాగరంబుఁ దరింపంజేసి రక్షించె. పరిక్షితుఁ బునర్జీవితుఁ జేసి వారి వంశంబు నిలిపె. ఇవన్నియు సాధుపరిత్రాణ కార్యంబులేకదా. జ్ఞానులకుఁగాని యజ్ఞులకుఁగాని స్త్రీశూద్ర చండాలురకుఁగాని భక్తియోగమే తరణోపాయమని సిద్ధాంతీకరించె.

దుష్కృత వినాశము

పూతనా తృణావర్త వ్యోమ కేశి బకాఽఘ ధేనుక ప్రలంబాది రాక్షసుల సంహరించె. కంసు మిత్రసహితంబుగ వధించె. నరక శిశుపాల దంతవక్త్ర జరాసంధ కాల యవన సాల్వపౌండ్ర కాశిరాజాదుల రూపుమాపె. పరస్పర సంఘర్షణంబు కల్పించి తజ్జనితాగ్ని వలన వెదుళ్ళు దహించు వాయువువలెఁ గురుపాండవులకుఁ బోరు

కల్పించి నిరాయుధుండై పదునెనిమిది యక్షౌహిణుల సమయించె. దృప్తులైన యాదవుల యసంఖ్యాయబలంబుల నన్యోన్యకలహంబున హతంబుగావించె. ఒక హిడింబ కిమ్మీర ఘటోత్కచ కాలకేయ నివాత కవచులఁ బరులచేఁ జంపించె. ఇట్లు భూమి నిష్కంటకంబుఁ గావించె. స్వాధికార బలంబునఁ గన్నులు గానని వేయి గన్నులవాని మదంబణంచె. రజోగుణ బలంబున మిన్ను మన్నెఱుంగని బ్రహ్మను గతమోహుఁ గావించె. దుర్జన పక్షపాతంబు వహించిన రుద్రు జయించె. ఇట్లు దేవతలనుగూడఁ జక్కఁబఱిచె.

ఈ కార్యములు చేయుటయందుఁ గృష్ణుండు కొన్నిట నీతిఁ దప్పి వర్తించెనని కొందఱు విమర్శకులు వ్రాసిరిగాని యది యవిచార మూలకంబు.

తనకెట్టి యపకారముచేయని కంసుని నిర్నిమిత్తముగఁ గృష్ణుఁడు వధించెనఁట. కంసుఁడు కృష్ణవధాభిలాషియుఁ దదుద్యముఁడు కాఁడని యెవ్వరును జెప్పఁజాలరు, ఆయనను జంపవలయుననియే కదా మధురకుఁ బిలిపించెను. ఇట్టి యాక్షేపమే దుర్యోధనుఁడు కావింపఁ గృష్ణుఁ డతని కిడిన ప్రత్యుత్తరము పఠింపుఁడు. (పు. ౫౫౬) వాస్తవమారయ "నమేద్వేష్యోస్తినప్రియ" యన్నట్టు లాయనకుఁ బ్రియులు లేరు. అప్రియులు లేరు ధర్మప్రియులే యాయనకుఁ బ్రియులు. ధర్మద్వేషులే యాయనకు ద్వేష్యులు. తన విషయమైన యపచారముల భగవంతుఁడు సహించుఁగాని స్వజన పరాభవంబు సహింపఁడు. కృష్ణునెడఁ గంసునకుఁగల ద్వేషబుద్ధి యటుండ నతండు ధర్మద్వేషి. స్వజీవిత కారణంబునఁ దనవారిని దల్లిదండ్రులనే బాధించుచుండెను. నిజగురుబంధు ధర్మద్వేషి. కారణాంతర మేమి కావలయునో. కంసవధ యధర్మమనువారు కృష్ణుఁడు పరీక్షిత్తు బ్రతికింపఁ గావించిన ప్రమాణవాక్యములఁ బఠింపుఁడు. (కృ. లీల. సం 3. పుట ౧౦౨.)

ఇంతయేల! తన్నుఁ జంపుటకై పైపడివచ్చినవారినో గాక రణమున కాహ్వానించినవానినో గాక యితరుల నొక్కనినైన నగరు కొండియై కృష్ణుఁడు కలహాకాంక్ష వధించినవాఁడు గాఁడు. ఈవిధికి

నరకాసుర జరాసంధ వధ లపవాదములు. చెఱుచు నుద్దేశముతో స్త్రీలను జెఱసాల నుంచినవాఁడు నరకుఁడు. శివునకు బలియీయ రాజులను జెఱనుంచినవాఁడు జరాసంధుఁడు. తానై పోక దుష్టుల వధింపక యెట్లు వారినెల్లఁ గారాముక్తులఁ గావింప సాధ్యపడు. జరాసంధుఁడు తనకుఁ దనవారికి నెంతో యపకారము గావించి యుండి నను భీమార్జునులతోడఁ బోయినపుడు జరాసంధునితో నీవు చెఱఁ బెట్టిన రాజుల విడువుము, లేకున్న రణంబున మరణింపుమని కృష్ణుఁడు బోధించెఁగాని జరాసంధుఁడు రాజుల విడువను రణమొనరించెదనని* యుద్ధమునకు వచ్చెఁ జచ్చె. ఇందుఁ గృష్ణునిదోష మేదిగలదు? భీమ జరాసంధులు నిద్రాహారములులేక పదునైదు దినములు యుద్ధమొనర్చిరి. పదునాలవనాఁడు జరాసంధుఁడు బలముక్షీణింప బడలెను. అది కనిపెట్టి కృష్ణుఁడు భీమునితో, 'భీమా! శత్రువు బడలియున్నాఁడు. ఇప్పుడు వధింపరాదు. అతని బలమెంతో యంతమాత్రము బలమే నీవును జూపుము'ని బోధించెను. ♦ వీఁడు దట్టికట్టి యెదురనిలిచి

---

*శ్లో॥ త్వా మాహ్వయే మహారాజన్, స్థిరో యుధ్యస్వ మాగధ
ముంచ వా నృపతీన్ సర్వాన్, గచ్ఛ వా త్వం యమక్షయమ్॥ ౨౬.

జరాసంధ ఉవాచ

దేవతార్థ ముపాహృత్య. రాజ్ఞః కృష్ణ! కథం భయాత్
అహ మద్య విముచ్యేయం, క్షాత్త్రం వ్రత మనుస్మరన్॥ ౨౯.

సభా॥ అధ్యాయ ౨౨.

♦శ్లో॥ చతుర్దశ్యాం నిశాయాం తు, నివృత్తో మాగధః క్లమాత్
తం రాజానం తథాక్లాంతం, దృష్ట్వా రాజన్ జనార్దనః
ఉవాచ భీమకర్మాణం, భీమం సంబోధయన్నివ
క్లాంత శ్శత్రుః న కౌంతేయ, లభ్యః పీడయితుం రణే
పీడ్యమానోహి కార్త్స్న్యేన, జహ్యా జ్జీవిత మాత్మనః
తస్మా త్తేనైవ కౌంతేయ, పీడనీయో జనాధిపః
సమ మేతేన యుధ్యస్వ, బాహుభ్యాం భరతర్షభ

భీమసేనః

నాయం పాపో మయాకృష్ణ! యు క్తస్స్యా ద్దనురోధితుమ్
ప్రాణేన యదుశార్దూల, బద్ధకక్షేణ వాససా,॥



యుద్ధముచేయుచుండ నేనిట్లు నీనిని విడుతునని భీముఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఆర్యులారా! యిందలి కృష్ణవాక్యము, శ్రీమద్రామాయణమున శ్రీరాములు రావణునితో "రాక్షసరాజా! నీవు వానరులతో యుద్ధముచేసి బడలియున్నాఁడవు. కావున నిన్ను నేనిప్పుడు చంపను. అనుజ్ఞ యిచ్చితిని. లంకకుఁబోయి బడలిక తీర్చుకొని రథివి ధన్వివై రమ్ము. అప్పుడు నా బలముఁ జూతు" వని చెప్పినవాక్యము స్మరణమునకుఁ దేక మానునా? అందు రావణుఁడు నిరాయుధుఁడై నిలువఁబడెను. ఇందు జరాసంధుఁడు యుద్ధమొనర్చుచునేయుండెను. కావునఁ జచ్చెను. ఇందధర్మము కలదేమో పరికింపుఁడు.

పౌండ్రకవాసుదేవుఁడు యుద్ధమునకు రమ్మని దూతముఖమున నాహ్వానించెను. కావునఁ గృష్ణుఁడు వానిపైకిఁ బోయెను. ఏయుద్ధమునందైనను ముఖ్యశత్రువు తనచేఁ జిక్కవలెనే కృష్ణుఁడు భటక్షయముఁ గావించుచుండెఁగాని యావల జననాశము నోర్చినవాఁడు కాఁడు. ఏదైన నుపాయముచే శత్రువు తనచేతఁ జిక్కునట్లుండు నేని యట్లు చేయునే కాని నిష్కారణ జననాశము నంగీకరింపఁడు. కాలయవన వధ, హంసడింభక వధ యాలోచింపుఁడు

కంస వధానంతరము కృష్ణుఁడు కంసునకై దుఃఖించెననియు హరివంశమునఁ గలదు.* దీనివలనఁ గంసవధ లోకక్షేమమునకై

*శ్లో॥ పుత్రశోకాభిసంతప్తో, విషపీత ఇవ శ్వసన్
స దదర్శ గృహే కృష్ణం, యాదవైః పరివారితమ్
పశ్చానుతాపా ద్ధ్యాయంతం, కంసస్య విధనావిలమ్
కంసనారీవిలాపాంశ్చ, శ్రుత్వా స రుణాన్ బహూన్
గర్హమాణం తథాత్మానం, తస్మిన్ యాదవసంసది
అహో మయాతిబాల్యేన, రోషా ద్దోషానువర్తినా
వైధవ్యం స్త్రీసహస్రాణాం. కంసస్యావధే కృతమ్
కారుణ్యం ఖలునారీషు, ప్రాకృతస్యాపి జాయతే
ఏవ మార్తః రుదంతీషు, మయాభర్తరి పాతితే
పరిదేవితమాత్రేణ, శోకః ఖలువిదీయతే
కృతాంతస్యానభిజ్ఞానం, స్త్రీణాం కారుణ్యసంభవః॥
హరివంశము ౩౨-వ అధ్యాయము.

యవశ్య కర్తవ్యమగుట నాచరింపఁబడెఁగాని కృష్ణునందు ద్వేషబుద్ధి లేదనియు నాయన హృదయము మృదులమనియుఁ దలఁపవచ్చును గదా.

జరాసంధుఁడు బలోన్మత్తుఁడు. బలముడిగినఁగాని వాని మద ముడుగదు. కావునఁ బ్రతి యుద్ధమందును వాఁడు చేచిక్కువఱకే వాని సేనల క్షయింపఁజేయుచుండెను. వానివలనఁ గలుగు ప్రజాక్షయము నకు రోసియే దూరముగఁ దొలఁగిపోయి ద్వారక నివాస స్థానముగఁ జేసికొని సమయముకనిపెట్టి వానినే మట్టుపెట్టించెను. సాధ్యమైనయెడల వారిలోవారు భేదోపాయము ననుసరించి కలహములు గలుగఁజేసికొని క్షయించునట్లు చేయుచుండెను. అంతియకాని మారణకర్మాభిలాష యాయనకు లేదని దీర్ఘాలోచము చేయువారు నిశ్చయింపఁగలరు.

ధర్మరాజుచే నసత్య మాడించెను. సైంధవుని మోసవిధమునఁ జంపించెనుగదా యనువారు భగవంతుఁ డంతర్యామియై చేయు కార్య మెట్టిదో యాలోచింతురు గాక. దీనికిఁ బ్రత్యుత్తరము గ్రంథమందే యియ్యఁబడి యున్నది. (చూ. సం ౨. పుట ౨౨౨.) 'య ఆత్మాన మన్తరో యమయతి' 'అంతఃప్రవిష్టశ్శాస్తాజనానామ్'' "శాస్తావిష్ణు రశే షస్యజగతో యోహృదిస్థితః'' "ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశే ర్జునతిష్ఠతి। భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" ఇత్యాది శ్రుతివాక్యము లిందనుసంధింపనగు. 'అంతర్యామి స్వరూ పంచ సర్వేషాం బంధువత్ స్థితమ్।స్వర్గ నరక ప్రవేశేహి బంధురాత్మా హి కేశవ' యన్నట్టు భగవంతుఁడు ప్రత్యక్షముగనో పరోక్షముగనో మన మేలునకయియే ప్రేరించుచుండును. ధర్మరాజార్జునులందు నరక ద్వారమైన లోభగుణము లేశమాత్రము వారికిని దెలియక వారి యందు దాఁగి యుండినది. దానిని వారికి స్పష్టముగాఁ గనఁబఱిచి వారిచే దానిని నాశముచేయించుటకే భగవంతుఁడు ప్రేరించెను. 'నజాతు కామా న్నభయా న్నలోభాత్ । ధర్మంత్యజే జ్జీవితస్యాపి

హేతో" యని యుండ లాభలోభజీవితాశల ధర్మరాజార్జును లధర్మ మార్గ మనుసరించిరి.

## ధర్మసంస్థాపనము.

ఇంక మూఁడవది ధర్మసంస్థాపనము. అది యెట్లు కావించెనో చూతము. భగవత్ప్రాప్తిసాధకకర్మము ధర్మము. తద్విరుద్ధ మధర్మము. భగవత్కైంకర్యబుద్ధిఁ గావించు ధర్మార్థ కామములు మోక్షసాధకములు. ధర్మవిరుద్ధార్థ కామములు సంసార కారణములు. గోకులమునందు నింద్రు నుద్దేశించిచేయు యాగము పునర్జన్మ కారణమగుటచే దానిని మానిపించెను. దానికి మాఱుగ నావులకు గడ్డి బీదలకు నన్నవస్త్రములు దానముచేయుఁడని బోధించెను. మొదటిది యింద్ర సేవ యయినచో నిది లోకసేవ. మొదటిది కర్మఫలాపేక్షా సహితముగా వున నీచము. రెండవది ప్రీతిపూర్వకము గావున నుత్తమము. ఇందుఁ బ్రతిఫలాపేక్ష లేదు. "కర్మమందే యధికారంబు నీకుఁ, గర్మ ఫలంబులఁ గా దీవుగోర" ననికదా భగవదుపదేశము. రెండవ దాని వలనఁ గలుగు తృప్తి యానందము మొదటి దానివలనఁ గలుగఁ జాలదు. లోకసేవ భగవత్సేవయే. ప్రపంచము భగవంతుని స్థూల రూపమేకదా. లోకసేవ తన సేవగా భగవంతుఁ డంగీకరించు నని స్థాపించుటకే గోవర్ధనము మీఁద మూర్తిధరించి గోపకులిచ్చిన బలుల నన్నిటిని గృష్ణుఁ డాహరించెను. మూఢులైన గొల్లలకుఁ దత్త్వార్థము నెంత సులభముగ బోధించి యాచరణమునకుఁ దెచ్చెనో కనుఁడు. లోకసేవకై యవతరించిన భగవంతుఁడు లోకసేవ మాన బోధించునా? అతిథిసేవ క్రతువులకంటె మిన్నయని సక్తుప్రస్థ చరిత్రముఁ చాటించెడిని గదా.

పురుషుల కిట్లు బోధించి స్త్రీలకేమి బోధించెనో చూతము. నందగోకులమందలి స్త్రీలందఱు గొల్లెతలు. విద్యావతులుగారు. జ్ఞానవతులుగారు. నీతివేదినులుగారు. పసులమేపుచు నడవులలో సంచరించువారు గావునఁ బశుప్రాయులే యనవచ్చు. కావున నాహార నిద్రాభయ సంభోగములుమాత్రము వారికిఁ జక్కఁగఁ దెలియును.

ఇవి యైనను ధర్మసహితములేవో ధర్మరహితములేవో వారు చక్కఁగ నెఱుంగరు. ఇందలి సతులు సీతా దమయంతీ చంద్రమత్యాదులవంటి పతివ్రతలునుగారు. ఇప్పటి కొందఱు నగరవాసినులయంతటి జారత్వ నిపుణలునుగారు. ఈ యర్థ ముద్ధవవాక్యమువలన స్పష్టపడు.

శ్లో॥ క్వేమే స్త్రియో వనచరా వ్యభిచారశీలాః
కృష్ణే క్వ చైష పరమాత్మని గూఢభావః।
నన్వీశ్వరోఽనుభజతోఽవిదుషోఽపి సాక్షా
చ్ఛ్రేయ స్తనో త్యగదరాజ ఇవోపయుక్తః॥

దీనియర్థము ౨-సం, ౪౨ పుట ౧౭-౨౨ పంక్తులయందుఁ గాననగు. ఇట్టి వారియందుఁ గామ మతితీక్ష్ణముగనుండుట సహజము. ఇట్టివారు సుందర పురుషునిఁ జూచినపుడు వానిని వలచుట స్వాభావధర్మము. ఇట్టివారు పతివ్రతలై కామము జయించి పురుషులై జ్ఞానులై కడతేఱుట యెన్ని జన్మముల కార్యము? అంతవఱకు వీరు సంసారాంధకూపంబునఁ బొరలాడవలయునా? ఇట్టివారు సులభముగఁ గడతేఱుమార్గము లేదా? ఇట్టి యధమదశయందుండు వారుకూడఁ గడతేఱుమార్గముగలదని లోకమునకు బోధింపఁ గృష్ణుండు నందగోకులంబుఁ జేరెను. దివ్య సుందర జగన్మోహన విగ్రహుఁడగుట వారి కామమూయనయందు విని యోగింప వారికి సహజముగ బుద్ధిపుట్టెను. అట్లు వారు తన కర్పించినఁ గామము కారణముగాఁగొని భగవంతుఁడు వారిని ముక్తులఁ గావించె. ఇందు మనస్సున నుంచవలసిన విషయములు రెండు. దర్శన స్పర్శనములవలన వారి నానందపరవశలఁ గావించి వాస్తవ సంభోగం బునఁ గలుగు నిమిషభంగురతుచ్ఛానందమునకంటె వేయిమడుంగు లెక్కువ యానందమును వా రనుభవింపఁజేసి వారి కోరిక సఫలము గావించి వారిని ధన్యులను గావించె. తాను జితేంద్రియుఁడు నూర్ధ్వ రేతస్కుఁడై కర్మఫలము దన్నంటకుండఁ గావించికొనియె. అత్యంత దుష్టము సర్వదుఃఖావహము సమస్తానర్థకమూలము నగు కామము మోక్షసాధనమగు నుపాయమని భగవంతుఁ డీవిధముగ లోకమునకు బోధించె. కామము క్రోధాదుల కుపలక్షణము. తనయందుండు నే

సుగుణ దుర్గుణములకైనను భగవంతుని బాత్రభూతునిఁగఁజేసిన భగవత్ప్రాప్తి లభించు. తనయందుంచఁబడిన గోపికల ప్రేమము తనయందే దృఢపడి వేఱుపదార్థమునందుఁ బోకుండుటకు నిశ్శృంఖలముగ వర్తింపఁజేసి యావల వియోగము గల్పించె. దానివలనఁ బ్రేమించు పదార్థమగు నాయన యెదుర లేకుండినను వారి ప్రేమ యథాపూర్వము కాదు కాదు మునుపటికంటె విశేషముగ నాయన విషయమునఁ బ్రవహింపసాగె. ఇదియ కదా భగవంతుఁడు గోపికలకు మాఁటికి మాటికి బోధించినది.* బ్రాహ్మణస్త్రీలకు బోధించిన దిదియ కదా. ఇప్పుడు మనకైనను నీ మార్గమే యనుసరణీయము. లీలాశుకులిట్లు చేసిగదా తరించె♦ దుష్కామ క్రోధభయాదులఁ బరభక్తిగాఁ బరిణమింపఁజేయుట ధర్మసంస్థాపనముగనో కాదో యోజింపుఁడు. కామ క్రోధభయాదులును ముక్తి సాధనములని తెలిసికొనుటకంటె సంతోషకరమై మనస్సున కాప్యాయమును గలిగించునది వేఱేదికలదు. దుష్టరాజుల సంహరించి వారి స్థానంబున శిష్టుల నిలుపుట ధర్మ సంస్థాపనముకదా.

భగవద్గీతోపదేశము ధర్మ సంస్థాపనార్థము కాదా. ఉద్ధవునకు యోగవిద్య నుపదేశించుట ధర్మసంస్థాపనార్థము కాదా. ఇట్టి లన్ని

* (తొలిసారి, ౧-సం. పుట ౧౯౨ పంక్తులు ౧౨-౧౩-౧౪. రెండవసారి ౨౧౭ పుట ౧౨-౧౩ పంక్తులు. మూఁడవసారి ౨ సం. ౩౭ పుట. నాల్గవసారి ౨-సం. ౧౭ పుట చూడుఁడు.)

♦ లీలాశుకులు కృష్ణకర్ణామృత గ్రంథకర్త ఈయన గొప్ప పండితుఁడు. చింతామణియను వేశ్యను మరగి దాని నత్యంతప్రీతి నాదరించుచుఁ దన ప్రాణమునకంటె నెక్కువగ దానిని వరించియుండెను ఆ వేశ్య వివేకిని. తుచ్ఛము నపాత్రము నగునన్ను నిమ్మహాత్ముఁ డింతప్రేమించియున్నాఁడే యీ ప్రేమ యీయన భగవంతుని యందుంచినచో నీయనకు మోక్షము కరతలామలకము గాదె గదా యని యోజించి యాయన కది హిత ముపదేశించెను. తనయందు విస్తారముగనుండు ప్రేమయను పదార్థమును వేశ్యమీఁదనుండి తీసి కృష్ణునియందుంచి లీలాశుకుఁడు తరించె ఈయన రచించిన కృష్ణకర్ణామృతంబునఁ బ్రథమ శ్లోకమందు "చింతామణి ర్జయ"తని యా వేశ్యను బరమగురువుగాఁ దొలుత స్తుతించెను ఈయన తొలిజన్మమున జయదేవుఁడని ప్రసిద్ధి. శ్రీరామానుజాచార్యులవారు రక్షించిన ధనుర్దాసుని చర్య యిట్టిదేకదా.

యుఁ జేయుచుఁ దుదకు ధర్మరాజును సింహాసనాసీనుఁ గావించి భీష్ముని చే సకల ధర్మోపదేశంబుఁ గొనఁజేసి ధర్మవిధి రాజ్యంబు పాలింపఁ జేయుట ధర్మసంస్థాపనంబ కదా. ఏమి కార్యములు చేయ భూమిపై నవతరింతునని చెప్పెనో యా కార్యములన్నియు లీలామానుషవేష ధారియగు శౌరి యిట్టు లొనర్చినవాఁ డయ్యె.

శ్రీకృష్ణుఁడు తక్కిన మతాచార్యులవలె ధర్మోపదేశము వాచా కైంకర్యముగమాత్రము చేసినవాఁడు కాఁడు. తాను భగవద్గీతయం దెంత యుపదేశించెనో యంతయు నడవడియందుఁ గనఁబఱిచెను. నీ కార్యమున కెట్టిఫలము గలుగునని చెప్పెనో యాకార్యమున కా ఫలము కలుగునట్లు చేసి ప్రత్యక్షముగఁ జూపెను. కావునఁ గృష్ణుఁ డాచార్యుఁడు కార్యఘటకుఁడును.

—: అవతార ప్రశంస :—

అనాదికర్మవాసనాబద్ధమైన జీవలోకము సంసారసాగరంబునఁ బడి మునుఁగుచుఁ దేలుచుఁ దేలుచు మునుఁగుచు దరిగానలేక దుఃఖిం చుచుండఁ వీరిని రక్షింప జ్ఞానబలైశ్వర్యశక్తి తేజఃకారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్య మహోదధి యగు శ్రీమన్నారాయణుఁడు జగ త్సృష్టి స్థితిలయకార్యంబులు కేవల కరుణాపరుండై గావించుచుండు. ఈ నిమిత్త మీశ్వరుఁడు పరత్వము, వ్యూహము, విభవము, నంతర్యా మిత్వము, నర్చావతారమునని పంచప్రకారస్వరూపములు ధరించు.*

---

*ఈవిషయమున బృహద్బ్రహ్మ సంహితలోని యీశ్లోకములు స్మరణీయంబులు

శ్లో॥ ద్విహస్తం హ్యేకవక్త్రం చ, శుద్ధస్ఫటిక సన్నిభమ్
సహస్రకోటి వహ్నీందు, లక్షకోట్యర్క సన్నిభమ్॥
మరీచి మండలే సంస్థం, చక్రాద్యాయుధ లాంఛితమ్
కిరీట హారకేయూర, వనమాలా విరాజితమ్॥
పీతాంబరధరం సౌమ్య, రూపమాద్య మిదం హరేః
ధ్యానైక సాధనం ధ్యేయం, యోగిభిర్హృదయాంబుజే॥
పశ్యంతి సూరయశ్శశ్వ, త్తద్విష్ణోః పరమంపదమ్
వాసుదేవేతి విఖ్యాతం, తతో౽న్య త్సమపద్యత॥

వాసుదేవాభిధ సోఽపి, హ్యేకవక్త్రశ్చతుర్భుజః
చక్రాద్యాయుధ సంయుక్త, స్తస్యకృత్యం నిశామయ॥
స్థిత్యై చక్రం సరసిజం, దధానం సృష్టయే పునః
ముక్తయే పాంచజన్యంచ, గదాం సంహృతయే తథా॥
మయూరవర్ణవ చ్ఛ్యామః, పీతనైసర్గికాంబరః
స్ఫురన్మకటకేయూర, కాంచీ మంజీర మండితః॥
స వాసుదేవో భగవాన్, స్సృష్టిస్థిత్యంత ముక్తిదః
కేనాపిహేతునైవా భూ, ద్ద్వితీయశ్చ చతుర్ముఖః॥
నారాయణో వాసుదేవ, స్తృతీయోయం ద్విధాభవత్
తయోరేకో వాసుదేవః, శుద్ధస్ఫటిక సన్నిభః॥
నారాయణేతి యఃప్రోక్తో, నీలాంబుద సమప్రభః
ఏతస్మా ద్వాసుదేవాత్తు, వ్యూహోత్పత్తిం నిశామయ॥
సంకర్షణో వాసుదేవా, త్తస్మాత్ప్రద్యుమ్న సంభవః
ప్రద్యుమ్నా దనిరుద్ధో భూ, త్సర్వ ఏవ చతుర్భుజాః॥
జ్ఞానాదిగుణ సామాన్యో, వాసుదేవః ప్రకీర్తితః
సత్త్వాదిగుణ సామాన్యా, ప్రాకృతే ప్రకృతిర్యథా॥
తథాగుణానాం వైషమ్యే, వక్ష్యంతే మూర్తయః క్రమాత్
గుణత్రయస్య వైషమ్యే, యథాస్యుర్మహ దాదయః॥
జ్ఞానాధికోఽభవద్బ్రహ్మన్, సంకర్షణ సమాహ్వయః
బలాధిక స్స్యాత్ప్రద్యుమ్న, ఐశ్వర్యే చా నిరుద్ధకః॥
మూర్తిత్రయ శ్చతుస్సృష్ట్యశ్చ, చతుర్వింశతి మూర్తయః
జాయంతే క్రమశో బ్రహ్మన్, దీపా ద్దీపాంతరంయథా॥
సర్వేచతుర్భుజాః పంచ, శంఖచక్ర గదాధరాః
రుద్రాది దేవతానాంచా, వ్యుత్పత్తి స్తాస దుచ్యతే॥
వాసుదేవాదాదిదేవా, త్ప్రథమా స్త్రేశవ స్తథా
నారాయణో మాధవశ్చ, త్రయస్త్వే తే బభూవిరే॥
సంకర్షణాచ్చ గోవిందో విష్ణుశ్చ మధుసూదనః
త్రివిక్రమో వామనశ్చ, ప్రద్యుమ్నాచ్ఛ్రీ ధరస్తథా॥
అనిరుద్ధా ద్ధృషీకేశః పద్మనాభశ్చ సువ్రతః
దామోదరైశ్చ తైరిత్థం, ద్వాదశాంశాః ప్రజజ్ఞిరే॥
చతుర్వ్యూహా చ్చతుర్వ్యూహ, స్త్వన్యోపి సమపద్యత

## 1. పరత్వము.

ఇందు నీశ్వరుఁడు సంపూర్ణ షడ్గుణైశ్వర్య సంపన్నుఁడు. జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, శక్తి, తేజస్సనను నీ యాఱును గుణములు. ఈ యాఱుగుణముల సముదాయమునకు భగమని పేరు. దీనిని గలవాఁడు భగవంతుఁడు. ఈయనయందుమాత్రమే యీపేరు సార్థకము. తక్కినవారియం దౌపచారికము. ఇది పరావతారము. ఈయననే పరవాసుదేవుఁ డందురు.

## 2. వ్యూహము.

ఈ పరవాసుదేవుఁడే కార్యసౌకర్యమునకై మూఁడు మూర్తులు ధరించును. సంకర్షణ, ప్రద్యుమ్నానిరుద్ధులను నీ మూఁటికే వ్యూహమని పేరు. అందు

సంకర్షణుఁడు:—జ్ఞాన బలము లీయన ముఖ్యగుణములు. ఈయన జీవతత్త్వము నధిష్ఠించియుండును. శాస్త్రప్రవర్తనము దేహిసంహార మీయన కార్యములు. ఈయనయే రుద్రునియం దనుప్రవేశమై జగత్సంహారము చేయును.

---

తస్యాప్యంశాన్ ప్రవక్ష్యామి. చేతసా పురుషర్షభ
వాసుదేవాచ్ఛ తన్నామ్నా తథా సంకర్షణాదపి
ప్రద్యుమ్నాద పితన్నామ్నా తన్నామ్నైవా నిరుద్ధకాత్॥
అభూవన్ క్రమశస్తేభ్య శ్చత్వారః పురుషోత్తమః
అధోక్షజో నృసింహశ్చ చతుర్థశ్చాచ్యుతో మతః॥
ఏతస్మాదపి సంభూతః, పురుషోత్తమ సంజ్ఞకాత్
వ్యూహాదపి పరోవ్యూహో, జనార్దన ముఖో మహాన్॥
జనార్దన స్తథోపేంద్రో, హరిః కృష్ణ సమాఖ్యయా
ఏవం ద్వాదశధాభేదో, ద్వితీయ స్సమపద్యత॥
చతుర్వింశతి మూర్తీనాం, కీర్తనం పాపనాశనమ్॥
మీనాద్యా జజ్ఞిరే విప్ర, చతుర్వ్యూహా ద్యథాక్రమాత్
మత్స్యకూర్మౌవరాహశ్చ, వాసుదేవా దజాయత
నృసింహో వామనో రామో, జామదగ్న్యో హ్యజాయత
సంకర్షణా త్తథా జజ్ఞే, ప్రద్యుమ్నా ద్రాఘవో; బలి
అనిరుద్ధా దభూత్కృష్ణః, కల్కీతి దశమూర్తయః॥

ప్రద్యుమ్నుఁడు:—ఐశ్వర్యవీర్యము లీయన ముఖ్యగుణములు. మన స్తత్త్వము నీయన యధిష్ఠించియుండును. ధర్మోపదేశము, మను చతుష్టయము మొదలగు శుద్ధవర్గసృష్టి యీయన కార్యములు.

అనిరుద్ధుఁడు:—శక్తి తేజస్సు లీయన ముఖ్యగుణములు. జగ ద్రక్షణము, తత్త్వజ్ఞానప్రదానము, కాలసృష్టి, మిశ్రసృష్టి యీయన కార్యములు. బ్రహ్మయందనుప్రవేశమై యీయన జగత్సృష్టిగావించు చుండు. నానావతారముల కీయనయే బీజభూతుఁడు. ఈ మువ్వురును వ్యూహావతారము లనఁబడును. వాసుదేవునిఁ గలిపి వ్యూహావతార ములు నాలుగనియుఁ జెప్పుదురు. సృష్టి స్థితి సంహారార్థము, సంసారి రక్షణార్థము, నుపాసకానుగ్రహార్థము, నిలుచు నునికికి వ్యూహమని పేరు.

ఈ నలువురిలో నొక్కొరొకరు మూఁడేసి రూపములు పేర్లు వహించి శరీరిని రక్షించుటకై శరీరమం దావేశించియుందురు. వాసు దేవునివలనఁ గేశవుఁడు, నారాయణుఁడు, మాధవుఁడు గలిగిరి. సంక ర్షణునివలనఁ గోవిందుఁడు, విష్ణువు, మధుసూదనుఁడు గలిగిరి. ప్రద్యు మ్నునివలనఁ ద్రివిక్రముఁడు, వామనుఁడు, శ్రీధరుఁడు గలిగిరి. అని రుద్ధునివలన హృషీకేశుఁడు, పద్మనాభుఁడు, దామోదరుఁడు గలిగిరి.

యథావిధి సంధ్యవార్చువారికి నీ మూర్తులు దేహమునం దేయే భాగముల నుందురో తెలియునుగావున వివరించు టనావశ్యకము. ఈ పేర్లు చెప్పి యాయా యవయవముల స్పృశించుటచే దేహము పవిత్ర మగును. ఇట్లు పవిత్రిత దేహుఁడయియే సాధవార్వవలయును. ఈ యప్రస్తుత ప్రశంసను పాఠకులు క్షమింతురుగాక.

## 3. విభవావతారములు.

ఇతర సజాతీయమైన యావిర్భావము విభవావతారము. అనఁగా నేయేలోకమున నేయేదేశమున నెట్టిజాతి శరీరులు గలరో యాచోటికిఁదగిన రూపమును ధరించి యవతరించుట. మనుష్యులలో మనుష్యరూపమునను, జలజంతువులలో మత్స్యాదిరూపమునను, వృక్ష ములలో వృక్షరూపమునను, మృగములలో మృగరూపమునను, దేవ

తలలో దేవరూపమునను నవతారములు గలుగును. వీనికి దేశకాల జాతి నియమము లేదు.

అనంతములైన విభవావతారములు* గౌణములని ముఖ్యములని రెండువిధములు. ఆవేశావతారములు గౌణములు. ఈ గౌణములు రెండు విధములు. స్వరూపావేశము, శక్త్యావేశము, పరశురామాదులు స్వరూపావేశావతారములు. చేతనుల శరీరములలో భగవంతుఁడు తన యసాధారణ విగ్రహముతో నావేశించి యుండును. బ్రహ్మరుద్రాదులు శక్త్యావేశావతారములు. సృష్టి సంహారాది కార్యములు చేయుటకై భగవంతుఁడు తన శక్తిని జేతనుల శరీరముల యందుఁ బ్రవేశింపఁజేయును. ఆ కార్యము కాఁగానే యాశక్తి యాదేహమును విడిచి పోవుచుండును. కృష్ణ నిర్యాణానంతర మర్జుని స్థితియు, శ్రీరాములతో ద్వంద్వయుద్ధమునకై వచ్చిన పదపడి పరశురాముని స్థితియు స్మరింపుఁడు విభవావతారములు కొన్ని భగవద్గీత పదియవ యధ్యాయమునఁ బేర్కొనఁ బడియున్నవి.

ప్రకృతి సంబంధము గలవగుటచే గౌణావతారములు ముముక్షువుల కుపాస్యములు గావు. నర-వ్యాస-కపిల దత్తాత్రేయాద్యవతారము లీ కారణంబుననే ముముక్షూపాస్యములుగావు. సిళ్ళన్నియు భగవత్స్వరూపములే యైనను ముఖికిని శ్శెట్లు ప్రాగమో యట్లే మోక్షాసక్తులు ప్రకృతిసంబంధముగల విభవముల సేవింపరు.

ప్రకృతి సంసర్గములేని సాక్షా దవతారములు ముఖ్యావతారములు. వీనియందు షడ్గుణము లుండుటచేఁ బూర్ణావతారములని యు నంశమాత్ర మగుట నంశావతారములనియు నందురు. ఇవి షడ్గుణ పరిపూర్ణములు. ఒక దీపకళికనుండి వచ్చిన వేఱొక దీపకళిక

---

* శ్లో॥ హన్త తే కథయిష్యామి, దివ్యాహ్యాత్మవిభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ, నాస్త్యంతో విస్తరస్య మే॥ ౧౦-౧౯.
నాంతోఽస్తి మమదివ్యానాం, విభూతీనాం పరంతప।
ఏష తూద్దేశతః ప్రోక్తో, విభూతే ర్విస్తరో మయా॥ ౧౦-౪౦. భ.గీ.
కృష్ణలీల ౨-వ సం. పుట ౩౯౧-౩౯౩.

వంటివి. ముముక్షువుల కివియే యుపాస్యములు* నరసింహ శ్రీరామ కృష్ణా ద్యవతారము లిట్టివే •

ఈ యర్థమునే శ్రీకృష్ణుఁ డర్జునున కిట్లు బోధించెను.

శ్లో॥ అజోపి స న్నవ్యయాత్మా, భూతానా మీశ్వరోపి సన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ, సంభవా మ్యాత్మమాయయా॥ ౪-౬.
కృష్ణలీల. ౨-వ సం. ౩౫౧.

అవజానంతి మాం మూఢా, మానుషీం తను మాశ్రితమ్
పరంభావ మజానంతో, మను భూతమ హేశ్వరమ్॥ ౯-౧౧.
కృష్ణలీల. ౨-వ సం. పుట. ౩౦౫.

ఈ యవతార సంభవము భూలోకమందు మాత్రమే కాదు. మనుష్యులందు మాత్రమే కాదు. స్వర్గ పాతాళాది లోకముల రక్షించుటకును, నచ్చటివారల కుపాస్యుఁడై వారిని దరింపఁజేయుటకు నవతరించి యున్నాఁడు. ఇంద్రలోకమునందు మూర్తికి నుపేంద్రుఁ డని పేరు. ఈయనయే భూలోకమున వామనమూర్తియై జనించి త్రివిక్రముఁడై దేవకార్యము నిర్వహించెను. మత్స్యమూర్తియే హయగ్రీవుఁ డయ్యెను. బదరీ నారాయణాశ్రమంబున నారాయణుఁ డను పేర గౌణావతారమైన నరుని శిష్యునిగాఁగొని యున్నవాఁడు. ఈ యిరువురే కృష్ణార్జునులైరి. ఉపేంద్రావతారము పూర్ణావతారము గావున వామనావతారము ముఖ్యావతారమే. నారాయణావతారము ముఖ్యావతారము గావునఁ గృష్ణావతారము ముఖ్యావతారమే.

---

* శ్లో॥ ప్రాదుర్భావాస్తు ముఖ్యా యే, మదంశత్వా ద్విశేషతః
అజహ త్స్వభావవిభవా, దివ్యాఽప్రాకృతవిగ్రహాః॥
దీపాద్దీపా ఇవోత్పన్నా, జగతో రక్షణాయ తే
అర్చ్యా ఏవ హి సేనేశ। సంసృత్యుత్తరణాయతే
ముఖ్యాం ఉపాస్యా సేనేశ। అనర్చ్యా నితరా న్విదుః॥

• శ్లో॥ నృసింహరామకృష్ణేషు, షాడ్గుణ్యం పరిపూర్ణితమ్
పరావస్థాసు దేవేశ, దీపా దుత్పన్న దీపవత్॥ పద్మ పు. పుట. ౪౯.

ఇట్టి ముఖ్యావతారములు పద్మనాభ, మధుసూదన, శ్రీపతి, వటపత్రశాయి, పాతాళశాయి, యేకాంభోధిశాయి, లోనగువారు ముప్పదియార్గురు గలరు.*

ప్రకృతమున కనావశ్యకము గావున వీని విచారము మానితిమి. అవతారములు పాపణశీలుఁడైన విష్ణువునకేగాని బ్రహ్మరుద్రులకు లేవు. మనుష్యులు కుటుంబరక్షణమునకై యెన్ని వేషములైన వేయుచున్నారుగాని సంతానోత్పత్తి కార్యంబునందును, హింసయందును బెక్కు వేషములు వేయుట లేదుగదా. కృష్ణార్జునులు నరనారాయణావతారములని యొకచోటను, భగవదవతారమని యొకచోటను గ్రంథములందుఁ బరస్పర విరుద్ధముగ వ్రాయఁబడియున్నదని కొంద ఱాక్షేపించి యుండుటచే నీ మాత్రము సంగ్రహముగనైన వ్రాయవలసివచ్చెను. కొందఱు పూర్ణావతారములన వైకుంఠము పాడుపెట్టి భగవంతుఁడు మఱి యెందును లేక యొకచోటనే ఘనీభవించి యుండుటయని యభిప్రాయపడి యున్నారు. ఇట్టి కార్యము సర్వవ్యాపకత్వమునకు హానికరముగదా. ఈ యభిప్రాయముల సవరించుటకే మా కీ శ్రమము కొంద ఱీశ్వరుఁడు నిర్గుణుఁడు కావున నవతారప్రసక్తియే లేదందురు. నిర్గుణుఁ డనఁగా గుణరహితుఁడని యర్థము చేయరాదు. ఆయర్థము పెక్కుశ్రుతులకు విరోధము. కావున నిర్గుణుఁడనఁగా హేయగుణరహితుఁడనియు సృష్టి కార్యము సంకల్పింపనపుడివి యాయనయందుఁ బ్రకాశముగాక నిద్రించుచుండుననియు నర్థము. సూక్ష్మముగనుండునవి స్థూలముగఁ బ్రకాశించునుగాని లేనివి యెప్పటికిని లేనివే. గుణరహితుఁడై భక్తుల ప్రార్థ

---

* శ్లో॥ పద్మనాభాదికా స్సర్వే, వైభవీయా స్తథైవ చ
షట్త్రింశత్సంఖ్యాసంఖ్యాతః, ప్రాధాన్యేన గణేశ్వర ॥
షట్త్రింశద్భేదభిన్నాస్తే, పద్మనాభాదికా స్సురాః
అవిరుద్ధా స్సముత్పన్నా, దీపా ద్దీప ఇవేశ్వరాః॥

ఈ ముప్పదియాఱులో భాగవతమునఁ జెప్పఁబడిన నిరువదియొకటి చేరియున్నవి.

నము విని, పిలిచినఁ బలికి, రమ్మనిన వచ్చి, కష్టవేళ రక్షించి దుర్జన బాధ తొలఁగింపంజాలఁ డయ్యెనేని యట్టిదేవుఁ డుండిననేమి లేకుండిన నేమి? ఉండియు లేనివాఁడేకదా. దేవునికిఁ బ్రయోజనపడని మొద్దు దేవుఁ డున్నాఁడనుటకంటె దేవుఁడే లేఁడనుట ఋజువాదము. కావుననే నిరీశ్వర సాంఖ్యముపై యోగము, దానిపై వేదాంతము కలుగుట. ఏశాస్త్ర మేమిచెప్పినను దాను జెప్పుకొనునది విని, తాను బిలిచినఁ బలికి, రమ్మనిన వచ్చి, యడిగినపుడు దర్శనమిచ్చి, కష్ట వేళ రక్షించుదేవుఁ డొకఁ డున్నాఁడని భక్తుల విశ్వాసము. ప్రహ్లాద ద్రౌపదీ గజేంద్ర ధ్రువాదుల చరిత్రము లీ విశ్వాసము వ్యర్థము కాదని యట్టిదేవుఁ డున్నాఁడని స్థాపించుచున్నవి. ఒకరి ననుగ్రహించిన దేవుఁడు మఱియొకరి ననుగ్రహింపకపోవునా? కాఁపులు భక్తులు తుల్యులు. పొలము దున్ని విత్తనములు చేతఁబట్టుకొని వానదేవుఁడా యని కాఁపులు మేఘముల కెదురుచూతురుగాని సముద్రము పేరైనఁ దలఁపరు. అట్లే భక్తులును నతఁ డెంతలావు పొడుగుండినను మూఁగ దేవుని గ్రుడ్డిదేవుని బ్రార్థింపరు. "మానవదేహము లోనికి వచ్చుటం జేసి యాతఁడు కొంత మితమునకు లోపడినవాఁడయి సర్వవ్యాప్తి కాఁజాలకపోవును" అని యొక యాక్షేపము. వాక్యమెంత వివేకముతో వ్రాయఁబడినదో విషయ మంత వివేకముతోనే వాదింపఁబడుచున్నది.

ఈ వాదము చేయు వారు భగవంతుఁడు సర్వశక్తిమంతుఁడు గాఁడని యభిప్రాయపడుదురు కాఁబోలు. భగవంతుఁడు స్వతంత్రుఁడు సర్వశక్తిమంతుఁడు నని యంగీకరించిరా మానవదేహము లోనికి వచ్చినపుడు ప్రకృతికి వశుఁడుగాక తన దివ్యత్వము గాపాడుకొనుట స్వాతంత్ర్యమును సర్వశక్తిమత్త్వమును దెలుపునా? ప్రకృతికి వశుఁడగుట తెలుపునా? మానవదేహములోనికి వచ్చినంతమాత్రమున మనయట్టివాఁడే యగునేని యతఁ డొక సామాన్యజీవుఁడే కాని పరమాత్మ యెట్లగును? గారడివిద్యలు చేయువారు తమ విద్యలకుఁ దాము మోసపోవుట యెందైనఁగలదా. పూర్వపు రాజులు మాఱు

వేషములు ధరించి ప్రజల సుఖదుఃఖము లెఱుంగుటకై దేశసంచారముఁ గావించుచుండిరిగదా. ఆమాత్రమున వారి అధికారమునకుఁ గాని శక్తిసామర్థ్యములకుఁగాని లోపమువచ్చెనా? వేషము మాఱినంత శక్తిసామర్థ్యములు మాఱవు.*

"ఏకాలమున పరమాత్ముఁడు శ్రీకృష్ణుఁడుగ మానవావతారమెత్తియుండెనో యాకాలమున తక్కిన భౌతిక ప్రపంచవ్యవస నంతను నెవరు జేయుచుండిరో! మరియు శ్రీకృష్ణుఁడు కౌరవులతోఁ బోరాడునపుడును * * నీ సృష్టియంతయు నెవరి యాధీనమునందుండెనో, ఎటుల జరుగుచుండెనో యా వివరమును యీశ్వరు యవతారముల నొప్పుకొనెడివారలు మాకు దెల్పఁగలరా?"

కృష్ణలీల ౩౨ పుట చూడుఁడు. రుక్మిణమ్మ యిట్టిప్రశ్న మడుగు నప్పటికి మేమీ గ్రంథముఁ జదివినవారము కాము. ఈ వాదము చేయువారిని మేమొక ప్రశ్న యడుగుచున్నారము. లోకములో

---

* 'Now as regards confining an infinite God in a finite body, I will only have to remind my critic that no one has ever been able to confine his mind in a human frame, three and at half cubits in length, and as mind is more akin to the real man than the body, so virtually no man on this earth is confined in his body. Mind is nowhere; I can at once send it to the sky, the sun, the moon, or the stars, nay, it can be made to embrace the entire celestial sphere. As the sun is not confined in his luminous disc alone, but permeates all space, as it were, through his rays, similarly no human being is entirely confined in his body. Since it is impossible to confine ordinary human mind fully in a body, is it not much more impossible to confine the Divine mind of God in the body which He assumes either playfully or for the sake of some of His devotees? So it is foolishness to think, that if we invest our God with a body, by so doing we can ever limit Him. Nothing can limit the limitless God although He may appear to be limited in a body. If Sri Krishna has been entirely confined in His body, it would have been impossible for Him to show His universal form to Arjuna."

SWAMI RAMAKRISHNANDA.

వేఁడిమి, వాయువు లేనిపదార్థము లేదని ప్రకృతిశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారుగదా. కారుచిచ్చు లడవుల దహించునపుడు వీరియింటఁ బ్రొయ్యి దీపములు మండెనో చల్లారియుండెనో, సముద్రమునఁ బెనుదుపాను వీచినపుడు వీరింట గాలి లేదు కాఁబోలు. వీరి యుద్దేశమున భగవంతుఁడు ౬ అడుగుల బొమ్మ కాఁబోలు నొకచోటనుండిన వేఱొకచోట లేకపోవుటకు.

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వా, త్పరమాత్మాయ మవ్యయః
శరీరస్థోపి కౌంతేయ! నకరోతి నలిప్యతే॥ ౧౩-౩౧.
యథా సర్వగతం సౌక్ష్మ్యా, దాకాశం నోపలిప్యతే
సర్వత్రావ స్థితో దేహే, తథాత్మా నోపలిప్యతే॥ ౧౩-౩౨.
కృష్ణలీల ౨-వ నం, ౪౦౩.

అజోపిస న్నవ్యయాత్మా, భూతానా మీశ్వరోపిసన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ, సంభవామ్యాత్మ మాయయా॥
కృష్ణలీల సం-౨. ౩౫౧.

"అజాయమానో బహుధా విజాయతే" పుట్టువులేనివాఁడయ్యును బహువిధములఁ బుట్టుచున్నాఁడు.

ఈ శ్లోకార్థములను వారు పర్యాలోచింతురుగాక.

శ్రీకృష్ణావతారమునఁ గృష్ణునకు దేహము పాంచభౌతికమనియుఁ దేజస్సు నారాయణ తేజస్సనియు నభిప్రాయపడి కీర్తిశేషులైన టి. సుబ్బరావుగా రిట్లు వ్రాసిరి.

"Turn, for instance, to the end of the Mousala Parva in the Mahabharata, where you will find a curious passage. Speaking of Krishna's death, the author says that the soul went to heaven —which corrsesponds to *Devachan* where it was received with due honours by all the Devas. Then it is said, that Narayana departed from that place to his own place, Narayana being the symbol of the Logos. Immediately after there follows stanza describing the existence of Krishna in Swargam and further on we find that when Dharmaraja's soul went into *Swargam* he found Krishna there. How are these two statements to be reconciled ?" Lecture one the study of the Bhagavad Gita.

ఈవిషయమైన మూలశ్లోకములు :-

శ్లో॥ ఆశ్వాయం స్తం మహాత్మా తదా సంగ
చ్ఛత్యూర్ధ్వం రోదసీ వ్యాప్య లక్ష్మ్యా
దివంప్రాప్తం వాసవోథాశ్వినౌచ
రుద్రాదిత్యా వసవశ్చాథ విశ్వే
ప్రత్యుద్యయు ర్మునయ శ్చాపి సిద్ధా
గంధర్వముఖ్యాశ్చ మహాప్సరోభిః॥
తతో రాజన్ భగవానుగ్ర తేజా
నారాయణః ప్రభవశ్చావ్యయశ్చ
యోగాచార్యో రోదసీ వ్యాప్యలక్ష్మ్యా
స్థానం ప్రాప్యస్వంమహాత్మాఽప్రమేయమ్
తతో దేవై ర్ఋషిభిశ్చాపికృష్ణః
సమాగతశ్చారణై శ్చైవరాజన్
గంధర్వాగ్ర్యై రప్సరోభిర్వరాభిః
సిద్ధై స్సాధ్యైశ్చానతైః పూజ్యమానః
తంవై దేవా ప్రత్యనందంతరాజన్
మునిశ్రేష్ఠా ఋగ్భిరానర్చురీశమ్
తంగంధర్వాశ్చాపితస్థుః స్తువంతః
ప్రీత్యాచైనం పురుహూతోభ్యనందత్
నమోనమ స్తే భగవశ్శార్ఙ్గధన్వ,
ధర్మస్థిత్యాప్రాదురాసీద్ధ రాయామ్
కంసాఖ్యాదీన్ దేవశత్రూంశ్చసర్వాన్,
హత్వాభూమఃస్థాపితాభారత స్త్వా
దివ్యంస్థానమజరంచాప్రమేయం,
దుర్విజ్ఞేయం చాగమై ర్గమ్యమగ్ర్యమ్
గచ్ఛప్రభో రక్ష చార్తిం ప్రపన్నా
న్కల్పేకల్పేజాయమానాంశ్చమర్త్యాన్

ఇత్యేవముక్త్వా దేవసంఘోఽనుగమ్య,
శ్రియాయుక్తం పుష్పవృష్ట్యా వవర్ష
వాణీచాసీ త్సంశ్రితాఽఽయాసినీ సా,
భానోర్మధ్యే ప్రవిశ త్వం తు రాజన్
భుజైశ్చతుర్భిః సముపేతం మమేదం,
రూపం విశిష్టం జీవితం సంస్థితం చ
భూమౌ గతం పూజయతాఽప్రమేయం,
సదాహి తస్మి న్నివసామీతి దేవాః॥

ఈ శ్లోకార్థములకుఁ గృష్ణలీలామృతము ౨-వ సం. పుటలు ౨౪౧-౨౪౨ చూడుఁడు. మఱియుఁ దక్షిణభారతమున మౌసల పర్వంబునను గనుఁడు.

మీఁది శ్లోకములందు నారాయణశబ్దము కృష్ణశబ్దము గాన వచ్చుటఁజేసియు 'తత' యని యీ రెంటికినడుమ నుండుటఁ జేసి కృష్ణుఁడు స్వర్గమున కేగెననియు నందుండి నారాయణుఁ డప్రమేయ లోకమున కరిగెననియుఁ గృష్ణుఁడు స్వర్గంబునందే యుండెననియు నీయనయే ధర్మరాజ జీవునకు నావల గోచరించెననియుఁ గావునఁ గృష్ణుఁడు దైవతేజ స్సావేశించిన మనుష్యుఁడేయనియు వారు వ్రాసిరి.

స్వర్గమునందు ధర్మరాజ జీవునకు గోచరించిన కృష్ణుఁ డెట్టివాఁడో చూతము.

శ్లో॥ దదర్శ తత్రగోవిందం, బ్రాహ్మేణ వపుషాన్వితమ్
తేనైవదృష్ట పూర్వేణ, సాదృశ్యే నైవ సూచితమ్
దీప్యమానం స్వవపుషా, దివ్యైరస్త్రై రుపస్థితమ్
చక్రప్రభృతిభిర్ఘోరై, ర్దివ్యైఃపురుష విగ్రహైః
ఉపాస్యమానం వీరేణ, ఫల్గునేన సువర్చసా
యథాస్వరూపం కౌంతేయో, దదర్శ మధుసూదనమ్॥

అచ్చట బ్రాహ్మశరీరముతో వెలుఁగు గోవిందునిఁ జూచెను. పూర్వము చూచిన శరీర సాదృశ్య మీయనయే యాయన యని సూచించెను. చక్రము మొదలగు దివ్యాయుధములు పురుష విగ్ర

హాములు ధరించి యుండెను. ఫల్గునుఁ డాయన నుపాసించుచుండెను. ఇట్టి మధుసూధనుని ధర్మరాజు చూచెను.

నారాయణుఁడు పరమపదముఁ బ్రాపించెననియుఁ గృష్ణుఁడు స్వర్గమునందే యుండెననియు మీఁది వాక్యములవలన నేర్పడుచున్నది. ఈ పెనుగష్టమునుండి విడివడుటకుఁగాను టి. సుబ్బరావుగారు కృష్ణుఁడు మనుష్యుఁడని, తేజము నారాయణు తేజమని చెప్పినఁగాని వేఱుపాయము లేదని వ్రాసిరి.* స్వర్గలోకమున ధర్మరాజునకుఁ గాన వచ్చిన కృష్ణుఁడు మానవకృష్ణుఁ డగునేని యాయనకు బ్రాహ్మ్య తేజ స్సెందుండి వచ్చెను? ఆ తేజ స్సితరులకేల లేకపోయెను? చక్రా ద్యాయుధములు మూర్తిమంతంబులై యాయనను గొల్వనేల? ఆ మానవజీవి మధుసూదనుఁ డెట్లయ్యెను? ఈశ్వరుఁ డెట్లయ్యెను? మానవజీవిని నింద్రుఁడు భగవంతుఁడా! శార్ఙ్గధన్వీ! ధర్మసంరక్షణార్థము నీవు భూమియందుఁ బుట్టి కంసుఁడు లోనగు దేవశత్రువులఁ జంపితివి. యుగయుగమున నిట్లే చేయుమని యెట్లు స్తుతించెను? నారాయణ తేజస్సు వెడలిపోయిన పిమ్మట మిగిలిన జీవి కిని సార్థకముగ నన్వయించునా? ఇవన్నియు వా రాలోచింపరైరి. ఇంతియకాదు స్వర్గారోహణ పర్వాంతమున నెవరెవరి యంశముల నెవరెవరు భూమి మీఁదఁ బుట్టిరో వారువా రాయా మూర్తులతో సాయుజ్యము గనిరని చెప్పుచోట స్వర్గమునందున్న కృష్ణమూర్తి గుఱించి

శ్లో॥ యస్సు నారాయణోనామ, దేవదేవ స్సనాతనః
తస్యాంశో వాసుదేవ స్తు, కర్మణోంతే వివేశహ,

యని వాసుదేవుఁడు నారాయణాంశమనియు నారాయణులోఁ గలసెననియుఁ జెప్పంబడి యున్నదిగాని మానవజీవి యని చెప్పబడఁ లేదు.

---

* "Unless we suppose that Narayana, whose energy and wisdom were manifested through the man Krishna, was a separate spiritual power manifesting itself for the time being through this individual, there is no solution of the difficulty."

Lectures on B. Gita by T. SUBBA ROW.

ఈ శ్లోకమేల వారు గ్రహింపరైరో. అవతార విచారము తెలియక వారు తెచ్చుకొన్న కష్టమునుండి విడువడు నుపాయము లేకపోలేదు. ాగవతమునఁ బ్రథమస్కంధమున నవతారముల గుఱించి చెప్పుచోట

"సీ. మహదహంకార తన్మాత్ర సంయుక్తుఁడై
చారుషోడశకలా సహితుఁ డగుచుఁ
బంచమహాభూత భాసితుండై శుద్ధ
సత్త్వుఁడై సర్వాతిశాయి యగుచుఁ
జరణోరు భుజముఖ శ్రవణాక్షి నాసాశి
రములు నానా సహస్రములు వెలుఁగ
నంబర కేయూర హారకుండల కిరీ
టాదులు పెక్కువే లమరుచుండఁ

గీ. పురుషరూపంబు ధరియించి పరుఁడనంతుఁ
డఖిల భువనైక వర్తన యత్నమమర
మానితోదారజలరాశిమధ్యమునను
యోగ నిద్రా విలాసియై యొప్పుచుండు.

ది సకలావతారంబులకు మొదలిగనియైన శ్రీమన్నారాయణదేవుని రాజమానంబయిన దివ్యరూపంబు దానిం బరమయోగీంద్రులు ర్శింతురు." అని ప్రారంభించి యావల నవతారములఁ జెప్పుచు ర్మకలా సర్గంబున నరనారాయణాభిధానులైన ఋషులై దుశ్చరం యిన తపంబు సేసిరని చెప్పఁబడెను. ఈ నరనారాయణులే యర్జున ాసుదేవులుగా నవతరించి రని పెక్కుచోటులఁ జెప్పఁబడెను. ష్ణార్జునులు (నరనారాయణులు) నాకలోకమం దుండఁగనే పరమ దమునకుఁ బోయిన నారాయణ తేజ స్సెక్కడిది? అది ముందుపోవఁ రణమేమి యని యాలోచింప విష్ణు పురాణంబునఁ గృష్ణావతార శంసయందు

శ్లో॥ "ఏవం సంస్తూయమానస్తు, భగవాన్ పరమేశ్వరః
ఉజ్జహారాత్మనః కేశౌ, సిత కృష్ణౌ తదామునే

ఉవాచచ సురానేతౌ, మత్కేశౌ వసుధాతలే
అవతీర్య భువోభార, క్లేశహానిం కరిష్యతః"

ఇట్లు స్తుతింపఁబడిన భగవంతుఁడు తెల్లని నల్లని రెండు కేశములను దీసి యివి భూమియం దవతరించి భూభారమణంచు నని చెప్పెనని కానవచ్చుచున్నది. ఇక్కడఁ గేశములనఁగా వెండ్రుకలని కొందఱర్థము చేసిరిగాని యది సరిగాదు. కేశమనఁగాఁ దేజస్సు. భారత మోక్షధర్మపర్వంబున నామ నిర్వచన ఘట్టంబున "సూర్యస్య తపసో లోకా నగ్నేః సోమస్య చోభయోః। అంశవో యే ప్రకాశంతే మమ తే కేశ సంజ్ఞితా" యని యుండుటచేఁ గేశము లనఁగాఁ దేజోంశములను నర్థమే సాధువు. ఈరెండు తేజోంశములే రామకృష్ణు లయిరి. పరికించి చూడ నిందొక్కటి నారాయణఋషి యందును వేఱొకటి యాది శేషుని యందును బ్రవేశించెననియు వారు తత్తేజో విశిష్టులై యవత రించిరనియు నెఱుంగనగు. ఆ కారణమున నారాయణఋషి యందుండు నంశముగాక యుపరి వేఱొక యంశము కార్య నిర్వహణార్థము కూడి కొనెను. ఈ యెక్కువగ వచ్చిన తేజోంశము పరమపదమునకుఁ బోయెననియు నారాయణఋషి స్వర్గలోకమం దుండెననియు నెఱుంగనగు.

కొందఱు బద్ధజీవు లజ్ఞాన విమోహితులు, సంకుచితజ్ఞానులు, గుణత్రయ బద్ధులునై తమకుఁగల స్వాతంత్ర్యమును దుర్వినియోగ పఱిచి, తాము తరించుటకై సాధనముగ నీయఁబడిన కరణ కళేబర మును విషయ పరతంత్రతయందు వినియోగించి కామ క్రోధ లోభ దూషితులై శాస్త్రాతిగాములై దురహంకార పీడితులై, యహంకార మమకారాంధకార నష్టదృష్టులై, శిశ్నోదర పరాయణులై తన్నిమిత్తం బుగ నితరుల బాధింపఁ గడంగుదురు. కొందఱు శాస్త్రబద్ధులై ప్రబుద్ధులై జ్ఞానసంపన్నులై కరణకళేబర దాతయెడఁ గృతజ్ఞులై కర్మ జ్ఞాన భక్తి యోగమార్గంబుల భగవంతుని సేవించుచు మనోవాక్కా యము లాయనకే సమర్పించి తదనుభవ జనితానందమున మునిఁగి త్రుటిమాత్రంబైనఁ దద్విరహంబు సైఁపక

"ఆఁకలి గొన్న క్రేపులు, రయంబున నీఁకలు రాని పక్షులున్
దీకొని తల్లికిన్, మఱి విదేశ గతుండగు భర్త కంగజ
వ్యాకుల చిత్తయైన జవరాలును దత్తరమందు భంగిఁ"

దత్తఱమందుచుఁ "గదాను సాక్షాత్కరవాణి చక్షుషా" యన్నట్లు లెప్పుడు గందునో కనుల కింపుగ శ్రీహరి రూపమని కొంద ఱేకారి పోవుచుందురు.

దుష్టసంహారము సంకల్పముచేఁ జేసినను భగవంతుఁడు నిజ స్వరూప దర్శన కాంక్షులైన భక్తులకు దర్శన మీయక యెట్లు వార లను సంకల్పముచేఁ దృప్తి పఱుపఁగలఁడు? ఎవరెవ రెట్లు ధ్యానించు చున్నారో వారివారి కావిధముగ దర్శన మీయవలయును గదా. మాయారూపములను జూపుట భక్తుల వంచించుటయే కదా. ఎట్లు కోరినవారి కట్లు దర్శన మిచ్చెదనని చెప్పి మోసముచేసెనేని యట్టి వాఁడు భగవంతుఁ డెట్లు కాఁగలఁడు? కావున వీరికి సాక్షాత్తుగ దర్శన మిచ్చియే తీరవలయును. లక్షణ రూపముగఁ దానుజెప్పిన శాస్త్రోక్తు లకుఁ దనచర్య లక్ష్యముచేయ నప్పుడప్పుడు భక్తుల ననుగ్రహింప గోచరింపఁజేని యతీంద్రియుఁడైన భగవంతుఁ డున్నాఁడని యెట్లు నమ్మవలయు? శాస్త్రములందుఁ బ్రమాణబుద్ధి యెట్లు జనించు? స్త్రీ యైన ద్రౌపదిని, బాలుండైన ధ్రువునిఁ, బశువైన గజేంద్రునిఁ, బక్షి యైన జటాయువును, బోయలైన శబరీ గుహులును, రాక్షసులైన ప్రహ్లాద విభీషణులను, ననుగ్రహించిన కారణమునఁ గదా వారికి సాధ్యపడినది మనకేల సాధ్యపడదని భక్తులు భగవంతుని సేవించు చున్నారు. ఇట్టి నిదర్శనములే లేకుండినచో నాస్తికులు ప్రబలి యుం దురుగాని యాస్తికుఁ డొకఁడైన నుండఁజాలఁడు. వాత్సల్య పరిపూర్ణుఁ డైన భగవంతుఁ డొకఁడున్నాఁడని ప్రత్యక్షముగ నిరూపించునది భక్తి యోగమే కావుననే యది తక్కిన యన్నిటికంటె మిన్నగ నెన్నఁ బడుచున్నది. 'పరిత్రాణాయ సాధూనా'మ్మని తొలుతనే చెప్పుట కీ కార్య మాయన కత్యంత ప్రీతికరము ముఖ్యము నగు కార్యము నగుటచేతనే. సాక్షాద్విభవావతార ముఖ్యప్రయోజన మిదియే.

కొందఱు దుష్టశిక్షణము భగవంతుఁడు సంకల్పముచేతనే చేయరాదా? దానికై యవతరింపవలయునా? యందురు. సత్యమే. భగవత్సంకల్పము లేక యేకార్యము జరగదు. భగవంతునిమాట యటుండనిచ్చి మనముచేయు కార్యములలో మానసిక వ్యాపారమైన సంకల్పముముందా? కాయిక వ్యాపారమైన కార్యాచరణము ముందా? యాలోచింపుఁడు. ఏ కార్యమైనను మానసికముగ జరిగియే యావలఁ గాయికముగ జరుగును. భగవంతుని కార్యమట్టిదే. సంకల్పముచే సంహారకార్యము చేయును. ఆవల నిమిత్తముగ నొకదానిఁగొని యా కార్య మింద్రియగోచర మగునట్లు చేయును.

శ్లో॥ కాలోస్మిలోకక్షయ కృత్ప్రవృద్ధో, లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః। ఋతేపిత్వానభవిష్యన్తిసర్వే, యేవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ, జిత్వాశత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్। మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్॥

అని భగవంతుఁడే చెప్పెనుగదా. కృ. లీ. ౨-సం. ౩౯౭ పంక్తి ౬-౧౪. పరభూపాయువులెల్లఁ జూపులనె శుంభత్కేళి వంచించు నీ పరమేశుం డని భీష్ముఁడు చెప్పెఁగదా. భారత యుద్ధమునఁ నెవఁడో ముందుగ శత్రువులను వధించుచుండినట్టును, నాయన చంపినవానికిఁ దన బాణములు దగులుచుండినట్టు నర్జునుఁడు చెప్పెఁగదా. వాస్తవముగ సంహారకార్యము తానే చేయుచుండినను నిందలేక పొందిపోదన్నట్టు నిమిత్తమొకటి యేర్పడవలయును. ఈ నిమిత్తము లోకశిక్షార్థమే. కృష్ణావతార విషయమే యాలోచింతము. కంస నరక జరాసంధాదులను భారత యుద్ధమునఁ జచ్చిన పదునెనిమిది యక్షౌహిణుల సేనను సంకల్పము చేతనే యెవరింట వారు చచ్చి పడియుండునట్లు భగవంతుఁడు చేసె ననుకొందు. దానివలన లోకమేమి నీతి గ్రహించి బాగుపడఁగలదు? కారణము లేక కార్యము గలుగదుకదా. ఏమి యకార్యము చేయుటచే వీరందఱేకకాలమునఁ జచ్చినట్టు? ధర్మాత్ములకు నధర్మాత్ములకుఁ గలహ ముదయించెనేని తొలుత ధర్మము చాల నిడుమలఁ బడ

నను దుదకు ధర్మమే జయించును. భగవంతుఁడు ధర్మపక్షముననే నిలిచి మేలుచేయునను నీతి భారతరణమున నేర్పికొంటిమి. అప్పుడట్లు నేర్చుకొన సాధ్యపడునా? పతివ్రతల కన్నీరుగాఁజేసినవారు నిర్వంశముగఁ బోదురను నీతి నేర్చుకొనఁగలమా? శాస్త్రవాక్యముల కిట్టి ప్రత్యక్ష నిదర్శనములు గలుగవేని శాస్త్రములం దెవనికిఁ బ్రమాణబుద్ధి నిలుచును? లోకమెట్లు బాగుపడును? భీమార్జునుల కిప్పుడు వచ్చిన కీర్తి యిప్పుడు రాఁగలదా? ఇత్యాద్యనేక కారణములచేత భగవంతుఁడు సంకల్పముచేత సంహారము గోచరింపఁజేయుఁడు. కారణము చెప్పక శిక్షించు ప్రభువుల మన మిప్పు డేమిగఁ దలఁచుచున్నారము? అవతార తత్త్వ మిట్లెఱుఁగువారు ముక్తిని గాంతురని భగవంతుఁడే యిట్లు చెప్పెను.

శ్లో॥ జన్మకర్మచ మే దివ్య, మేవం యోవేత్తి తత్త్వతః *
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోర్జున॥

కృష్ణలీల సం-౨ పుట ౩౫౨ పంక్తి ౧౦-౧౬.

## 4. అంతర్యామిత్వము.

పరవ్యూహావతారములు మనుష్యులకు గోచరించునవి కావు. భక్తాభీష్టప్రదంబులై, శిష్టరక్షణము దుష్టశిక్షణముచేసి భగవంతుఁ డొకఁ డున్నాఁడని లోకులకుఁ బ్రత్యక్షముగ దోఁపఁ జేయునని విభవావతారములే. అయినను నివి యిప్పు డప్పుడప్పుడు వచ్చుచుఁ బోవుచునుండునుగాని నిలుకడగా నుండునవికావు. కావున రెండవతారముల నడిమికాలమున దేవుఁ డున్నాఁడా? నేను గనులఁ జూడఁ

---

* పూర్ణావతారములం దవతారమూర్తి దేహము "పరమేష్ఠి, పుమాన్, విశ్వః, నివృత్తి సర్వఏవచ" యను పంచోపనిషన్మయ దేహమేకాని ప్రాకృత దేహము కాదు. కావుననే భారతము సభా. ౬౧. అధ్యాయమందు

శ్లో॥ నైషగర్భత్వ మాపేదే, నయోగ్యా మవసత్ప్రభుః
నతస్యప్రాకృ తా మూర్తిః, మాంసమే దోస్థి సంభవః

అని చెప్పఁబడెను. దివ్య దృష్టిగలవారికి దివ్య దేహము ప్రాకృత చక్షుస్సులకుఁ బ్రాకృత దేహమువలెఁ గానవచ్చును,

గలనా ? యని నిజమైన యభిలాష గలిగినవారికి గోచరించుటకై భగవంతుఁడు ప్రతి జీవియందు హృదయ పద్మమున నంతర్యామియై తేజోరూపమునఁ బ్రకాశించుచుండును. ఆయనను జూడవలయు నని నిజమైన శ్రద్ధాభక్తులు గలిగి యాయనయందే మనస్సు నిశ్చంచలముగ నిలిపి ధ్యానించువారి కాయన గోచరించు. ఇట్లు ధ్యానించు వారే యోగులు.

భగవంతుఁ డంతర్యామియై హృదయపద్మమున రెండు విధముల నుండును. జీవుని కాప్తుఁడై తేజస్స్వరూపమున• నుండి జీవుఁడు పాపానుభవమునకై నరకమునకుఁ బోయినపుడును, పుణ్యానుభవము నకై స్వర్గమునకుఁ బోయినపుడు, నుభయానుభవమునకై గర్భమునఁ బ్రవేశించినపుడు ప్రీతిగల బంధువువలెఁ* విడనాడక కూడి యుండును. హృదయపద్మమున దివ్యస్వరూపముతో నుండి బాహ్య విషయాసక్తి గల మన స్సేమాత్రము తనయందుఁ బ్రసరించినను నదే నెపముగాఁ గొని దానికిఁ దనయందే యభిరుచి పుట్టించుచు నిశ్చయమైన భక్తి శ్రద్ధలతోఁ దన్ను ధ్యానించినపుడు వారు కోరినవిధముగ దర్శన మిచ్చుచుండును. ఈ యోగవిషయ మాత్మసాక్షాత్కార విషయము గ్రంథ విస్తరభీతి వివరించి వ్రాయఁ జాలమికి విషాదము పొడము చున్నది. శ్రద్ధగలవారెఱుంగు మార్గము భగవంతుఁడే చూపించును. బుద్ధ్యాది నియామకుఁ డీమూర్తియే. కావుననే భగవద్గీతయందు

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం, హృద్దేశేర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని, యంత్రారూఢాని మాయయా॥

---

• "అంగుష్ఠమాత్రః పురుషోజ్యోతి రివాధూమకః" "నీలతోయద మధ్యస్థ విద్యుల్లేఖేవ భాస్వరా."

* శ్లో॥ అంతర్యామి స్వరూపంచ, సర్వేషాం బంధువత్ స్థితమ్
స్వర్గనరక ప్రవేశేపి, బంధురాత్మా హి కేశవః.

తమేవ శరణంగచ్ఛ, సర్వభావేన భారత
తత్ప్రసాదాత్ పరాంశాంతిం, స్థానం ప్రాప్స్యతి శాశ్వతమ్
భ. గీ. ౧౮-౬౧. కృష్ణలీల. సం-౨, పుట. ౪౨౯.

అని హృదయమందుండెడి యీశ్వరు శరణుచొరుమని యుపదేశించె.

5. అర్చావతారము.

విభవావతార దర్శన మా కాలమందలి జనులకు మాత్రమే లభ్యము. హృదయమందుండు మూర్తి దర్శనము యోగులకు మాత్రమే లభ్యము. తక్కిన జనులగతియేమి? వారెట్లు తరింపవలె? కర్మజ్ఞాన యోగముల కధికారులుగాని స్త్రీ శూద్రాదులు నరకగాములు కావలయునా? ఉపేక్షింపఁబడుటకు భగవంతునకు వీరు చేసిన ద్రోహ మేమి? భగవంతుఁడు సర్వ సముఁడు. సమస్త జీవకోటులు తరింపవలయుననియె యాయన యభీష్టము. కావున సర్వసామాన్యముగ నందరకు నుపాస్యుఁడయి యన్నివేళల దర్శనమిచ్చుటకై నానాదేశముల నానాగ్రామముల నర్చారూపముల నవతరించెను. పూజకు యోగ్యమైన ప్రతిమకు నర్చయని పేరు. ఇందుఁ గొన్ని స్వయంవ్యక్తములు. కొన్ని మంత్రప్రతిష్ఠితములు. 'భౌమనికేతనేష్వ వికుటీకుంజే' మన్నట్లు లివి దేవాలయములందే గాక యిండ్లయందు, గుడిసెలయందుఁ బొదలయందును గూడ నుండవచ్చును. భగవదాభిముఖ్యమందుఁ దత్సేవయందు రుచిజనకత్వము యవతారమునకుఁ బరమోద్దేశము. ఎవరికెవరి కేయే మూర్తియందు సహజప్రీతి గలదో వారు వారాయామూర్తిని బంగారు వెండి లోహము మన్ను మొదలగువానితో యథాశక్తి గల్పించి సేవింపవచ్చును. విగ్రహములు చిత్రపటములు నన్నియు సేవ్యములే. సర్వవ్యాపి భగవంతుఁ డొకదానియందుండి యొకదానియందు లేకుండువాఁడు కాఁడు.

కం. ఇందుఁగలఁ డందు లేఁడని సందేహము వలదు శౌరి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన నందందే కలఁడు దానవాగ్రణి! వింటే.

యని భగవంతుఁ డెల్లచోటులఁ గలఁడు. నృసింహావతారము స్తంభమందుఁగదా. గోపిక లిసుకతోఁ జేసిన పార్వతినిగదా పూజించిరి.

రుక్మిణి దేవాలయమునఁగదా పార్వతీ పరమేశ్వరులఁ బూజించె. మా ర్కండేయుఁడు రాతిలింగమునుగదా పూజించె. ఇక్ష్వాకుల కులధన ముగదా శ్రీరంగనాయకులు. కత్తిర నందనారాది శివభక్తులు, విష్ణుభక్తులైన యాళ్వారులు కబీరు రామదాస పురందర దాసాదు లందఱు విగ్రహారాధన పరులేకదా వేంకటాచల ఘటికాచలాది దివ్యస్థలంబుల మూర్తిసేవ దృష్టఫలంబేకదా.*

శ్లో॥ యోయో యాంయాం తనుంభక్త, శ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్యతస్యాచలాంశ్రద్ధాం, తామేవవిదధామ్యహమ్॥
సతయా శ్రద్ధయాయుక్తం, స్తస్యారాధన మీహతే
లభతేచ తతః కామాన్, మయైవ విహితాన్ హితాన్॥
భ. గీ. ౭-౨౧, ౨౨,

అని శ్రీకృష్ణుఁడే సెలవిచ్చెఁగదా,

కావునఁ బరమకరుణాసముద్రుఁడైన భగవంతుఁడు మనలఁ దరింపఁ జేయఁగోరి యెన్నెన్ని రూపములుగనో మనకు గోచరించు చున్నాఁడు. ఎవరెవరి శక్తి యెంతమాత్రమో వారువారు వారి శక్తి కొలఁది భగవంతుని సేవించి దర్శించి తరింప వలనుపడునట్లు భగవం తుఁడు నానావిధముల నానారూపములఁ గానవచ్చును. భగవంతుఁడు భక్తవత్సలుఁడు. 'నమేభక్తః ప్రణశ్యతి' యని భక్తులెన్నఁటికిఁ జెడరు. నాస్తికులు సంశయాత్ములు చెడుదురు. వీఁడు నన్ను బంగారు విగ్రహ మునఁ బూజించెనని సంతోషించి మంటివిగ్రహమునఁ బూజించిన వారిని గోపింపఁడు. హృదయాకాశమునందు తన్ను నుపాసించు వారిని మెచ్చుకొని విగ్రహములందుఁ దన్నుఁ బూజించువారిని విడ నాడఁడు. భగవంతుఁడు సర్వసముఁడు. నిష్పక్షపాతబుద్ధి. తనయందుఁ బ్రీతిగలవారిని రక్షించును. ప్రీతిలేక పోయినను గామద్వేషాదులచే నిత్యము స్మరించుచుండినను రక్షించును. కావునఁ దెలివిమాలిన

* పాండవుల కాలమునను దేవాలయము లర్చావిగ్రహము లున్నట్టు భారత మందుఁ గలదు. శ్లో॥ అర్చాత్ర ప్రనృత్యంతి, నదంతిచ హసంతిచ,
ఉన్మీలంతి నిమీలంతి, రాష్ట్రక్షోభం వినిర్దిశేత్॥ సభాపర్వము ౭౭ అ.

వారు చెప్పెడి పనికిమాలిన మాటలనన్నిఁ యొకమత మెక్కువ యొక మతము తక్కువ యనికాని యొకమార్గ మెక్కువ యనికాని మఱి యొకటి తక్కువ యనికాని భ్రమింపక తమ చిత్తవృత్తి యెట్లున్నదో తమలోనే శోధించుకొని తమ శక్తిసామర్థ్యములఁ బరిశీలించుకొని మన స్సనునది భగవంతునియందు దృఢముగ నిలిపినయెడల సంసారముక్తి కొంగునఁ గట్టుకొన్నభుక్తి యగును.

## —♦ శ్రీకృష్ణపరతత్త్వ ప్రశంస ♦—

### శ్రీకృష్ణుఁ డవతారమూర్తియా?

ఒక పురుషుఁ డవతారమూర్తి యగునా కాఁడా యని నిర్ణ యించుటెట్లు? క్రైస్తవులు క్రీస్తవతారపురుషుఁడనుటకుఁ గొన్ని కారణములు చెప్పెదరు. క్రీస్తు పుట్టకముందే యవతారపురుషుఁడు పుట్టునని కొందఱు చెప్పియున్నారఁట! క్రీస్తుచేసిన యమానుష కృత్యము లాయన యవతారపురుషుఁ డనుటకు సాక్ష్యములఁట!! ఈ కారణములచేఁ గ్రీస్తవతారపురుషుఁడైనచో శ్రీకృష్ణుఁడుగాఁడని వారనుటకుఁ గారణమే లేదు.

### ముచుకుందుఁడు శ్రీకృష్ణునిఁ జూచి

"జ్ఞాత్వానారాయణం దేవం, గర్గవాక్యమనుస్మర"న్నని చెప్పి నట్లు భాగవతంబునను,

శ్లో॥ "ముచుకుందశ్చతత్రాసౌ, వృద్ధ గార్గ్య వచస్స్మరన్
సంస్కృత్య ప్రణిపత్యైనం, పరం సర్వేశ్వరం హరిమ్॥
ప్రాహ జాతో భవాన్ విష్ణో, రంశ స్త్వం పరమేశ్వర
పురా గర్గేణ కథిత, మష్టావింశ త్తమే యుగే
ద్వాపరాంతే హరేర్జన్మ, యదువంశే భవిష్యతి"

అని విష్ణుపురాణంబునను గలదు.

క్రీస్తుచేసిన వమానుష కృత్యములని యోగశాస్త్రజ్ఞానహీను లైన క్రైస్తవులు తలంచుచున్నారుగాని యాయన చేసినవన్నియు నమా నుషములు కానేకావు. యోగసిద్ధుఁ డెవఁడైనఁ జేయఁగలఁడు. క్రీస్తు

చేసినవానికంటె నత్యద్భుతములైన కార్యములు వ్యాసాదులు చేసియున్నారు. క్రీస్తువిషయమై క్రైస్తవులు చెప్పునట్టివన్నియు నిజముగా గ్రహించినను నతఁడొక గౌణావతారమని శక్త్యావేశావతారమని చెప్పవలయునేకాని యంతకు విశేషించి చెప్ప సాధ్యపడదు. ఇట్టి యావేశావతారము ముముక్షుల కుపాస్యుఁడు కాఁజాలఁడని ముందే వివరింపఁ బడియెఁగదా. క్రీస్తైవరైన నగుఁగాక. మన కృష్ణుని విషయ మాలోచింతము.

కృష్ణుఁడు బాల్యమున నొనర్చిన రాక్షసవధ లాయన పూర్ణావతారమని స్థాపింపఁజాలవు. కృష్ణుఁడు యుద్ధముచేసి రాక్షసులఁ జంపినఁ జ్యవనాగస్త్యాదులు హుంకారమాత్రముననే చంపిరి. కృష్ణుఁడు దావాగ్నిని త్రావిన నగస్త్యుఁడు సముద్రమునే పానముచేసెను. చంద్రమతి కాఱుచిచ్చు నణఁచివేసెను. తుదకు గోవర్ధనోద్ధారణము కూడ నసమానుషకృత్యముకాదు. కృష్ణుఁడు బహురూపియై చరించినచో సౌభరి కాలేదా? కృష్ణుఁడు మృతపుత్రకుల బ్రదికించినచో వ్యాసుఁడు రణనిహతులఁ గౌరవాదులనెల్ల బ్రదికింపలేదా? నారదుఁడు బ్రదికింపలేదా? కావున యోగసిద్ధులకు సాధ్యమైన యిట్టి కార్యము లమానుషములు కావని నిరాకరించి వాస్తవముగ నమానుష కృత్యము లున్నవేమో చూడవలసియున్నది.

౧. శంఖచక్రహస్తుఁడై చతుర్భుజుఁడై జన్మించుట.
౨. యశోదకుఁ దన గర్భంబున బ్రహ్మాండము కనఁబఱచుట.
౩. నలకూబరమణిగ్రీవుల శాపముక్తులఁ జేయుట.
౪. నృగశాప మోక్షణము.
౫. అక్రూరునకు నిజస్వరూపముఁ జూపుట.
౬. వైష్ణవాస్త్ర ముపసంహరించుట.
౭. పూతనా మోక్షప్రదానము.
౮. శిశుపాల దంతవక్త్ర వధ.
౧౦. ముచుకుంద వరదత్వము.

౧౧. బాణాసుర యుద్ధంబున శివపరాభూతి.
౧౨. విశ్వరూప ప్రదర్శనములు.

దేవకీ వసుదేవులు వారి పూర్వజన్మంబున భగవంతు నారాధించి యాయన తమకుఁ గుమారుఁడుగా జన్మించునట్లు వరంబు నొందిరి. ఆ వరము సార్థకముగ శంఖచక్రములు ధరించి చతుర్భుజుఁడై జనించినవాఁడు భగవంతుఁడేయై యుండవలయును గాని మఱి యే యోగియు నై యుండఁడు. గౌణావతారమునయి యుండదు. గౌణావతారములకు శంఖచక్రాది చిహ్నము లుండవు.

నలకూబర మణిగ్రీవులను శపించునపుడు నారదమహర్షి "వాసుదేవస్య సాన్నిధ్యం, లబ్ధ్వాదివ్య శరచ్ఛతే, వృత్తేస్వర్లోకతాం భూయో, లబ్ధభక్తీ భవిష్యత" యని శపించె. భాగవత ముఖ్యుఁడైన నారదమహర్షి వాక్యమునకు విరోధముగ మఱి యెవఁడు వారల శాపము మాన్పఁగలఁడు? స్వగ శాపమోక్షణ మిట్టిదే. మోక్షదాత భగవంతుఁ డొకఁడేగాని వేఱొకరు లేరు. కావునఁ బూతనకు మోక్షమిచ్చినవాఁడు భగవంతుఁడే కావలయును. ఘంటాకర్ణుని చరిత్రము స్మరింపుఁడు. బాణాసుర యుద్ధంబున శివునిఁ బరాజితుఁ జేయఁగలిగినవాఁడు భగవంతుఁడుగాక మఱి యెవ్వఁడు? ఎట్టివానికైన నన్యున కది సాధ్యమా? వాసుదేవశబ్దము సార్థకమగునట్లు యశోదకుఁ దన యుదరంబున సర్వ ప్రపంచముఁ గనఁబఱిచెను. సర్వ సంహారకర్త తానేయని యర్జునునకు విశ్వరూపముఁ జూపెను. సృష్టికర్త దానేయని బ్రహ్మకు మాఱుబ్రహ్మను సృష్టించెను. (కృ. లీ. పుట ౯౯-౧౦౦-౧౦౧) ఇట్లు సృష్టి స్థితి సంహారములకుఁ గర్తయైన వాఁడు భగవంతుఁడుగాక మఱి యెవ్వఁడు? శిశుపాల దంతవక్త్రులకు మోక్షమియ్యఁగలవాఁడు భగవంతుఁడు గాక మఱి యెవ్వఁడు? వీరి పూర్వజన్మవృత్తాంతము స్మరించునది. భగవదత్త ప్రయుక్తంబైన వైష్ణవాస్త్రంబును సహింపఁగలవాఁడు విష్ణువుగాక మఱి యెవ్వఁడు?

ఈయన యవతారమూర్తియని పూర్వు లెవ్వరైనఁ జెప్పిరా యని యొకరు ప్రశ్నించిరి.

వాసుదేవేపితిచేన్నాకారమాత్రత్వాత్. శాండిల్య సూత్రము ౫౨.

ప్రత్యభిజ్ఞానాచ్చ. శాండిల్య సూత్రము ౫౩.

యదోర్వంశం నరశ్శ్రుత్వా, సర్వపాపైః ప్రముచ్యతే
యత్రావతీర్ణం విష్ణ్వాఖ్యం, పరబ్రహ్మ నరాకృతిః॥

విష్ణు పు. ౪ అంశ, అధ్యాయ ౧౧.

బ్రహ్మణ్యో దేవకీపుత్రో, బ్రహ్మణ్యో మధుసూదనః

నారాయణోపనిషత్తు అధర్వశిరస్సు ౬ దశ.

యః స దేవో మయాదృష్టః, పురా పద్మాయతేక్షణః
స ఏష పురుషవ్యాఘ్రః, సంబంధీ తే జనార్దన॥

ప్రళయకాలమందుఁ దా నేరూపము చూచెనో యాయనయే యీ శ్రీకృష్ణుఁడని మార్కండేయుఁడు ధర్మరాజునకుఁ జెప్పెను.

మహాభారత అరణ్యపర్వము అధ్యాయ ౧౮౯.

తపస్సుచేతను జూచుటకు భగవంతుఁడు సాధ్యుఁడుగాఁడని విని జనమేజయుఁడు

తపసా హ్యసుదృశ్యోహి, భగవాన్ లోకపూజితః
తందృష్టవంతసేసాక్షాత్, శ్రీవత్సాంకిత భూషణమ్।

మహాభార. శాంతి, మోక్ష ధర్మపర్వము అధ్యా. ౩౪౫.

"సాక్షాద్భగవాన్స్వయమ్" అని సంజయుఁడు చెప్పెను.

భీష్ముఁడు కృష్ణుని నేమిగా స్తుతించెనో (భీష్మస్తవరాజము కృ. లీ. సం-౩. పు. ౨౬) చూడుడు. గ్రంథవిస్తరభీతి స్తవమంతయు ముద్రింపఁ బడదయ్యె.

కృష్ణస్తు భగవాన్ స్వయం॥
స్వయమేవ హరిఃకిల॥
గృహీత మూర్తిత్రయ ఈశ్వరేశ్వరః॥

శ్రీకృష్ణమూర్తి జన్మించుటకు ముందే భగవంతుఁ డిం దవతరించునని గర్గుఁడును, గృష్ణుని సమకాలికులగు భీష్మ యుధిష్ఠరార్జునోద్ధవాక్రూర వ్యాసనారదపరాశర ముచుకుందాద్యనేకులును శ్రీకృష్ణుం డవతరించిన భగవంతుఁడని నుడివిరి. ఆయన యతిమానుష

చర్యలును నాయన భగవంతుఁడని స్థాపించుచున్నవి. లోకము భ్రాంతిచే శ్రద్ధాభక్తులులేక చెడునని తలఁచి యవతారతత్త్వమును ఘంటాఘోషముగఁ జెప్పెను. వృష్ణీనాం వాసుదేవోస్మి యని శ్రీకృష్ణుఁడే తన్ను విభూతిగణములోఁ జేర్చియుండఁగాఁ బూర్ణావతారమని యెట్లు చెప్పనగుననుసందేహము గలుగవచ్చును. దీనికిఁ బ్రత్యుత్తరముగ శాండిల్యమహర్షి "వృష్ణిషుశ్రేష్ఠ్యైతత్" అని సూత్రించెను. విభూతియోగాధ్యయమునందాయాజాతిలో శ్రేష్ఠులెవరో వారు చెప్పఁబడిరిగాని పూర్ణావతారమా గౌణావతారమా యనునది వివక్షగాదు. వృష్ణివంశమువారిలో నేనే శ్రేష్ఠుఁడనని కృష్ణుఁడు చెప్పెను. తన్నుఁ జెప్పక మఱియెవరినైనఁ జెప్పియుండినఁ దన నికృష్టత దానే యంగీకరించినట్లులుగదా యగు.

ఈ కారణములచే శ్రీకృష్ణుఁడు సాక్షాద్భగవంతుఁడగుట నిస్సందేహము.

## —◆ శ్రీకృష్ణ గుణవర్ణనము. ◆—

లీలామానుషవేషధారియైన శౌరి మనుష్యలోకంబున నవతరించి లోకసంగ్రహార్థంబు మనుష్యచర్యల నెట్లు జరపెనో చూతము.

### పుత్రధర్మము.

అదియేమి నిర్భాగ్యదశయోకాని దేవకీవసుదేవులు కృష్ణునిఁ బుత్రునిఁగాఁ బడసిరిగాని దానివలన నాయన బాల్యావస్థయందు ముద్దు చూచుటకుమాఱు కారాగారంబున నవయుచుండిరి. కొడుకుల లాలించి బేలించి యాడించి పాడించి యద్దుముద్దు చూచు భాగ్యంబు యశోదానందులకుఁ గలుగ వారెంత పుణ్యాత్ములో. బాల్యలీలలయందు నాపుణ్యదంపతులు బాలురఁ దామాడించుచుండినట్లు దలంచిరిగాని వాస్తవమారయ వారినే బాలురాడించుచుండిరని తోఁచుచున్నది. తల్లియనిన యశోదవంటిది తల్లిగాని యందఱు తల్లులా? ఒక తెప్పపాటు కాలమైనను దన్నువిడిచి యేమె పనిచేసికొనుటకు విరామము కృష్ణుఁడు కల్పించెనో లేదో! క్షణ

మాత్రము తన్నువిడిచి యామె దూరమేగినా వెంటనే యేదో యొక కిల్లచేష్ట చేయుట యామె నాకర్షించుట. అహోరాత్రములు సర్వకాల సర్వావస్థలఁ గృష్ణా పాలిచ్చెదనురా కృష్ణా నీళ్లుపోసెదనురా కృష్ణా బువ్వపెట్టెదనురా కృష్ణా జోగొట్టెదనురా కృష్ణా యేమిచేయుచున్నావురా కృష్ణా యెక్కడనున్నావురా కృష్ణా! కృష్ణా! కృష్ణుఁడేఁడీ? ఏఁడే మాకృష్ణుఁడు? అమ్మా మాకృష్ణుఁడు మీయింటికి వచ్చెనా? అక్కా మాకృష్ణుఁడు మీపిల్లలతో నాడుచున్నాఁడా? ఎంత కొంటెవురా కృష్ణా! ఎక్కడెక్కడ నేమి తుంటపనులు చేసితివని కృష్ణాకృష్ణా యని కృష్ణునిఁ గట్టను, గృష్ణుని దిట్టను, గృష్ణు నేరములు విచారింపను యశోదకుఁ గాలము సరిపోవుచుండెను. ముక్కునఁ జీమిడి, కంటఁ బుసి, నోర శోకవిరాళి, గలిగి వలదు వలదనఁగాఁ బూర్వజన్మకృత పాపమువలనఁ బుట్టిన ఋణపాతకులగు బిడ్డలవలెఁగాక సుపుత్రుండు తల్లిదండ్రుల కెంత సంతోషము గలిగింప సాధ్యమో యంత సంతోషము యశోదానందులకు బాలకృష్ణుఁడు కలిగించి బాలలీల నటించెఁ గదా. ఇది వారి కుత్తరవియోగకాలమున నంతకంత దుఃఖకారణమైనను, నావిరహదుఃఖము మోక్షకారణమే యయ్యెను. దేవకీ వసుదేవులయొద్దఁ జేరినపిమ్మట "జీవతో వాక్యకరణా" త్తను సూక్తి ననుసరించి వారినే పరమదైవతములుగాఁ గొలిచి తదాజ్ఞావశుఁడై వర్తించుచుండెను. ఇట్లు పుత్రధర్మము కొఱఁతలేకుండఁ జరిపెను.

### శిష్యధర్మము.

బ్రహ్మచర్యాశ్రమము స్వీకరించినవేళఁ గృష్ణుఁడు గురువుల యొద్ద నెంత భయభక్తులతో నటించెనో, యెట్లు తన గొప్పతనము దాఁచి వినయవిధేయతలతో గురువునకు గురుభార్యకు శుశ్రూష చేయుచుఁ దుదకుఁ గౌపీనమాత్రధారియై యడవికిఁబోయి కట్టెలు కొట్టి మోపుకట్టి నెత్తిపైఁ బెట్టికొని గాలివానలోఁ దడియుచు గజగజ వడఁకుచు శ్రమించియు నించుకంతయైన మనస్సున నొచ్చుకొనక విద్యలునేర్చి తుదకు వారుగోరిన గురుదక్షిణనిచ్చి స్నాతకుఁడయ్యెనని

కుచేలోపాఖ్యానాదులవలనఁ దెలియుచున్నది. పరివస్యానియమం బింత కంటెఁ జక్కఁగ నాచరించు టెట్లు?

మిత్రధర్మము.

ఇఁక మిత్రులనెట్లాదరించెనో చూతము. ద్రోణుఁడు ద్రుపదుఁ డెట్లు సహాధ్యాయులో కుచేలుఁడు కృష్ణుఁడు నట్లు సహాధ్యాయులే. ద్రుపదుఁడు తాను రాజయినపుడు తనయొద్దకు రమ్మని చెప్పియుండి యు ద్రోణుఁ డతని నొక యావును యాచింపఁ బోయినపుడు

చ. "కొలఁది యెఱుంగ కిట్టిపలుకుల్ పలుకం దగఁగాదు నాక నన్ బలుచఁదనంబునం బలుకఁ బాడియె నీ సఖ నంచుఁ? బేద వి ప్రులకును ధారిణీశులకుఁ బోలఁగసఖ్యము సంభవించునే? పలుకక వేగ పొమ్మకట పాఱుఁడు సంగడికాఁడె యెయ్యెడన్?

చ. ధనపతితో దరిద్రునకుఁ, దత్త్వవిదుండగు వానితోడ మూ ర్ఖునకుఁ, బ్రశాంతుతోడఁ గడుఁగ్రూరునకున్, రణశూరు తోడ భీ రునకు, వరూథితోడ నవరూథికి, సజ్జనుతోడఁ గష్ట దు ర్జనునకు, నెవ్విధంబునను సఖ్యము దా నొడఁగూడ నేర్చునే.

క. సమశీల వ్రతయుతులకు
సమధనవంతులకు సమసుచారిత్రులకున్
దమలో సఖ్యమును వివా
హమునగుఁ గాకగుని రెండు నసమానులకున్.

మఱి యట్లుగాక రాజులకుఁ గార్యవశంబునఁ జేసి మిత్రామిత్ర సంబంధంబులు సంభవించుఁ గావున మాయట్టి రాజులకు మీబోఁటి పేదపాఱువారలతోఁ గార్యకారణవశంబైన సఖ్యంబెన్నండును గానేర దని తిరస్కరించి పలికె." భార. ఆది.

ఇట్టి సందర్భములందే కృష్ణుఁ డెట్లు కుచేలునాదరించెనో స్మరిం పుఁడు. (చూ. కృ. లీ. సం-౨. పు-౧౯౭) తానుదనభార్యపరుండు శయ్య మీఁద నాయనను గూర్చుండఁబెట్టి తాను శుశ్రూష చేయుటేకాక తన భార్యచేతను బరిచర్య చేయించెను. తమభార్యలు వారి తండ్రు

లకు వీఁపురుద్ధుటయు దుష్టముగ నెంచువారల కిది వికటముగఁ దోఁచు నేమో కాని కృష్ణుఁడు చేసిన కార్యము మిత్రలక్షణమునకు విరోధము గాదు. మైత్రి సర్వవిధముల సర్వభావముల సామ్యము దప్ప వేఱొకటి యెఱుఁగదు.

క. దారలు పుత్రులు పురముఁ
శ్రీ రాష్ట్రము భోగములును జేలలు సకలా
హారంబులు నవిభక్తము
లారఁగ మన కిరువురకు వనాటేశ! యనఁ

అని రావణుఁడు వాలితో మైత్రి చేసికొనిన కాలమునఁ జెప్పినట్లు వాల్మీకిరామాయణమునఁ గలదు. ఈయర్థమునందే "కృష్ణేర్పితాత్మ సుహృద్దర్థ కళత్రకామా" యని కృష్ణ సఖులవిషయమునఁ జెప్పఁబడియె. (కృష్ణలీల పుట ౧౧౬ పంక్తి ౭౮.) ఇట్లు చెప్పుటచేఁ దమ భార్యలను మిత్రులప్రక్కలోఁ బండఁబెట్టుమని యర్థముకాదు. ఇది యభేదబుద్ధిని దెలుపును.

మైత్రి విషయమునఁ గర్ణుని శ్లాఘించి యిప్పుడు కొందఱు వ్రాయుచున్నారుగదా. అట్టి కర్ణ దుర్యోధన మైత్రికిని గృష్ణపాండవ మైత్రికినిగల తారతమ్యము చూతము. పాండవుల నవమానపఱుప నుద్దేశించిపోయిన ఘోషయాత్రయందు దుర్యోధనుని శత్రువులకప్పగించి వింటిని జంకకుఁ దగిలించుకొని కర్ణుఁడు తన మహాబలము పరువెత్తుటయందు సహాయపడఁ దనప్రాణము రక్షించుకొనినఁ జాలునని పిక్కబలముకోలఁది పరువెత్తెను. వీనిచర్య సంస్కృత భారతంబున నిట్లు చెప్పఁబడినది.

శ్లో॥ తతో రథా దవప్లుత్య, సూతపుత్రోఽపిచర్మభృత్
అంసావలంబిత ధను, ర్ధావమానో మహాబలః
వికర్ణ రథమాస్థాయ, మోక్షాయాశ్వా నచోదయత్॥

కర్ణునకు దుర్యోధనుతో మైత్రిచేయుటలో స్వలాభాపేక్ష గలదు. మైత్రి కది లక్షణముగాదు. అర్జునుఁడు శూరాగ్రేసరుఁడని

ప్రఖ్యాతిగాంచెను గావున నాయునతో సమానముగఁ బోరి జయించి కీర్తిని సంపాదింపవలయునను నుద్దేశ మతనికిఁ గలదు. అర్జునునకంటెఁ దాను బలవంతుఁడగుట నిశ్చయమేని యిది దోషము గాదుగాని యర్జునుని దాను జయించుట సందిగ్ధ మన నేల యసాధ్యమని యతఁడే యెఱుఁగునని యతఁడు కృష్ణునితో

శ్లో॥ యదా ద్రక్ష్యసి మాం కృష్ణ! నిహతం సవ్యసాచినా
పునశ్చితి స్తదాచాస్య, యజ్ఞస్యాథ భవిష్యతి॥కృ లీ సం-౨.318.

యని స్పష్టముగఁ జెప్పెను. అంతియగాక తనకు మృత్యురూపమగు బ్రాహ్మణశాపము ప్రాణావసానవేళ నస్త్రవైకల్యముగలవని యెఱుఁగును. దుర్యోధనుని నమ్మించుటకై తనకస్త్రవైకల్యము లేదనికర్ణుఁడు బొంకెను తనకు జయము సందిగ్ధమనియైనఁ దోఁచియుండునుగదా. ఇట్టిసందర్భములోఁ దాను జచ్చినఁ దన మిత్రునిగతి యేమియని యతఁడాలోచించినవాఁడేకాఁడు. తన ప్రతిష్ఠమాత్రము చూచుకొనెను. కృష్ణుఁడో స్వలాభదృష్టి కొంచెమైనలేక తా నపకీర్తిపాలైనను దన నియమమునకు హానికలిగినను మిత్రకార్యము నెఱవేర్చును. 'ఉపకారఫలంమిత్ర'' మ్మను శ్రీరాములవాక్యము స్మరించి నూతనలీలఁ బఠించినచో శ్రీకృష్ణుఁడు మిత్రధర్మమెట్లు నిర్వహించెనో కనసగు. 'మమ ప్రాణాహి పాండవా' యన్నట్లు తన ప్రాణముఁ దానెట్లు కాపాడుకొనునో యట్లుగదా కృష్ణుఁడు పాండవుల రక్షించెను. కృష్ణు విషయమున నర్జునుఁ డెట్లుచెప్పెనో కనుఁడు.

క. మనరసాథి మనసచివుఁడు
మనవియ్యము మనసఖుండు మనబాంధవుఁడున్
మనవిభుఁడుం గురుఁడు దేవర
మనలను విడనాడి చనియె మనుజాధీశా.

సీ. చెలికాఁడ రమ్మని చీరు నన్నొకవేళ
మన్నించు నొకవేళ మఱఁది యనుచు
బంధుభావంబునఁ బాటించు నొకవేళ
దాతయై యొకవేళ ధనము లిచ్చు

మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు
బోధియై యొకవేళ బుద్ధిసెప్పు
సారథ్య మొనరించుఁ జనవిచ్చి యొకవేళఁ
గ్రీడించు నొకవేళ గెలిసేయు.

గీ. నొక్క-శయ్యాసనంబున నుండుఁ, గన్న
తండ్రి కై వడిఁ జేసితప్పు గాచు
హస్తములుపట్టి పొత్తున నారగించు
మనుజవల్లభ! మాధవు మఱపురాదు.

ఒక ప్రభువు, సమానరహితుఁడు నగువాఁడు తనకంటె నికృష్టుఁడగు వానికి బండితోలుట కొప్పుకొనుట యన నెట్టిదో, యీ కార్యముచేయుట కెంతటి ప్రీతివలన నెంత యహంకారమును జంపియుండవలెనో యాలోచింపుఁడు. శల్యుఁడు కర్ణసారథ్యమున కంగీకరించినప్పుడు జరిగిన వృత్తాంతము స్మరించితిరేని కృష్ణుని యౌత్కృష్ట్యము స్పష్టమగును.

గొప్పగుణముగలిగి, జిడ్డువలెనంటుకొని ప్రేమించి రక్షించువాఁడని మిత్రశబ్దమునకు వ్యుత్పత్త్యర్థము. గుణమహిమ గలవానికిగాని యితరులరక్షింప బుద్ధిపుట్టదు. ఒకవేళ బుద్ధిపుట్టినను రక్షించుశక్తి యుండదు. మిత్రుఁడు జిడ్డువంటివాఁడై యుండవలయును. అనఁగా నీళ్లు దేహమునకుఁ దగిలినయెడ మనము తుడుచుకొనక పోయినను నవి యెండిపోవును. జిడ్డావిధముగఁ బోదు. ప్రయత్నపూర్వకముగ సీకాయవేసి నీళ్లుపోసి రుద్దినఁగాని పోదు. అట్టులే యింక నీస్నేహము నాకుఁ బనిలేదని మనమై వదలుకొనువఱకుఁ గష్టములందును సుఖములందును మైత్రి దానుగ నది వదలిపోకయే యుండును. ప్రేమయుండవలయును. ఇట్టివాఁడు మిత్రుఁడు. *ఇట్టివాఁడు తా నిచ్చును,

---

* శ్లో॥ దదాతి ప్రతిగృహ్ణాతి, గుహ్య మాఖ్యాతి పృచ్ఛతి
భుంక్తే భోజయతే చైవ, షడ్విధం మిత్రలక్షణమ్॥
కరావివ శరీరస్య, నేత్రయో రివపక్ష్మణీ
అవిచార్య ప్రియంకుర్యాత్, తన్మిత్రం మిత్రముచ్యతే॥

బుచ్చుకొనును. తనరహస్యము చెప్పును. అడుగును. భుజించును. భోజనము పెట్టును. దేహమునకుఁ జేతులెట్లు రక్షణపోషణములందుఁ బనిచేయునో కంటిని ఱెప్పలెట్లు రక్షించునో యట్లు వర్తించును. మిత్రరక్షణమువకై యీపని చేయవచ్చును ఈపని చేయరాదను విచారముంచుకొనఁడు. మిత్రరక్షణము ప్రధానముగాని యుపాయము ప్రధానముగాదు. చేయరాని పనియైనను జేసి మిత్రుని రక్షించును. తన ప్రాణములకంటె నెక్కువగఁ జూచుకొనును. అనఁగాఁ దన ప్రాణరక్షణమునకై తాను జేయనొల్లని కార్యములు కూడ మిత్రుని రక్షించుటకై చేయును ద్రోహమెంచఁడు పనిపడినప్పుడు నెపము పెట్టి ముఖము తప్పింపఁడు. పాపములనుండి తొలఁగించును. హితము చేయును. ఆపత్కాలమందు వదలిపోఁడు. రహస్యములు దాఁచును. గుణములను బ్రకటించును. తనకార్యము వదలియైన మిత్రకార్యము సమకూర్చును. ఇవి మిత్రుని లక్షణములు. కావున నిజమైన మిత్రుఁడు దుర్లభుఁడు.

మిత్రులైన పాండవులను రక్షించుటయం దీ గుణముఁను గృష్ణుఁడు కనఁబఱిచెనో లేదో యాలోచింపుఁడు. కుమ్మరియింటఁ దొలుతఁ జూచినది మొదలు తన నిర్యాణమువఱకుఁ బాండవులఁ జేపీడినవాఁడు కాఁడు గదా. దూరంబుననుండియు ద్రౌపదీ వస్త్రాప హరణ కాలంబునను, దుర్వాసుఁడు సశిష్యుఁడై యతిగా వచ్చిన కాలంబునను రక్షించెఁ గదా. ఇంతయేల సూతలీల యంతయుఁ గృష్ణమైత్రినే కదా ప్రకటించును. భగదత్తుని వైష్ణవాస్త్రమునకుఁ

---

మిత్రమాపత్సు జానీయాత్
ప్రాణైరపి హితావృత్తి రద్రోహో వ్యాజవర్జనమ్॥
ఆత్మనీవప్రియాధాన మేతన్మైత్రీ మహావ్రతమ్॥
పాపాన్నివారయతి యోజయతేహితాయ
గుహ్యాని గూహతి గుణాన్ ప్రకటీకరోతి
ఆపద్గతంచ నజహాతి దదాతికాలే
సన్మిత్రలక్షణ మిదం ప్రవదంతి సంతః
అకార్యకార్యకర్తా య స్త్వనాది ష్టోన్యసౌ సుహృత్॥

డా నష్టపడియెను. కర్ణుని నాగాస్త్రమునుండి దప్పించెను. సైంధవవధ నాఁ డర్జునుని గాపాడెను కృష్ణుని మానవత్వము నంగీకరించి భావించి నను ధర్మరాజుచే నసత్యమాడించుటయు సైంధవవధనాఁడు యోగశక్తి సూర్యబింబమును మఱుఁగుపఱుచుటయు మిత్రకార్యమునకు విరోధములని మీఁద వివరించిన మిత్రలక్షణముల మనసున నుంచుకొనువా రనఁజాలరు. కృష్ణుఁడు యోగశక్తి నర్జునురక్షింపఁ డయ్యెనేని పర్యవసాన మెట్లుండునో చూడుఁడు. అర్జును మరణము. పాండవుల మరణము. పాండవపక్షము వారి మరణము. దౌష్ట్యవిజృంభణము. దుర్యోధనునకు రాజ్యప్రాప్తి. అధర్మసంస్థాపనము. ధర్మనాశము. ఇట్టికార్యము చేయుటకా కృష్ణుఁడు పుట్టె ది? కృష్ణుఁ డవతారమూర్తియను తలంపుటుండనిండు. మనుష్యుఁడనే భావింతము. తాను రక్షింప శక్తుఁడయ్యును రక్షింపక యిట్టి పర్యవసానము గలిగించుట మిత్రలక్షణమా! సమర్థుఁడయ్యు నాపద వేళ రక్షింపనివాఁడు మిత్రుఁడా!

ధర్మరాజుచే నసత్యమాడించెనను విషయము చూతము. ఆ నాఁడు ద్రోణుఁడు క్షత్రియకులమునంతయు ధ్వంసము చేయవలయు నని పూని బ్రహ్మాస్త్రాదివ్యాస్త్రములచే నస్త్రవిద్య తెలియనివారిని వేల కొలఁది వధించుచుండెను. బ్రాహ్మణుఁడుగాఁబుట్టి నీ విట్టి ఘోరకార్యము చేయరాదు. అస్త్రశస్త్రము లావలఁ బాఱవైవుమని భరద్వాజాది మహర్షులు మింటనుండి బోధించిరి. అప్పటికిని ద్రోణుఁడు మారణకర్మము మానినవాఁడు కాఁడు. ఈయన యిట్లింక నర్ధదినము యుద్ధముచేసినఁ బాండవసేనలో నొక్కఁడైన దక్కఁడు. అశ్వత్థామ చచ్చినాఁడని వినినా యీయన యుద్ధముచాలించునని కృష్ణుఁ డర్జునునితో జెప్పెను. ఈయాలోచనకు ధర్మరాజార్జునులంగీకరించినవారు గారు. ఈమాటలు వినుచుండిన భీముఁడు వెంటనేపోయి మాలవ దేశాధీశుఁడైన యింద్రవర్మ యేనుఁగశ్వత్థామయను పేరుగలదానిని వధించి ద్రోణునకు వినవచ్చున ట్లశ్వత్థామ చచ్చెనని బిగ్గ యఱచెను. ఆమాట విశ్వసింపక ద్రోణుఁడు ధర్మరాజునుజూచి తనకొడుకు చచ్చెనా బ్రతికియున్నాఁడా యని యడిగెను. అప్పుడు భూమిని

నిష్పాండవము చేయు తలంపుగలవాఁడు ద్రోణుఁడని యెఱిఁగి కృష్ణుఁడు ధర్మరాజుతో నీయన యింక నర్ధదినము యుద్ధము చేసెనా నీ సేనయం దొక్కఁడును జీవింపఁడు. ద్రోణువలన మమ్మందఱ రక్షింపుటకై నీవు సత్యము చెప్పుటకంటె నసత్యము చెప్పుటే మేలు. ప్రాణరక్షణార్థము బొంకినఁ బాపము రాదని* చెప్పెను. దీని ననుసరించియే భీముఁడు తాను జేసిన కార్యమును జెప్పి బొంకుటే మేలని చెప్పెను. ఆమాటలువిని కృష్ణవాక్యచోదితుఁడై యది భవితవ్యముగుట యసత్యభయమగ్నుఁడయ్యు జయకాంక్షచే• నశ్వత్థామ చచ్చెనని గట్టిగఁ జెప్పి యేనుఁగని మెల్లగఁ జెప్పెను. అప్పటికి నాయన యుద్ధము చాలించినవాఁడు కాఁడు. ఆయనగతి యెట్లైననగుఁ గాక, ఇందుఁ గృష్ణుని దోషమేమి గలదు? పాంచాలురకు సృంజయులకును ద్రోణునకును దీర్ఘకాలవిరోధము గలదు. న్యాయమార్గముననో యన్యాయమార్గముననో వారి నందఱఁ బాండవులతోడ ధ్వంసముచేయ నాయన పూనెను. ఆయన నెదిరింప శక్తిగలవాఁడు పాండవులం దొక్కఁడును లేడు. ఇది యెఱిఁగి కృష్ణుఁడు ధర్మరాజా! యీయన యింక యుద్ధము చేసెనా మీరు లేరు మీకు రాజ్యము లేదు. ఇందఱు బ్రతుకవలయునని యుండెనా యసత్యము చెప్పుము. ప్రాణాపదవేళ నసత్యభాషణము దోషావహము గాదు. ఇందఱు బ్రతుకుకోరిక లేదాయెనా సత్యము చెప్పుమనెను. అప్పుడు ధర్మరాజునకు సత్యకాంక్షకంటె రాజ్యకాంక్ష మెండై యుండుట నసత్యమాడెను.

---

* తతో నిష్పాండవా ముర్వీం, కరిష్యంతం యుధాపతిమ్
ద్రోణంజ్ఞాత్వా ధర్మరాజం, గోవిందో వ్యథితో బ్రవీత్॥
యద్యర్ధ దివసం ద్రోణో యుధ్యతే మన్యుమాస్థితః
సత్యం బ్రవీమి తే సేనా, వినాశం సముపైష్యతి॥
సభవాన్ స్త్రాయతునో ద్రోణాత్ సత్యాత్ జ్యాయోఽనృతంవచః
అనృతం జీవితస్యార్థే వదన్నస్పృశ్యతే నృపైః॥

• తస్యతద్వచనం శ్రుత్వా కృష్ణవాక్యాత్ ప్రచోదితః
భవిత్వాచ్చ మహారాజ, వక్తుం సముపచక్రమే॥

అసత్యమాడనని చెప్పినఁ గృష్ణుఁడు ధర్మరాజును దండించునా? "భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబునిచ్చు", "ప్రాణాతురుఁడైనచోఁ బరిణయంబులపట్లను బలుకఁ బొంకు సత్యాతిశయంబ యండ్రు" "జీవన్ భద్రాణిపశ్యతి" ఇట్టి శాస్త్రవాక్యములు ప్రమాణములుగఁ గృష్ణుఁడు చెప్పెను. 'తస్మాత్ శాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ" యని శాస్త్రమును బ్రమాణముగఁగొని హితముపదేశించెను. దేవుఁడనుభావనఁ జూచినను మనుష్యభావనచేఁ జూచినను గృష్ణునియందు దోషములేదు. ఏదిసత్య మేది యసత్య మనునది ధర్మరాజు నర్జునుఁడు చంపఁబూనిన సమయమునఁ గృష్ణుఁడు వివరించెను. (కృష్ణలీల ౨-సం. పుట. ౪౪౭ చూడుఁడు.)

అట్లైనచో ధర్మరాజున కసత్యఫలము రాలేదా? నేలయంటక తిరుగు రథము గుఱ్ఱములు నేలఁబడియెఁగదా? యందు రేని సత్యము. ధర్మరాజు కేవల మందఱ ప్రాణములు రక్షింపవలయునను నుద్దేశముతోనే బొంకినవాఁడుకాఁడు. ఆయన రాజ్యకాంక్షచే బొంకెనని వ్యాసులు చెప్పెను. ప్రాణరక్షణార్థమని యెంచక జయార్థమని ధర్మరాజుఁడెంచుట యాయనదోషమా కృష్ణునిదోషమా? జనప్రాణరక్షణార్థమని సంకల్పించి బొంకియుండిన ధర్మరాజురథము నేల గ్రుంగియుండదు. ఆత్మలాభార్థముగాక పరప్రాణరక్షణార్థ మేమిచేసినను దోషముగాదు. మిత్రుఁడు చెప్పవలసినహితము కృష్ణుఁడు చెప్పెనుగావున దోషిగాఁడు. ధర్మరా జసత్యమాడకుండిన పర్యవసాన మేమైయుండునో యాలోచింపుఁడు.

కర్ణపరాజితుఁడైన ధర్మరాజర్జునుదూషించిననాఁడు కృష్ణునిచర్య యత్యంత శ్లాఘ్యము. విషమసంకటమునుండి ధర్మజార్జునులనేకాక లోకమునే యుద్ధరించెనని చెప్పవలయును. ఇందు సత్యాసత్యవిచారము చక్కఁగఁ జర్చింపఁబడినది. ఎంతటిమహావిపత్తు నెంత తేలికగఁ బోఁజేసెనో యాయన బుద్ధిపాటవము గనుఁడు. ఆయన యట్లుచేయకుండిన ననర్థసంస్థాపనమే కదా యయియుండును. స్వలాభపరత లేక మిత్రకార్యము నిర్వహించురీతిని గృష్ణచర్యవలన మనము నేర్చుకొన

వలయును. కృష్ణుఁ డెన్నివిధముల మిత్రులకుఁ దోడుపడెనో వివరముగఁ దెలియఁగోరువారు పోతనరత్నములు పుటలు ౧౨౧ మొదలు ౧౨౬ వఱకుఁ బఠింపుఁడు. దుర్యోధన వధానంతరము శిబిరములఁ దక్కిన వారితోపాటు పాండవులుండిన నేమైయుండురు? రథముగాలినప్పుడు పార్థుఁడు, గాంధారికోపానలమున ధర్మరాజు, ధృతరాష్ట్రబాహువులఁ జిక్కి భీముఁడు నేమైయుండురో యోజింపుఁడు.

## గార్హస్థ్యము.

కృష్ణుఁడు తక్కిన ధర్మముల నేలోపమును లేక యెట్లు నిర్వహించెనో గృహస్థధర్మమట్టులే నిర్వహించె. భార్యలవిషయమున నెట్లువర్తించెనో కృష్ణలీల సం ౩. పుట ౯౬ చూడుఁడు. అతిథుల నభ్యాగతుల నెట్లాదరించెనో సం-౨. పుటలు ౨౭-౨-౨౬-౩. చూడుఁడు.

## శాత్రవము.

కృష్ణుఁ డాత్మస్వజన, ధర్మసంరక్షణార్థము పెక్కుర వధించినను, నా వధకుఁ గామక్రోధములు కారణములుగావు. అవశ్యకర్తవ్యము లగుటచేఁ జేయవలసి చేసెను. కంసవధానంతర పరితాపము రాజుల విడుపుమని జరాసంధునకు నొనర్చిన హితబోధములో నైనవి యాయన యుదారస్వభావము హృదయసారళ్యము ప్రకటించుచున్నవి. క్రౌర్యమేనాఁడును లేదు. సులభోపాయమున శత్రువధమగునట్లుండినఁ గత్తి దూయఁడు.

## దౌత్యము.

అది యేమిపాపమో లేక యాయనపుట్టిన లగ్నబలమో కాని శ్రీకృష్ణుఁడెంత నిర్వంచనముగఁ బరోపకారంబుగఁ 'గర్మణ్యేవాధికారస్తు మాఫలేషుకదాచన' యనుమాట తప్పకవర్తించినను నిందలు తప్పినవికావు. శ్రీకృష్ణుఁడు రాయబారమున నిండుమనస్సుతో వర్తింపలేదనియు సర్వశక్తిమంతుఁడు కావున నాయన సంధియే కుదురవలయునని కోరియుండినఁ గుదిరియే యుండుననియుఁ జెప్పెడివారలలో గాంధారి మొదటిది. ఉదంకుఁడు రెండవవాఁడు. జనమేజయుఁడు మూఁడవవాఁడు. ఇంకఁ దక్కినవారిమాట ననుకోనేల? పరోక్షమున

నుండువారగుట తక్కినవారిమాట కేమిగాని యెదురుగానుండిన గాంధారి కృష్ణుని దూషించుటే చిత్రము. పుత్రశోకాతురయగుట నామెకు మతితప్పెనేమో లేక యామె మగఁడు తన్నుఁ గొట్టిన బావగారి ముక్కుకోసికిన యిల్లాలివంటిదో.

శ్లో॥ తతఃకోపపరీతాంగీ, పుత్రశోక పరిప్లుతా
జగాద శౌరిం దోషేణ, గాంధారీ వ్యధితేంద్రియా॥
పాండవా ధార్తరాష్ట్రాశ్చ, క్రుద్ధాఃకృష్ణ! పరస్పరమ్
ఉపేక్షితా వినశ్యంత, స్త్వయా కస్మాజ్జనార్దన!
శక్తేన బహుభృత్యేన, విపులే తిష్ఠతాబలే
ఉభయత్రసమర్థేన, శ్రుతవాక్యేన చైవహి॥
ఇచ్ఛతోపేక్షితోనాశః, కురూణాం మధుసూదన
యస్మాత్త్వయా మహాబాహో, ఫలం తస్మాదవాప్నుహి॥
కృ. లీ. సం. ౨. ౪౭౩.

అని గాంధారి కృష్ణుని శపించెను.

కౌరవసభలో నాయన యిచ్చిన యుపన్యాస మద్భుతమైనదని విజ్ఞులందఱు పొగడుచున్నారు. ఆ యుపన్యాసము రాజనీతిజ్ఞులు కార్యనిర్వాహకులు రాయబారులు కంఠస్థము చేయఁదగినది. ఎట్లుపక్రమించెనో యెట్లుపసంహరించెనో చూడుఁడు. కృ. లీ. సం ౨. పుట ౨౮౫). ఇట్టినింద తనకు వచ్చుననియే తలఁచి దానిని బాపుకొనుటకై నిర్వంచముగఁ బ్రవర్తించెదనని శ్రీకృష్ణుఁడు విదురునితోఁ జెప్పెను. అట్లు వర్తించియు నింద తప్పినదిగాదు. తొలుత సామమార్గమున బోధించెను. అది వ్యర్థమగుటచూచి, యంతయు మీరే తీసికొని మైదుగురికి నైదూళ్లయిన నిమ్మనెను. దానికిఁ గౌరవు లంగీకరించినవారు గారు. దుర్యోధనుఁడు వాఁడి సూదిమొనమోపినంత భూమినైన నీయననెను. ధృతరాష్ట్రుఁడు నేను స్వతంత్రుఁడఁ గానని దొంగమాటలు పలికెను. రాజు తానేకదా. తానిచ్చిన దుర్యోధనుఁ డేమిచేయఁగలఁడు? భీష్మద్రోణ కృపాశ్వత్థామ బాహ్లిక శల్యాదులనేకులు మధ్యస్థులుగానున్నవా రప్పుడు దుర్యోధనుపక్ష మవలం

బించి యుండరుగదా. వారందఱు తోలఁగిన దుష్టచతుష్టయమేమి చేయఁగలదు? ధృతరాష్ట్రుఁడు తాను స్వతంత్రుఁడఁగానను సరిగా దని కృష్ణుఁ డాక్షేపించెఁగదా. ఇప్పుడు కృష్ణుని దూషించిన గాంధారియే ధృతరాష్ట్రునితో నీ వెవ్వరి కేమియిచ్చిన నడ్డమువచ్చువా రెవ్వరని చెప్పెఁగదా. ఈవంశమునకు దుర్యోధనుఁడనువాఁ డెవ్వఁడని విదురుఁ డడిగెఁగదా. ధృతరాష్ట్రుఁడు పెనులోభి. తన కొడుకులు జయింతురను నాశకలవాఁడు. కావున సంధి కుదరకుండఁ జేసెను. కృష్ణునకు లంచమిచ్చి వశపఱచుకొనఁ దలఁచిన మహానుభావుఁడుకదా ధృతరాష్ట్రుఁడు. సామదానములు వ్యర్థములుకాఁగా భేదోపాయ మాలోచించి కృష్ణుఁడు కర్ణునిఁ దొలఁగఁదీయఁజూచెను. ఇఁక మిగిలినది దండోపాయమేకదా? గాంధారి మోపిన నేరము దూతవ్యమునుమనస్సుతోఁ జేసినాఁడని కాదు. అపారబలసంపన్నుఁడు గనుక బలాత్కారముగనైన యుద్ధము లేకుండఁ జేయక యుపేక్షించినాఁడనియే. యుద్ధము లేకుండఁ జేయుటకు దుర్యోధనవధ తప్ప వేఱుపాయము లేదు. అదియును గృష్ణుఁడు సూచించెఁగదా. ఆపని చేయ నర్హులెవ్వరు? దానికి ధృతరాష్ట్రుఁ డధికారిగాని కృష్ణుఁడు కాఁడు. [illegible]టుంబకలహములోఁ దాను బ్రవేశించి దుర్యోధను హింసించియుం[illegible]న లోక మేమనును? దుర్యోధనుఁడు కృష్ణునకుఁ జేసిన యపకారమేమి హింసించుటకు? ధృతరాష్ట్రుఁడు పాండవుల భాగము వారి [illegible]చ్చితినని చెప్పియుండిన దానికి దుర్యోధనుఁ డడ్డమువచ్చియుండిన యెడల రాజశాసనము మీఱినవాఁడని భీష్మాదులే శాసించియుందురు. [illegible]ట్టి సందర్భము లేదాయె. కృష్ణుఁడు తాను బలవంతుఁడనని దేశములో [illegible]ందు నందఱను శిక్షింపవలయునా?

రాయబారము పొమ్మని ధర్మరాజు చెప్పినప్పుడే కృష్ణుఁ డిది [illegible]ర్థ కార్యము సంధిపొసఁగదని చెప్పెను. ముందుగ నీ మాట చెప్పుట [illegible]కతఁ గృష్ణునకు సంధి యిష్టము లేదని కొందఱందురు. ఇదియును సరి[illegible]ాదు. బుద్ధిలేనివా రూహింపలేరు గాని దూరదృష్టిగల మేధావులు [illegible]ాలకర్మగతులఁబట్టియు మనుష్యుల స్వభావముఁబట్టియుఁ గాఁగలకా

ర్యములు మూఁడుముందుగఁ జెప్పుదురు. ఆమాత్రముచేతనే యిష్టానిష్టములు చెప్పవచ్చునా? సంధి పొసంగదని విదురుఁ డేల చెప్పెను? కావునఁ గృష్ణుఁడు కాయబారమున నిర్వంచనముగ మనుష్యుం డెట్లు వర్తింపవలయునో యట్లు వర్తించెను.

### యోగేశ్వరుఁడు.

కృష్ణుఁడు యోగీశ్వరుఁడని యోగేశ్వరుఁడని యోగమాయ నాశ్రయించెనని పెక్కుస్థలములఁ జెప్పఁబడెను.

### యోగమనఁగా నేమి?

౧. చిత్తవృత్తినిరోధము. ౨. ఉపాయము.* మొదటిది పాతంజల యోగశాస్త్రమునఁ జెప్పఁబడినది. దీనినే యష్టాంగ యోగమందురు. యమ, నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణాధ్యాన సమాధు లష్టాంగములు. ఈయోగము పరమోద్దేశము ముక్తియే. ౨. ఉపాయమను నర్థమున యోగశబ్దము కర్మజ్ఞాన భక్త్యాదులకుఁ జేర్పఁబడును. కర్మయోగము జ్ఞానయోగము భక్తియోగ మిత్యాదులు. వీని యుద్దేశము ముక్తియే. ఈయుపాయములు భగవద్గీత యందుఁ జెప్పఁబడినవి. ఈ రెంటివలనఁ గలుగు ఫలములందుఁ గించిద్భేదమున్నను రెండును కేవలభిన్నములు గావు. పరస్పరోపకారకములు.

అష్టాంగయోగసిద్ధివలనఁ గలుగు సిద్ధులు పతంజలి యిట్లు పేర్కొని యున్నవాఁడు.

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహ మను నివి యమములు. వీనిని సాధించుటచేఁ గలుగు లాభము మాత్రమే యిచట వివరింపఁబడును. ♦

---

* యోగస్సన్నహనే, ధ్యానే, యుక్తౌ, సంగత్యు పాయయోః॥ నా. ర.

♦ అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః ౨-౩౫.
సత్య ప్రతిష్ఠాయాం క్రియా ఫలాశ్రయత్వమ్॥ ౨౩-౬.
అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వ రత్నోపస్థానమ్ ౨-౩౭.
బ్రహ్మచర్యా ప్రతిష్ఠాయాం వీర్యలాభః ౨-౩౮.
అపరిగ్రహ స్థైర్యే జన్మకథంతా సంబోధః ౨-౩౯.

అహింస దృఢపడిన వానియెదుట సహజవిరోధులైన ముంగిస పాములు, పిల్లియెలుకలు, పులులావులు లోనగునవికూడ విరోధము మాని యన్యోన్యమైత్రిని సంచరించుచుండును.

సత్యము ప్రతిష్ఠితమైనచో నమోఘవాక్కగును. శాపానుగ్రహ సమర్థుఁడగును. 'సత్యేనలోకాఞ్జయతి' యని వీఁ డన్నిలోకముల జయించును. ఒకనిని స్వర్గమునకు నీవు పొమ్మనినచో వాఁడు స్వర్గమునకుఁ బోక తప్పదు.

అస్తేయము ప్రతిష్ఠితమైన సర్వశ్రేష్ఠ పదార్థములు లభించును.

బ్రహ్మచర్యమువలన వీర్యలాభము అణిమాదిసిద్ధులు లభించును. వీఁడు కృష్ణ భీష్ములవలె జ్ఞానోపదేశము చేయ నర్హుఁడు,

అపరిగ్రహమువలనఁ ద్రికాలజ్ఞానము కలుగును.

శౌచము, సంతోషము, తపము, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానమును నివి నియమములు.*

శౌచము ప్రతిష్ఠితమైనఁ దన దేహముమీఁద జుగుప్సయు నితరులతోఁగలసి యుండవలయుననిన నసహ్యము తోఁచును. సంతోషమువలన నుత్తమ సుఖలాభము కలుగును. ఈలోకమందలి కామ సుఖముల వలనను, స్వర్గలోకమున దివ్యభోగముల వలనను గలుగు సంతోష మీ సంతోషములో నొక కళకును సరిగాదు.

తపస్సువలనఁ గాయేంద్రియసిద్ధియు నశుద్ధిక్షయములు కలుగు. కాయసిద్ధియనఁగా నణిమాదిసిద్ధి. ఇంద్రియసిద్ధియనఁగా దూరశ్రవణము పరచిత్తజ్ఞానము లోనగునవి.

స్వాధ్యాయమువలన నిష్టదేవత ప్రత్యక్షమై కార్యములందుఁ

* శౌచాత్ స్వాంగజుగుప్సా పరైరసంసర్గః ౨-౪౦.
సత్త్వశుద్ధి సౌమనస్యైకాగ్రతేంద్రియజయాత్మదర్శనయోగ్యత్వాని ౨-౪౧.
సంతోషా దనుత్తమః సుఖలాభః ౨-౪౨.
కాయేంద్రియ సిద్ధి రశుద్ధి క్షయా త్తపః ౨-౪౩.
స్వాధ్యాయా దిష్టదేవతా సంప్రయోగః ౨-౪౪.
సమాధిసిద్ధి రీశ్వర ప్రణిధానాత్.

దోడుపడును, ఈశ్వర ప్రణిధానమువలన సమాధిసిద్ధి. దీనివలన సర్వే ప్సితములు ఫలవంతములగును. దేశాంతర దేహాంతర కాలాంతరము లందు జరగునవి తెలియును. అప్పుడు సర్వ మున్నదున్నట్లు గోచ రించును.

*పరిణామత్రయముమీఁద సంయమము చేసిన భూత భవిష్య జ్ఞానము. దీనిని బట్టియే నందునకు వసుదేవుఁడు వ్రేపల్లె యందలి వృత్తాంతము చెప్పఁగలిగెను.

శబ్దార్థభావముల మీఁద వేఱు వేఱుగ సంయమము చేసిన సమస్త జంతు భాషాజ్ఞానము కలుగును. కైకేయి తండ్రి యిట్టి శక్తి గలవాఁడు.

సంస్కారములు సాక్షాత్కరించిన పూర్వజన్మజ్ఞానము కలుగును.

నా పూర్వజన్మముల జ్ఞానము నాకుఁ గలదు. నీకు లేదని కృష్ణు డర్జునితోఁ జెప్పెనుగదా. దేవకీ వసుదేవు లెవ్వరో కృష్ణుఁడు చెప్పెఁ గదా.

ప్రత్యయముల మీఁద సంయమము చేసిన నితరుల మనస్సులు తెలియును. గోపకన్యకల చిత్తవృత్తి కృష్ణుఁ డెఱుంగుట యీశక్తి వలననే.

దేహరూపముల సంయమము చేసిన యోగి యెంచున నుండినను

* పరిణామత్రయసంయమా దతీతానాగత జ్ఞానమ్ ౩-౧౬.
శబ్దార్థప్రత్యయానా మితరేతరా ధ్యాసాత్సంకర స్తత్ప్రవిభాగసంయమాత్ సర్వభూత రుతజ్ఞానమ్ ౩-౧౭.
సంస్కార సాక్షాత్కరణాత్ పూర్వజాతి జ్ఞానమ్ ౩-౧౮.
ప్రత్యయస్య పరచిత్తజ్ఞానమ్ ౩-౧౯.
కాయరూప సంయమాత్తద్గ్రాహ్యశక్తిస్తంభే ప్రకాశా సంయోగే రంతర్ధా నమ్ ౩-౨౧.
మైత్ర్యాదిషు బలాని ౩-౨౪. బలేషు హస్తి బలాని ౩-౨౫.
స్థూలస్వరూప సూక్ష్మాన్వయార్థ తత్త్వసంయమాద్భూతజయః ౩-౪౫.
నిర్మాణ చిత్తాన్యస్మితా మాత్రాత్ ౪-౪.
ప్రవృత్తిభేదే ప్రయోజకంచిత్త మేక మనేకేషామ్ ౪-౫.

గానరాఁడు. ఈశక్తివలననే గోపికలు తన్ను వెదకుసమయమున వారితోడనుండియుఁ గృష్ణుఁడు వారికిఁ గానరాకుండెను.

మైత్రికరుణా ముదితలపై సంయమముచేసిన జీవకోటినంతయు సుఖపెట్టుట, భూతకోటిబాధ తొలఁగించుట, యందఱ విషయమున ధర్మమున వర్తించుట యనుబలము కలుగును.

ఏనుఁగు బలముమీఁద సంయమముచేసిన నేనుఁగుబలము లభించును. ఇట్లులే దేనియందు సంయమముచేసిన దాని బలము లభించును.

స్థూలస్వరూప సూక్ష్మాన్వయార్థ తత్త్వములమీఁద సంయమము చేసిన భూతజయము కలుగును. ఈశక్తివలననే కృష్ణుఁడు దావాగ్నిని మ్రింగుట, యింద్రుఁడు కురియించిన వర్షమువలన బాధ లేకుండఁజేయుట లోనగునవి చేసెను.

అస్మితామాత్రముచేతనే యనేక మనస్సులు దేహములు సృష్టింపఁబడును. సృష్టింపఁబడిన మనస్సులు భిన్నముగానున్నను నన్నియుఁ బ్రథమమనస్సునకే లోపడియుండును. సౌబరి కృష్ణులు పెక్కురూపముల ధరించుట యీ శక్తిచేతనే. రాసమండలమునఁ గర్ణికయందు నడుమనున్న కృష్ణుఁడు ప్రథమమూర్తి యనియుఁ, దక్కిన మూర్తులు సృష్టములనియు నెఱుంగవలయును. ఈశక్తిచేతనే భగవంతుఁడు తన మనస్సువలననే ప్రపంచసృష్టి చేయును.*

దీనివలన యోగసిద్ధు లెట్టికార్యమైనఁ జేయఁగలుగుదురని తెలియనయ్యెను. ఇన్ని శక్తులుగల కృష్ణుఁడు యోగీశ్వరుఁ డగుట

---

*On this says the Purana :— The one Lord becomes many by his power of Lordship. For this reason and because having become many he again becomes one, these are certainly born by the differences of the mind, one fold two-fold, three-fold and manifold. The Yogiswara makes his bodies in this way and unmakes them. By some he enjoys objects of enjoyment and by other performs hard penances. He again draws in the bodies as the sun draws his ray. —VACHASPATI GLOSS.

యేమివింత. ఇన్ని సిద్ధులు మోక్షము నొసంగఁజాలవు. ఇవి సంసార కారణములగుఁ గావున వీనిని ముముక్షువులైన యోగులు పరిగ్రహింపరు. ఇన్ని శక్తులుగల యే యోగీశ్వరుఁడైనను యోగేశ్వరుఁడైన కృష్ణునివలె నేను మీకు ముక్తి నిచ్చెదను, మీరు నన్నే పొందుదురు, నాకంటె భిన్నమైనది వేఱులేదు, భూతసృష్టి స్థితి సంహారములకు నేనే కర్త నని యీవిధముగఁ జెప్పఁజాలఁడు. భగవంతునియందు మాత్రమే యీ శక్తి గలదు. కావుననే కృష్ణుఁడు సాక్షాద్భగవంతుఁడు గాని సామాన్య యోగీశ్వరుఁడు కాఁడు.

ఇఁక కృష్ణుఁ డెంతటి కర్మయోగియో చూతము.

మనుష్యులు సుఖదుఃఖము లనుభవించుటకు వారువారు చేసిన పుణ్యకర్మములు పాపకర్మములు కారణము పుణ్యకర్మములు చేసినవారు సుఖమనుభవింతురు. పాపకర్మములు చేసినవారు దుఃఖమనుభవింతురు. పరోపకారము పుణ్యము. పరాపకారము పాపము. కావునఁ బరులకు మేలుచేయఁగోరి కర్మమును జేసినఁ బుణ్యఫలము సుఖము గలుగును. పరులఁ బీడింపఁజేయు కార్యములవలనఁ బాపఫలము దుఃఖము కలుగును. ఈ రెంటియందుఁ గోరిక యనునది సమానము. ఈకోరిక మనోవ్యాపారము. కావున మనస్సే బంధమునకు మోక్షమునకుఁ గారణము. కర్మఫలము కోరికవలనఁ గలుగునపుడు కోరిక యనుదానిని దొలఁగించి కర్మములు చేసినఁ బుణ్యఫలము లేదు పాపఫలము లేదని యనివార్యముగ నేర్పడుచున్నది. కావున విషము కోరికయందున్నది గాని కర్మములందు లేదు. కోరిక విడిచి చేయు పుణ్యకర్మమువలనఁ బుణ్యములేదు. పాప కార్యములవలనఁ బాపము లేదు. ఇంతమేల కోరికలేక చేయుకార్యమునకుఁ గర్మమను పేరే లేదు. కావున నావిధముగఁ గార్యములు చేసియును వాఁడు చేయనివాఁడే. ఇది కర్మయోగ రహస్యము. దీనినే కృష్ణుఁ డర్జునున కుపదేశించెను.*

---

*శ్లో॥ సుఖదుఃఖే సమేకృత్వా, లాభాలాభౌ జయాఽజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ, నైవంపాప మవాప్స్యసి॥ ౨-౩౮.
యోగస్థః కురుకర్మాణి, సంగం త్యక్త్వా ధనంజయ,

'సమత్వం యోగ ఉచ్యతే' యని యుపదేశించిన కృష్ణుఁ డన్నివేళల సుఖములందును దుఃఖములందును సమచిత్తుఁడై యుండెననుట నిర్వివాదవిషయము. గోపికలతోఁ గ్రీడించినపు డూర్ధ్వరేతస్కుఁడై యుండెనుగాని కామదాసుఁడు గాఁడు. కామదాసుఁడైనచో మరల

సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా, సమత్వం యోగ ఉచ్యతే॥ ౨ ౪౮.
యస్త్వింద్రియాణి మనసా, నియమ్యా రభతేర్జున
కర్మేంద్రియైః కర్మయోగ, మసక్తస్సవిశిష్యతే॥ ౩-౭.
తస్మాదసక్తస్సతతం, కార్యం కర్మసమాచార
అసక్తో హ్యాచరన్ కర్మ, పరమాప్నోతి పూరుషః॥ ౩-౧౯.
నమాం కర్మాణి లింపంతి, నమేకర్మ ఫలేస్పృహా
ఇతిమాం యోభి జానాతి, కర్మభి ర్నసబధ్యతే॥ ౪-౧౪.
యస్యసర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం. తమాహుఃపండితంబుధాః॥ ౪-౧౯.
త్యక్త్వాకర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభి ప్రవృత్తోపి, నైవకించిత్కరోతిసః॥ ౪-౨౦.
నిరాశీర్యతచిత్తాత్మా, త్యక్తసర్వపరిగ్రహః
శారీరంకేవలంకర్మ, కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ ౪-౨౧.
యదృచ్ఛాలాభసంతుష్టో, ద్వంద్వాతీతోవిమత్సరః
సమస్సిద్ధావసిద్ధౌచ, కృత్వాపినవిబధ్యతే॥ ౪-౨౨.
గతసంగస్యముక్తస్య, జ్ఞానావస్థితచేతసః
యజ్ఞాయాచరితః కర్మ సమగ్రంప్రవిలీయతే॥ ౪-౨౩.
నైవకించత్కరోమీతి, యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్, నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥
ప్రలపన్ విసృజన్ గృహ్ణ, న్నున్మిష న్నిమిషన్నపి
ఇంద్రియాణీంద్రియార్థేషు, వర్తంత ఇతిధారయన్॥ ౫-౯.
బ్రహ్మణ్యాధాయకర్మాణి, సంగం త్యక్త్వా కరోతియః
లిప్యతె న స పాపేన, పద్మపత్రమివాంభసా। ౫-౧౦
కాయేన మనసాబుద్ధ్యా, కేవలై రింద్రియైరపి
యోగినః కర్మకుర్వంతి, సంగంత్యక్త్వాత్మ శుద్ధయే। ౫-౧౧.

ఈ శ్లోకములందుఁ జెప్పఁబడిన కర్మయోగలక్షణము పూర్ణముగ శ్రీకృష్ణుని యందు లక్ష్యముగఁ గానవగు.

బృందావనముఁ జేరియుండును. గోపికల నట్లు గోడాడించి యుండఁడు. కృత్యమగుటచేఁ గంసవధ సలిపెనుగాని ద్వేషబుద్ధినిగాదు. వానికై దుఃఖించుటయే తెలుపుచున్నది. పరీక్షిత్తును బ్రతికింపఁజేసిన ప్రమాణము చూడుఁడు. బృందావనమందుఁ బొంగినవాఁడు కాఁడు. ప్రవాసమందుఁ గ్రుంగినవాఁడు కాఁడు. ఇంతయేల? యాదవవంశము తన కన్నులప్రోల నిర్మూలమగుచుండఁ గంటఁ దడిపెట్టినవాఁడు కాఁడు కదా. మనస్సునందైన విచారపడినవాఁడు కాఁడుకదా. ఇంతకంటెను గర్మయోగి వేఱెవ్వఁ డుండఁగలఁడు? ఇట్టి జితేంద్రియుఁడు, నిస్సంగుఁడు, సమబుద్ధి యెందఱు స్త్రీలతో భోగించిననేమి, యెన్ని యక్షౌహిణులు వధించిననేమి? లోకోత్తర సౌందర్యముగల యందఱు స్త్రీలు లభించినప్పుడు వారితోఁ గలసిమెలసి తాఁకి ముద్దిడి కౌఁగిలించి యింతచేసియు నూర్ధ్వరేతస్కుఁడై యుండినవాఁడు యోగీశ్వరుఁడు గాకుండిన వేఱొకరుఁ డెవ్వఁడు? నపుంసకుఁడా?

కంసవధానంతరము రాజ్యలక్ష్మి తన్ను వరించియుండ నుగ్రసేనాది యాదవులందఱు సింహాసనమధిరోహింపఁ బ్రార్థింప నొల్లననినవాఁడు యోగీశ్వరుఁడు కాకుండిన నన్యుఁ డెవ్వఁడు?

కంసవధానంతరము మరల బృందావనమునకుఁ దోడుకొనిపోవ వెంటవచ్చిన నందాదుల వాత్సల్యమును, చెలిమికాండ్రగు గోపాలుర చెలిమియును, నన్నిటికిబలిష్ఠమైన ప్రాణప్రియులైన గోపికల స్నేహశృంఖలములనన్నిటిని లక్ష్యముచేయక బృందావనమునకుఁ బోనొల్లని వానికంటె యోగీశ్వరుఁడెవ్వఁడు? తమ్ములు కొడుకులు మనుమలు బాంధవులు నిశ్శేషముగఁ దన కన్నులప్రోల నొకరినొకరు వధించుచుండ బొమ్మలనాడించు సూత్రధారునివలె వేడుకచూచుచుండినవానికంటె యోగీశ్వరుఁడెవ్వఁడు? తన ప్రియురాలిని జిన్నవయస్సుదానిని రుక్మిణిని దుర్వాసుఁడు రథమునకుఁ గట్టితోలుచుఁ జబుకుతో మోఁదినపుడు కోపింపనివానికంటె యోగీశ్వరుఁ డెవ్వఁడు? వీనివలనఁ గామక్రోధములఁ బూర్ణముగఁ గృష్ణుఁడు జయించెనని రూఢిపడెనుగదా.

ఇంతటివాఁడు యోగీశ్వరుఁడేగాక యోగేశ్వరుఁడని చెప్పినఁదప్పేమి? మఱి యొప్పేయగు.

దేశికుఁడు.

శ్రీకృష్ణభగవానుడు లోకమున కేమి యుపదేశించెనో చూతము. ఈయన యుపదేశమంతయుఁ గృష్ణార్జున సంవాదమను భగవద్గీతయందును, గృష్ణోద్ధవ సంవాదమనెడు నుద్ధవగీతయందును గానగు. సూతలీలయందు భగవద్గీత, యోగాచార్యలీలయందు నుద్ధవగీతలును గాననగు. భగవద్గీతయందు ముక్తిసాధనములు ౧ కర్మయోగము, ౨. జ్ఞానయోగము, ౩. భక్తియోగము, ౪. అవతారరహస్యజ్ఞానము, ౫. పురుషోత్తమత్త్వజ్ఞానము, ౬. ప్రపత్తి. యీ యాఱును మోక్షసాధనములని పేర్కొనఁబడెను. ఇందుఁగొందఱు కర్మయోగమునే ప్రశంసించిరి. కొందఱు జ్ఞానమొక్కటే మోక్షసాధనమనిరి. కొందఱు కర్మజ్ఞానభక్తులు మూఁడును స్వతంత్రమోక్షసాధనములనిరి. కొందఱు భక్తియొక్కఁటె మోక్షమనిరి. ఈమూఁడును దుష్కరములు గావునఁ బ్రపత్తియొక్కటే మోక్షసాధనమనిరి. ఈ విషయమున నొక్కొక్కదానినిగుఱించి భగవంతుఁడేమి చెప్పెనో సప్రమాణముగ వివరించి యావల నభ్యాసకునకు నెది యవలంబనీయమో యది తెలుపఁబడెను. శ్రీకృష్ణలీలామృతము వాదగ్రంథముగాదు. వాదులతోడఁ బనిలేదు. వాస్తవముగ నాసక్తిగలిగిన మోక్షకామి యేవిధముగ వర్తించినచో సత్యముగ ముక్తిగలుగునని చెప్పఁబడెనో యది యభ్యసించు టెట్లో యది తెలుపఁబడెను.

కర్మయోగము.

కౌరవులకుఁ బాండవులకు ఘోరయుద్ధము ప్రాప్తించినపుడు కృష్ణుని సారథిగాఁగల యర్జునుఁడు కేల విల్లుగొని బాణముల సంధించి తొలిబలి యెవరిని దీసికొందునా యని యాలోచనఁజేఁగాఁ గృష్ణా! నే నెవరితోడ యుద్ధము చేయవలయునో చక్కఁ జూడవలసి యున్నది. కావున రథమును రెండుసేనలనడుమ నిలుపుమని కోరెను. కృష్ణుఁడు నట్లగావించె. సింహము లేనుఁగుమీఁదికి లంఘించునుగాని

క్షుద్రమృగముల వంకఁబోవు కావునఁ దనకు సమాను లెవ్వరాయని యర్జునుఁడు పాఱఁజూచెను. చూడఁగాఁ దన్ను సాఁకి పెంచి పెద్దచేసి తనక్షేమముగోరు తనతాత భీష్ముఁడు నట్టివారేయగు బాహ్లీకాదులు విద్యాగురువులు ద్రోణకృపులు, గురుపుత్రుఁ డశ్వత్థామ పెద్దతండ్రి కొడుకులు నూరుగురు వారి కుమారులు వీరుగాక బావలు మఱఁదులు లోనగు బంధువులందఱు గానవచ్చిరి. అట్టివారే తన బంధువులు తనకై ప్రాణములిచ్చుటకుఁ దనపక్షమున వచ్చినిలిచి యుండుటయుఁ జూచెను. చూడఁగానే యాహా యేమి ఘోరకార్యమునకుఁ దలపెట్టితిని. అశాశ్వత రాజ్యసంపదకై యిన్ని యక్షౌహిణుల సేనలు సమస్త బంధువులతో హతముచేయవలయునా యిందఱఁజంపి నేనేమి రామరాజ్య మేలవలయునని నిర్వేదము జనింప నేను యుద్ధముచేయనని కృష్ణునితోఁజెప్పి విల్లునమ్ములు రథముమీఁదఁ బడవైచి యూరక కూర్చుండెను. శ్రీకృష్ణభగవానులు పెక్కుకారణములు చెప్పఁగా విని యర్జునుఁడు మరల యుద్ధముచేసెను. ఈయుపదేశ వాక్యములకే భగవద్గీతయని పేరు. ఈ యుపదేశఫలమును బట్టి చూచిన సమష్టిమీఁదఁ బాపకార్యమైనను బుణ్యకార్యమైనను మనుష్యుఁడు స్వధర్మము నిర్వహింపవలసినట్లే యేర్పడుచున్నది. అనఁగాఁ దా నేవర్ణమం దేయాశ్రమమందున్నాఁడో యావర్ణాశ్రమధర్మ మవశ్య కర్తవ్యమని యేర్పడుచున్నదిగాని సన్న్యాసియై పొమ్మని యేర్పడదు. ఇంతకు సన్న్యాసము డెబ్బదియైదు సంవత్సరముల వయస్సు వచ్చినపిమ్మటి వృత్తాంతము. అప్పటికిఁగాని వైరాగ్యము స్థిరపడదు. నిజమైన విరక్తియు సంపూర్ణముగ నింద్రియజయ మీకాలమున దుర్లభము కావున నవి యిప్పుడు నిషేధింపఁబడియె. సమష్టిమీఁదనేగాక వ్యష్టిమీఁదఁ జూచినను సాంఖ్యయోగ మనఁబడు రెండవ యధ్యాయమున "తస్మాద్యుధ్యస్వభారత (౨-౧౮). తస్మాదుత్తిష్ఠకౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః" (౨-౩౭) అనియును, కర్మయోగమును బోధించు మూఁడవ యధ్యాయమున "యుధ్యస్వవిగతజ్వర" (3-30) యనియు, జ్ఞానయోగమును బోధించు నాల్గవ యధ్యాయంబున "కురుకర్మైవతస్మా

త్త్వం పూర్వైః పూర్వతరంకృతమ్" (౪-౧౫) అనియు, విశ్వరూప ప్రదర్శనవేళ ౧౧-వ యధ్యాయమందు "జిత్వాశత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్" "యుధ్యస్వ జేతాసిరణేసపత్నాన్"(౧౧-౩౩-౩౪) అనియు నిట్టి వాక్యములచే గానవచ్చుచున్నవి. అంతియకాక కర్మ మును వదలుట యసాధ్యమనికూడ భగవంతుఁడు చెప్పెను.

శ్లో॥ నియతం కురుకర్మత్వం, కర్మజ్యాయోహ్యకర్మణః
శరీరయాత్రాపిచతే, నప్రసిద్ధ్యేదకర్మణః॥ ౩-౮.
సదృశం చేష్టతేస్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి
ప్రకృతిం యాంతిభూతాని నిగ్రహః కింకరిష్యతి॥ ౩-౩౩.
నహికశ్చిత్ క్షణమపి, జాతుతిష్ఠత్యకర్మకృత్
కార్యతేహ్యవశఃకర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥ ౩-౫.
నహిదేహ భృతాశక్యం, త్యక్తుం కర్మాణ్యశేషతః ౧౮-౧౧.
స్వభావజేన కౌంతేయ, నిబద్ధస్స్వేనకర్మణా
కర్తుంనేచ్ఛసియన్మోహాత్, కరిష్యస్యవశోపితత్॥ ౧౮-౬౦.

ఇది సత్యమేకదా. ఱెప్పలువ్రాల్పక యుండఁగలమా? మనస్సు వ్యాపారము నిలుపఁగలమా? ఆఁకలి కాకుండ నిలుపఁగలమా? గుండెలు కొట్టుకొనకుండ నిలుపఁగలమా? నెత్తురు పాఱకుండ నిలుపఁగలమా? నడవక కూర్చుండక యుండగలమా? గాలిని బీల్పక యుండఁగలమా? ఱెప్పవ్రాల్చినపుడా దెబ్బకు నెన్నో జీవజంతువులు చచ్చునఁట. కుంభకర్ణుని ముక్కులోనికి వానరులవలె మనము శ్వాసము పీల్చినపుడెన్ని జీవజంతువులు మనలోనికిఁ బోవుచున్నవో! కాఁబట్టి కర్మముచేయకుండుట సాధ్యముకాదు. మన ముండవలయు ననుకొనినఁ బ్రకృతి యుండనీయదు. ప్రకృతి నతిక్రమించుశక్తి దేహికి లేదు.

2. వెలుపల నేపనియుఁ జేయనట్లు నలువురికిఁ గానిపించుచు మనస్సులో విషయచింత చేయువాఁడు మిథ్యాచారుఁడు. మూఢుఁడు.

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య, యఆస్తే మనసాస్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా, మిథ్యాచారస్సఉచ్యతే॥

3. కర్మముల వదలినవాఁడు సోమరియగునుగాని జ్ఞానిగాఁడు.

శ్లో॥ నకర్మణా మనారంభా, న్నైష్కర్మ్యం పురుషోశ్నుతే
నచసన్న్యసనా దేవ, సిద్ధిం సమధిగచ్ఛతి॥ ౩-౪.

4. ఏవిధమునఁ జూచినను గర్మము చేయవలసినది విధి. అది తప్పదనియు జ్ఞాననిష్ఠకంటెఁ గర్మయోగమే శ్రేష్ఠమనియు భగవంతుఁడు చెప్పుచున్నాఁడు.

శ్లో॥ స్వధర్మమపిచావేక్ష్య, నవికంపితుమర్హసి॥ ౨-౩౧.
మా తే సంగో స్త్వకర్మణి॥ ౨-౪౭.
నియతం కురు కర్మత్వం, కర్మజ్యాయోహ్యకర్మణః॥ ౩-౮.
ఏవంజ్ఞాత్వాకృతంకర్మ పూర్వైరపి ముముక్షుభిః
కురుకర్మైవతస్మాత్త్వం, పూర్వైః పూర్వతరంకృతమ్ ౪-౧౫.
సన్న్యాసః కర్మయోగాశ్చ, నిశ్శ్రేయసకరావుభౌ
తయోస్తు కర్మసన్న్యాసాత్, కర్మయోగోవిశిష్యతే॥ ౫-౨.
5. జ్ఞాననిష్ఠ కష్టసాధ్యమని యభిప్రాయము.

శ్లో॥ సన్న్యాసస్తు మహాబాహో, దుఃఖమాప్తు మయోగతః
యోగయుక్తో మునిర్బ్రహ్మ, నచిరేణాధిగచ్ఛతి॥ ౫-౬.

6. జ్ఞాననిష్ఠకంటెఁ గర్మనిష్ఠ హీనముకాదు.

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయస కరావుభౌ। ౨-౫.
సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి నపండితాః
ఏకమప్యాస్థితస్సమ్య, గుభయోర్విందతే ఫలం॥ ౫-౪.
యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం, తద్యోగైరపిగమ్యతే
ఏకంసాంఖ్యంచ యోగంచ, యఃపశ్యతిసపశ్యతి ౫-౫.
7. స్వధర్మము దోషయుక్తమైనను వదలరాదు.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మేనిధనంశ్రేయః పరధర్మో భయావహః॥ ౩-౩౫.
శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావనియతంకర్మ, కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ ౧౮-౪౭.

స్వే స్వే కర్మణ్యభిరత, స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరతస్సిద్ధిం, యథావిందతి తచ్ఛృణు॥ ౧౮-౪౫॥

ఇట్లన్ని వర్ణాశ్రమములవారికిఁ గర్మము విధిగ భగవంతుఁడు బోధించెను. అర్జునునకుఁ గలిగిన సంకటదశ ప్రతిమనుష్యునకు నే జన్మమందో యే వయస్సునందో యేకాలమందో యేసందర్భమందో దారపుత్ర వియోగములు ధననష్టి యాధివ్యాధులు మొదలగువాని మూలముననో యతఃకరణశుద్ధిగలవాఁడు శ్వవృత్తిఁ బరాధీనుఁడై సంచరించుచు బలాత్కారంబుగనో యుదరభీతినో యసత్యము లాడ వలసి వచ్చినపుడో యెప్పుడో యొకసారి రాక తప్పదు. కురుక్షేత్రమే సంసారము. నరుఁడే జీవుఁడు. రథమే తేరు. కృష్ణుడే యంతర్యామియై హృదయగుహయందు జీవునితోడనుండు నీశ్వరుఁడు. అర్జునుని నెదిరించిన పదునొకొండక్షౌహిణులే యేకాదశేంద్రియములు. ఇంద్రియజయము కార్యము, ఇది సంసారమందుండి చేయవలయునా? విడిచిపోయి చేయవలయునా? ఏది కర్తవ్యమనునది విచార్యము. సంసారమునుండి నిగ్రహింపవలసినదనియే భగవంతుని యుపదేశము. ఆయన యనుష్ఠించి మార్గదర్శియై బోధించుననదియు నదియే. సంసారమునందుండియే కార్యములు చేయుచుఁ బాపముల పాలుగాక యింద్రియముల జయించి కడతేఱు టెట్లని ప్రశ్న. దానికి భగవంతుఁడు చెప్పిన యుపాయము.

నీవర్ణమునకు నాశ్రమమునకు ధర్మములని చెప్పఁబడిన కర్మములు చేయుము. అవి పుణ్యకర్మములా పాపకర్మములాయని విచారించు నధికారము నీకు లేదు. స్వధర్మము చేయవలసివచ్చినపుడు జంకక చేయవలసినదే విధి. కర్మమందే నీ కధికారము. నీవు చేయునట్టి కార్యములవలనఁ గలుగు ఫలము మంచిదిగాని చెడ్డదిగాని నీవు కోరరాదు. నీవు చేయవలసివచ్చిన కార్యమువలన లాభముగలదా నష్టిగలదా యనియు నీ వాలోచింపరాదు. ఆ కార్యమువలన లాభమువచ్చినఁ బొంగరాదు, నష్టివచ్చినఁ గ్రుంగరాదు. ఈ కార్యము చేసినవాఁడను నేనను నహంకర్తృత్వాభిమానము కారాదు. తత్త్వము విచా

రించినపు డీ దురభిమానమునకుఁ గారణమే లేదు. ప్రేరకుఁ డీశ్వరుఁడు. కర్తయు నాయనయే. సాధనము దేహము. ఇఁక నీవు చేసిన దేమి ? నీ చేతికత్తియో కలమో యొక కార్యము చేసినపు డాకార్యము చేసినది నీవా ? ఆ కలము కత్తియా ? మనము నిమిత్తమాత్రము. కావున ద్వంద్వములందన్నిట సమచిత్తుఁడై ఫలముఁ దానాశింపక సర్వము భగవదర్పణము చేయుచుండిన వీనిని బుణ్యమంటదు పాపమంటదు. పుణ్యపాపములు రెండును బంధకములే. ఈ విధముగఁ బ్రవర్తించినఁ గ్రొత్తగా సంపాదించుకొను బంధము లుండవు. యజ్ఞదానతపములు ముందు చెప్పినవిధమునఁ జేయుచుండినఁ బూర్వజన్మసంచితమంతయుఁ దొలఁగి మనస్సు నిర్మలమై పరభక్తియుదయించును. ఈ వాక్యములకుఁ బ్రమాణములఁ గోరువారు. భ-గీ ౨ అ. ౩౮,౪౭,౪౮, ౩ అ ౧౯, ౨౦ ౨౧,౨౫,౩౦ ౪ అ. ౧౯,౨౦ ౨౨,౨౩,౩౭. ౫ అ. ౮,౯,౧౦, ౧౧,౧౨,౧౩,౧౪. ౯ అ. ౨౭, ౨౮. ౧౮ అ. ౫,౬,౧౧,౧౨,౫౬, ౫౭. చూడనగు. జ్ఞానులైన జనకాదు లీవిధముగఁ గర్మనిష్ఠులై తరించిన వారే. మీఁదఁ జెప్పినప్రకారము ఫలకాంక్ష లేక సమబుద్ధికర్మము చేయుటకే కర్మయోగమని పేరు. జ్ఞానముతోడై వచ్చిన రానీ రాకుండినఁ బోనీ యని కర్మయోగి తలంచునుగాని దాని సాహాయ్యమునకై ప్రయత్నింపఁడు గాని భక్తినిమాత్ర ముపేక్షింపఁజాలఁడు. భక్తిలేని కర్మజ్ఞానములు వ్యర్థములు. జీవములేని దేహములు. భక్తిగలవాఁడయ్యుఁ గర్మములకై యెక్కువ పాటుపడువాఁడు గావునఁ గర్మయోగి యనఁబడును. కేవల కర్మయోగమువలన జ్ఞానసహాయము లేకయే యాత్మావలోకనమగును. కేవలాత్మావలోకన తత్పరునకుఁ గైవల్య ప్రాప్తిగలదు. వీనికి మరల జన్మములేదుగాని భగవదనుభవానందము లేదు. దేవాలయములోనికిఁ బోయి ప్రాకారములోపల నెందో యొకమూల నొంటరిగఁ దనలోఁ దానానందించుచుండుటవంటిది కైవల్యము. ఇందు భగవద్దర్శన లాభము లేదు.

కర్మములు చేయఁగాఁ బ్రతిబంధకములు తొలఁగి యావలఁ బర భక్తి యుదయించునని మీఁదఁ జెప్పఁబడియె. అటని భక్తికిఁ గర్మయో

గను కారణము కాఁజాలదు. యత్కించిద్గౌణభక్తి జనించుటవలననే భగవత్ప్రీతిగఁ గర్మములు చేయ బుద్ధిపుట్టును. మఱియొకచోట వ్రాసినట్లు నిర్వేదాంతమున భక్తి జనించు. అది మొదట సకామకర్మమునకు నావల నిష్కామకర్మమునకుఁ గారణమగు. కావున భక్తియే కర్మయోగమునకు బీజము. తరువాత నివిరెండు పరస్పరోపకారకములగు కర్మయోగి యేపని చేసినను నిలిచినను గూర్చిండినను భుజించినను త్రావినను నన్నిసమయంబులఁ జేసెడి పనియంతయుఁ గృష్ణార్పణమస్తని యనుచుండవలయునుగదా. ఈవిధముగ వేమాఱు భగవన్నామము స్మరించుటచేఁ గార్యములందు భగవంతునిఁ బూజించుటచే భక్తి వృద్ధియగు. భక్తి వృద్ధియగుకొలఁది కర్మము లెక్కువ శ్రద్ధాభక్తులతోఁ జేయును. ఇట్లు వెన్నెలచేత రాత్రి రాత్రిచేత వెన్నెలవలె రెండును నొకదానినొకటి యుపకరించును. పలుమాఱు దేనిని స్మరించెదమో దానియందుఁ దగులము వృద్ధియగునుగదా. ఈ కారణముచే నారద శాండిల్యమహర్షులు కర్మయోగమును గౌణభక్తి యనిరి.

## జ్ఞానయోగము

ఇఁక జ్ఞానయోగ మెట్టిదో చూతము. దీనినిగుఱించి వ్రాయుటయందు మిక్కిలి యసంతుష్టియుఁ బరితాపము గలుగుచున్నది. దీని మహిమయు నభ్యాసవిధంబును వ్రాయఁబూనిన నొక గ్రంథమగుచు. గ్రంథవిస్తరభీతిని, నప్రస్తుతమనియు నాకార్యమునుండి విరమింపవలసి వచ్చెను. భక్తికంటెను జ్ఞానము తక్కువయని యిందు దందు వ్రాయుటచే జ్ఞానవాదులు వీఁ డజ్ఞానియని తలంపవచ్చును గాని 'యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ' యనునది జ్ఞానయోగికే లభ్యమని యెఱుంగఁ దగినంతమాత్ర మభ్యాసము వీనికిని గలదు. పరితాపమునకదే కారణము, జ్ఞానయోగి శాస్త్రజ్ఞుఁడు గను సుశాగ్రబుద్ధిగ నుండవలయుననుట సత్యము. మనశాస్త్రము లటుండ నాంగ్లభాషలోఁ బ్రకటింపఁబడిన ప్రకృతివిషయకశాస్త్రములలోఁ జెప్పఁబడిన విషయములు లక్ష్యములుగను నుపనిషద్వాక్యములు లక్షణములుగఁ దీసికొని సమన్వయింపఁ బూనినపుడు భగవ

త్సృష్టి వైచిత్రియు భగవన్మహిమ జ్ఞానము మనస్సును స్తంభింపఁ జేయును. లత గుల్మభూయిష్ఠమైన యరణ్యమున సంచారము చేయు వాఁడు నిశితఖడ్గమును గేలఁగొని యడ్డమువచ్చినవానినెల్ల నసహాయుఁడై నఱికివైచుచు నెట్లు మార్గమేర్పఱుచుకొనిపోవునో యట్లులే జ్ఞానాభ్యాసియుఁ దీక్ష్ణబుద్ధిచే గార్యకారణ యుక్తులచే సందేహముల ఛేదించుకొనుచుఁ బోవుచుండవలయును. వీని కష్టమెట్టిదో యితరు లూహింపనైనఁ జాలరు. కావుననే యీ కష్టమార్గమునఁ దఱచు నడచువారుండరు. "బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాంప్రపద్యతే"యని భగవంతుఁడే చెప్పెనుగదా. కావున నా ప్రయాసము విడిచి వాడుక ప్రకారము వ్రాయఁబడుచున్నది.

కర్మమనఁగా బని. భక్తియనగా సేవ. ఈ రెండు సాధించుట యందుఁ గాలు సేతులు తోడుపడును. జ్ఞానమనఁగా నెఱుక. ఇది కేవలము తలచేయు కార్యమేగాని కాలు సేతులు సహాయముతోఁ జేయునదిగాదు. కావుననే జ్ఞానయోగులకుఁ దల పెద్దదై యుండవలయు. భక్తులకు హృదయము పెద్దదై ప్రేమరస పూరితమైయుండవలయు. దేనిని దెలిసికొనుట జ్ఞానము? దీనికిఁ బ్రత్యుత్తరము భగవంతుఁడే యిట్లు సెలవిచ్చెను.

శ్లో॥ జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి, యజ్జ్ఞాత్వాఽమృత మశ్నుతే

అనాది మత్పరంబ్రహ్మ, నసత్తన్నాస దుచ్యతే॥ ౧౩,౧౨.

సర్వతః పాణిపాదం త, త్సర్వతోఽక్షి శిరోముఖమ్

సర్వతః శ్రుతిమల్లోకే, సర్వమా వృత్యతిష్ఠతి

సర్వేంద్రియ గుణాభాసం, సర్వేంద్రియ వివర్జితమ్

అసక్తం సర్వభృచ్చైవ, నిర్గుణం గుణభోక్తృచ।

బహిరంతశ్చ భూతానా, మచరం చర మేవచ

సూక్ష్మత్వాత్తద విజ్ఞేయం, దూరస్థం చాంతి కేచతత్

అవిభక్తంచ భూతేషు, విభక్త మివచ స్థితమ్

భూతభర్తృచ తజ్జ్ఞేయం, గ్రసిష్ణు ప్రభవిష్ణుచ॥

జ్యోతిషామపి తజ్జ్యోతి, స్తమసః పరముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం, హృదిసర్వస్య నిష్ఠితమ్॥ ౧౩, ౧౭.

ఈ తెలియవలసినదానికి నన్ని చోట్లను గాళ్లు. అన్ని చోట్లను జేతులు. అన్ని చోట్లను గన్నులు. ముఖములు, తలలు, చెవులు, నంతట వ్యాపించి యున్నవట. ఇది యుండునది కాదట. లేనిది కాదట. దీని కింద్రియములు లేవట. ఇంద్రియములు చేయుకార్యములం జేయునట. ఒకదాని నంటియుండదట. అన్నిటిని ధరించునట. గుణములు లేనిదట. గుణముల ననుభవించునట. మిక్కిలి సూక్ష్మము గావునం దెలియరానిదట. దూరమునం దున్నదట. దాపున నున్నదట. భాగములు లేవట. ఉన్నట్లు కానవచ్చునట. కాంతిగల పదార్థముల కదియే కాంతి నొసంగునట. కంటికిగడా యీవిప్పుడుకథ. ఇట్టి దానిని దెలిసికోవలె. అనంగా మాటల కర్థము గాదు. ఇట్టిదానిని గనులారం జూడవలయు. ఇది యెంతటి కష్టకార్యమో యాలోచింపుండు. కష్టమేగాక యుపాయములు మెండు. సాధకుం డెంతెంత సాధించునో యంతంత దానిగుణమును బొందుచుండు వాం డగును. ఆ వెలుతురు పూర్ణముగం జూచునప్పటి కా వెలుతురులో లీనమైపోవును. దానిగుణ మొక్కటొక్కటిగా సంపాదించుచుం దుద కన్ని గుణములు రాంగా నదే తానైపోవును. ఇదియే యద్వైతుల యద్వైతసిద్ధియందురు. పిల్లవాండ్రు సన్నని యుల్లిపొరవంటి రబ్బరు తిత్తుల నూందంగా నూందంగా నది పెద్దదై పెద్దదై తుదకుం బగిలిపోయి లోపలిగాలి వెలుపలిగాలిలోం గలసిపోవును. అట్టిదే యిదియని స్థూలముగం జెప్పవచ్చును. ఇం దానందానుభవము లేదు. ఇది సరియైన జ్ఞానముగాదు.

(కొంద ఱీ శ్లోకములు ప్రత్యగాత్మలక్షణమని యనాదిమత్ + పరమ్మని విభజించి పరమాత్మపరముగ నన్వయించిరి.)

ఇట్టి దానిని సాధించు నుపాయముల భగవంతుండే ౧౩-వ యధ్యాయము ౭ మొదలు ౧౧ వఱకుంగల శ్లోకములలో సెలవిచ్చెను. అందుం దక్కనవానితోడ 'మయిచానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ'

(కృ లీ.౨-పం.౪౦౭ పం ౧౨-౧౩)అనియేకాంతభక్తియుఁ జెప్పఁబడెను. భక్తిసాహాయ్యము లేకుండిన జ్ఞానము శోభిల్లదనినారదులు చెప్పిరిగదా. ఈ జ్ఞానమార్గమునఁ బ్రవేశించుటకును దొలుత గౌణభక్తియే కారణము. కావున దీనికి నాద్యంతముల భక్తి కావలసియున్నది. ఇందును జ్ఞానభక్తులు పరస్పరోపకారములు. ఈ కారణములచే నారదశాండిల్యులు జ్ఞానమును భక్తికంగముగా సాధనములలోఁ జేర్చిరి. శాండిల్య భక్తిమీమాంస చూచునది?

## భక్తియోగము.

భక్తియోగ ప్రాశస్త్యము దాని నభ్యాసము చేయువిధము ఫల ప్రాప్తి భగవంతుఁడు ౧౨-వ యధ్యాయములో సెలవిచ్చెను. నిర్గుణోపాసనము మేలా ? సగుణోపాసనము మేలా ? యని యర్జునుఁడు ప్రశ్నింప నిర్గుణోపాసనము సాపాయము కష్టైకసాధ్యమనియు సగుణోపాసనమె సుసాధము సత్యఫలము గావున దేహధారుల కిదియే మేలనియు భగవంతుఁడు బోధించెను. తరువాత దాని నభ్యసించు విధానము బోధించెను. ఈ యోగ మిందు విపులముగఁ జర్చితము గావున నిచట వివరింపఁబడలేదు.

౧౨-వ యధ్యాయమునఁ గాక ౬ అ, ౪౭; ౭ అ, ౨౦, ౨౧, ౨౨; ౯ అ, ౧౨, ౧౩, ౨౨, ౨౩, ౨౪, ౨౯, ౩౦, ౩౧, ౩౨; ౩౩, ౩౪; ౧౦ అ, ౭, ౮, ౯, ౧౦, ౧౧; ౧౧ అ, ౫౩, ౫౪, ౫౫, ౧౩ అ. ౧౧, ౧౯, శ్లోకములను జూడుఁడు కృష్ణలీలయందు దా యీ యధ్యాయములలో నాయాసంఖ్యక్రింద దాని యర్థము గాననగు.

"జ్ఞానయోగమువలనఁ బ్రకృతి వియుక్తాత్మస్వరూపమునుబొంది యర్చిరాదిమార్గమునఁ బరమపదమునకుఁబోయి యందొకమూల పతి వియుక్త పత్నీన్యాయమున భగవదనుభవము లేని స్వాత్మానుభవము మాత్రము గలిగియుండుట కైవల్య మనఁబడును. అది యీ ప్రకృతి మండలమందే యొకచో స్వాత్మానుభవమని కొందఱిమతము, జీవుఁడు భక్తి ప్రపత్తులచే సంసారమువదలి యర్చిరాదిమార్గమునఁబోయి నిత్య విభూతికిని లీలావిభూతికిని నడుమనున్న విరజానదిలో స్నాతుఁడై దివ్య

శరీరము నొంది నిత్యవిభూతిం జేరి యందుఁగల నిత్యముక్తులతోఁ డ నీశ్వరస్వరూపానుభవము సేయుచు సర్వకైంకర్యము లాచరించుచుఁ బునరావృత్తి లేని నిరతిశయానంద మనుభవించుచుండును. ఇదియె మోక్షము." అని యొకరు ఫలభేదముఁగూర్చి వ్రాసిరి.

### రాజయోగము.

దీనిని భగవంతుఁడు కర్మయోగముగాఁగ వచించెను. ఇది యీ కాలమున విపులముగఁ జర్చింపఁదగిన విషయము. ఈ యోగాభ్యాసమువలన నల్పకాలములోనే కొన్ని శక్తులు గలుగును. యమనియమములు పాటింపక ప్రాణాయామముతోఁ బ్రారంభించి కొన్ని శక్తులు సంపాదించుకొని కొందఱు వానిని దుచ్ఛవిషయంబుల వినియోగించుట వలనఁ దమ కెంత కీడుకలుగనున్నదో వారాలోచింపక వాని మూలమున నితరులకుఁ గీడు చేయుచున్నారు. కొంద ఱట్టి శక్తులు లేకయు యోగమువలన నట్టి శక్తులు గలుగునను జనవిశ్వాసమును బట్టి లోకులను మోసగించుచున్నారు. కొందఱు వానిని జీవనాధారము చేసికొనుచున్నారు. కొందఱు పుణ్యజనులు స్త్రీలకు యోగము నేర్పెదమని సంయోగము నేర్పుచున్నారు. వీరిని జూచిన దేహము వణఁకుచున్నది. ఇట్టి మోసగాండ్రవలన నెందఱు చెడనున్నారో తెలియదు. రాజయోగమును దుర్వినియోగపఱిచినవారే మయ శంబర మారీచాది రాక్షసులు, సద్వినియోగపఱచినవారే దేవతలు. ఈవిద్యయందు దేవతలకంటె రాక్షసులే బలవత్తరులు. ఈ యోగముల గుఱించి భగవద్గీత ౬-వ యధ్యాయమున ౩౨ శ్లోకములవఱకును నుద్ధవగీత యందును గొంత చెప్పఁబడినది. ఇదియు భక్తికి నంగమే.

### ప్రపత్తి.

భక్తియోగము తక్కినవానికంటె సుకరమని పేరేగాని యదియు సుకరముగాదు. తైలధారావదవచ్ఛిన్నముగ ననఁగా నూనెధార త్రెంపులులేక పడునట్లు గంగాప్రవాహము సముద్రమునకు నిలువక పాఱునట్లు దినమునకు ౨౪ గంట లనఁగా ౧౪౪౦ నిమిషములు విడువక మఱపులేక భగవంతుని స్మరించుచుండవలయును. అచింతనతప్ప

వేఱుచింత యేదియు మనస్సునకు రారాదు. ఈవిధముగ భక్తిచే యుట సుకరమా! కావునఁ బరమదయాళుండగు భగవంతుఁడు దాని కంటె సులభమైన ప్రపత్తిమార్గ ముపదేశించెను. దీనికి నధికార నియతి లేదు. దేశకాలవిచారము లేదు. సంసారమున నిజమైన నిర్వేదము జనించి తాను సంసారసముద్రమునందు మునిఁగియున్నాఁడ ననియు, దానిని దరింపఁ దా నశక్తుఁడననియుఁ బరతంత్రుఁడననియు నీ యాపద తన యత్నంబుచేఁ దొలఁగఁద్రోయ సాధ్యపడునది కాద నియుఁ దలఁచి దీనిఁ దొలఁగఁజేయ శక్తుఁడు సర్వజ్ఞుఁడు స్వతంత్రుఁడు ప్రభువు సౌశీల్యాది సద్గుణశాలియు నగు రక్షకుఁడు భగవంతుఁ డొక్కఁడే సర్వదా సన్నిహితుఁడై యున్నాఁడనియు దృఢముగ నచం చలమతి నమ్మి నిజయోగక్షేమభారం బాయనపై నైచి యాయననే స్మరించుచు శాస్త్రవిహిత కృత్యంబుల మాత్ర మాచరించువారలెల్ల దీనిక నధికారులు.

శ్లో॥ అనన్యసాధ్యేస్వాభీష్టే, మహావిశ్వాసపూర్వకమ్
తదేకోపాయతాయాచ్ఞా, ప్రపత్తి శ్శరణాగతిః॥

"శరణాగతి కఠ, ముండక, శ్వేతాశ్వతం, నారాయణోపనిష త్తులలోను భగవద్గీతలలో ౭ అ. ౧౪ శ్లో; ౮ అ. ౨౧-౨౨; ౯ అ. ౧౫-౨౨-౩౪; ౧౩ అ. ౧౮; ౧౫ అ. ౪; ౧౮ అ. ౬౧-౬౨-౬౫-౬౬-౭౩ శ్లోకములలో నుపాదింపఁబడినది. అనాద్యజ్ఞానముగు మాయను దాఁటుటకును, భగవదనుగ్రహ సంపాదనమునకును, ప్రపత్తి ముఖ్యకారణమని భగవంతులును, శంకర రామానుజాచార్యు లును నొక్కి నుడివిరి. సర్వశాస్త్రములయొక్క పరమరహస్యము ఈశ్వర శరణాగతియే యగు యనేకకారణములచేతనే భగవంతుఁడు తమ గీతాశాస్త్రమును శరణాగతియందే పరిసమాప్తిఁ జేసిరనియు మధుసూదనసరస్వతులు చరమశ్లోక టీకలో వ్రాసిరి" బ్ర. శ్రీ. వావి లాల వేంకటశివావధానులవారి బ్రహ్మసూత్రసారము పుట ౫౫.

ఇట్లు సర్వామత సమ్మతంబైన యీ ప్రపత్తినిగుఱించి జ్ఞాన వృద్ధుల సూక్తులించుక యిందు సంగ్రహింపఁబడుచున్నవి.

"ప్రపత్తి యనఁగాఁ జక్కని జ్ఞానము. ఈజ్ఞాన మెట్టిదన,
శ్లో॥ అనాత్మన్యాత్మ బుద్ధిర్యా, అస్వేస్వమితి యామతిః
సంసార విషవృక్షస్య బీజమేత ద్ద్వధాస్థితమ్॥
ఈ సంసారమను విషవృక్షమునకు విత్తనమున రెండు పిచ్చెలు గలవు. అందొక్కటి తానుగానట్టి దేహము తానని తలంచుట. ఇదియే యహంకారము. రెండవది తనవికాని పెండ్లాము బిడ్డలు గృహములు పశువులు క్షేత్రములు తనవియని తలంచుట. ఇదియే మమకారము. ఈ రెండొప్పాలు గలసిన విత్తనమునుండియే సంసార విషవృక్షము పుట్టెను. సంసారము క్షయింపఁజేయవలయుననిన నీ విత్తమును, దీని లోనుండి పాఱిన వేళ్లను గామ క్రోధ లోభ మోహాదులను నెండఁ గట్టి క్షయింపఁజేయవలయు. ఇట్లొండించుటయేకాక తన్ను రక్షింప సమయమువేచి కాచియుండు భగవంతుని కుతూహలమునకు స్వవ్యాపారంబుల మరగి నిడివలుకుఁ గలిగించుచుండు భంగమును నికఁ గలిగింపక యుండవలయునను నీ జ్ఞానమే ప్రపత్తి. భగవంతుఁడు మనల రక్షింపవలయుననిన మన మడ్డమా? ఏల రక్షింపరాదు? ఎవరు వలదనిరని సందేహింతురేమో. తనంతటఁ దానే జీవకోటిని గడతేర్పఁ బూనినచో సర్వశక్తుఁడగు భగవంతుఁడు సమస్త జీవకోటి కొకక్షణంబుననే ముక్తి యియ్యవలసివచ్చును. ఇది యాయన లీలావిభూతి సంకల్పమునకు విరోధము. సంసారప్రవాహము నింకింపరాదు. కావున నీలీల జరుగుటకై యొకసారి యెవఁడైన నిండు మనస్సుతో స్వామీ నీవాఁడను. వేఱుదిక్కు లేనివాఁడను. రక్షింపుమని ప్రార్థించినది మొదలు వాఁడు ముక్తుఁడగుమార్గము కల్పించును.*శంకరాచార్యుల వారు చెప్పినట్లు లగ్నిహోత్రుఁడు తన్నుఁ జేరవచ్చిన వారి చలినే కదా పోఁగొట్టును. కాఁబట్టి "భగవత్ప్రవృత్తి విరోధిస్వ ప్రవృత్తి నివృత్తిః ప్రపత్తిః" భగవత్ప్రవర్తనమునకు విరోధముగఁ దాను బ్రవర్తింపకుండుటే ప్రపత్తి యనఁబడును. శరణాగతి, శరణవరణము, భర

*శ్లో॥ సర్వజ్ఞోఽపిహి లక్ష్మీశ, స్సదాకారుణి కోఽపిసన్
సంసారతంత్రవాహిత్వా, ద్రక్షాపేక్షాం ప్రతీక్షతే॥
అను సూక్తి ననుసంధించునది.

సమర్పణము, న్యాసము, సాధ్యభక్తి, నమస్సనునవి ప్రపత్తికిం బర్యాయ నామములు.

చలికి వణంకెడువారందఱు నెండలోనికిం బోవనట్లు లక్ష్మిలో యట్టులే సంసారతప్తులందఱు భగవత్కృప కర్హులు. ఇదియే భగవదభిప్రాయమని,

శ్లో॥ మాంహిపార్థవ్య పాశ్రిత్య, యేఽపిస్యుః పాపయోనయః
స్త్రియోవైశ్యాస్తథాశూద్రా, స్తేఽపియాంతిపరాంగతిమ్ గీ-౩౨
సమోఽహం సర్వభూతేషు, నమే ద్వేష్యోస్తి నప్రియః॥ గీ-౨౯
అపిచేత్సుదురాచారో, భజతే మా మనన్యభాక్
సాధురేవ స మంతవ్యః, సమ్యగ్వ్యవ సితోహిసః॥ గీ-౩౦

యను గీతావాక్యములే ఘోషించుచున్నవి. కావుననే "శ్రీమన్నృసింహ, వరాహ, శ్రీరామకృష్ణావతారంబుల నాల్గింటను భగవంతుఁడు

శ్లో॥ సత్యంబ్రవీమి మనుజాః, స్వయమూర్ధ్వబాహు
ర్యోమాం ముకుంద నరసింహ జనార్దనేతి
జీవన్ జపత్యనుదినం మరణే ఋణీవ,
పాషాణకాష్ఠ సదృశాయ దదామి ముక్తిమ్॥

మనుజులారా! స్వయముగ నేను చేయెత్తి సత్యము పలికెద. జీవించియుండు సమయంబున నెవ్వఁడు ప్రతిదినము ముకుందా! నరసింహా! జనార్దనా! యని నన్నుఁ బలుమాఱు పిలుచుచుండునో, (నాదు నామము జపించునో) యట్టివాఁడు నిర్యాణసమయమునఁ బాషాణమువలెను, గాష్ఠమువలెను, స్మృతిలేకుండినను, నప్పుగొనిన వాఁడు మరల నప్పుచెల్లించనవిధముగ వానికి ముక్తినిచ్చెదను." అని యుండుటచే,

శ్లో॥ యంయంవాపి స్మరన్ భావం, త్యజత్యంతే కళేబరమ్
తంతమేవైతి కౌంతేయ! సదాతద్భావభావితః॥ గీ. ౮-౬.

యనునట్టి యంతిమస్మరణ నిర్బంధము ప్రపన్నవిషయము కాదని యెఱుంగునది. మఱియు,

శ్లో॥ స్థితే మనసి సుస్వస్థే, శరీరేసతి యోనరః
ధాతుసామ్యే స్థితేస్మర్తా, విశ్వరూపంచ మామజమ్ ।
తతస్తం మ్రియమాణంతు, కాష్ఠపాషాణ సన్నిభమ్
అహం స్మరామి మద్భక్తం, నయామి పరమాంగతిమ్॥

చంచలమగు మనంబు కుదిరికతో నిలిచి, శరీరము స్వస్థమై, వాత పిత్త శ్లేష్మధాతువులు సమంబులయి యున్న సమయమున నెవ్వఁడయిన నెపుడయిన నొక్క పర్యాయము విశ్వరూపుఁడగుటఁ జేసి యంతటను, నజుఁడనగుటచేత నెప్పుడును సన్నిహితుఁడగు నన్ను స్మరించునో యంతనే నదియే వ్యాజంబుగఁ గైకొని కాష్ఠపాషాణములవలె నిర్యాణకాలంబున స్మృతితప్పియున్న వానినైనను నాభక్తుని నేనే స్మరించి పరమపదంబు నొందించెద.

ఇచ్చట ధాతుసామ్యము మొదలగువానిఁ జెప్పుటచేఁ బ్రతిబంధక బహులంబగు శరీర కారాగృహమున మిణుకుచుండు వాఁడేల స్మరింపనోపుననియు, దానివలన సకృత్స్మరణంబె చాలుననియుఁ బ్రతిబంధకంబు లతి ప్రబలంబులనియు, నట్టివాఁడు స్మరించుటయనఁగ నత్యాదరణీయకంబనియు, నింతకధికము కోరుతచె నిత్య విభూతి మార్గమే ఖిలమగుననియు, స్మరణమునకుఁ గాలదేశాది నియమము లేదనియు, నతఁడు నిర్యాణక్లేశముచే స్మృతిహీనుఁడయి యుండిన నాకు సయితము స్మృతితప్పెనా యనియు, నతఁడు స్మరింపకున్న నేను స్మరించుట కతఁడు నాయందు భక్తుఁడగుటయె కారణంబనియు, నితఁడు చేసిన యత్న మల్పమగుట ఫలబాహుళ్య విఘాతకంబు కానేరదనియు భావము సిద్ధించుచున్నది. ఇచట "అహం స్మరామి మద్భక్తం నయామి పరమాంగతి"మ్మన్నచో నాదుభక్తుని నేనస్మరింతు. లేకున్న నేను బరమగతిఁ జెందకపోదునుగాక యని శపథరూపంబుగ భావమను రసోక్తియు సంప్రదాయసిద్ధము. "జీవజ్జపత్యాను దిన"మ్మను నదియు నిందు మార్పఁబడియె. "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతమ్మమ" (ఒక్క పర్యాయమైన ప్రపన్నుఁడై నేను నీవాఁడనని యాచించువానికి సమస్త

జంతువులనుండియు భయములేనటులు చేసెదను. ఇదియె నాదు వ్రతంబు.) ఇందుఁ బ్రపత్తిస్వరూపము భగవదనుకూలత్వ సంకల్ప రూపంబనియు యాజ్ఞాగర్భంబనియుఁ దెలియుచున్నది. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ, అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః" (ఇంతకాలముగ నివియె మోక్షసాధనంబు లని నీవు తలఁచియుండిన వానిని సపరికరంబులుగ సవాసనంబుగ వదలి నన్ను రక్షించుటకుఁ బరిపూర్ణహేతువులగు స్వామిత్వ శరణ్యత్వాదిగుణములు కలిగియున్న నన్నొక్కనిచే శరణంబని నిశ్చయించు కొనుము. నిన్ను రక్షించట కితరోపాయ సహాయం బపేక్షింపని సిద్ధోపాయంబగు నేను నన్నొక్కనిని నమ్మియున్న నిన్నుఁ బుణ్య పాప రూపంబులయి నీవు నన్నుఁ జెందుటకు విరోధులగు నెల్ల వాని నుండియు వదలించెదను. (శోకింపకుము) ఇతరంబులందెల్ల మోక్ష సాధనంబు లనుభ్రమమువదలి సౌలభ్య, స్వామిత్వ, సౌశీల్యాది కల్యాణ గుణగణ నిలయమైన సర్వేశ్వరుఁడే యుపాయంబు. ఇతరము లగు కొఱగాముల నింతవఱకు నమ్మి యీ పెన్నిధిం గోలు పోయితిమే యను ఖేదముతో భగవంతుఁడె యాపన్నరక్షకుఁడని తలఁచుటయె ప్రపత్తియని యిందులోని పూర్వార్ధము చేతన కృత్యమును సర్వజ్ఞుఁడై సర్వస్వామియై రక్షణశక్తుఁడైన సర్వేశ్వరుఁడు సకల ప్రతిబంధక నివృత్తి కలిగించునని యుత్తరార్ధ మీశ్వరకృత్యంబును దెలియఁ జేయుచున్నది. కాఁగా స్వాతంత్ర్యాభిమానంబున నింతకాలము తన్ను వదలించుకొనుటకుఁ జేసిన యత్నంబులెల్ల బంధహేతువు లనియుఁ, బరతంత్రునకు స్వరూపప్రాప్తంబగు పరతంత్రత్వాధ్యవసాయంబొండె కావలసినదనియు నదియుండిన సొమ్ముకలవాఁడు సొమ్మును రక్షించుచున్నాఁడనియుఁ బ్రపత్తి రహస్యమేర్పడుచున్నది."

ఈ పై విషయమంతయు శ్రీమదద్దంకి తిరుమలసముయోద్దండకోలాహల లక్ష్మీనృసింహకుమార తాతాచార్యకవిభూషణ స్వాములవారిచేఁ బ్రణీతంబైన శ్రీపరమార్థప్రకాశమునుండి గ్రహింపఁబడియె. సర్వధర్మాన్ పరిత్యజ్య యనుటచే ధర్మకర్మములెల్ల స్వరూపముతో నే

వదలుమని యర్థముగాదు. అవి యాజ్ఞారూపకములు గావునఁ గైంకర్యబుద్ధిఁ గర్తవ్యంబులే. ఫలము భగవదర్పితము గావలయు.

భక్తికి భక్తియేఫలము గావున సాధనముకాదు రోగము నివర్తించిన పిమ్మట నౌషధసేవ మానినట్లు లిష్టార్థము సిద్ధింపఁగా మానుకొనునట్టిది సాధనమనఁబడును. భక్తుఁడు ముక్తుఁడై స్వామి సన్నిధానమందుండినను "కృతాంజలిపుటా హృష్టాః నమ ఇత్యేవ వాదిన" యన్నట్లు తన దాస్యమును వదలఁడు. అట్లులే ప్రపత్తియు సాధనము గాదు, ప్రపత్తియనఁగా నహంకార మమకారములు వదలుకొనుటయే యని మీఁద వివరింపఁబడియెఁ గదా.

ఈ ప్రపత్తి యాఱువిధములు.

శ్లో॥ ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూలస్య వర్జనమ్
రక్షిష్యతీతి విశ్వాసో, గో ప్తృత్వ వరణంతథా
ఆత్మనిక్షేప కార్పణ్యే, షడ్విధా శరణాగతిః॥

అనుకూలుఁడుగ నుండుదునని సంకల్పించుట, ప్రతికూలభావము వదలుకొనుట, రక్షకుఁడు రక్షించునని దృఢమైన విశ్వాసము, రక్షింపఁ గోరుట, తన యాత్మభరమంతయు నీశ్వరునందే యర్పించుట, దీనతఁ జూపుట యను నీ యాఱువిధంబులు గలదియే శరణాగతి.* ఈ భరన్యాసము త్రికరణశుద్ధిగఁ జేయవలయు. మనోవాక్కాయ వ్యాపారంబులు పరస్పరము విరోధింపరాదు. ఇట్టివాఁడే జన్మమునందే నిస్సంశయముగ ముక్తుఁడే.

శరణాగతియే పరమగతిగా నెంచుకొనువారిలోఁ బెక్కురయందు నిది యిప్పుడు లౌకికాచారమాత్రముగఁ బరిణమించియున్నది. గ్రంథములం దిది కొనియాడఁబడినది పూర్వులీప్రకారము చేసిరి. కావున మనము చేయుదమనియు మనము చేయకున్న నితరులు తమ్ము హీనముగఁ జూతురే యను నభిప్రాయముతోను బ్రపత్తి కర్మమును

*ఈప్రపత్తి శైవులకు సమ్మతమే. "ఆత్మైన భారఇతితంత్వాయి యోనిధత్తే సోంగానికాని కలయత్వలసః ప్రపత్తేః" కానే తనకు భారమని తన భారము నీయందువైచు సోమరియగు నధికారి ప్రపత్తి యంగంబులలో దేనిని జూడఁగలఁడు.

గొందఱు జరపుచు ధన్యులమైతిమని సంతసించుచున్నారు. వీరియందు నిర్వేదముగాని సంసారమున వైరస్యముగాని కానరాదు. వీరియందు స్నానమునకు సంధ్యకుఁ బూర్వాంగములు కాపీనీళ్లు తేయాకునీళ్లు త్రావుట, యే కన్నకసుమాలమైన నెవనిచేతనైన వేళావేళలు, భోజ్యాభోజ్యము లనువిచారములేక తినుట, కామక్రోధములను గామినీకాంచనాసక్తిని వదలకుండుట ప్రకటము. యోగక్షేమం వహామ్యహమ్మను వాక్యమునందు విశ్వాసములేక తమ రక్షాభారము రక్ష్యమ్యతీతి విశ్వాసము నెలజీతములొసఁగు నే మూలమూడిగలయందో యుంచి శ్వవృత్త్యాది నిషిద్ధవృత్తుల మరగి వర్ణాశ్రమధర్మంబు లెట్టివో మఱచియు 'నిర్భయోనిర్భరోస్మి' యనుచున్నారు. చిత్రము! చిత్రము!!

వీరిస్థితి శోచనీయమైనను సంప్రదాయము చెడక కాపాడుచున్నారుగదా యని సంతోషింపవలసియున్నది. అసాధ్య విహిత కృత్యములు మానిన మానుదురుగాక ఆపద్ధర్మంబులందును నిషిద్ధంబులని శాస్త్రంబుల వచించు కార్యములైన మానకుండుట యసహ్యాపచారముగాదా. వేదసూక్తికి విరోధముకాదా. శ్రీకృష్ణలీలామృతంబున గోపికా ద్రౌపదీ రుక్మిణ్యాదులందు నీ ప్రపత్తి గాననగు. లోక విడంబనార్థము గాక వాస్తవబుద్ధి శరణాగతులైన వారినే కాక తత్సంబంధులనుగూడ భగవంతుఁడు రక్షించును. ఈవిషయము మఱియొకచోఁ గొంచెము వ్రాయఁబడియున్నది.

అధికారమునుబట్టి ప్రపన్నులు మూఁడువిధములు. సంసారమున స్వానుభవబలమువలనఁ దీవ్ర నిర్వేదము విరక్తిజనించి యనన్యభక్తిగలవారై తమ్ముఁదామే భగవంతున కర్పించి నిజరక్షాభారము భగవంతునియందువైచి నిశ్చింతులై యుండువారు. ఇట్టివారి ప్రపత్తికి స్వనిష్ఠయని పేరు. గ్రంథములు చదువుటచే సంసారదోషముల నెఱిఁగి రక్షకుఁడు భగవంతుఁడుతప్ప వేఱొకఁడు లేఁడనియు స్వతంత్రించి ముక్తిసాధించుట యసాధ్యమనియు నెఱిఁగి స్వామీ! నీవే గతియని తన రక్షణభారమును భగవంతునిపై వైచుట. దీనికి నుక్తి

నిష్ఠయని పేరు. ఈ రెండువిధములఁ బ్రపత్తిచేయుటకు శక్తిజ్ఞానము లేనివా రాచార్యనిష్ఠయను మార్గ మవలంబింతురు. ఇందు శిష్యు నకుఁగా నాచార్యుఁడు ప్రపత్తి సేయును. ఇం దాచార్యుఁడు నారదుఁడు కృష్ణుఁడు చెప్పిన యోగ్యతగల సాధువై యుండవలయు. కాదేని గ్రుడ్డివాని నమ్మిపోయిన గ్రుడ్డివానివలె నిరువురు చెడుదురు.

అవతారరహస్య జ్ఞానము వేఱొండు వ్యాసంబునను బురుషో త్తమజ్ఞానము గీత. ౧౫-వ యధ్యాయంబునను గననగు.

భగవంతుఁ డుపదేశించిన విషయములలో వారివారి యధి కార మనుసరించి నిష్కల్మషము నిర్వంచనమునగు బుద్ధితో నేదేని గ్రహించి లోకులు కృతార్థు లగుదురు గాక.

## —♦ గోకులలీలా ప్రశంస. ♦—

**హే**యగుణరహితుండును ననంతకల్యాణ గుణసహితుండును నగు భగవంతుఁడు జగత్సృష్ట్యాదికార్యము లొనర్చుట జీవులపట్లఁ గల యపారకరుణాతిరేకంబునని కాని స్వార్థపరత్వంబునఁగాదు. ఉబు సుపోకకునుఁగాదు. అపహతపాప్మండు విజరుఁడు విమృత్యుఁడు విశో కుఁడు క్షుత్పిపాసారహితుఁడు సత్యకాముఁడు సత్యసంకల్పుఁడు నగు జీవుఁ డనాదికాలంబునఁ దనకుఁగల కించిత్స్వాతంత్ర్యంబును దుర్వి నియోగపఱిచి యనాదికర్మప్రవాహప్రవృత్తము, భగవత్స్వరూప తిరోధానకరము, విపరీతజ్ఞానజనకము, స్వవిషయభోగ్యబుద్ధిజనకము, గుణమయముదైవమునగు ప్రకృతికి వశుఁడై వేశ్యాలంపటుండై తల్లి దండ్రులవిడిచి తిరుగు దుర్విటునివలె ఘోరసంసారపారావారంబున మునుఁగుచుఁ దేలుచు మునుఁగుచునుండఁ గరుణావరుణాలయుఁడైన భగవంతుఁ డాజీవుల నుద్ధరింపఁగోరి యితరవిధముల ఛేదింపరాని తన మాయ యనువలకు వాఁడియైన కరవాలంబగు నిజసేవ నొనర్చుకొనుట కుఁ గరణకళేబరంబు లొసంగుచు, నాత్మరక్షార్థంబొసఁగఁబడిన కత్తిచే స్వశిరంబు ఛేదించుకొనుమూఢులవలె వానిని దుర్వినియోగపఱిచి ప్రకృతిసేవయందే వానిని వినియోగించుచు మఱిమఱి సంసారపంకం బున దిగఁబడుచుండ "అజాయమానో బహుధా విజాయతే" య

న్నట్టు లాయా తరుణముల నాయా జాతులయందు నానావిధముల నవతరించి వారికి బోధించుచుఁ దనమాటఁబట్టి వర్తించువారిని రక్షించుచు నట్టివారిని బాధించువారల శిక్షించుచునుండుఁగదా.

వాస్తవ మారయ భగవంతుఁడు రక్షాకంకణముఁ గట్టుకొన్న వాఁడుగాని శిక్షాదీక్షవహించినవాఁడు కాఁడు. భగవంతుని ప్రేమ సూర్యరశ్మి వంటిది. సూర్యుఁడు నిష్పక్షపాతముగ సమానముగ భూమియందంతటను దన వెలుఁగును బ్రసరింపఁజేయును. ఆ వెలుఁగును గ్రహించు జంతువులు వృక్షములులోనైనవిచక్కఁగా నభివృద్ధిగాంచు. వెలుఁగును గ్రహింపక నీడలోనుండునవి క్రమముగ క్షీణించి నశించు. అంతియగాని వీనిక్షయము సూర్యకృత్యముగాదు. అగ్నిజ్వాలలో నుండి యెగిరిపోయినమిణుఁగు రగ్నినాశ్రయించియే యుండిన దాని ప్రకాశము వేడిమి పోఁగొట్టుకొనకయుండును. జ్వాలనువిడిచి దూర మేగిన బూదియైపోవును. అట్లులే భగవదంశమైన జీవుఁడు భగవంతు నాశ్రయించియుండిన స్వశక్తులకు లోపములేక సుఖపడును. ఆయనను విడిచి మఱచిపోయెనా దుఃఖభోజి యగును.

గోకులంబునఁ గృష్ణుఁడు కావించిన దంతియుకాని వేఱొండెద్దియులేదు వాసుదేవుఁడే పరవాసుదేవుఁడు. ఈయన తమస్సునకుఁ బరుఁడు. (తమసః పరిస్తాత్) తమస్సు చీఁకటి నలుపుగదా. దానిని దాఁటి యీ ప్రపంచమునకు వచ్చుటే నల్లని యమునానదిని దాఁటి గోకులమునకు వచ్చుట (కృష్ణార్జునులు మృతవిప్రశిశువును దెచ్చుటకై పోయిన మార్గమును స్మరింపుఁడు) ఈతమ స్సితరుల కభేద్యమైనను భగవత్కటాక్షపాత్రునకు సుభేదమని వసుదేవుఁడు యమునా నదిని దాఁటుటవలనఁ దెలియనగు. గోకులమే ప్రపంచము. జీవకోటియే పశుసముదాయము. వీనిరక్షణమే గోపాలకత్వము. 'యే యథా మాం ప్రపద్యంతే' యన్నట్టు లేయేజీవి తన్ను నేయేవిధముగ భజించునో తా నాయాజీవిని నాయా విధముగ భజించును. దేవకికి జనించినప్పుడు వారికిఁ దోఁచినమూర్తికి గోకులంబునఁ గానవచ్చిన మూర్తికి నెంత

భేదమో పరవాసుదేవునకు నవతారమూర్తియైన వాసుదేవునకు నంతియభేదము. ఐశ్వర్య పరత్వాదుల లోపము లేదు.

గోకులలీల* సర్వ మిాతత్త్వమునే బోధించును.

గోకులమే ప్రపంచమని మిాఁదఁ జెప్పఁబడెను. ప్రపంచమునఁ గర్మవశులై పుట్టినవారి నాధ్యాత్మికాధి దైవికాధిభౌతికము లనుతాప త్రయములు ప్రారబ్ధత్రయకారణమున బాధింపక మానవు. ఈబాధ సాధువులకు నసాధువులకు సమానమైనను భగవత్కటాక్షమువలన సాధువుల నివి బాధింపఁజాలవు.

యశోదానందులు గోపికలు పూర్వజన్మంబుల భగవద్భక్తిఁగోరి జనించినవారనియు గోవులు ఋషుల యంశమునఁ బుట్టెననియు భాగవతము చెప్పుచున్నది. వీరివృత్తి యడవుల మేఁతమేసి యన్యుల కెన్నఁడు నెగ్గుసేయక విహరించు పశువులమేపి వానివలన లభించిన పాలు పెరుఁగు నెయ్యి యమ్మి దానితో హాయిగ జీవించుట కావున

*గోకులలీల యన బృందావనమందలి చర్యలను గ్రహింపనగు బృంద యనునది రాధకును, దులసికిని పేరు. రాధ యనఁగా సర్వకాల సర్వావస్థల భగవంతుని విశేషముగ నారాధించునది యని యర్థము. అనఁగా నత్యంతభక్తురాలు. వీరుండు నట్టి వనమే బృందావనము. కావున బృందావనము భక్తులస్థానమగుటఁ బుణ్యక్షేత్రము. బృందమనఁగా సమూహము. జీవసమూహము. అవనమనఁగా రక్షణము సంతోషము. కావున బృందావనమనఁగా జీవకోటిని రక్షించుట రక్షించునది యని యర్థము. వ్రేపల్లెవిడిచి కృష్ణుఁడు బృందావనమునకు గోపాలుర పోవునట్లు చేయుట తరింపఁగోరు జీవులు పుణ్యక్షేత్రముల వసింపవలయునని తెలుపుటకే. 'యావచ్ఛరీరపాత మత్రైవ శ్రీరంగేసుఖమాస్వ' యని కలదుకదా. బృందావనము స్త్రీలక్షేత్రము గదా. కావుననే కాఁబోలు నిందుఁ బురుషులకంటె స్త్రీలే యెక్కువ భక్తిగలవారుగా నున్నారు. ఇది స్త్రీ క్షేత్రమగుట జూడఁ బురుషు లెట్టివారైన నగుదురు గాక. సాధువులు పుణ్యస్త్రీలుండుచోట వసింపవలయునుగాని పుణ్యస్త్రీలుండుచోట వసింపరాదని యేర్పడుచున్నది. భిక్షంబు పెట్టరే పుణ్యసతులన్నట్లు సాధ్వులు సాధువులకింత భిక్షమయిన నిడుదురు. అసాధుస్త్రీలు విప్రనారాయణు నట్లు దుష్కార్యములకు లోపఱుతురు.

వీరు సాధుకోటిలోనివారే. కావుననే వీరికిఁ గలిగిన తాపములనెల్లఁ బాపుట భగవంతునకు విధి యయ్యెను.

అధ్యాత్మమనఁగా మనస్సునకుఁ గలుగువేదన. ఆధిదైవికము దేవతాదులవలనఁ గలుగునది. ఆధిభౌతికము పంచభూతములవలనను మృగాదులవలనను గలుగునది. పూతన, శకటాసురుఁడు, ప్రలంబాసురుఁడు, తృణావర్తుఁడు, కాళీయుఁడు, వత్సాసురుఁడు, బకాసురుఁడు, అఘాసురుఁడు, ధేనుకాసురుఁడు, దావాగ్ని, సుదర్శనుఁడు, వృషభాసురుఁడు, ఇంద్రుఁడు, బ్రహ్మ, శంఖచూడుఁడు వీరివలనఁ గలిగిన బాధలు తాపత్రయములోఁ జేరినవేకదా. వీనివలన గోగోపాలుర రక్షించి 'నమేభక్తః ప్రణశ్యతి, నహికల్యాణ కృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి' నాభక్తులు నశింపరు. శుభకార్యములు చేయువారు దుర్గతి పాలుకారను స్వనియమము భగవంతుఁ డెల్లు సార్థకపఱిచెనో కంటిరిగదా. కావునఁ దాపత్రయ వ్యాధికి హరిపాదాశ్రయమే దివ్యౌషధము.

ధర్మసంస్థాపనము వివరించుటకు ముందు బృందావనవాసుల యం దేయధర్మములు నెలవుకొని యుండెనో చూతము. త్రేతయనఁగా నగ్నిత్రయము. "దక్షిణాగ్ని ర్గార్హపత్యాహవ నీయకాత్రయో౽గ్నయ అగ్నిత్రయ మిదం త్రేతా" యని నామలింగానుశాసనము. త్రేతాయుగములో నగ్నులలో హోమము చేయుట విశేష వ్యాప్తియం దుండినది. కావుననే దీనికిఁ త్రేతాయుగమని పేరు. అగ్నికార్యములు విశేషముగ నుండుటచే దీని నాగ్నేయి యందురు. 'త్రేతాగ్నేయీ' యని త్రికాండశేషము. ఈకాలమున ముఖ్యాతిక ధర్మము నడపుచు యజ్ఞములు భగవత్కైంకర్యబుద్ధితో భగవదర్పణముగఁ జేయఁబడుచుండెను.

కృష్ణావతారము ద్వాపరయుగాంతమున ద్వాపరమనఁగా సందేహము. ధర్మము రెండుపాదములే నడచుటచే నిశ్చల నిశ్చయ బుద్ధిచెడినది. ధర్మవిచారమున సందేహములు మెండైనవి. యజ్ఞాదులం దర్చితుఁ డింద్రాది దేవతాంతర్గతుఁడగు భగవంతుఁడను బుద్ధిఁ తొలఁగి

యింద్రాదులనే యర్చించుచుండిరి. ఇది సరిగాదని శ్రీకృష్ణుఁడు భగవద్గీతయందు నిరాకరించి యున్నవాఁడు.

శ్లో॥ యామిమాం పుష్పితాంవాచం, ప్రవద న్త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ, నాన్యదస్తీతి వాదినః॥ ౨-౪౨.
కామాత్మనః స్వర్గపరా, జన్మకర్మ ఫలప్రదామ్
క్రియావిశేష బహుళాం, భోగైశ్వర్య గతింప్రతి॥
భోగైశ్వర్య ప్రసక్తానాం, తయాప హృతచేతసామ్
వ్యవసాయాత్మికాబుద్ధి, స్సమాధౌ నవిధీయతే॥ ౨-౪౪.
త్రైగుణ్య విషయావేదాః నిస్త్రైగుణ్యో భవార్జున॥ ౨-౪౫.
(కృ. లీ. సం-౩. పుట-౫౮.)

ఫలాపేక్ష లేక భగవత్కైంకర్యబుద్ధి యజ్ఞములఁజేయక ధనధాన్యాది లాభములఁగోరి యజ్ఞముచేయుపద్ధతి నిట్లీసడించి యిట్లు చేయుటవలన శ్రేయస్సులేదని

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే॥
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివిదేవభోగాన్॥
తే తంభుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి॥
ఏవం త్రయీధర్మమను ప్రపన్నా
గతాగతం కామకామా లభంతే॥ ౯-౨౦-౨౧.
(కృ. లీ. సం-౨. ౩౮౬-౩౮౭.)

కామైస్తై స్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతే న్యదేవతాః
తంతంనియమ మాస్థాయ ప్రకృత్యానియతాస్స్వయా॥ ౭-౨౦.
యోయో యాంయాం తనుంభక్త శ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్యతస్యా చలాంశ్రద్ధాం, తామేవ విదధామ్యహమ్॥
సతయాశ్రద్ధ యాయుక్త, స్త స్యారాధన మీహతే
లభతేచ తతఃకామాన్, మయైవ విహితాన్హితాన్॥

అంతవత్తు ఫలం తేషాం, తద్భవత్యల్ప మేధసాం
దేవాన్ దేవయజోయాంతి, మద్భక్తా యాంతిమామపి॥ ౭-౨౩.
ఆబ్రహ్మ భవనాల్లోకాః పునరావర్తి నోర్జున!
మాముపేత్యతు కౌంతేయ! పునర్జన్మ నవిద్యతే॥ ౮-౧౬.
(కృ. లీ. సం.౨. పుట-౩౩౩.)

ఈ వాక్యములు వేదములనే నిందించునవి కావు. వేదంబులు ముముక్షువులకు వైహిక భోగేచ్ఛులకుఁగూడ సేవ్యంబులు వారివారి చిత్తవృత్తి ననుసరించి యుపయోగింప వచ్చును. నిండు తటాకము లోని జలమును కొందఱు దప్పిదీరఁ ద్రావి సుఖింతురు. కొందఱు వానిలో గుడ్డలుదుకుదురు. కొందరు పాదప్రక్షాళనముఁ గావింతురు. ఆ విధముగానే వేదములును గావున నందుఁ జెప్పఁబడిన కర్మము లైహిక సుఖవాంఛచేఁ జేయరాదని శ్రీకృష్ణుని మతము.

శ్లో॥ యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావాన్సర్వేషు వేదేషు, బ్రాహ్మణస్య విజానతః॥ ౨-౪౬.
(కృ. లీ. సం.-౨. పు-౩౩౩.)

కృష్ణుఁడు నిషేధించినది కామ్య సంకల్పమును గాని కర్మమును గాదు.

శ్లో॥ యజ్ఞ దాన తపఃకర్మ, నత్యాజ్యం కార్యమేవతత్
యజ్ఞో దానం తపశ్చైవ, పావనాని మనీషిణామ్ ౧౮-౫.
ఏతాన్యపితుకర్మాణి, సంగంత్యక్త్వా ఫలానిచ
కర్తవ్యానీతిమేపార్థ, నిశ్చితం మతముత్తమమ్॥ ౧౮-౬.
నియతస్యచ సన్న్యాసః కర్మణో నోప పద్యతే
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః॥ ౧౮-౭.
(కృ. లీ. సం-౨. ౪-౨౧ ౪-౨౨.)

ఈ వాక్యములు గోకులమువారి యందెంత యన్వయించునో చూతము. ఇంద్రయాగ విషయమైన నందకృష్ణ సంవాదము. (పుట ౧౫౪-౧౫౯) పఠించితిరేని నందాదు లింద్రునే యారాధింపఁబూనిరి గాని తదంతర్యామి యగు భగవంతు నారాధింపఁ బూనలేదని తెలియ

వచ్చును. ఇంద్రుఁడఁట వర్షము నిచ్చునఁట. ఇది దురభిప్రాయము గదా.

శ్లో॥ తపామ్యహ మహంవర్షం, నిగృహ్ణామ్యు త్సృజామిచ
అమృతం చైవమృత్యుశ్చ, సదసచ్చాహ మర్జున॥ భగ. ౯-౯.

అన్నట్లు వర్షమిచ్చువాఁడు నిగ్రహించువాఁడు భగవంతుఁడు గాని యింద్రుఁడు కాఁడు. కృష్ణుఁ డీ పౌరపా టభిప్రాయమును సవరించెను.

గొల్లవాండ్రు పామరులు. అధ్యాత్మవిచారము వేదాంతములు వారి కుపదేశింపఁబూనిన వారిమనస్సుల కెక్కవు. కావున వారు నచ్చునట్లెంత చమత్కారముగ వారికి బోధించెనో ౧౫౯, ౧౬౦, ౧౬౧ పత్రములం జదువుఁడు. అధికారియోగ్యత తెలిసికదా గురువు బోధింపవలయు. 'కారణం గుణసంగోస్య సదసద్యోని జన్మసు' ౧౩-౨౨. కృ.లీ.స-౫.౮౦౬, అన్నట్లు సత్వాగుణముల ననుసరించి వాఁడు వాఁడు చేయు కర్మములవలననే మంచిజన్మమో చెడ్డజన్మమో కలుగుచున్నది. ఇట్లు జన్మించి చేయు కర్మములఫలమునే సుఖముగాను దుఃఖముగాను ననుభవించును. వాఁడు వాఁడు చేసిన కర్మముకొలఁది నెంతసుఖ మెంతదుఃఖ మనుభవింపఁ జేయువలయునో యంతే భగవంతుఁడైనను ననుభవింపఁజేయునుగాని కోపించి యెక్కువ శిక్షచేయుటకును ననుగ్రహించి తగ్గించుటకును సమర్థుఁడుగాఁడు. ఐనను భగవంతుఁ డొకటి చేయఁగలఁడు. దీర్ఘకాల మనుభవింపవలసిన కర్మఫలమును నల్పకాలములోనే యతి తీవ్రముగ ననుభవింపఁజేసి ప్రారబ్ధము క్షయింపఁజేసి ముక్తి నీయఁగలఁడు. భైరవయాతన యనునది యిట్టిదే కదా. కృష్ణునియొద్దకుఁబోవుటకు వీలుపడని గోపికయును బ్రాహ్మణస్త్రీయును నత్యంత తీక్ష్ణమైన తాపముచేఁ బ్రారబ్ధమును క్షయింపఁజేసి భగవంతుఁ జేరిరిగదా. కావుననే 'ప్రారబ్ధం పరిభుజ్యకర్మశకల' మ్మని చెప్పఁబడెను.

కావున నెవ్వఁడేవర్ణ మందు నే యాశ్రమమఁదుండునో దానికి విహితమైన కర్మములను భగవత్కైంకర్యబుద్ధి భగవదర్పణముగఁ

గావింపవలయును. దానివలన భుక్తిముక్తులు రెండును గలుగును. భుక్తికై భగవంతు సేవించినను గాలక్రమమున నది ముక్తికిని సాధనమగును. నాయుర్వ్దముచే గడిన మోక్షామమే మోక్ష ముక్తి ప్రదంబగుననియు నగ్నిహోత్రమున వైచిన విత్తనములవలె నిట్టి కామము కర్మములఁ గలిగింపఁ జాలదనియు బోధించెఁగదా. కుచేలునివలె ముక్తికై సేవించినను భుక్తియు లభించును. కావున నాత్మక్షేమము గోరువానికి సేవ్యుఁడు భగవంతుఁడొక్కఁడే. అట్టైన భగవంతు సేవించుటెట్లు ? దేవతల యజించుట కష్టముగాని భగవంతుని బహు సులభముగ సేవింపవచ్చును. కర్మహీనమును క్రియాహీనమును మంత్రహీనమును దక్షిణాహీనమును నగుపూజచే దేవతలు కోపింతురుగాని భగవంతుఁడు కోపింపఁడు. ప్రీతికలదా లేదాయనిమాత్రమే యాయన చూచును. కావునఁ బ్రీతితో భగవంతుని రెండువిధముల నర్చింపవచ్చును. భగవంతుఁ డంతర్యామియైన సూక్ష్మరూపమున హృదయములందును, స్థూలరూపియై ప్రపంచరూపముగను నున్నవాఁడు. హృదయాకాశమందుండు భగవంతుని బూజింపలేనివారు ప్రపంచరూపముగనుండు భగవంతుని సేవింపవలయును. సర్వ మీశ్వరకళామయమే కావున మన మితరజీవుల హింసించిన భగవంతునే హింసించుచున్నామనియు నితర జీవుల సంతోషింపఁజేసిన భగవంతునే సంతోషింపఁజేయుచున్నామనియు నమ్మవలయును. ఇది వాస్తవము గాని యూహామాత్రము కాదు. కావున లోకసేవయు భగవత్సేవయే. అంతర్యామిసేవ దుష్కరముగాని యిది సుకరము. కేవల ప్రపంచసేవచేఁ గృతార్థుఁడు కావచ్చునుగాని దీని నిరాకరించి మొదటిమార్గమునఁ గడతేఱుట కష్టైకసాధ్యము.*

*"For mental expansion, the country is always better than the town. It was with the object of teaching how to culture the idea of the Beautiful that He took to pastoral life. He, by his personal example, taught man how to worship Nature. Krishna was a great advocate of this worship, not as an end, but as a

కృష్ణుఁడు నందాదుల కుపదేశించిన దిదియే. వారాత్మజ్ఞాననిష్ఠులుగారు. కావునఁ బ్రపంచసేవారూపమున భగవంతునర్చింప బోధించెను. 'స్నానముచేసి యలంకరించుకొని' యనుటచే శుచిగా నుండ బోధించెను. ఆవుపాలతోఁ బిండివంటలు చేయింపుఁడనుటచే నాహారము సాత్త్వికాహారముగ నుండవలయుననియు శుచిగను రుచిగను నుండవలయునని బోధించెను. ఏమాత్రము జీవహింసయైనను భగవంతుఁడు సహింపఁడు. తమ్ము దీవించు బ్రాహ్మణులకు ధేన్వాదుల నిండని యాశ్రితరక్షణము సత్పాత్రదానము బోధించెను. కుక్కలకుఁ జండాలురకుఁ బతితుల కన్నము పెట్టుఁడనుటచే నన్నదానమునకుఁ బాత్రాపాత్ర వివేచనము పనిలేదనియు నావులకుఁ బచ్చిక నిడుఁ డనుటచే సర్వభూతతృప్తి గావింపను బోధించె. పర్వతమునకును బల్యన్నముఁ బెట్ట బోధించెనుగాని నోరులేని జంతువుల హింసించి పెట్టుఁడని బోధింపఁడయ్యె. ఇం దిప్పటి విపరీతజ్ఞానులు విగ్రహారాధనము గూడదను వారు నేర్చుకొనవలసిన విషయమొండు గలదు. పర్వత మచేతనమైనను దానికిని బలియిడుఁడని బోధించి యా యన్నమును దానే వేఱురూపముఁ గైకొని కృష్ణుఁడు భుజించె. దీనివలన సర్వాంతర్యామి భగవంతుఁ డొకచోటనుండి యొకచోట లేకుండఁ

---

means to an end. *i. e*, knowledge of Nature's God. His sublime teachings in the Gita, regarding the necessity of doing Vedic sacrifices and their real purport, are quite in accord with the manifestations of His boyish individuality Vraja land. His counsel to the Varja-Gopas to do honour to the Govardhana mount in preference to Indra is quite of a piece with those sublime teachings. If Indra and Vayu are vedic deities, whose mediation by sacrifice is needed to enable the soul to attain the Infinite and Eternal, nature in the vicintty deserved no less a reverential study for the attainment of that grand end. Krishna counselled all would be yogis to take to Nature worship for understanding God's love and mercy, without which all yoga was imperfect and incomplete. And His Vraja-Lila was strictly and wholly the embodiments of that godly advice." BULLORAM MULLICK, B A.

డనియు స్తంభమున నృసింహరూపమున గోచరించినట్లు లప్పుడును బర్వతాగ్రంబునఁ దోఁచెననియు భగవంతు నుద్దేశించి భగవద్భావ ముతోఁ జేతనముగాని యచేతనముగాని దేని నర్పించినను దానిని భగవంతుండే స్వీకరించుననియు భగవంతునిఁ జేరునది మన మనస్సే గాని మన మర్పించు పదార్థము గాదను జ్ఞానమా వశ్యకమనియు దానివలన భగవంతుఁడనుబుద్ధిచే నేరాతిని నే చెట్టును నేగుట్టను నేబొమ్మను నే పటమును బూజించినను భగవంతునిఁ బూజించినవార మే యగుదు మనియు నేర్పడియెఁగదా.

గోపికావస్త్రాపహారణమూలమున స్త్రీలు నదులలో దిసమొల లతో స్నానము చేయుటచే మానహానియనియు నందు వ్రతదినముల నగ్నలై చేయుటచే వ్రతహానియనియు బోధించి యా దురాచారము మాన్పెఁగదా.*

గోపికలును బ్రాహ్మణస్త్రీలును కృష్ణుని సన్నిధికి వచ్చినవారే. ఇరువురకుఁ గృష్ణుడు పాతివ్రత్య మవశ్యానుష్ఠేయమని బోధించెను. బ్రాహ్మణస్త్రీలు భగవత్పరతంత్రలుగావున నాజ్ఞోల్లంఘనము గావింప కేఁగి మరలిపోయిరి. పరభక్తికుదిరిన గోపకాంతలు భగవత్కైంకర్య

*కదంబవృక్షమే పరమపదము. అందలి కృష్ణుఁడే భగవంతుఁడు. యమునా ప్రవాహమే సంసారము. అందుఁ గ్రీడించుచు మునుఁగుచుఁ దేలుచునుండు గోపికలే జీవులు. గోపికలవస్త్రములే యైహిక పదార్థములు. భగవంతుఁడు దానెవరి ననుగ్ర హింపఁగోరునో వారి సర్వస్వము నపహరించును. భార్యా పుత్రధనాది వియోగము కలుగును. దానికి జ్ఞాని దుఃఖింపక భగవంతుఁడు బంధము దొలఁగించెఁగదాయని సంతోషించును. తెలివిమాలినవాఁడు భార్యపోయిన వేఱొకభార్యను గ్రహించును. కొడుకు చచ్చినఁ గొంపమునిఁగినదని యేడ్చుచుండును. ధనముపోయిన జీవచ్ఛవ మైయుండును. "అజ్ఞానే నావృతంజ్ఞానం, తేనముహ్యంతిజంతవ" యని కలదుగదా. సర్వస్వనాశమున జ్ఞాని యవధూతవలెఁ గట్టఁబట్టముపెట్ట గోఁచియులేక నిలఁబడును. భక్తుఁడో "స్వామీ నాయోగ క్షేమభారము నీయందు పైచితినిగదా, ఏమైనఁ జేయు" మని నమస్కరించి విచారములేక యుండును. భక్తుల యోగక్షేమభారముల వహిం చిన భగవంతుఁడు భక్తులకు భుక్తిముక్తులు రెండు నొసంగును. కృష్ణుఁడు గోపికల పట్లఁ జేసిన దిదియె.

రతులగుట పోరైరి. కాన దీనివలన భక్తిస్థిరపడినను లోకసంగ్రహార్థమైనను కులాశ్రమోచిత సామాన్యధర్మానుష్ఠాన మనివార్యమని యేర్పడియెఁగదా. తుదవఱకు గోపికలు సంసారమందే యుండిరి. (కృ. లీ. సం-౨. పుట-౧౨౬. పంక్తి-౧౦-౧౧.) ఇవన్నియు ధర్మసంస్థాపన కార్యములే కదా. భగవద్గీతయందు భగవంతుఁ డుపదేశించిన దిదియె కదా.

ఇఁక బృందావనలీలలవలన మనము గ్రహింపవలసిన నీతి యేదియో చూతము. కొందఱు లీలల తత్త్వార్థబోధకములైన రూపకములని యనుచున్నారు. ప్రకృతితత్త్వమంతయు నెఱిఁగిన సర్వజ్ఞంమన్యులు కొందఱు కృష్ణలీలలు స్వభావవిరుద్ధమనుచున్నారు. కొందఱు ప్రక్షిప్తము లనుచున్నారు. పురంజనోపాఖ్యానమువలె నివి రూపకము లనినచో నా చర్య లసత్యములని యంగీకరించినట్టే కదా యగు. పురంజనోపాఖ్యానము రూపకము కావున నసత్యము. పురంజనుఁడను పేరుగల మనుష్యుఁడు భూమిమీఁదఁ బుట్టను లేదు. పెరుఁగను లేదు. అందుఁ జెప్పినచర్యల జరుపను లేదు. కృష్ణచరిత్ర మట్టిది కాదు. కృష్ణుఁడు సత్యము. ఆయన చర్యలు సత్యములు. మహాత్ములేదో యొక నీతి లోకమున కుపదేశింపఁ గార్యములు చేయుదురు. కావున వారి చర్యలు తత్త్వార్థావబోధకములై యుండు. చర్య లసత్యములైనచోఁ బంచతంత్రమున కెంత గౌరవమో యంతయే భాగవతమునకగు. కావున నట్టియభిప్రాయము* సరిగాదు. కృష్ణుఁడను పురుషుఁడు దేవకీ

* The studied, strategic encounters of the demons sent by Kamsa, which Rama and Krishna with their playmates had to encounter every now and then in the forest, we cannot honestly explain away as mere accidents exaggerated into demon stories without tortouring the texts, and hiding the plain and clear meanings behind strained and farfetched interpretations of some of our critics. Even such arbitrary explanations cannot throw any light on most of these incidents, as we find them in the Puranas, and therefore these reckless critics have to take recourse to the theory of later additions and interpolations. Such a guess work can never give any satisfaction to a man even of an average understanding, and so instead of launching ourselves into

పుత్రుఁడు వసుదేవనందనుఁడు కంసహంత యుండినట్లు నిస్సందిగ్ధ ప్రమాణములుగలవు కావున నాయనచర్యలవలన మనము గ్రహింప వలసినదేమియని యాలోచింపవలయును.

పూర్వజన్మంబునఁ దా మొనర్చిన తపంబు కారణంబుగ దేవకీ వసుదేవులు భగవంతునిఁ బుత్రునిఁగాఁ బడసిరిగాని తత్ఫలంబైన యానందమనుభవింప నోచుకోరైరి. వృక్షమున ఫలముపుట్టును. మను ష్యులు భుజించి యానందింతురు. దేవకీవసుదేవుల కాభాగ్యము కలుగకుండుటకుఁ గారణము లేకపోలేదు. భర్త వసుదేవుఁడు భార్య దేవకి వీరిరువురయందు 'దేవ' శబ్దము సమానము. దేవశబ్దమునకుఁ గ్రీడించువారని యర్థము. వసుదేవుఁడనఁగా ధనముచేఁ గ్రీడించు వాఁడు, ధనముచేఁ బ్రకాశించువాఁడు. లేక ధనమే దేవుఁడుగాఁగల

---

the storeless sea of such baseless judgement, it is better to look at them as they are. although they may appear in the present state of our knowledge to be mere impossibilities, remembering the instructive and beautiful saying which Shakespeare puts in the month of his hero Hamlet, 'There are more things, Horatio, in the heaven and earth than are dreamt of in your philosophy.

"Science has proved many impossible things to be possible, and is it a wonder then, that what we cannot understand now and deem altogether impossible, may appear to us clear as day-light in some near or remote future ?"

"And because Divine Power was acting through him, therefore all his works were extraordinary, and has such, ordinary people in vain want to understand them in their ordinary way, as they would always form a hard nut for them to crack. To understand a great man we must ourselves be great; to reach a fruit on the highest branch of a tree, we must have to raise ourselves or something else to that level, if we want to get that fruit at all. If our critics want to understand Sree Krishna, let them at least imbibe a little bit of His infinite greatness. He is known as Hrishikesa or Lord of the senses; so let our critics raise themselves above their senses. let them be proof against all sorts of temptations, and then they will be able to understand some of the extraordinary incidents in His life."

SWAMI RAMAKRISHNANDA,
*The Pastoral Sree Krishna.*

వాఁడని యర్థము. దేవకీ శబ్దమునకుఁ గ్రీడించునదియనియే యర్థము. దేవకీ శబ్దమునకుఁ బాచికలని యర్థము.

ఈ కారణముచేత వీరిరువురు నైమిత్తికాసక్తులని యేర్పడుచున్నది. వసుదేవుఁడు యోగి జ్ఞానిగదా యందు లేని భగవద్గుణానుభవమువలనఁ గలుగు నానందము భక్తుని సొత్తుగాని జ్ఞానులసొత్తుగాదు వా రాత్మారాములు. వారు భగవంతుని యైశ్వర్యము ధ్యానించువారు. ఇరువురకు నంత్యఫల మొక్కటియే యైనను దారి నడచుటయందు భక్తునకుఁగల యానందము జ్ఞానికి లేదు. అవ్యక్తోపాసకులయిన యోగులలో భక్తులలో నెవరు శ్రేష్ఠులని యర్జునుఁడు ప్రశ్నింపఁ దన మూర్తిని ధ్యానించు భక్తుఁడే శ్రేష్ఠుఁడని కదా భగవంతుఁడు చెప్పెను.

శ్లో॥ మయ్యావేశ్య మనో యేమాం, నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా, స్తేమేయుక్త తమామతాః। ౧౨-౨.
యేత్వక్ష రమనిర్దేశ్య, మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్ర గమచింత్యంచ, కూటస్థ మచలంధ్రువమ్।
సన్నియమ్యేంద్రియగ్రామం, సర్వత్ర సమబుద్ధయః
తేప్రాప్నువంతి మామేవ, సర్వభూత హితేరతాః॥
క్లేశోధికతర స్తేషా, మవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తా హిగతిర్దుఃఖం, దేహవద్భి రవాప్యతే॥
యేతుసర్వాణి కర్మాణి, మయిసన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన, మాంధ్యాయంత ఉపాసతే॥

భగ. ౧౨. అ. ౨-౬. కృ. లీ. సం-౨. పుట-౪౦౦-౪౦౧.

కావున భగవంతుని ననుభవించు నానందము దేవకీవసుదేవులకు లేదయ్యె. ఆథర్వణిక కృష్ణోపనిషత్తునందు "నిగమో వసుదేవోయః" "దేవకీ బ్రహ్మపుత్రాసా" వసుదేవుఁడు వేదములు. దేవకి సరస్వతి యని యుండుటయు వీరు జ్ఞానమార్గ కర్మమార్గ నిష్ఠులను నభిప్రాయమే బలపఱుచుచున్నది. భగవంతు ననుభవించు నానందము యశోదానందులకుఁ గలిగె. ఏలన నందుఁ డానందుఁడే కదా. 'నిత్య

'తృప్తోనిరాశ్రయః' యన్నట్టు సర్వదా ఽనందసంపూర్ణుఁడు. భార్యయో యశోద. యశోద యనఁగాఁ గీర్తిని గలిగించునది. యశస్సనఁగా నన్ని దిక్కులయందు వ్యాపించునది.* కావున నందుని యానందము నిఖిల భూతములయందు వ్యాపించినదనియు నాయన సకలభూతహితుఁడనియు నేర్పడెను. పాలు పెరుఁగు నేయి వెన్న లోనగు సాత్త్వికాహారములు గొనుచు, నడవులలోనుండి యొకరికి హింసచేయక, నావుల మేపుటచే భూతరక్ష గావించుచు, నుండు వారికి సర్వభూత దయగాక మఱియేది పుట్టును ? గోవులనఁగా నింద్రియములు. గోకులమనఁగా నింద్రియస్థానమైన దేహము. ఆనంద మనుభవించునది మనస్సు గావున నందుఁడు. దానిని విస్తరింపఁజేయునది బుద్ధి యశోద.

'యో నందః పరమానందః' 'యశోదా ముక్తిగేహినీ' యని కృష్ణోపనిషత్తునందుఁ గలదు. పరమానందమే నందుఁడు. మోక్షలక్ష్మియే యశోద • ఇట్టిచోటఁ గాక భగవంతుఁడు మఱి యెందుఁ జేరును ? ఆయన యుండుచోటే వైకుంఠము. 'గోకులం వనవైకుంఠ' మ్మని యుపనిషత్తు. 'బృందాభక్తిః' యను నుపనిషద్వాక్యము చొప్పున బృందావనమే భక్తి. సాత్వద్భక్తియే రాధ. యశోదానందులు బ్రహ్మచే భగవద్భక్తి లభించునటుల వరము గొనివచ్చిన వారలు. కావున శ్రీకృష్ణుఁడు దేవకీవసుదేవుల విడిచి భక్తులు భక్తురాండ్రు నుండుచోటఁ జేరెను.*

---

* తేజః ప్రతాపాదులవలన వచ్చు ఖ్యాతికిఁ గీర్తియని పేరు. దానధర్మ పరోపకారాదుల వచ్చు ఖ్యాతికి యశస్సని పేరు. ఇది సర్వభూత హితము.

• ఆనందముతోఁ గూడిన మోక్షసుఖమే సుఖము. కాని "అవిదిత సుఖ దుఃఖం నిర్గుణం వస్తుకించి, జ్జడమతిరిహకశ్చిన్మోక్షఇత్యాచచక్షే" యనుకాళిదాస సూక్తి చొప్పున సుఖానుభవము లేని నిర్గుణ వస్తుతత్త్వమును భక్తుఁడు కోరఁడు.

*శ్లో॥ నాహం వసామి వైకుంఠే, నయోగి హృదయేషుచ
మద్భక్తా యత్రగాయంతి, తత్రతిష్ఠామి నారద॥

నారద ! నేను వైకుంఠమున వసింపను, యోగి హృదయములందు నుండను, నా భక్తులు నన్నెచ్చటఁ గీర్తింతురో యచ్చట నుందును.

భగవంతుఁడు తనయింట బాలుఁడై యాడుచుఁ బాడుచుఁ దనపై నెక్కి త్రొక్కుచుఁ బైఁటలాగుచుఁ జన్నుఁ వేఁడుచు నీలియేడుపు లేడ్చుచుఁ బైకి నెగఁ బ్రాఁకుచు ముద్దుమాటల నవ్వించుచు నుండ నాయనను దొడపైఁ గూర్చుండఁబెట్టుకొని ముద్దులుపెట్టి చిచ్చొచ్చళ్ళ హాయి యని జోగొట్టుచుఁ దొట్లలోనుంచి యూఁచుచుఁ బాటలు బాడుచు నెక్కడఁబడునో యెక్కడ లేచునో యని వేగన్నులఁ గని పెట్టుచు నాయన చేయు ప్రతిచేష్టకుఁ గొంతసేపు కోపము నభినయించుచుఁ గొంతసేపు సంతోషించుచుఁ బాలు వెన్నలోనగునవి యిచ్చుచు సింగారించుచు నాయనఁజూచి సంతోషించుచుండిన యశోదయు నందునియునానందమును బిడ్డలఁ గనిపెంచిన తల్లిదండ్రు లూహించుకొనుఁడని చెప్పుట నాయట్టివానికి యశస్కరము. అని ర్వాచ్యము ననుభూతము వర్ణించుటెట్లు?

యశోదానందుల వృత్తాంతమువలన మన మనస్సులు సంతుష్టములు భక్తియుక్తములు సర్వభూత హితములై యున్నయెడల మనలను వెదకికొనుచు భగవంతుఁడు వచ్చునని గ్రహించితిమి. ఇఁక గోపాలబాలుర చర్యవలన నేర్చికొనఁదగిన దేమో చూతము.

గోపబాలురు కృష్ణుఁడు తమతోడ నాడుకొను చెలికాఁడని యెఱుఁగుదురే కాని రాజకుమారుఁడని, గొప్పమహిమగల వాఁడని యెఱుఁగరు. ఇంటిలోఁ బెద్దవారట్లను కొన్నను వారది లెక్కచేసిన వారు గారు. యశోదానందులు కృష్ణన్నా! కృష్ణప్పా! కృష్ణయ్యా! కృష్ణమూర్తి! చిన్నికృష్ణాయని పిలుచుచుండిరిగాని వీరో యోరికృష్ణా యెక్కడనున్నావురా? మాకృష్ణుఁజేఁడమ్మ యశోదమ్మా! యనిపిలుచుచుండిరి. వీరుచేయు పనియేమి? ధ్యానము గాదు. జ్ఞానముగాదు. పాలిచ్చుటగాదు. వెన్నపెట్టుటగాదు. కూడనాడుకొనుట, చెల్లెకుట్ట, యొకరినొకరు తోసికొనుట చిగురుదండలు కట్టి తాము పెట్టుకొని కృష్ణునకుఁ బెట్టుట సఖ్యభావమే గాని గౌరవము లేదు. కావున వీరి మనస్సులు కేవలము నిర్మలములు. ఆడుకొను స్థలమో యేకాంత రమ్యవనము. ఇట్టి స్థితిమతిగలవార మైతిమేని భగవంతుఁడు మన

తోడను నాడుకొనును. ఆర్యులారా! మన యాయువు లల్పములు వీ ఘనకార్యములు సాంగోపాంగముగ సాంతముగఁ జేయుటకుఁ గాలము చాలదు. బెబ్బులివలె మృత్యు వెప్పుడెప్పుడు వాత వేసికొందమా యన కాచియుండును. దానితోడఁబుట్టినది జర. దేహవికారము లాలోచించిన నేయోగము సాధించుటకు వలనుపడదు. అన్నివయస్సు లందు నన్నికాలములందు సాధ్యపడునది యాడుకొనుటయే. మనస్సున కుల్లాసము గలిగింప దీనితో సమానమైనది వేఱొకటి లేదు. కావున నందఱు లీలాసక్తులగుట మేలు. ఈ యాట ప్రకృతితో నాడితిమా చెడితిమి భగవంతునితో నాడితిమా బాగుపడుదుము. వీరికిఁ గలిగిన నెట్టి కష్టముల భగవంతుఁడు తొలఁగించెనో గ్రంథమే చెప్పుచున్నది *

పూతనవధ :— కృష్ణుని జంప యత్నించెనని పూతనను దిట్టుదుము కాని యిట్టి శిశుహంత్రులు నేఁటికిని మన దేశమందే కొలఁది చోటులనున్నారు. బిడ్డలు నిద్దుర పోవవలయునని తల్లులు చనుముక్కలకు నల్లమందుఁబూసికొని పాలిచ్చియు, నితరులు నల్లమందు మాత్రలు గుత్తుకలో వేసియు శిశువుల దీర్ఘనిద్రఁబుచ్చుచుందురు. ఇట్టి దురభ్యాసములు నల్లమందుఁదినువారి కొంపల నుండును. దీనివలనఁ బూతనయు నాంధ్రదేశస్త్రీయో లేక యీవిద్య వీరివలన నేర్చినదో. పూతన భగవంతునకు విషము పెట్టి మోక్షము సంపాదించెను. వీరు శిశుహత్యసల్పి శాశ్వతనరకము సంపాదించుచుందురు. భగవంతుని యందు దుర్బుద్ధితోనో సుబుద్ధితోనో మనస్సు నిలుపుట సమర్పిం

* కష్టములు రానేల తొలఁగనేల? భగవంతుఁడు కృష్ణుఁడు కష్టములు రాకుండనే చేయరాదా యందువేని కష్టములు వచ్చిననే భక్తి కుదుటఁబడును. భోజనమున వేయువేలు రుచులేల? ఎండ వడఁబడిన వాఁడే నీటిపట్టు నాశించును నీడయందే యుండువానికి దానియందుఁ బ్రీతి కలుగదు దానిగుణము తెలియదు.

చుట ప్రధానము. భగవంతునకు నమృతము విషము తుల్యము.* బకా
సురుఁడు .— కొంగరక్కసుఁడు. బకధ్యానమని సుప్రసిద్ధము.

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య, య ఆస్తే మనసాస్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే॥ 3-౬
కృ. లీ. సం. ౨. ౩౪౨.

అను శ్లోకమునఁ జెప్పఁబడినవారే బకాసురులు. వీరు పరులకు
హింస దలపోసిరేని చెడిపోదురు. బకధ్యానము లవారిని భగవంతుఁడు
మెచ్చఁడు.

కృష్ణుఁడు దావాగ్నిని మ్రింగుట:- విస్తృత్తి వ్యిక్రయమున వచ్చు
పైకము వైశ్యస్త్రీల దయినట్లు గొల్లయిండ్లలో సామాన్యముగాఁ
బాలు పెరుఁగువలన వచ్చు లాభము గొల్ల యిల్లాండ్రది. పాలు
నిర్మలములు. మనోహరములు. పుష్టికరములు. వెన్నయుఁ గడు
మృదువు. మేనివేఁడికే కరఁగును. ఇటులగుటవలనఁ గృష్ణుఁడు గోపి
కల పాలు పెరుఁ గపహరించెననిన గోపికల మనస్సు లపహరించినాఁ
డని భావము. వెన్నవంటి వయస్సు, పాలవంటి కులమని చెప్పుటగలదు
గదా. భగవంతుఁడు క్షీరాబ్ధిశయనుఁ డనినప్పుడు నిట్లులే గ్రహింప

*పూతనయనునది శిశువులకు వచ్చు మహావ్యాధియని యది యొక గ్రహమని
వైద్యశాస్త్రమునఁ గలదు. ఈ పూతన పక్షిరూపమున వచ్చినట్టులు కొన్నిచోటులఁ
గలదు. కంసుని పంపున వచ్చిన రాక్షసియనియుఁ గలదు. ఇది పరస్పరవిరుద్ధమని
యసంభావ్యమని కొందఱు తలంపు వారు హరివంశములోని యీ వాక్యములఁ
దిలకింతురుగాక

శ్లో॥ కస్యచిత్త్వథ కాలస్య, శకునీ వేషధారిణీ
ధాత్రీకంసస్య భోజస్య, పూతనేతి పరిశ్రుతా॥
పూతనా నామశకునీ, ఘోరప్రాణ భయంకరీ
ఆజగామార్ధ రాత్రేవై, పక్షౌక్రోధాద్వి ధున్వతీ॥ విష్ణుపర్వము.
దీనిపై నీలకంఠవాక్యము.
శకునీపక్షిణీ బకానుజాత్వాత్, వేషధారిణీ తిమనుష్య
వేషధారిణీ కంసస్య, ధాత్రీతివ్రజ స్థైశ్రుతాః

బకాసురుని సోదరి కంసుదాది పూతనయను రాక్షసి మనుష్యస్త్రీ వేషమున వచ్చెనని
యెఱుంగవలయు.

వలయును. ఎవని మనస్సు నిర్మలమైన పాలవంటిదో యట్టివానియందు భగవంతుఁడు వసించును. సముద్రమని చెప్పుట వైశాల్యము గాంభీర్యము లోనగు గుణములఁ దెలుపుటకే. వాని మనస్సు సముద్రమువలె గంభీరమని చెప్పుట కలదుకదా. ఇట్టి నిర్మలమైన మనస్సువలన నమృతము సంపాదింపవచ్చును. అమృత మనఁగా మోక్షము. అమృతము లభింపవలయు ననిన మిక్కిలి శ్రమింపవలయును. మొట్టమొదటఁ జేయవలసిన పని భగవంతు నాశ్రయించుట. కార్యభారమంతయు భగవంతునిపై వేయవలయును. ఆ భారము మనయందుంచికొంటిమా మందరము దేవతలనెత్తిపైఁబడినట్టు లగును. మందరము విచారము. దీనిచేత మనస్సును మథింపవలయును. ఈ విచారమున నైహికవిషయములు (రాక్షసులు) తమవంకకు లాగును. ఆముష్మికచింతలు (దేవతలు) తమవంకకు లాగును. ఈ విచారము భగవంతుని విడిచి స్వతంత్రశక్తిచేఁ జేయరాదు. అట్లు చేసినయెడ మందరము మునిఁగినట్లు విచారము విషావముగఁ బరిణమించును. అప్పుడు భగవంతునిఁ బ్రార్థించితిమా యాయనయే యది మునుఁగకుండఁ (కూర్మావతారమెత్తి) కాపాడును. ఈ మథనసమయంబున నీయమృతాభిలాషుల యాస్థఁబరీక్షింపఁ బెక్కు మహావిఘ్నములు సంభవించును. కొన్ని భయంకరములు కొన్ని మనోహరములు సముద్రమథనంబునఁ దొలుత విషముగదా జనించెను. ఇట్టి సంకట సమయంబున భగవంతునే యాశ్రయింపవలయును. ఆయనయే దానిని బ్రత్యక్షముగనో పరోక్షముగనో హరించును. *గోకులంబునందలి దావాగ్నిని నట్టులే కృష్ణుఁడు ప్రత్యక్షముగ మ్రింగెను. ఇట్లు ప్రతికూలరూపవిఘ్నములు గాక యనుకూలరూప విఘ్నములు రత్నగజాశ్వాది సంపదలు గలుగును.

---

*హాలాహలమునకు భయపడి కొందఱు దేవతలు శివునొద్దకుఁ బోయిరనియుఁ గొందఱు విష్ణువునే ప్రార్థించిరనియు శివుఁడు వచ్చులోపల జగము నాశమగునని తలంచి విష్ణువే హాలాహలమును మ్రింగి శివుని వ్యర్థముగాఁ బంపిన నవమానపఱచినట్లగునని కొంచె మాయనకై యుంచెననియు నా కొంచె మాయన ద్రావెననియు నొక గ్రంథమునఁ గలదు.

వానితో సంతోషపడి ప్రయత్నము మానరాదు. ఇట్లు సంకల్పము నెఱవేఱువఱకు దృఢప్రయత్నము గావించిన నమృతము లభించు. భగవంతునిమీఁద భక్తిలేనివారికి (రాక్షసులకు) శ్రమముమాత్రమే ఫలము. భక్తులకు (దేవతలకు) నమృతము ఫలము. నందునిమందలోని వారికిఁ గీడు కలుగుట తొలఁగుట నిట్టిదశా భావింపవలయు.

కాలీయమర్దనము :— కాలసంబంధము కాలీయము. లకారక భేదము గావునఁ గాళీయము. యమునాప్రవాహమే సంసారప్రవాహము. యమునాజలము నలుపు. సంసారము దుఃఖమయము గావున నలుపే. కాలశబ్దమునకు మృత్యువనియర్థము. సంసారమునందు పురుషుని వాతవేసికొన నెన్నియో సర్పములు సుడిగుండములు మడుఁగులు సిద్ధముగా నున్నవిగదా.

శ్లో॥ తృష్ణాతోయే, మదనపవనోద్ధూతమోహోర్మిమాలే,
దారావర్తే, తనయసహజగ్రాహసంఘాకులేచ,
సంసారాఖ్యే మహతిజలధౌ మజ్జతాం నస్త్రిధామన్
పాదాంభోజే వరద ! భవతో భక్తినావం ప్రయచ్ఛ॥
(ముకుందమాల.)

సంసారసముద్రమున నాశయనునది నీరు. మన్మథుఁడే గాలి తుఫాను. మోహమే యలలు. భార్యయే సుడిగుండము. కొడుకులు నన్నదమ్ములే మొసళ్లు. దీనిని దాఁటుటకు భగవద్భక్తి యను నావ తప్ప వేఱుగతిలేదు. కావున భగవంతు నాశ్రయించినవారికి సంసారమున విషము తొలఁగిపోవ నది యమునానది గోగోప గోపాలికలకు వలె సేవ్యమగును,

ధేనుకాసుర, వత్సాసుర, పూతనాది వధలవలన నవధ్యులగువారును దన్నుఁ జంపవచ్చినవారు వధ్యులగుదురని గ్రహింపవలయు.

యమళార్జున భంజనము :— సాధువులయెడ వినయము దప్పి మత్తులై వర్తించువారు తామసజన్మము లెత్తుదురనియు వారిని సాధుసమ్మతిని భగవంతుఁడే కటాక్షింపవలయునుగాని యితరులు వారి నుద్ధరింపఁజాలరనియు నెఱుఁగవలయు.

తక్కినవిట్టులే గ్రహింపనగు.

*Several such incidents are mentioned in the Puranas to have taken in the early life of our Hero, who successfully put the demoniac authors of these to death, and began to increase in stature and strength, beauty and majesty rapidly. Some people like to look upon these demons as mere disastrous accidents which the baby of Yasoda, somehow or other, escaped, and these getting their colours from the hands of the poets, have been manufactured into demon stories. Modern science has taught such critics that the universe is made up of eighty elements which have certain fixed characters of their own. Those characteristics are always the same under the same circumstances, and go by the name of Natural laws. Atheists, Sceptics, and Agnostics, therefore, find no necessity of admitting a God as the creator of the universe, since those eighty elements and the laws which they obey are sufficient to explain all phenomena. They have reduced the whole universe and its workings to a combination of dull, dead, and inert matter and material forces. No intelligent power is behind all these, to order and regulate them. The aimless, thoughtless stream of creation is eternally running between its two banks of causes and effects, upon the bed of Space and Time coming from and going to the unknown and unknowable; and the self consciousness and intelligence of man, what are they ? They are merely the effects of the combinations of certain elements in certain proportions. Death dissolves the body, as well as the self. However rational these canclusions may appear, which I leave to my audience to refute, that they are extremely uninteresting, dull, prosaic, and undesirable, there can be no doubt about. Universe, in that case, is nothing more than an automatic machine unless it has been previously arranged or set in order by an intelligent being, nor of a soulless body having life in it, similarly it is impossible for us to imagine the existence of such a world. As in a living being life depends for its existence upon the soul that is, with the entrance or exist of the soul in the organism, life also will have to enter into or go away from it, similarly the cosmic life must depend for its existence upon a soul behind, but for which no life can exist. Thts is our honest conviction; and this was also the conviction in those old and hoary Puranic days when people were honest believers in a Universal Soul whom they called God. This God used to peep out to them through all glorious phenomena, all beauti-

ful, and charming manifesations of Nature; hence the Sun, the Moon the lightning and thunder, the sublime mountains like the Himalayas, the wide and long-winding rivers with pure and limpid water like the Ganges, the gigantic trees, which lift up their innumerable, massive, and leafy branches to reach the heavens, like pippal trees, the majestic king upon his brilliant throne. the glorious sages sitting above kings potentates and emperors, upon the thrones of eternal peace and bliss placed upon the adamantine rocks of Truth, and whatever is great, glorious, good and extraordinary were to them the manifestations of the Divine Soul behind the universe. As every limb of a living man is filled with the man, similiarly every important and impressive phenomenon in Nature was filled with that Divinity in their eyes. That being the case, is it not natural that the innocent and pure–hearted people of the period, and especially the inhabitants of Gokula, before whose eyes these incidents took place, should not look upon these extraordinary disasters in the early life of our Hero, as mere accidents which He accidently escaped, but as the workings of some superhuman evil Powers which he was able to put down with his own superhuman Divine power ? The modern critics may pity the innocent convictions of the people of those old days, but if we compare the old with the modern views, we can in no way envy the knowledge and improvement which Natural Philosophy has given to our modern civilized men and women. It has taken away much of the poetry from our heart, and has thrown us into a dull, dead, and inert world where a little amount of precarious and transient sensual enjoyment is the only charm for us. But trying to take away our God from us, it is also trying to deprive us of an all-loving, all protecting, all gracious, and all good Father, Mother, Master or Friend, and throw us under the mercy of unflinching, changeless, heartless and soulless laws of actions. If modern progress and civilisation can give us nothing better than this, can we rightly feel any pride by imagining that we are happier and better than the innocent people of those ancient days who always felt themselves protected and safe under the parental care of an all-merciful and all-loving Power. If it is a fact, that we create our own worlds, such as a happy man lives in a happy world, a miserable man lives in a miserable world, a saint lives in a world of saints, etc., then undoubtedly the happy men of those good oid days were living in a safer and happier world. This world was a picture of their bright hearts."

SWAMI RAMAKRISHNANADA,
*The Pastoral Sree Krishna.*

బ్రహ్మ గోపాలకుల దాఁచుట :— కొందఱు శుష్కజ్ఞానులు జ్ఞానమువలననే మోక్షమనియు, రామాయని కృష్ణాయని కీర్తించుట, భజనలుచేయుట పిచ్చిచేష్టలని వానివలన మోక్షములేదని యెంచి తమ యోగశక్తిచే నట్టి భగవత్సమీపవర్తులను భగవంతునినుండి భక్తిమార్గమునుండి దూరముగాఁ దొలఁగించి వారి స్వభావమునకు నూతనమైన జ్ఞానమార్గమునఁ బ్రవేశపెట్టఁజాలక యుభయభ్రష్టులఁ జేసి బ్రహ్మ గోపాలకులను గుహలో దాఁచినట్లు లజ్ఞానాంధకారమునఁ ద్రోయుదురు. మతిమాలిన క్రైస్తవమత బోధకులు చేయు ఘోర కార్య మిట్టిదేకదా ? ఈ మోహితులు భగవంతునిఁ దత్కాలమున మఱచినను భగవంతుఁడు వీరిఁ మఱువక కొంత కాలమునకైనను మరల నా దురభిమానుల గర్వమణంచి భక్తులను దన సమీపమునకుఁ దీసికొనును. తనమత మెక్కువయని తలఁచు దురభిమానియే బ్రహ్మ. గోపాలకులే భక్తులు. బ్రహ్మ గర్వమణంచి గోపాలకుల బ్రహ్మమాయ నుండి కృష్ణుఁడు రక్షించెను. క్రైస్తవమతమునఁ గలసిపోయిన హిందువులు తమ మతమునందలి న్యూనతను క్రైస్తవమతమునందలి మాహాత్మ్యమును దెలిసికాదు. వారు భ్రష్టులగుటకు వివేకానందస్వామి చెప్పినట్లు స్త్రీలో ధనమో కారణము. భ్రష్టులై యిప్పుడు పరితపించువారెందఱో కలరు. వీరికిఁ గ్రైస్తవమత హీనత్వము నార్య మతము మాహాత్మ్యమును బోధించువారు గలిగిన మరల హిందూ మతమునఁ జేరుట నిస్సంశయము.

—◆ గోపికాకృష్ణ లీలాప్రశంస. ◆—

శ్లో॥ జయతి జననివాసో దేవకీ జన్మవాదో
యదువర పరిషత్స్వైర్దోర్భి రస్య న్న ధర్మమ్॥
స్థిరచర వృజినఘ్నః సుస్మిత శ్రీముఖేన
వ్రజపురయువతీనాం వర్ధయన్ కామదేవమ్॥

భాగ. ౧౦ శుకవాక్యము.

కం. పాపాత్ముల పాపములం
బాపంగా నోపునట్టి పద్మాక్షునిపైఁ

భాషము గలదని పలికిన
పాపాత్ముల పాపమునకుఁ బారము గలదే. ఆం. భాగ. ౧౦.

స్త్రీపురుష భేదజ్ఞానరహితుఁడును, జీవన్ముక్తుఁడును, నవధూతయు నగు శ్రీశుకయోగి యాసన్నమరణుఁడు, ముముక్షువు నగు పరిక్షిత్తునకు నెవరిలీల వినిచి దానిని 'రాసవిజయరూప' మనియు శ్రద్ధతో వినువాఁడును వినిపించువాఁడును భగవంతునందుఁ గామంబు జయింపఁగల పరభక్తినొంది శీఘ్రకాలంబునఁ బూర్ణంబుగ హృదయతాపంబులెల్లం బాయునని వచించెనో, యాపత్కాలంబున ద్రౌపది* నిజమానసంరక్షణమునకై యెవ్వరిఁ బ్రార్థించెనో, యేకాంత భక్తికి లక్ష్యంబుగ నేకాంతలఁగొని నారదమహర్షి "యథా వ్రజగోపికానా" మ్మని సూత్రించెనో, యేస్త్రీలు మనోమాలిన్య రహితులని "అత ఏవ తదభావా ద్వల్లవీనా"మ్మని శాండిల్యమహర్షి వచించెనో, యెవరిని గూర్చి పరాశరమహర్షి "చింతయంతీ జగత్సూతిం పరబ్రహ్మ స్వరూపిణీ, నిరుచ్ఛ్వాసతయా ముక్తిం గతాన్యా గోపకన్యకా" యని రచించెనో, యెవరి నుద్దేశించి మహాయోగియగు నుద్ధవుఁడు "వందే నంద వ్రజస్త్రీణాం, పాదరేణు మభీక్ష్ణశః। యాసాం హరి కథోద్గీతం, పునాతి భువనత్రయ"మ్మని నమస్కరించెనో, యాళ్వారు లందఱుఁ దామే స్త్రీలవలెఁ నుండఁగోరియు సహజపురుషభావంబున నటువర్తింప నేరరైరో, యేమత్తకాశినుల వృత్తం బనుకరించి యాముక్తమాల్యద ధన్యురాలయ్యెనో, భక్తాగ్రేసరులందఱు నెవరివృత్తంబు పరభక్తికి మార్గదర్శిగ గ్రహించిరో, యట్టిగోపికల విషయమునఁ బాశ్చాత్య విద్యాసురాపానమత్తులు, తచ్చోదిత దురభినివేశచిత్తులు, నార్యసనాతన మతవారిపూర వ్యర్థీకృత నిజమతౌత్కృష్ట్య దురభిమానాగ్నులు నగువారు పిచ్చివ్రాఁతలు వ్రాసిన లోటేమి? పాశ్చాత్య నృత్యక్రీడల యందు నర్ధనగ్నల నృత్యంబుఁ జూచువారును, దానఁ దృప్తినొందకయో తదదర్శనలోపపూర్తికో యట్టి సిగ్గుమాలిన స్త్రీలపటంబుల

* శ్లో॥ ఆకృష్యమాణే వసనే, ద్రౌపద్యా చింతితో హరిః
గోవింద ద్వారకావాసిన్ కృష్ణగోపీ జనప్రియ॥

నైనఁ జూచి ధన్యతనొందఁ గోరువారును, సంతకు సంతుష్టిలేక వివిధ వికారవివసనస్త్రీల పటంబులఁగొని యుంచుకొని చూచుచుండువారును, దుష్కామరసపూరితులును, వివిధ ధవాసక్తవిధవల యెదుట దిసమొలల స్నానము చేయు విధురులును, నాత్మవత్సర్వభూతాని యను న్యాయమనుసరించి జితేంద్రియత యెట్టిదో యెఱుఁగక లోకమంతయుఁ దమయట్టిదే యని దురభిప్రాయపడుచు జితేంద్రియుల గోపికాకృష్ణుల దూఱనాడుట నేమివింత ? వారి మనస్సు నతిక్రమించి వారెట్లు పోఁగలరు ?* లోకమున దుర్యోధనునకు సజ్జనుఁడు, యుధిష్ఠిరునకు దుర్జనుఁడు కానరాకుండుటయందుఁ జిత్రమేమిగలదు ? భక్తిలక్షణ మెఱుఁగని కొందఱు (దుష్కామరహితులయ్యు) దేనిని భక్తులు పరభక్తియని సంభావించుచున్నారో దానిని బరమనీచమని యెంచుచున్నారు. పూర్వుల దృష్టికి నిప్పటి పురోభాగుల దృష్టికిని భేదకారణ మిదియే. ఇట్టివారి వ్రాఁతలు ముగ్ధులను బెడత్రోవఁ ద్రొక్కించునుగాని గోపికా కృష్ణచరిత్రము కాదు.

---

*ఎండు వేసంగిని మండునెండలో నొకఁడు బాటకుఁ బ్రక్కఁ రిత్తనేలఁ బరుండి గాఢముగ నిద్రించుచుండెను. అప్పుడొక త్రాగుఁబోతు మార్గమునఁబోవుచు వానిని జూచి "యాహా ! త్రాగిన వీనివలెఁ ద్రాగవలయును. లేకుండిన నూరకుండవలయు. క్రిందఁమీఁదఁ గాలుచున్నను వీనికి దేహస్మృతి గలదేమో చూడు" మనుకొనుచుఁ బోయెను. అవలఁ బాటుపడి జీవించు కష్టజీవియొకం డాత్రోవఁబోవుచు వానినిజూచి "కష్టముచేసిన వీనివలెఁ జేయవలయును, ఎంత శ్రమింపకయున్న బొబ్బలువోవునట్లు కాయుచున్న యెండలో నొడలెఱుఁగక నిద్రించునా" యనుకొనుచుఁ బోయెను. అవల యోగియొకఁ డాత్రోవఁబోవుచు "బలే యోగసమాధి యనిన నిదికదా. కొఱవులతోఁ జూఁడినట్లు లెండమండుచున్నది. పెనమువలె నేల కాలియున్నది ఇచ్చట వీఁడు సమాధియందున్నవాఁడే యెంతటి మహానుభావుండో" యనుకొనుచుఁ బోయెను. రామకృష్ణపరమహంససూక్తులు.

కావుననే కామదాసులకు గోపికాకృష్ణులు కాముకులుగ గానవచ్చుట, హరిదాసులకు భక్తురాండ్రుగను భగవంతుఁడుగను గానవచ్చుట.

మనదేశంబున వ్యభిచారంబునకు గోపికాకృష్ణచరిత్ర కారణ మని పాశ్చాత్యు లనుచున్నారుగదా. 'షార్లిమాన్' అను క్రైస్తవ చక్రవర్తి* "అనేకులు సన్న్యాసులు జారత్వమునను మఱియు ననేక నీచగర్హ్య చేష్టలను బరాయణులై యున్నారని మాకు భీతికరమైన వార్త తెలియవచ్చెను..........ఇట్టి దురభ్యాసముల నత్యంత విధియుక్త మగురీతి నిషేధించుచున్నారము. అంతియుగాక యిట్టి దుష్కామ ముల సంతుష్టి పడుటయం దాసక్తిగల సన్న్యాసులందఱు మఱియే

---

* If the Rasu be held to be the root of vices among the Vaishnavas, what did the 'pure religion' of Christ do for Christian morals that the Emperor Charlemagne had to issue the following notable edict.—"We have been informed to our great horror, that the monks are addicted to debauchery and all sorts of abominations even — — . We forbid all such practices in the most solemn manner, and hereby make known that all monks who indulge in the gratification of such lusts, will be punished by us severely that no Christian will ever care to commit such sins again. We command our monks to cease swarming about the country, and we forbid our nuns to practise — — and intoxication. We shall not allow them any longer to be — — thieves, murderers, and so forth, to spend their time in debauchery and sing improper songs. Priests are here-with forbidden to haunt the taverns and market places for the purpose of seducing mothers and daughters. J. N MITRA-KRISHNA.

'Arrayed in gorgeous silk, satins, and velvets, covered with flashing gems--mine is bu the common story of every physician---I have had known women walk into my office and inquire 'Are you the doctor ?' and upon an affirmative reply, without further preface, say, I want you to produce .... .... as coolly as if ordering a piece of beef for dinner — — yet, with such facts before us brown stone palaces will continue to be built on the Fifth Avenue and do business of — — will thrive and the rich occupants will snap their fingers at the laws, for have they not the reputation of the wives and daughters of lawyers, jurors, aye, even of judges themselves in their hands ?"

Ths Conjugal Relationship As to health by

A, R. GARDNER, M. D.

క్రైస్తవుఁడు నిట్టి పాపముల మరలఁ జేయ జంకునంత కఠినముగ దండింపఁబడుదురనియు నీమూలమునఁ దెలియఁజేయుచున్నారము. దేశమందంతట సన్న్యాసులు గుంపులు గూడరాదని యాజ్ఞాపించుచున్నారము’ సన్న్యాసినులు .... .... టను, మత్తుగలిగించు పదార్థమును దినుటను, నిషేధించుచున్నారము. ఇఁక నేమాత్రమైనవారు .... .... గను, దొంగలుగను, హత్యచేయువారుగను, మఱియు నిట్టి యితర దుష్కార్యములను జేయువారుగను, వ్యభిచారమునఁ గాలముపుచ్చువారుగను, ననుచితములైన పాటలు పాడువారుగను నుండుట సహింపము. తల్లులను, గూఁతులను, శీలభ్రష్టలఁజేయ నాశనించుటకై కల్లుగుడిసెలను సంగడివీధులను గులగురువులు సదా యాశ్రయించియుండుటను నిషేధించుచున్నారము.’’ అను నిట్టి శాసనము ప్రకటించుటకుఁ గ్రీస్తు కారణమో కృష్ణుఁడు కారణమో తమది “పవిత్రమత”మని చెప్పుకొను క్రైస్తవమత బోధకులు సెలవిత్తురుగాక. ఇందుఁ జుక్కలుంచినచోట నుండు పదము నోర నుచ్చరించునది గాదు. చేత వ్రాయఁదగినది కాదు. అట్టి మహాపాపకార్యము పాశ్చాత్త్యులమూలమున మనదేశమందును స్త్రీలయందును బురుషులయందును గొంత సంక్రమించినది. పాశ్చాత్త్యసాంగత్యమువలనఁ గలిగిన యనర్థకములలో నిది యొక మహానర్థకము.

అసూయాపిశాచిగ్రస్తులయు భక్తిజ్ఞానశూన్యులయు మాటల నటుండనిచ్చి పూర్వు లీవిషయమును భావించిన విధంబును దానికిఁ గారణము నాలోచింతము. ఈ వ్యాసమును బఠించుటకుఁ బూర్వము కృష్ణలీలామృతంబునఁ గొన్నియైన నొకపరి పఠింపఁ బాఠకులు ప్రార్థితులు. అవి యీ పుటలయందుఁ గానవగు. పుట 17 పంక్తి ౨౧-౨౨; 51-౧౫; 68-71; 74-౧-౨౨; 116-౧౯-౨౦; 117-౮; 131 కడపటినుండి ౧-౨-3; 134-౧-౨-3; 136 కడపటి రెండుపంక్తులు; 137-148; 176 కడపటి రెండుపంక్తులు; 177-231; 248-249-250; 252-253; 284-283-305; సం-౨.178-180.

## గోపిక లెవరు ?

శ్రీరామావతారంబున దండకారణ్యమందలి కొందఱు ఋషులు శ్రీరాముల జగన్మోహనదివ్యసుందరవిగ్రహముం జూచి యానందపరవశులై కౌఁగిలింపఁగోరఁగా నీజన్మంబున మీకోరిక నెఱవేఱదనియు, మఱుసటి యవతారంబున గోపికలై కౌఁగిలింపుఁడనియు వరము బొందినవారు కొందఱని "గోపికాభూత్వామా మాలింగథ" యను నాథర్వణిక కృష్ణోపనిషత్తు వాక్యమువలనను పద్మపురాణమువలనను దెలియవచ్చెడి. మఱికొందఱు "తత్ప్రాజార్థం సంభవంతు సురస్త్రియ" యని బ్రహ్మచే నాజ్ఞప్తలై తద్భక్తిగలుగ వరమునొంది పుట్టినవారు. "గోప్యాగావో ఋచ" యను కృష్ణోపనిషద్వాక్యము వలన ఋక్కులును గోపికలుగను గోవులుగను జన్మించుటయ్యె. వీరు గాక కొందఱు నిత్యసిద్ధులు. కొందఱు సాధనసిద్ధులు. శ్రీరాములను గౌఁగిలింపఁగోరిన ఋషులయందును, బ్రహ్మచే నాజ్ఞాపింపఁబడిన దేవతాస్త్రీలయందును భగవన్మహిమ వెల్లడిసేయు ఋక్కుల యందును నిత్యసాధనసిద్ధులయందును భగవంతునియందలి ప్రేమ సమానవస్తువని యేర్పడెను. పురుషులైనను విశేషకామాసక్తులగుదురేని స్త్రీలై జన్మింతురనియుఁ "గామోష్టగుణ ఉచ్యతే" యన్నట్లు స్త్రీలయందుఁ గామమే మిక్కుటమైయుండుట సహజగుణమనియుఁ బాఠకులు మఱవకుందురుగాక.

గోపికలు వారి పూర్వజన్మంబుల సేకరించిన ప్రేమ యంతటితో నశించెనా ? అ యెప్పటికి నశింపదు. క్రమక్రమాభివృద్ధిగాంచును. "నమేభక్తః ప్రణశ్యతి"* యని కలదుగదా. పూర్వజన్మానుక్రమమే మఱుసటిజన్మము. మాఱునది దేహమేకాని యాత్మగాదు.

---

*శ్లో॥ తత్రతం బుద్ధిసంయోగం, లభతే పౌర్వదైహికమ్
యతతేచ తతోభూయ, స్సంసిద్ధౌ కురునందన
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపిసః॥ భగ, ౬-౪౩-౪౪,
కృ లీ. సం-౨. పుట-౩౭౨,

శ్లో॥ శరీరం యదవాప్నోతి, యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతానిసంయాతి, వాయుర్గంధానివాశయాత్ ॥౧౫-౮
కృ. లీ. సం-౨ పుట. ౪౧౩.

అన్నట్టులు జీవుఁడు పూర్వజన్మవాసనాయుక్తుఁ డయియే యొక దేహమును విడిచి వేఱొక దేహమునఁ బ్రవేశించును. అట్టులే గోపికలును బూర్వజన్మవాసనాయుక్తలై యెచ్చట జన్మించిన వారి కోరికలు కొనసాగునో యచట జన్మించిరి. సంకల్ప రూపముననుండు భక్తి బీజమును నంకురితముఁ జేసి ఫలవృత్తముగాఁ బెంచి ఫలమొసఁగఁ జేయు భారము భగవంతుఁడు తనయందే యుంచుకొన్నాఁడు గదా. గౌణ భక్తికైనఁ గొంత పురుషప్రయత్నము కావలయును గాని పరభక్తి కేవల భగవత్సంకల్ప సిద్ధము. తనంతట నదియే రావలయును గాని బలాత్కార ప్రయత్నముచే లభించునది గాదు. ఫలవృత్తమునఁ బూవులు పండులు నా యా ఋతువులఁ దమంతటఁ దామే పొడచూపును గాని యకాలంబున బలాత్కరించిన వచ్చునా ?

గోపికల మనంబుల భగవంతుఁడు ప్రేమాభివృద్ధి యెట్లు గావించి వారి మనస్సులను దనయందు నాటుకొనఁ జేసెనో చూతము.

గొల్లెతలకుఁ బాలు పెరుఁగు వెన్న మీఁగడ నెయ్యి యివియే సర్వైశ్వర్యములగుట నిర్వివాదము. వీనియందు వారికిఁ గల ప్రీతి ధన కనకవస్తువాహనాదులందును నుండదు. వారికి గోధనమే ధనము. కావున నావులను దూడలను గవ్యములను వారెంతో ప్రేమించుచుందురు.

సీ. వసుమతీనాథ యెవ్వనిమీఁద నాకను
గ్రహబుద్ధి వొడము నా ఘనునివిత్త
మంతయుఁ గ్రమమున నపహరించిన వాఁడు
ధనహీనుఁడగుచు సంతాప మొందు
విడుతురు బంధు ల వ్విధమున నొందిలి
యైచేయు నది లేక యఖిలకార్య
భాగంబు లుడిగి మద్భక్తులతో మైత్రి
నెఱపుచు విజ్ఞాన నిరతుఁడగుచుఁ

గీ. బిడప వాఁడవ్వ యానందపదము నాత్మ
బరఁగి శ్రీవిష్ణులోక సంప్రాప్తినొందు
గాన నాసేవ మిగుల దుష్కరమటంచు
వదలి భజియింతు రితరదేవతల నిపుడు. భా. ౧౦ స్క.

అని స్వనియమ మనుసరించి గొల్లెతలకుఁ బ్రాణపదములైన దధిక్షీర ఘృతనవనీతాదులఁ గృష్ణుఁడు హరింపఁజొచ్చెను. దూడలు తమతమ తల్లులపాలు గ్రోలునట్లు తలుగులఁ దప్పించుచుండెను. వారి కతి సంచయ దోషము వాప భూతతృప్తిగఁ గొంత క్రోఁతులకు బంచిపెట్టు చుండెను. బిడ్డలకంటెఁ దల్లులకుఁ బ్రీతిపాత్రము లుండవు గనుక బిడ్డల ముడ్డి గిల్లి యేడ్పించి పోవుచుండెను. ఇట్లు తమ కత్యంత ప్రీతిపాత్రము లగు వానికే పోరాములు గలుగుటచే గోపికలు వానిని రక్షించుటకై కృష్ణుని వేయిగన్నులఁ గనిపెట్టుచు నేత్రోవ కృష్ణుఁడు వచ్చునో యని నిమిషనిమిషమున కరయుచు నిదోకృష్ణుఁ డదో కృష్ణుఁడు కృష్ణుఁ డిటువచ్చెఁ గృష్ణు డటుపోయె కృష్ణుఁడు వారింట నటుచేసెఁ గృష్ణుఁడు వీరింట నిటుచేసెనని కృష్ణకథాశ్రవణ మననాదులు చేయుట తోనే వారి కహర్నిశములు సరిపోవుచుండెను. ఇంతేల

శ్లో॥ రామో రామో రామ ఇతి, ప్రజానా మభవత్కథాః॥
"రామభూతం జగదభూత్త"ను నట్లు గోపికలమంతయుఁ గృష్ణమయ మయ్యెను.

సీ. కలకంఠి ! మావాడ గరితలమెల్ల నీ
పట్టి రాగలఁడని పాలు పెరుఁగు
నిండ్లలోపలనిడి యేమెల్లఁ దనత్రోవఁ
జూచుచో నెప్పుడు చొచ్చినాఁడొ
తలుపులు ముద్రలు తాళంబులును బెట్టి
యున్న చందంబున నున్న వరయ
నొక యింటిలోఁబాడు నొక యింటిలోనాడు
నొక యింటిలో నవ్వునొకటఁ దిట్టు

గీ. నొకట వెక్కిరించు నొకొక్కచో మృగ
పక్షి ఘోషణములు పరఁగఁ జేయు
నిట్లు చేసి వెనుక నెక్కడఁ బోవునో
కానరాఁడు రిత్త కడవలుండు. ఆం. భాగ.

ఇన్ని యిండ్లలో నీవిధముగ నేకకాలమున నిన్ని రూపములు ధరించి యిందఱికన్నులు గప్పి యిన్నికుండల పాలు పెరుఁగు వెన్న తిని యిన్ని చేష్టలు చేసి యదృశ్యుఁడైన బాలుఁడు ప్రాకృత మనుష్యుఁడో మహా యోగీశ్వరుఁడో యాలోచింపుఁడు. ఈ విధముగ గొల్లకుటుంబినులు నెల్లవేళల శ్రవణమననాదులఁ గృష్ణధ్యాన నిరతలై యుండిరి. స్నిగ్ధములై నిర్మలములై మృదువులైన నెయ్యి వెన్న లోనగు వానివలె స్నిగ్ధములై నిర్మలములై మృదువైన వారి మనస్సుల నపహరింప నాయాపదార్థముల హరించెఁగాని వారికి ద్రవ్యహాని గూర్పఁగాదు. ఏలన గోపికలే కృష్ణుని వెదకునెడ

శ్లో॥ జయతి తేఽధికం జన్మనా వ్రజః శ్రయత ఇందిరా శశ్వదత్ర హి॥
కృ. లీ. 205 పుట.

అని మునుపటికంటెఁ బాఁడి సమృద్ధియని వచించిరి కదా.

ఈవిధముగ బాలవృద్ధగోపికల మనంబులు స్వాయత్తంబులు గావించికొని శ్రీకృష్ణుఁడు తన్నుఁగానని నిమిషము వారికొక కల్పంబుగఁ దోఁపఁజేయుచుండెను. బృందావనంబునఁ గావించిన కార్యములచేఁ శ్రీకృష్ణుఁ డన్నివయస్సుల స్త్రీపురుషులకుఁ బ్రియతముఁ డయ్యె. (చూడుడు పుట 116–౧౫–౨౦; 117–౮. 111. ౭–౧౮–౧౪–౧౬. 114–౭–౧౦. 131–౨౮–౨౪–౨౬.

సౌందర్యమహిమ.

ఈవిధముగఁ గృష్ణునం దనన్యమనస్కలైన గోపతరుణుల విడిచి గోపకన్యాప్రశంస గావింతము.

శ్లో॥ తాసామావిరభూచ్ఛౌరిః స్మయమానముఖాంబుజః
పీతాంబరధరస్స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః॥
కృ. లీ. 215–౨–౫ పం.

యున్నట్లు కృష్ణుఁ డత్యంత దివ్యసుందర విగ్రహుఁడుగదా.

శ్లో॥ యద్యద్విభూతి మత్సత్త్వం, శ్రీమదూర్జిత మేవవా
తత్తదేవా వగచ్ఛత్వం, మమ తేజోంశ సంభవ॥

కృ. లీ. సం-౨. పుట-౩౬౩ పం-౧౧-౧౩.

మన్నట్టు లోకమున నేది యత్యంతసుందరమని తలంతుమో యందలి సౌందర్యము భగవత్సౌందర్యమునఁ బరమాణు భాగము. ఈ ప్రాకృత వస్తువునందలి సౌందర్యమే వర్ణనాతీతమగుచుండ నిఁకఁ బూర్ణ సౌందర్యమును దాని మహిమను నెవ్వండు వర్ణింప సమర్థుఁడు?

ఒకనిని నధఃపాతాళమునఁ ద్రొక్కుటకు, వైకుంఠమున కెత్తుటకు సమర్థమైనది సౌందర్యమే. వీరు వారనక, యీజాతి యాజాతి యనక, యీవయ స్సావయస్సనక, సమస్త శరీరుల మనంబుల నాకర్షించునది సౌందర్యమే. ఎట్టి క్రూరునిఁగాని యెట్టి యోగినిఁగాని స్త్రీ గృహకుంభదాసునిఁ జేయునది స్త్రీల సౌందర్యమేకదా. చంపఁగత్తినెత్తిన ఘాతకుని మనంబునైనఁ గరఁగించునది సౌందర్యమే. స్త్రీల పాతివ్రత్యమునకు వేరువిత్తగునది పురుషసౌందర్యమే. అన్నిగుణములను లోననే యణఁగఁద్రొక్కి వెలుపలఁ బ్రకాశించునది సౌందర్యమే. పరిపక్వదశనొందిన వైరాగ్యముతప్ప సౌందర్యమునకసాధ్యమైనది లోకమున లేదు. దాని మహిమ యేమోకాని పురుషులను బురుషులే వలతురు. స్త్రీలను స్త్రీలే వలతురు. శూర్పణఖవంటి సర్వవికారపు ముసలిముండయును ముక్కు చెవులు గోలుపోయి రామలక్ష్మణులఁ జంపింపవలయునని క్రోధపూరిత మనస్కయై ఖరునియొద్దకుఁ బోయినపుడు నిన్నెవ్వఁడే యిట్లు చేసెనని వాఁడడుగ రాముఁడు లక్ష్మణుఁడని చెప్పుటకుమాఱు తనకుఁ గన్నుల కట్టినట్లుండు వారి సౌందర్యమును దలఁచి "తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ పుండరీక విశాలాక్షౌ" యని పెండ్లికొడుకును స్మరించు వధువు వలె వర్ణింప నారంభించెను. ఇది యేఁడుది కామపీడితయందమా. రామలక్ష్మణుల సాముద్రికలక్షణము లేవియని సీత యడుగఁగా హనుమంతుఁడు "రామః కమలపత్రాక్షః సర్వసత్త్వ మనోహర" యని ప్రారంభించెను. ప్రత్యక్షానుభవ సిద్ధమునకుఁ బ్రమాణాంతరము లేల?

భగవత్కళాలేశమైన ప్రాకృతసౌందర్యమునందే యెంతో మహిమ గాన వచ్చుచుండఁ బరిపూర్ణ సౌందర్యనిధియై 'పుంసాం మోహన రూపాయ' యన్నట్లు సాక్షాన్మన్మథ మన్మథుఁడై జనియించిన దివ్య సుందరమూర్తి సౌందర్యం బెంతటి కార్యంబుఁ జేయఁజాలదు? తారుణ్యమున వార్ధకమున నెంతో ఘోరముగఁగానవచ్చు జంతువు లును బాల్యమున సుందరములుగానే యుండును. వసంతకాలమునందలి వృక్షముల నన లెట్లుండునో తక్కిన ఋతువులం దెట్లుండునో చూడమా. చిగుళ్లెట్లుండునో ముదురుటాకు లెట్లుండునో కానమా? అట్లులే బాల్యమునందు జనాకర్షక సౌందర్యము గలదు. సౌందర్యము రూపమునందే కాదు. అన్నివిషయంబులఁ గలదు. గ్రహణశక్తి కలవి కన్నులుమాత్రమే కావు. శబ్దసౌందర్యమును వీనులు గ్రహించును. రససౌందర్యమును నాలుక గ్రహించును స్పర్శసౌందర్యమును త్వక్కు గ్రహించును, గంధ సౌందర్యమును నాసిక గ్రహించును. భావసౌంద ర్యమును మనస్సు గ్రహించును. వాల్మీకివ్యాసకాళిదాస భవ భూత్యాదులను మనము దర్శింపకున్నను వారిగ్రంథమువందలి భావ సౌందర్యమున కానందించుచున్నారముకదా. ఇఁక కృష్ణునందో దేహ సౌందర్యము వాగ్మిత్వము (ఇంద్రయాగవిషయమునఁ గావించిన యుప న్యాసము. దూతయై కౌరవసభలోఁ గావించిన యుపన్యాసము భగవ ద్గీత పఠింపుఁడు.) గాన కళాచాతురి పరోపకారాదిగుణ సౌందర్యము దేహబలము సౌహార్దము సౌశీల్యము లోనగు ననేకసుగుణములు నెలకొనియుండెను. ఈగుణములన్నియు సామాన్యమనుష్యునందుఁ గొంచెముగా నుండిన నతఁ డెంతో మహానుభావుఁడని దేవాంశ సంభూతుఁడని మనమెంచుచున్నారముగదా.

అట్లుండ నిన్ని యుత్తమోత్తమగుణములకుఁ దోడుగ నతిమా నుషకృత్యంబులను నొనర్చిన కృష్ణుని గోపికలు గోపాలురు దేవుండని భావించి సంభావించినఁ దప్పేమి? అనేక రాక్షసవధ గోవర్ధనోద్ధారణ కాళియమర్దన దావానలాస్వాదన విశ్వరూపప్రదర్శనేత్యాద్యసాధ్య కార్యనిర్వాహకుని వారు దైవముగ నెంచుటయందు దోషము లేదు.

గర్గవాక్య మందఱెఱేఁగియే యున్నవారు. ఇట్టి దివ్యసుందరమూర్తిని మహానుభావుని గోపకన్యకలు ప్రేమించు టాశ్చర్యమా?

ఎందున్నను సౌందర్య మెన్నఁటికి ననివార్యముగఁ బ్రేమ జనింపఁజేయును గాని క్రోధాదిగుణముల జనింపఁజేయదు. సౌందర్యముఁగని కినియు స్త్రీపురుషులు లోకంబున లేరు. సుందరులగు సవతులు ద్వేషించుటకు సౌందర్యము కారణము కాదు. స్వార్థలాభహానికై ద్వేషింతురు. వారే యక్కసెల్లెండ్రుగానున్న ద్వేషింతురా? కావున సౌందర్యము కారణము. కార్యము ప్రేమ కార్యము కారణమందు సంక్రమించును గావున గోపికల ప్రేమ కృష్ణునందే ప్రసరించుటయు స్వభావవిరుద్ధము గాదు.*

ఈప్రేమ సర్వసామాన్యమై కృష్ణునిఁ జూచిన యందఱియందననేల పశుపక్ష్యాదులందును జనించియే యుండును. ఇఁక గోప

స్పర్శమహిమ.

కుమారికలయందలి విశేషమేమో చూతము. పల్లెటూళ్లయందు నేఱుపిడుకలకుఁ, జేఁడకు, విడియాకులకు, గట్టెపుల్లలకు, నాఁడుపిల్లలు పోవుట యాచారము. అట్టులే గోపకన్యక లొకనాఁ డడవికిఁబోయిరి. వారి పూర్వపుణ్యవశముననో పూర్వజన్మమున లబ్ధవరలగుటనో, వారియందుఁ శ్రీకృష్ణునకు ననుగ్రహబుద్ధి జనింపఁగా వారు శ్రీకృష్ణచరణారవిందంబుల స్పృశించిరి. ఆ గడియమొదలు వారు తమ దేహములను మనస్సులను కృష్ణార్పణము గావించి తదేకచిత్తలై తద్వశలైరి. ఈ విషయములు గోపికల వాక్యంబులలోని "అంబుజాక్షా! వనవాసులకుఁ బ్రియుఁడవై మహాలక్ష్మికిని మహోత్సవకారణంబైన నీపాదతలం బరణ్యంబున నొక్కపరి స్పృశియించితిమి. అదిమొదలు కృష్ణా! నీయందే మనస్సానందించుచున్నది. కావునఁ బామరుల యెదుట నెట్లు నిలువఁగలవారము? నీ పాదాంబుజంబులయందుఁ గ్రీడించుచిత్తంబు తుచ్ఛంబులు నశాశ్వతంబులునగు వానిపైఁ

---

* శ్లో॥ సుందరంపురుషం దృష్ట్వా, భ్రాతరం పితరంసుతమ్
యోనిర్ద్రవతినారీణాం, తథ్యంమేబ్రూహికేశవ॥ యని ద్రౌపది చెప్పెఁగదా॥

బోవునే!" యనువాక్యమువలనఁ దెలియవచ్చెడిని. (కృ. లీ.పుట 196) యోగసిద్ధులు మహాత్ములు నగు గురువులు శిష్యులను స్పృశించుటచే వారియందుఁ దమ ప్రాణశక్తిని ప్రవేశింపఁజేసి వారియందుఁగల రజస్తమో రూపక హృదయమాలిన్యమును హరించి సత్త్వమును ప్రకాశింపఁజేయుదురు. యోగాభ్యాసము చేయువారు తాము సంగ్రహించిన యీ ప్రాణశక్తిచేతనో దాఁకుటచేతనో చూచుటచేతనో యూఁదుటచేతనో రోగుల రోగములను నివారింపఁజేయుదురు. ఈశక్తి మహిమ యార్యచరిత్రమాలికాగ్రంథములందు వివరింపఁబడి యుండుట నింకు వివరింపఁబనిలేదు. ఈశక్తి స్పృశించువారి కరచరణముల ద్వారమున నితరులలోఁ బ్రవేశించును.

ఈ కారణముచేతనే చిన్నవాండ్రు పెద్దలకు గురువులకు దైవములకుఁ బాదములఁబడి నమస్కరింతురు. పెద్దలు పిన్నలశిరముల హస్తముంతురు. ఈశక్తిని సంధ్యాజపతపఃప్రాణాయామేశ్వర ప్రణిధాన సాత్త్వికాహారాదులవలన సంపాదింపనగు. వేఁడినీటి పాత్రమును దగులునట్లు చల్లనీటి పాత్రముంచిన వేఁడినీటిపాత్రము వేఁడిమి చల్లనీళ్లను వేఁడిగ నట్లుచేయునో యట్లే యీశక్తియు నొకరిదేహములో నుండి మఱియొకరి దేహములోనికిఁ బోవును. కావుననే యిట్టి శక్తి నార్జించువా రితరుల స్పృశింపరు. కొంతదూరముననే యుందురు. తాఁకవలసి యుండినను గుంపులోనికిఁ బోవలసియుండినను శక్తి వెలుపలికిఁ బోకుండు నుపాయము చేసికొందురు. యోగులకే యొకరి దేహమునస్తత్త్వముల మార్చు శక్తియుండ యోగీశ్వరుఁడు యోగేశ్వరుఁడు పరబ్రహ్మమునగు కృష్ణునకుండుట వింతయా? తన వక్షస్థలమున హస్తముంచినవాఁడు మొదలు వివేకానందస్వామి రామకృష్ణ పరమహంసగారి సాత్త్వికుఁడయ్యెనో* యట్లే పాదస్పర్శ చేసిననాఁటినుండి గోపికలు కృష్ణుని సాత్త్వికులైరి.

---

*"In that state he (Sri Ramakrishna Paramahamsa) came down from his seat and walking across the room came to Noren (afterwards Swami Vivekananda) who was sitting close at hand and placed his right hand upon the boy's heart and then, draw-

శ్రీకృష్ణసౌందర్యము గోపకన్యకలయందుఁ బ్రేమ జనింపఁ జేసెనని మీఁదఁ జెప్పఁబడెను. ఆప్రేమ శుద్ధసాత్త్వికముగాక ప్రకృతి ప్రయుక్తముగుటచే మిశ్రమైయుండెను. శ్రీకృష్ణ పాదస్పర్శమువలన నా మాలిన్యము పాసెను. ఇట్లు శేషించిన ప్రేమకు గతియేమి ? మనకొక వస్తువునందుఁ బ్రేమజనించిన మనమేమి చేయుదుము. సాధ్యమైన యెడల దానిని గ్రహించుటకో, కాకుండిన దానితోడఁ గూడి యుండుటకో యత్నింతుము గదా. అట్లే గోపకన్యకలు కృష్ణునిఁ దమ సొత్తుగఁ జేసికొనఁ గోరిరి. ఎట్లు వా రాయనను గ్రహింపఁ గలరు? అట్టిశక్తి వారియం దేమి యున్నది? కర్మఠులై గ్రహింపఁగలరా? జ్ఞానయోగమున సాధింపఁగలరా ? భక్తి యెట్టిదో దానిలక్షణము వారెఱుఁగుదురా ? వారియం దేది ప్రధానగుణమో దానిచేతనే కదా వారు గ్రహింపవలయును. కర్మజ్ఞాన భక్తియోగము లందు భగవంతు నాకర్షించునది యేది ? వారు చేయు క్రియలా ? కాదుకాదు. వారి మనస్సు. అట్లే గోపికలయందును స్త్రీలయం దన్నిటిని మించి యుండునది స్త్రీత్వకారణమైనది కామమే. 'కామోష్టగుణ ఉచ్యతే' యని కలదు కదా. కావున నట్టి కామముచే వారు కృష్ణుని సాధింపఁ బ్రయత్నించిరి. ఇదియే కదా స్వభావసిద్ధమార్గము. భగవంతుఁడు

---

ing himself up, put his left hand upon the shoulder of the boy and gazed into his eyes as if to break his body conciousness which is the next of dreams And Noren ! Noren; for him the room, the verandhas, the Temple, the garden of Dakshineswara, the faces and forms of the devotees and of the master seemed all of a sudden to fade out. At the touch of the master his concious ness was dissolving .... — He had turned the subconscious currents of Noren's tendency, by force as it were, into the s per-conscious channel — — — Noren realised that Sri Rama Krishna was a man who could turn his own soul from consciousness into the shoreless sea of the consciousness of God, at will. But from that time when the master touched the heart of his disciple he owned and possessed him. It was a possession, however, which meant the highest freedom fo Norren's own soul."

Life of VIVEKANANDA SWAMI.

చెప్పిన స్వధర్మ మిట్టిదేకదా. దీనియందు దోషముండినను గుణవంత మైన పరధర్మమునకంటె నిదియే శ్రేయస్కరమని భగవంతుఁడు చెప్పిన మాట గోపికల విషయమున నెట్లు యథార్థపడెనో చూడుఁడు. వీరు పరధర్మములైన కర్మజ్ఞానమార్గములఁ బోయియుండిన నేగతిఁ బట్టి యుందురో. భగవంతుఁ డేల యట్లు పోనిచ్చును.

ఈ కామము ధర్మసహితమని ధర్మవిరుద్ధమని రెండు తెగలు. భార్యాభర్తలకామము ధర్మసహితము. ఇదియును గొన్నివేళల నధర్మ మేయగు. (పతీహితచర్యఁ జూడుఁడు.) భార్యాభర్తలుగాని స్త్రీ పురుషుల కామము ధర్మవిరుద్ధము. ఇందుఁ జెప్పఁబడిన ధర్మము సామాన్య ధర్మమే కాని విశేషధర్మము కాదు. అది మఱియొకచో వివరింపఁ బడుడు. కావున సామాన్య ధర్మమార్గమున వర్తింపఁగోరి గోపకన్య కలు శ్రీకృష్ణునే పెనిమిటిగాఁ జేసికొన నాసక్తలైరి. ఈయాసక్తినే భక్తి శాస్త్రజ్ఞులు కాంతాసక్తి యందురు.

ప్రేమ.

ఇచటఁ బ్రేమనుగుఱించి కొంచెము ప్రశంసింపవలసి యున్నది.

శ్లో॥ సర్వథాధ్వంస రహితం సత్యపి ధ్వంసకారణే
యద్భావ బంధనంయూనోః, సప్రేమ పరికీర్తితః॥

యువయువతులకుఁ గల భావబంధనము ధ్వంసమై పోవఁగారణము లుండినను నట్లు చెడక యుండునేని దానికిఁ బ్రేమని పేరు. ఇది యువయువతులందే కాక యెవరియందైన నవ్వయించును. పేర్లు భేదించును. భార్యాభర్తల ప్రేమ కామము. తల్లిదండ్రులకు బిడ్డ యందలి ప్రేమ వాత్సల్యము. దైవమునందలి ప్రేమ భక్తియని యిట్లు ప్రేమమే నానా నామముల సందర్భముకొలఁది పిలువఁబడుచుండును. మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవో భవ. యని యుండుటచే వీరందఱు దేవసములు గావునఁ దల్లి, దండ్రి, యాచార్యాదులయందలి ప్రేమను మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి యందురు. తనకంటె భార్యాపుత్రధనాదులు నికృష్టములగుట భార్యా భక్తి, పుత్రభక్తి, ధనభక్తి యనరు.

ప్రేమయనునది దైవికశక్తి. "పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబల క్రియాచ" యనియు "జలధేరివశీతతా దయేత్వం, వృషశైలాధిపతేః స్వభావభూతా" యనియుఁ గలవుగదా.

భగవంతుఁడు జగత్సృష్టి స్థితిసంహారాది కార్యములు చేయును. తేజోబల పరాక్రమాదు లుపకారసాధనములు. భగవంతుని యీ ప్రేమశక్తినే లక్ష్మియందురు. లక్ష్మి ప్రేమస్వరూపిణికదా. ప్రేమకు స్థానము హృదయము గావున లక్ష్మినారాయణుని హృదయమం దుండును. 'విష్ణోరేషానపాయినీ' యన్నట్లు లామె యెన్నఁడును భగవంతుని విడిచియుండదు. భగవంతుఁడు ప్రేమను విడిచిన లోకము గతి యేమి ? బిడ్డలు రోగపీడితులైనపుడు వారు పడెడు బాధకంటె వారి తల్లిదండ్రు లెక్కువ బాధపడుదురు. అట్లే తన బిడ్డలైన జీవాత్మలు సంసారమునఁ జిక్కి పడెడు బాధలకు వారికంటె నెక్కువగ భగవంతుఁడు శోకించును. వా రానందించిరేని వారికంటె నెక్కువగఁ దానానందించును.

శ్లో॥ వ్యసనేషు మనుష్యాణాం, భృశంభవతి దుఃఖితః
ఉత్సవేషు చ సర్వేషు, పితేవ పరితుష్యతి॥

యని వాల్మీకిరామాయణమునఁ గలదుగదా.

శ్లో. మమయోని ర్మహద్బ్రహ్మ, తస్మింగర్భం దధామ్యహమ్
సంభవ స్సర్వభూతానాం, తతోభవతి భారత॥ ౧౪-౩.
సర్వయోనిషు కౌంతేయ ! మూర్తయ స్సంభవంతియాః
తాసాంబ్రహ్మ మహద్యోని, రహంబీజ ప్రదఃపితా॥ ౧౪-౪.
కృ. లీ. సం-౨. పుట-౪౦౩.
పితాహ మస్యజగతో, మాతాధాతా పితామహః॥ ౯-౧౭.
కృ. లీ. సం-౨. పుట-౩౮౬. పంక్తి-౧౦.

మృతకల్పులై జడములవలెఁ బడియుండు జీవులకుఁ గరణకళేబరము లిచ్చి రక్షింప భగవంతుఁడు జీవులను ప్రకృతియందుఁ జేర్చును. ఆ మాత్రముననే జడమైన ప్రకృతియు జడకల్పుఁడైన జీవుఁడు నేమియుఁ జేయఁజాలరు. బియ్యము నీళ్లుకలిపిన నన్నమగునా ? కావున సృష్టికిఁ గాను భగవంతుఁడు తన ప్రేమశక్తిని వీనియందుఁ బ్రవేశపెట్టును.

వానివలన నవి వికసించిన చైతన్యముగలవై సృష్టికార్యము చేయ
శక్తిగల వగుచున్నవి. కావుననే లక్ష్మీదేవిని "చైతన్య స్తన్యదాయిని"
యని పెద్దలు చెప్పెదరు.* ప్రేమచే నచేతనములు చేతనములగుట
అండెకే అనుమానియుండుఁ గన నగు. ఇవి స్త్రీరూపములుగల జ
గ్రహములు. వీనియందుఁ దొలుత జీవచైతన్యము లేదు. పురుష
ప్రాణి దీనితో సంభోగించినయెడల నిది బిడ్డలఁ గనును. చైతన్యము
గలదగును ♦ మీఁద వ్రాసిన విషయమెంత సరిదాఁకెనో కంటిరి గదా
'యస్యాస్తే మహిమాన మాత్మనఇవ త్వద్వల్లభో ప్రభుః । నాలం
మాతు మశక్య' యన్నట్లు లాయన మహిమ యాయనయు నెఱు
గునో యెఱుంగఁడో.

స్పర్శముచే గోపికలకు శ్రీకృష్ణుఁడు చేసిన లాభమేమన, భక్తి
విఘ్నకారణములగు రజస్తమస్సుల నణంచెను. దానివలనఁ గో
కత్తిరించిన దీపమువలె వారిభక్తి విజృంభించి ప్రకాశింపసాగెను. స్నేహ
భావము ప్రేమ. భగవద్విషయమున స్నేహపూర్వానుధ్యానము
భక్తి. పునర్విశ్లేష భీరుత్వము ♦పరభక్తి. 'చిచ్చుఁబుట్టునే పరుల

---

* శ్లో॥ సమస్త జననీంవందే, చైతన్య స్తన్యదాయినీమ్
శ్రేయసీం శ్రీనివాసస్య, కరుణా మివరూపిణీమ్॥
అచిద విశేషాన్ప్రళయే, జంతూనవ లోక్యజాతనిర్వేదా
కరణకళేబరయోగం, వితరసి వృషశైలనాథ కరుణేత్వమ్॥దయాశతకము

♦ "The greatest agent is love. A poet loving nature and a
its forms loving the Naiads, the Dryads, the Oreads puts a sou
into them That explains the myth of the Undines[1] who get
soul when faithfully loved. That explains how we hasten th
evolution of animals by love. That explains why when highe
beings love us we develop rapidly. That explains also why, acc
ording to the Vedic Poets, praise and devotion increase the st
rength of God, the strength of all powers of nature. Intricate ar
the meshes of Karma but love can unravel them and bring ou
the imprisoned splendour." ZERO.

♦ భగవంతుని విడిచి యుండలేకుండుట పరభక్తి.

---

1 "Undine A female water sprite without a soul but capa
ble of obtaining one by marrying a moral and bearing a child".

చెప్పినసైన నిజేచ్ఛనైన నేమిచ్చినసైనఁ గానలకుఁనేగినసైనహరిప్రబోధము' లన్నట్టు భక్తి పరోపదేశముచే లభింపదు. స్వప్రయత్నముచే తను రాదు. భగవత్సంకల్పమువలనఁ దనంతటఁ దానే చెట్టునందుఁ బువ్వవలె నుదయింపవలయును. భక్తిస్వతంత్రము. దానికదే ఫలము, భక్తికి భక్తికిమించిన ఫలములేదు. ఆ ఫలమును దప్ప వేఱుఫలమును నది గోరదు. జ్ఞానయోగమునకుఁ గర్మయోగమునకు ముక్తిఫలము. కావున నవి యస్వతంత్రములు. భక్తులు భక్తిచేఁగలుగు నానందమును దా మనుభవింపఁగోరుదురేగాని దానికంటె వేఱగుఫలమును గోరరు. ఇంతయేల? తమభక్తిచే భగవంతుని సంతోషపెట్టవలయునను తలంపు గూడ వారికిఁ గలుగదు. వారి కోరిక యానందానుభవ మొక్కటే. జీవుండులేని పదార్థము లేదుగావున జగత్సృష్టికిఁ గారణభూతమైన యీ ప్రేమ సర్వభూత సామాన్యము. లతా వృక్ష పక్షి పశువులందును ప్రేమ గన నగును గదా. భగవంతుని ప్రేమ యిట్టిదని మన మెఱుంగక యజ్ఞానాంధకారమున మునిఁగి మనలఁ జిరకాలముగఁ బ్రేమించు దేవునిఁ బ్రేమింపక కృతఘ్నులమై యున్నను భగవంతుని ప్రేమ దాను జేయవలసిన పని మనయందుఁ జేయుచునే యున్నది. దానిని మనము ధనదారపుత్రాదుల విషయమున నైహిక ఫల కాంక్ష దుర్వినియోగ పఱుచుచున్నారము. మనలను జెఱుచునది యీ దుర్వినియోగమే. ఈప్రేమను నశాశ్వతము దుఃఖకారణము లైన యైహికములందుంచుటకుమాఱు కృతజ్ఞులమై భగవంతుని యందుంచిన విషయానందమున కెన్నియోమడుఁగు లతిశయించిన శాశ్వత నిర్మల బ్రహ్మానంద మనుభవింపఁ గలము. మనము ప్రేమింపకున్నను భగవంతుఁడు మనలఁ బ్రేమించుట మనవలన నొక ప్రతిఫలముగోరి గాదు కదా. అటులే మనమితరుల ననేల భగవంతుని బ్రేమించుటయందును బ్రతిఫలము గోరరాదు. కావుననే భక్తులు మోక్షమునుగూడఁ గోరరు. శిలలుగానుండిన మనలను వృక్షములఁ జేసినదియు, వృక్షములనుండి తిర్యక్కులఁ జేసినదియుఁ, దిర్యక్కుల నుండి మనుష్యులఁ జేసినదియుఁ బశుప్రాయులైన మనుష్యులను

జ్ఞానులఁ జేయునదియు భగవత్ప్రేమయే కదా. మనుష్యుఁడుగాఁ బుట్టిన తరువాతఁగదా దేవుఁ డొకఁ డున్నాఁడను జ్ఞానము కలుగును. అంతవఱకు మనల రక్షించిన వా రెవరు ? భగవంతుని ప్రేమయే కదా. మన యభివృద్ధికై యిచ్చిన యట్టి ప్రేమరస ప్రవాహమును మనము కామ్యార్థులమై ధనములు ధాన్యములు భార్యలు బిడ్డలు మనుమలు మగలు గృహములు క్షేత్రములు వస్త్రములు వాహనములు సొమ్ములు లోనగు పెక్కుచీలు కాల్వలవెంటఁ బోనిచ్చి వ్యర్థపఱచుటకు మాఱుగ నీకాల్వలవెంటఁ బోనీక యఱికట్టి ప్రవాహమునంతయు నేకముఖముఁజేసి భగవంతుఁడను సముద్రమునఁ బాఱనిచ్చి సునాయాసముగఁ గృతార్థులము కాఁగలము. సముద్రములోని నీటిబిందు వావిరియై యెగసి మేఘమై వర్షమై భూమియందుఁబడి వాఁగులలో వంకలలోఁ గలసి మహానదులఁ జేరి క్రమముగ నెట్లెట్లో సముద్రమును జేరునట్లు జీవుఁడును నేనాఁటికైన నొకనాఁటికి ముక్తుఁడగుట సిద్ధము. అయినను గాలహరణమున దుఃఖానుభవము మెండు గావున గమ్యస్థానము శీఘ్రముగఁజేర యత్నించుట బుద్ధిమంతుల లక్షణము. ప్రతిజీవియు సుఖకాంక్ష గలిగియు దుఃఖకారణములైన కార్యములు చేయుటకంటె శాశ్వతసుఖము నిచ్చు కార్యము లేల చేయరాదు ? మహైశ్వర్య సంపన్నుని కొడుకయ్యుఁ జిరప్రవాసియై దేశాటనము గావించుచుఁ గూటికి నీళ్ళకు మొగము వాఁచి కన్నకష్టములు పడుటకంటె నిల్లుచేరి యెంతో వాత్సల్యసంపన్నుఁడైన తండ్రి తనకై యెత్తియుంచిన భోగ్యముల భుజించుచు నేల సుఖింపరాదు ? సూక్ష్మభూతములనుండి పుట్టిన స్థూలభూతములు మరల నెట్లు సూక్ష్మములలో లయమై తుదకు భగవంతుఁ జేరుచున్నవో యట్లే ప్రేమను స్థూలముల వెంటఁ బోనీక మరలించి భగవంతునియందు లయింపఁజేయువారు ముక్తులు. అటు చేయనివా రెన్నికోట్ల జన్మములందైన యాతాయాత యాతన ననుభవించుచుండవలయు. ఇట్లు భగవంతుఁడు తమయందుంచిన ప్రేమను మరల భగవంతునియందే వినియోగించు కృతజ్ఞులు భక్తులు.

“తైర్దత్తా నప్రదాయైభ్యో యోభుంక్తే స్తేనఏవసః” యన్నట్లు మనయొద్ద నొకరొక సొత్తుంచి దీనివలన నీవు వ్యాపారము చేసి బాగుపడి మరల నాసొత్తు నాకిమ్మని యిచ్చిన దానిని వానికీయక కలకాలము స్వప్రయోజనముగ దుర్వినియోగపఱుచు వాఁడు దొంగయే కదా. భక్తు లిట్లు తలంతురు. భగవంతుఁడు మనవలన నేమి లాభమునుగోరి మనలఁ బ్రేమించుచున్నాఁడు. నిర్వ్యాజముగఁ గదా ముందు మనల నిష్కారణముగఁ బ్రేమించిన వానిని బ్రేమింపకుండుట కృతఘ్నతగదా. స్వామీ! నిన్ను నేను బ్రేమించెదను. నాకు భూములిమ్ము సొమ్ములిమ్ము చీరలిమ్ము బిడ్డలనిమ్మని బేరమాడుటయుఁ, దాము గర్భములో నుండినది మొదలు తమకుఁగాను వారు పడిన పడరాని పాట్లెల్ల మఱచి బిడ్డలు పెద్దవారైనపుడు తల్లిదండ్రులారా! మీయందు మేము దయగలవారమై యుండెదము మాకేమి లంచమిచ్చెదరని యడుగుటయు సమానము లేకదా. ఒక జన్మమునఁ గరణకళేబరదాతలై రక్షకులైన తల్లిదండ్రులఁ బ్రేమింపని వాఁడే పరమపాపుఁడగుచుండ ననేకజన్మములనుండి మనల రక్షించుచుండు భగవంతునిఁ బ్రేమింపనివాఁ డెట్టివాఁడని చెప్పవలయును? అనితలఁచి భక్తులు నిష్కాములై భగవంతునియందు భక్తి సేయుదురు. మన మొకరిని బ్రతిఫలాపేక్ష లేక ప్రేమించినచో నొక విధమైన యానందము మనస్సునఁ గలుగును. ఆత్మానందమును గలిగింపని శుద్ధప్రేమ లేదు. స్వభావముచేతనే యానందము ప్రేమ ననుసరించియుండును. ప్రేమ యతిశయించుకొలఁది యానంద మతిశయించుచుండును. ఈకీలెఱిఁగి భక్తులు భగవంతునియందలి తమ ప్రేమ నతిశయింపఁ జేయుచుందురు. తలచుట్టము తోఁకపగ లేదు గదా. అట్లే ప్రపంచమంతయు భగవన్మయము గావునఁ బ్రపంచమునందయు వారు ప్రేమింతురు, వారికి ద్వేష్యపదార్థమే లోకమున లేదు. ప్రణమేదీశ్వరకలా మాశ్వచండాల గోఖరమ్.’ (కృ. లీ. సం-౩. పుట-౨౮౨. అనియు

శ్లో॥ విద్యావినయ సంపన్నే, బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ, పండితా స్సమదర్శనః॥ భగ. ౫-౧౮.
(కృ. లీ. సం-౨. పు-౩౬౨.)

యనియు భగవంతుఁడే సెలవిచ్చెఁ గదా. ఇందు జ్ఞానయోగులు సర్వము భగవన్మయమని తెలిసికొందురు. భక్తు లంతటితోఁ బోక ప్రేమింతురు. ఈప్రేమవలనఁ గలుగు నానందమేదియో దాని ననుభవింప భక్తులు గోరుదురుగాని భుక్తిముక్తులఁ గోరరు. భగవంతుని సంతోషింపఁజేయు కోరికకూడ వారికి లేదు. అయినను భక్తిని వెంటనంటియే భగవదనుగ్రహము వచ్చుచుండును. ఆ కారణముచే భగవంతుఁడు కారణముని కాని భగవంతుని సంతోషింపఁజేయ భక్తుఁడు భక్తి చేయుచున్నాఁడని కాని చెప్ప వలనుపడదు. పుష్పము వికసించునపుడు తన్నుఁజూచి మనుష్యులు సంతోషింపవలెఁ, దుమ్మెదలు రావలెననుకోరిక దానికిఁ గలదా? భగవంతుని సంతోషపఱుపవలయుననుతలంపు భక్తులకు లేదేని భక్తుల ననుగ్రహింపవలయునన తలంపు భగవంతునకు లేకపోవచ్చును గదా? యందురేని యది సర్వ శక్తిమంతుఁడైన భగవంతున కసాధ్యకార్యము. ఏల? స్వస్వభావ విరుద్ధము. భగవంతుఁ డెట్లు జ్ఞానానందమయుఁడో యట్లు ప్రేమమయుఁడు. ఎండ లేని సూర్యుఁడు సూర్యుఁడు లేని యెండ వలె ప్రేమ యాయనను విడిచియుండదు. ఆయన ప్రేమను విడిచి యుండజాలఁడు. తా నజ్ఞానియై పోవలయుననిన భగవంతుఁడు పోఁగలఁడా? తాను శోకించుచు నొకమూలఁ గూర్చుండవలయుననిన నుండఁ గలఁడా? అట్టులే ప్రేమయును. అజ్ఞాన శోకములు ప్రత్యేకగుణములు గావు. జ్ఞానము మఱుఁగుపడుటే యజ్ఞానము ఆనందము లేకుండుట శోకము. వెలుతురు లేకుండుటే చీఁకటి. నీడయుండుఁ జెట్లు చెడుట నీడ కారణముగాదు. సూర్యరశ్మి లేకుండుట కారణము. చీఁకటి సూర్యునెట్టు లాక్రమింపఁజాలదో యట్లజ్ఞాన శోకములు జ్ఞానానందమయుఁడైన భగవంతునందుఁ గలుగఁ జాలవు. నిలువఁ జాలవు. అట్టులే భగవంతుఁడు తాను ప్రేమలేనివాఁడు గావలయునని

గాఁజాలఁడు. కావున భక్తియున్నచోట భగవంతుఁ డుండును. భగవంతుఁ డున్నచోట జ్ఞానశోకము లుండవు. ఇదియంతయు నప్రస్తుత ప్రశంసయని పాఠకులు కినియకుందురుగాక.

మీఁదఁ గాంతాసక్తియని పరభక్తియని రెండుపదము లుపయోగింపఁబడెను గోపికలయం దన్వయించుటకు వాని లక్షణ మెఱుఁగవలయును గదా. పూర్వోత్తర సందర్భములఁ దెలుపక నడుమ నొకదానిఁ దెలిపిన సుబోధము కాఁజాలదు గనుక భక్తిమార్గమున నడచు సంసారిజీవుని చర్య కొంచెము ముచ్చటింపవలసియున్నది. అదియునుగాక భక్తి తనంతటఁ దానెట్లు పుట్టునో చెప్పవలసియున్నది.

బద్ధజీవచర్య.

సంసారమను తప్తతైలమునఁబడి తపించు జీవిసంకటపాటు సర్వజనానుభూతమగుటవలన వర్ణించు టనావశ్యకము.

అనేక సహస్రజన్మంబుల నిట్లు తపింపఁ దపింప నొకానొక జన్మంబున ననేక పూర్వజన్మంబులఁ దెలిసియో తెలియకయో కొంచెము కొంచెముగ సేకరించిన సుకృతము బలంబున భగవదనుగ్రహంబున నొకానొకనికి నొకానొకనాఁడు నిర్వేదంబు జనింప నిట్లు తలపోయఁ దొడంగు. అయ్యయ్యో! యెన్నిలక్షల జన్మము లెత్తితిని. ఎనుబది నాలుగులక్షల యోనులని పెద్దలు చెప్పుదురుగాని యొక్కొక్క జాతి యందుఁ గలయవాంతర యోనులం దెన్నిట నెన్నిమార్లు జన్మించితినో యెవ్వఁ డెఱుఁగు. ఇప్పుడు రాయియని తీఁగయని చెట్టని పశువని పక్షియని మృగమని హీనముగ దేనిని జూచుచున్నాఁడనో యిన్ని యవతారములు నేనెత్తి యిన్నిరూపముల నున్నవాఁడనే కదా. రాయిగాఁ జచ్చి తీఁగనై, తీఁగగాఁ జచ్చి చెట్టై, చెట్టుగాఁ జచ్చి తిర్యగ్జంతువనై, యిప్పుడు మనుష్యుఁడనైతిని. మానవయోనియం దెన్నిమార్లు పుట్టితినో యింక నెన్నిమార్లు పుట్టవలయునో అన్ని జన్మములు వ్యర్థపఱిచితిని గదా. నేనిన్నిజన్మంబులం ద్రావిన చనుఁబాలెన్ని సప్తసముద్రములయి యుండునో. నా యెముకలు కుప్పవేసిన

నెన్ని మేరుపర్వతములగునో. ఎందఱు తల్లులో యెందఱు తండ్రులో యెంగఱు పెండ్లాలో ! ఎందఱ కడుపులు కాల్చితినో యెందఱ త్రాళ్లు త్రెంచితినో! నాకడుపెందఱు కాల్చిరో! పూర్వజన్మజ్ఞానమేనాకుండి, చచ్చిన తల్లిదండ్రులకు భార్యాపుత్రుల కేడ్వంబూనిన నెన్నికల్పము లైనఁ జాలునో! సంపాదించిపెట్టినఁ దినువారును, బెట్టుకున్నఁ దిట్టు వారే కాని నావెంటఁ దోడుగా వచ్చువారు వచ్చినవా రొకరును లేరు గదా. ఇంత దీర్ఘప్రయాణము నేనొకండనే కదా చేయుచున్నాఁడను. బాల్యమునఁ బరాధీనత నల్లాడునపు డేవి తనకుఁ బాలిచ్చి రక్షించెనో, గర్భనరకమునుండి యేద్వారమునుండి బయటికి వచ్చెనో దానినేకదా పెద్దవాఁడయినపుడు పురుషుఁడు కృతఘ్నుఁడై మర్దించి బాధించును. ఇట్టి కృతఘ్నునకు నరకయాతనగాక యింకేదిలభించును. ఎంతటి బుద్ధిహీనతయో కాని యాఁడుదాని జొల్లులో మూత్ర పాత్రములో మోతుమున్నట్టు దానికై దేవులాడితిని. ఆ విషయమున నేఁ బడినపాటు చెప్ప శక్యమా ? ఎంత పాపము ! ! ధనార్జనము సుఖము, భార్యాసంగమము సుఖము, పుత్రపరిష్వంగము సుఖ, మని తలఁచితినిగాని యేది సుఖమని భ్రమించితినో యదియే దుఃఖ కారణమని భావింపనైతిని. దావాగ్నిలోఁ జిక్కిన మృగమువలెఁ దాప త్రయములకు వశుఁడై తపించు నన్నెవ్వరు రక్షింప సమర్థులు ? ఎవ రిని వేఁడుదును ? ఎవరి పాదములఁబడుదును ? ఎవరు నాకు దిక్కు ? నిలువనీడలేక, త్రాగ నీళ్లులేక, నిరాలంబమై యుపాశ్రయరహితమై యత్యంతదీర్ఘమై మహా ఘోరమైన యమపురమార్గమున ముండ్లలో గండ్లలో ఱాలలో నన్నుఁ గింకరులు పాశంబులఁగట్టి దినమునకు రెండునూర్లనలువదియేడు యోజనముల చొప్పున వైతరణిగాక యెనుబదియాఱువేల యోజనము లీడ్వ నయ్యయ్యోయని యెన్ని మాఱు లేడిచితినో. అప్పుడొకరును రక్షించువారు లేరైతిగదా. పెద్దల సేవింపక, సాధుసాంగత్యము చేయక, సదాచారమున వర్తింపక, పుణ్యంబుసేయక, భగవంతు భజింపక, పశువువలె శిశ్నోదర పరా యణతఁగాలము వ్యర్థపఱుచు నన్నెవ్వరు రక్షింతురు ? ఏమి చేయుదు

దైవమాయని దీనుఁడై విచారపడఁజొచ్చును. దైవమా యనుమాట నోరవచ్చి మనస్సు దైవముమీఁదఁబోయి సర్వజీవరక్షకుఁడు భగవంతుఁడొకఁడున్నాఁడని తోఁచి నప్పటినుండి వీనిమార్గము మాఱును. విషయముల కభిముఖముగఁ బాఱు కామాసక్తమైన మనస్సును గొంచెము సేపైన నామార్గమునుండి భగవంతుని కభిముఖముగు మార్గముకఁ గ్రొత్తగఁ బ్రవేశపెట్టులే భక్తి మొనచూపుట. ఇంతవఱకుఁ బ్రేమయంతయు విషయములమీఁద నుండెను. దానినే త్రిప్పి యిప్పుడు క్షణమాత్రమున భగవంతునందు నిలుపఁబడెను. ఆకారణముచే శాస్త్రోక్తులందు శాస్త్రకర్మములందు శ్రద్ధ జనించి పెద్దల నాశ్రయించి యథావిధి కర్మములఁ జేయ నారంభించును. ఈ నిర్వేదము జనించువఱకుఁ జెవులలో జ్ఞానమని భక్తియని శాస్త్రమని జేగంట వాయించినను శంఖము పూరించినను దలలోని కెక్కఁడు. శాస్త్ర వాక్యములందు నమ్మిక గలవాఁడయ్యుఁ బ్రప్రథమమునందే యిది వఱకుఁ జిరకాలముగ నున్న కామాసక్తి నిమిషములో నశింపఁ జేయుట యసాధ్యము. కావునఁ దొలుత ఫలకాంక్ష స్వర్గ సుఖాదులఁగోరి కర్మములు చేసి వానిఫల మనుభవింప స్వర్గమునకుఁబోయి. పుణ్యక్షయమున మరల భూమిపై జన్మించి, మరలఁ గర్మములు చేసి మరల స్వర్గమునకుఁబోయి మరల ధరపై జన్మించుచునిట్లు చక్రమువలెఁ దిరిగితిరిగి తుదకు దానియందును విసుఁగుపుట్టి యశాశ్వత స్వర్గసౌఖ్యముఁ గోరక శాశ్వతసుఖముఁగోరి కర్మములొనర్చి ఫలముభగవంతున కర్పించుచుండును. దీనినే కర్మయోగమందురు. దీనివలన మనస్సు పరిశుద్ధమగును. ఇది భగవత్ప్రాప్త్యుపాయములకు విఘ్నములు చేయు పాపములఁ దొలఁగించును. పాపములు దొలఁగుకొలఁది ముక్తి లభించు నుపాయమేదియో యని విచారింప నారంభించును. ఇట్టిసాధనాన్వేషణ పరునకు సాధుసాంగత్య మావశ్యకము. సాధుసేవయే దైవభక్తికి బీజభూతము. అర్చనయం దిదియే ప్రథమము సాధుసాంగత్యము సాధు

సేవ యైహిక విషయములందు వైరాగ్యమును* పారలౌకిక విష యంబులందు నాసక్తియుఁ గలిగించును. అది కారణముగ నితరాలో చనములతో పాటప్పుడప్పుడు భగవచ్చింతనము కలుగును. ఇతరాలో చనములఁ గలిగించు మనోమాలిన్యమునకు ననర్థకములు కారణము. ౧. దుష్కృతము ౨. సుకృతము ౩. అపరాధము. ౪. భక్తియను నాలుగింటివలన ననర్థకముఁ గలుగును. మనస్సును బెడద్రోవద్రొ క్కించుటచే నివి యనర్థకములనఁబడును. దుష్కృతము పాపచింతలు గలిగించును. సుకృతము ధర్మచింతగలిగించును. ధర్మకార్యములు స్వర్గ ప్రాప్తికి సాధనములుగాని మోక్షమునకుఁగావు. అపరాధములు పది విధములు. ౧. వైష్ణవదూషణము. ౨. అన్యదేవతావహేళనము. ఒక దేవతనుబూజించువా రన్యదేవతల దూషింపరాదు. సర్వము బ్రహ్మమయమే కావున నెవరినిదూషించినను భగవంతుని దూషించి నట్లేయగు. 'ప్రణమేదీశ్వరకలామాశ్వ చండాల గోఖర'మ్మని యుండ నన్యదేవతా నింద భక్తిలక్షణముగాదు. ఉపచారము చేయకుండిన మానెఁగాని యపచారముచేయరాదు. వాస్తవమిట్లుండ పరస్పరము యథేచ్ఛము దూషించుచుఁ బూర్వ వైష్ణవాచార్యులనే తూలనా డుచు దేవాలయములఁ బూజాదులకు విఘ్నములుగావించు వడగల్ తెంగల్ శాఖలలోఁజేరిన కొందఱు వైష్ణవనామధారులు తల్లిగర్భ మునఁ బ్రవేశించు కాలమున నామె పశువుల స్మరించుచుండెనో చండాలుర స్మరించుచుండెనో యెవ్వ రెఱుఁగుదురు ? పూర్వజాతి వాసన పొరినట్లు చేయించును. భక్తి మతైకతాను లగువీరు స్వమ తాభిమానముపేరఁ జేయు ఘోరకార్యములు చండాలురును జేయరు, కావున వీరిని జండాలురని సందేహించుటయుఁ బాతకమే. కర్మచం డాలురకన్న జాతి చండాలురు శ్రేష్ఠులు. గౌరవార్హులు.* ౩. గురు

* శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం, నిస్సంగత్వే నిర్మోహత్వమ్
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం, నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥
సాధుసంగంబు సకలార్థసాధకంబు, మఱియు కృ. లీ. సం-౨. పుట-౧౭౧. చూడుము.

పును సామాన్యమనుష్యునిఁగ నెంచుట. ౪. శాస్త్రదూషణము. ౫. భగవన్నామసంకీర్తనము వ్యర్థమని తలంచుట. ౬. భగవన్నామముల కపార్థము చేయుట. అథోక్షజుఁడనఁగాఁ గ్రిందియింద్రియము (గుదము)లోనుండి పుట్టినవాఁడని చెప్పుటవంటిది. ౭. నామోచ్చారణ శరణాగత్యాదు లెట్టిపాపములునైన హరించునని క్రొత్తపాపములఁ జేయుట. ౮. భగవన్నామతుల్యముగ నితర ధర్మకార్యమును బేర్కొనుట. ౯. శ్రద్ధాహీనులకు భగవన్నామ ముపదేశించుట. శిష్యుల పాపమును గురువును బొందును గావున నితరులను జక్కఁగఁ బరీక్షింపక యుపదేశము చేయరాదు. ౧౦. భగవన్నామ మాహాత్మ్య మెఱిఁగి యుండియు నాసక్తి లేకుండుట. ౧౧. శ్రీరామకృష్ణాద్యవతారమూర్తులను సామాన్య మనుష్యులుగ నెంచి వారు మోక్షదాతలు గారనుట. ౧౨. అర్చావతార తిరస్కారము. ఇవియన్నియు ననర్థకములే. భక్తి వలనఁ గలుగు నపరాధములు ధనము కీర్తి సంతానము దేహారోగ్యము లోనగునవి ప్రతిఫలముగఁ గోరుట.

—• భక్తి పరిణామక్రమము. •—

ఈ యనర్థకములన్నియు భక్తికి నుపకారకములైన కొన్ని సదుపాయముల• నభ్యసించుటవలనఁ గ్రమక్రమముగఁ దొలఁగిపోవును.

* శ్లో॥ సూతోవా సూతపుత్రోవా, యోవాకోవా భవామ్యహమ్
దైవాయత్తం కులేజన్మ, మదాయత్తంచ పౌరుషమ్॥ అనికలదుకదా.

'అపూర్వకర్మచండాలమయి ముగ్ధేవిముంచమా' మ్మనుచోఁ దన్ను జాతి చండాలునకన్న నీచునిఁగాఁగదా శ్రీరాములు చెప్పుకొనెను.

• "ఏనకేనాప్యుపాయేన మనః కృష్ణేనివేశయే" త్తను నారదు వాక్యము చొప్పున నేవిధముగనైన భగవంతుని వ్యక్తమూర్తియందో యవ్యక్తమూర్తియందో దృఢముగ మనస్సునిలుపక ముక్తిలేదు. అవ్యక్తోపాసనము దేహధారులకు నసాధ్యమని యవతారమూర్తి యుపాసనమే భగవంతుఁ డామోదించెను. కృ. లీ. పుట. ౬౪౭. ౧౨ అధ్యా. కావున నది యప్రస్తుతమగుట వదలి వ్యక్తమూర్తి విషయము విచారింతము.

శా॥ కామోత్కంఠతగోపికల్, భయమునం గంసుఁడు, వైరక్రియా
సామగ్రిం శిశుపాలముఖ్యనృపతుల్, సంబంధులై వృష్ణులున్

ప్రేమన్ మీరలు, భక్తినేము నిదె చక్రింగంటి, మెల్లైన నద్ధా

ద్ధామధ్యాన గరిష్ఠుఁడైన హరిఁజెందన్ వచ్చు ధాత్రీశ్వరా ॥

గీ. అలుకనైనఁ జెలిమినైనఁ గామంబున, నైన బాంధవమున నైన భీతి
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ, జేరవచ్చు వేఱు సేయఁడతఁడు.

కం. వైరానుబంధనంబునఁ, జేరిన చందమున విష్ణుఁ జిరతరభక్తిం
జేరఁగ రాదని తోఁచెను"

అని నారదుఁడు వచించినట్లు వేరూపముననైనఁ దీవ్రధ్యానము ప్రధానముగాని దానికిఁ గారణమైన కామక్రోధాదిగుణములు కావు. పరతత్త్వ కృష్ణానుశీలన విన్నివిధములఁ జేయునగు అందుఁ బ్రేమచే ననుశీలనము చేయఁబూని శాస్త్రోక్త కార్యము లొనర్పఁబూనినచో భావోదయ మగు. ఇది సామాన్యముగా సగుణమై సోపాధియై యుండును. (సోపాధియనఁగాఁ బరిశుద్ధమైనది గాక యితరములతోఁ గలసినది.) ఈ సగుణ సోపాధి భక్తియే నిర్గుణనిరుపాధి భక్తిగఁ బరిణమించును ఇదియే సద్యోముక్తికిఁ గారణమగు సోపాధికభక్తి సకామమో (కోరికలతోఁగూడినది) నిష్కామమో (కోరికలులేనిది)యైయుండును. సకామభక్తినే గుణీభూత భక్తి యందురు. అనఁగా దీనియందుఁ గర్మము జ్ఞానము యోగము ప్రధానముగను భక్తి గౌణ (మప్రధాన) ముగను నుండును. దీనివలన సిద్ధులు లభించును. (కృ లీ సం ౩.172.)

దీని నార్తుఁడు, జిజ్ఞాసువు, అర్థార్థియనువా రనుసరింతురు. కావున నిది ము త్తెగలగు. ఈమూఁడు తెగలలో నొకటొకటి సాత్త్వికమని రాజసమని తామస మని మూఁడు విధములు. (గీత 17 అధ్యాయము) నిష్కామ భక్తియందుఁ గర్మ జ్ఞాన యోగము లప్రధానములు భక్తి ప్రధానము. కావున దానిని బ్రధానీభూత భక్తి యందురు. దీనిని జ్ఞానులుమాత్రమే యభ్యసింతురు. (7-14.) నిష్కామభక్తియందుఁ జేయఁబడు కర్మములఫలము భగవంతున కర్పింపఁబడును ఇదియె కర్మయోగము. దీని ఫలము చిత్తశుద్ధి. (గీత 18-5) వాస్తవముగ భక్తివలననే చిత్తశుద్ధి గలుగును. అయినను నిందుఁ గర్మమును భక్తిగాఁ జెప్పియారోపించుటచే దీని నారోపసిద్ధభక్తి యందురు. ఇది చిత్తశుద్ధి గలిగించి జ్ఞానమిశ్రమో యోగమిశ్రమో యైన భక్తిగాఁ బరిణమింపఁజేయును ఈరెండును సంగసిద్ధభక్తి యనఁబడును. ఇందు భక్తితోఁ గూడి జ్ఞానము యోగము పరమాత్మసాక్షాత్కారము గలిగించును. జ్ఞానమిశ్రమైన భక్తియే జ్ఞానయోగము. అది బ్రహ్మజ్ఞానముతోఁగూడి సద్యోముక్తిని గలిగించును. యోగమిశ్రమైన నిష్కామ భక్తియే యష్టాంగయోగము, దీనివలనఁ గ్రమముక్తి గలుగును కావున జ్ఞానము యోగము నిష్కామ భక్తితోఁగూడిననే మోక్షమునిచ్చు శక్తిగలవగును. కావుననే నిరుపాధిభక్తి కర్మజ్ఞానయోగములకంటె నుత్తమమని నారదుఁడు వచించెను. కావునఁ గర్మయోగము, జ్ఞానయోగము, రాజయోగము ఉప కారములు మాత్రము గావున గౌణములు.

ఈయుపాయముల నభ్యసించుటవలన స్థిరచింతనము నిష్ఠపట్టుదలతోఁ బూజించుట కలుగును. ఈనిష్ఠ రుచికిఁ గారణమగును. (ఇంపైన పదార్థమును దినుటయందు బుద్ధి మనస్సు సంతోషముగ నెట్లు ప్రవర్తించునో యట్టి సంతోషమే భక్తిప్రవర్తనమందుఁ గలుగుట రుచియనఁబడును.) రుచివలన నాసక్తి గలుగును. (మిక్కిలియాశతో మనస్సొకదానిని గూడియుండుట యాసక్తి.) ఈయాసక్తికిఁ గారణములు రెండు ౧. ఐశ్వర్యజ్ఞానము. ౨. మాధుర్యజ్ఞానము. భగవంతుఁ డనేకకోటి

---

(కొందఱు భక్తికి జ్ఞానమే సాధనమని యందురు. కొంద అన్యోన్యాశ్రయము వచింతురుగాని నారదమహర్షి స్వయంఫలరూపతేతి బ్రహ్మకుమార యని (30వ సూ.) భక్తి స్వాతంత్ర్యమును స్వయంఫల రూపత్వమును వచించెను. అయినను మీఁదఁజెప్పిన మూఁడు యోగములు గాక సహాయకారులు మఱికొన్ని గలవు. విషయత్యాగము (నా. 35) ఇది కలుగుటకుఁ గారణమైన నిరంతరభజనము. (నా. 36) భగవద్గుణ శ్రవణకీర్తనములు. (నా. ౬8) ఇన్నిటికి ముఖ్యమైనది మహాత్ముల కృపయే, అనఁగా భగవత్కృపాలేశమే మహాత్ముల సాంగత్యము దుర్లభము. అగమ్యము నమోఘమునైన మహత్కృప దుర్లభము. (నా. 39) అది భగవత్కృప చేతనే లభింపవలయును. ఏలన భగవంతునకు భాగవతులకు భేదములేదు (నా. 41) భక్తి శాస్త్రాధ్యయన మనఁగా భాగవత భగవద్గీత రామాయణాదుల మననము చేయవలయును. ఊరక చదివిన విశేషప్రయోజనము లేదు. అందుఁ జెప్పిన ప్రకారము కర్తవ్యముల వర్తింపవలయు మనస్సు తైలధారావదవచ్ఛిన్నముగ నుండవలయును. అహింసా, సత్య, శౌచ, దయాస్తిక్యాది చరిత్రములను బరిపాలింపవలయును. (నా. 78) సర్వకాలములయందు నిండు మనస్సుతో నితరవిచారము లేక భగవంతునినే భజింపవలయును. (79) ఇది సాధ్యముకాదేని భగవంతుని నామమునే కీర్తింపవలయును. ఇటుచేసిన శీఘ్రకాలమునందే భగవంతుఁడు ప్రత్యక్షమై తనమహిమచే భక్తుల నిండించును. (80) కావునఁ ద్రిసత్యుఁడగు భగవంతునియందలి భక్తియే శ్రేష్ఠమైనది. కావున నారదుఁడు, జిజ్ఞాసువు, ఆర్తాది పోవుమార్గములను వదలి నిత్యదాస్యాసక్తి నిత్యకాంతాసక్తి యను రెండు భక్తిమార్గములచే భక్తినే యభివృద్ధి చేసికొనవలయును. (నా. సూ. ౬౬) (త్యాజ్యములు లోనగునవి భక్తియోగ వ్యాఖ్యానంబునఁ గననగు ) ఇట్టి నానావిధభక్తి స్వరూపములకు నపరభక్తియని పేరు. నిరుపాధిక భక్తిమాత్రమే పరభక్తి. పరభక్తికి నపరభక్తి యుపకారము మాత్రమే. (నా. 56 శాం. 56).

బ్రహ్మాండనాయకుఁడు. ఇన్నిటిని నాయన నిమిషములో సంకల్పమాత్రముననే సృష్టించును రక్షించును సంహరించును. సర్వవ్యాపి. సర్వశక్తిమంతుఁడు. సర్వేశ్వరుఁడు. అపహతపాప్ముఁడు. విజరుఁడు. విమృతుఁడు. విశోకుఁడు. క్షుత్పిపాసారహితుఁడు. సర్వజ్ఞుఁడు. ధర్మసేతువు నని యాయన గొప్పతనమును దెలిసికొనుట యైశ్వర్యజ్ఞానము. ౧. భగవంతుఁడు దివ్యసుందరమూర్తి శరణాగతరక్షకుఁడు పరమదయాళువు వాత్సల్య సౌశీల్యసామాద్యనేక కల్యాణగుణ సముద్రుఁడు. స్మరణమాత్ర సంతుష్టుఁడు. నమస్కారప్రియుఁడు. భక్తసులభుఁడు. పరమానందమూర్తియని యెఱుఁగుట మాధుర్యజ్ఞానము. మొదటి దానికి గుణమాహాత్మ్యాసక్తి యని పేరు. రెండవదానికి రూపాసక్తియని పేరు. ఈ జ్ఞానమువలనఁ బూజాసక్తి జనించునుగాని యీ యుభయాసక్తులందును భక్తునిమనమున నాశ్చర్యభయములు పెనగొని యుండును గావున భక్తుఁడు దూరముననే నిలిచియుండును. భగవంతుఁడింత మహామహిముఁడే. నేనో క్షుద్రుఁడనే. ఆయన పాపరహితుఁడే నేనో పరమపాపినే. ఆయనను సమీపించు యోగ్యత నాకుఁ గలదా యనుతలఁపు భక్తునిమనస్సున నాటుకొనియుండును. ఇట్లున్నను బ్రేమయనునది హృదయమునఁ బనిచేయుచున్నది కావునఁ బ్రేమచే నాయనను దూరముననుండియే స్మరించుచుండును. దీనికే స్మరణాసక్తియనిపేరు. స్మరణాసక్తివలనఁగొంచెము ధైర్యముగలవాఁడై మ్రొక్కెడివారిచేతులు దేవుఁడు గోయఁడుకదా. 'దాసరి తప్పులు దండముతోసరి' గదాయని ధైర్యమువహించి యజమానుని సేవించు భృత్యునివలె భగవద్దాస్యముచేయ నారంభించును. ఇదియే దాస్యాసక్తి. మునుపటికంటె సమీపమున నిల్చినను భగవంతుఁ డెక్కువ తాను దక్కువయను తారతమ్యజ్ఞానము పోయినదికాదు. దాస్యాసక్తి ముదిరి సఖ్యాసక్తియగును. సఖ్యమనఁగా స్నేహము. ఇందు సమానప్రతిపత్తి గలుగును. సఖ్యాసక్తి వాత్సల్యాసక్తిగఁ బరిణమించును. బిడ్డలయందుఁ దల్లిదండ్రులకుండుప్రేమ వాత్సల్యము. వాత్స

ల్యాసక్తి కావలిమెట్టు కాంతాసక్తి.* గోపకన్యకలయందుఁ గలదని చెప్పినది యీకాంతాసక్తియే. పూర్వావస్థలన్నియుఁ బూర్ణముగఁ బూర్వజన్మములందే గోపికలు దాఁటిరి. భార్యాభర్తలెంత చనవుగా నుండినను భార్య తాను వేఱు భర్త వేఱు నిరువురును రెండు భిన్నవ్యక్తులనియేకదా తలఁచుచు, అట్టులే భక్తునకును గాంతాసక్తియందుఁగల భేదవ్యక్తిజ్ఞాన మాత్మనివేదనాసక్తి జనించువఱకుఁ బోదు. ఆత్మనివేదనాసక్తియందుఁ దానుదనదియను భావముపోయి తానుదనది తనయిష్టమాయనయిష్టమనునవి ప్రత్యేకముగా లేవనియు, సర్వమాయనదే; సర్వ మాయనయిష్టమే, తన్నేమిగా నుపయోగించుకొనినను సంతో

*కాంతకుఁ గాంతునియందుఁగల యాసక్తి కాంతాసక్తి. కాంత శబ్దమునకు మనోహరయని యర్థము. పురుషుని మనస్సు హరించు సౌందర్యవతి కాంత, స్త్రీ మనస్సును హరించు సుందరుఁడు కాంతుఁడు కావునఁ గాంతయనఁగా వివాహము చేసికొనిన భార్యకును వివాహములేకయు భార్యాస్థానమునుండు స్త్రీకిని పేరు. అట్టులే కాంతుఁడనఁగా వివాహముచేసికొనిన పతియు, నుపపతియునగు. కావునఁ గాంతాసక్తి భార్యకు భర్తయందుండు నాసక్తియనియు జారకు జారునియందుండు నాసక్తియనియుఁ జెప్పనగును. కావునఁ గాంతాసక్తి రెండువిధములయ్యె. ఇందు భార్యకు భర్తయందుండు ప్రేమకంటె జారిణికి జారునియందుఁ గల ప్రేమ నిర్మలము నిష్కళంకము బలవత్తరము తీవ్రము నైనది. సీత, రుక్మిణి, దమయంతి, చంద్రమతి లోనగు మహా పతివ్రతలయందు భయముతోఁగూడిన భక్తియే యుండెను గాని కేవల భక్తి యుండెనని చెప్ప వలనుపడదు. భర్త కప్రీతికరమైన కార్యము తామేది చేయుదుమోయని భయము. జారల మనస్సునందు నిట్టి జంకు కళంకము కలుగదు. వారు తామేది చేసినను ప్రియుఁడు ప్రియముగానే గ్రహించునుగాని తప్పు లెన్నఁబోఁడు ఒకవేళఁ దా మవజ్ఞతచేసినను క్షమించునుగాని దండింపఁడను నిశ్చయజ్ఞానము వారికిఁగలదు కావుననే భక్తివిషయమున 'యోషాజారమివప్రియ' మ్మని శ్రుతి చెప్పుచున్నది ప్రియుఁడైన జారుని స్త్రీ వలచిన ట్లంతటి తీవ్రము నిష్కళంకమైన ప్రీతిని భగవంతునియందుంచువారు భక్తురాండ్రగుదురు. ప్రాకృత మనుష్యులయం దుంచువారు అంకుటాండ్రగుదురు. కావున నారదమహర్షి "నారదస్తు తదర్పితాఖిలాచారతా తద్విస్మరణే పరమవ్యాకులతా (19) అస్త్యేవమేవమ్ (20) యథా వ్రజ గోపీనామ్ (22) తత్రాపి నమాహాత్మ్యజ్ఞాన విస్మృత్యాపవాదః (22) తద్విహీనం జారాణామివ (23) నాస్త్యేవ తస్మిన్ స్తత్సుఖసుఖిత్వమ్" (౨౪) అని సూత్రించెను.

మమే, తనయిష్టమనునది వేఱుగా లేదని యెంచి వ్యక్తిభేదజ్ఞానమును నశింపఁజేయును. తాననునది యొకటి లేదు. సర్వము భగవంతుఁడే యను జ్ఞానమెప్పుడు దృఢపడునో యప్పుడే తన్నుఁదాను మఱచి తాను గూడ భగవంతుఁడనియే యెంచును. దీనినే తన్మయాసక్తి యందురు. ఇదియే భావసమాధి. భావసమాధి మహాభావసమాధిగ నభివృద్ధియై పరమవిరహాసక్తి దశను బొందును. దీనియందు విరహదశయందలి ప్రియులవలె నున్మత్తులై భక్తులన్నిటియందు భగవంతునిఁ జూచుచు భగవంతుఁడను మహాసముద్రములో మునిగి సముద్రమునందలి మీనమువలెఁ దాను భగవంతునియందే జీవించును. దీనినే పరమ ప్రేమయందురు. ఇదియే ప్రేమకుఁ బరాకాష్ఠ. ఇంతతోఁ బ్రేమసరి. జీవుని సంసారబద్ధునిఁ జేసిన హృదయగ్రంథిని నిది భేదించును. అన్ని సంశయములు తీఱును. పునర్జన్మకారణమైన కర్మము మూలముట్టుగ నశించును. ఈవిధముగ జీవుఁడు మాయను దరించి ముక్తుఁడగును. ఇట్టిస్థితి బ్రదికియుండఁగానే కలిగెనా జీవన్ముక్తుఁ డందురు. మరణానంతరము లభించిన విదేహముక్తుఁ డందురు.

భక్తిమార్గమున యీ తాయాత్క్రమము సూత్రప్రాయముగ వివరింపఁబడియె. ఇఁక దీనికిలక్ష్యముగ గోపకన్యాచరిత్ర యెంతవఱకన్వయించునో చూడవలయును.*

---

*"Let him kiss me with the kisses of his mouth
For thy love is better than wine.

* * *

Behold thou art fair, my beloved, yea pleasant
also our bed is green.

* * * *

Stay me with flagons—comfort me
with apples; —for I am sick of love.
His left hand is under my head, —
and his right hand doth embrace me.

* * * *

By night on my bed—I sought him
whom my soul loveth :
I sought him, but I found him not.
I will rise now, —and go about the city

"నీ పాదతలం బరణ్యంబున నొక్కపరి స్పృశియించితిమి, అది మొదలు కృష్ణా నీయందే మనస్సానందించుచున్నది" యని గోపికలు చెప్పిరిగదా. అది మొదలు వీరి చిత్తవృత్తి యెట్లు పరిణమింపఁజొచ్చెనో చూతము. అంతవఱ కుదాసీనములుగనున్న మనస్సు లది మొదలు కృష్ణునియెడ నానందపూర్వకముగ నభిముఖములయ్యెను. తాను దేనియం దానందించునో దానియందే వర్తించుట దాని గుణవిశేష మెఱుఁగఁగోరుట మనస్సుస్వభావము. గోపికన్యకల యానందముతోడ వయస్సభివృద్ధి గనుచుండెఁగదా. యుక్తవయస్సు వచ్చునప్పటికి జాతివయఃప్రయుక్తము కామోదయ మవశ్యంభావి యయ్యెను. కృష్ణుఁడు వారియందుఁ గామముఁ బెంపకున్న జ్ఞానమేల పెంపఁగూడదను సందేహము గలుగవచ్చును. ఎవరేమార్గమునఁబోదురో వారి కా మార్గమున సుఖప్రయాణము జరుగునట్లు భగవంతుఁడు చేయునుగాని నూతనసృష్టి యేదియుఁ జేయఁడు. జ్ఞానయోగాభిలాషులందు జ్ఞానమే

---

In the streets, and in the broadways--
I will seek him whom my soul loveth
Thou hast ravished my heart. my sister, my spouse,
Thou hast ravished my heart with one of thine eyes,
With one chain of thy neck,
How fair is thy love, my sister, my spouse!
How much better is thy love than wine!
Oh that thon wert as my brother,—
that sucked the breast of my mother!
When I find thee without,
I would kiss thee;
yea, I should not be despised.
I would lead thee, and bring thee
into my mother's house,
Who would instruct me;
I would cause thee to drink of spiced one—
of the juice of my pomegranate.
His left hand should be under my head,—
and his right hand should embrace me.
I charge you, O daughters of Jerusalem
That ye stir not, nor awake
my love, until he please.

కర్మఠులందుఁ గర్మమే భక్తులయందు భక్తియే యభివృద్ధిఁ జేయునుగాని తాఱుమాఱు కార్యములు చేయఁడు. 'సహజం కర్మకౌంతేయ సదోష మపినత్యజే' త్తనియు 'శ్రేయా న్స్వధర్మోవిగుణః పరధర్మా త్స్వనుష్ఠి తాత్, స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయావహ' యని భగవంతుఁడె చెప్పెనుగదా. కావునఁ దనకత్యంతప్రియమైన భక్తిమార్గమునఁబూర్వ జన్మంబునందునుండి యింతవఱకు భక్తిని వృద్ధిచేసికొని తత్ఫలానుభవ మునకు సిద్ధులైన వారి మనస్సులనుండి దానిని నెట్టివేసి యనఁగా నిన్ని జన్మములందు వారు చేసిన కృషి యేటిపాలుచేసి యిప్పుడు నూత నముగ జ్ఞానబీజము నాటునా ? అది పెరుఁగుట యెప్పుడు ఫలించుట యెప్పుడు ? అనేక సహస్రజన్మములకుఁగదా జ్ఞానము ఫలింపఁబోవును. అంతవఱకు వారు జననమరణ పీడితులు గావలయునుగదా. అటుచేసి యుండిన భక్తియోగము వ్యర్థము కష్టైక ఫలమనికదా స్వాభిప్రాయ విరుద్ధముగ సిద్ధాంతము చేసినట్లగు. నీమతము తప్పు మామతమునకు రమ్మని చెప్పుటకుఁగృష్ణుఁడు బుద్ధిమాలిన క్రైస్తవుఁడుగాఁడు, మతప్ర రతురుష్కుఁడును గాఁడు. కావున వారియం దేభావము జన్మజన్మమున ననుసరించి వచ్చుచుండెనో దానినే ఫలవంతముగఁ జేయఁబూనెను. అటుగాదేని 'తస్యతస్యా చలాంశ్రద్ధాం తామేవ విదధామ్యహ'మ్మను వాక్య మున్మత్త ప్రలాపమే కదాయగును. కావున జాతిస్వభావవయః

గోపికా కృష్ణులయందు దోషమారోపించి క్రైస్తవుల మతగ్రంథమను బైబి లునుండి యీ సాలోమన్ గీతము గ్రహింపఁబడెను. గోపికలు కృష్ణునకు భార్యలని చెప్పుదుము. పరస్త్రీలని వారు తలఁతురు. అది దోషమేని యిందుఁ గ్రీస్తునకుఁ దోడఁబుట్టినదానితో సంభోగము వర్ణింపఁబడినదే యీగ్రంథము గతియేమి. ఇందుఁ బురుషుఁడు తోడఁబుట్టినదాని ప్రక్కలోఁ బండుకొనుట, ముద్దుపెట్టుట, బొమ్మల పయిఁ జేయివైచుట చేతిని స్త్రీకిఁ దలదిండుగఁజేయుట వర్ణింపఁబడెను. ఇంతేగాదు ఆయనకుండు ప్రేమ సారాయముకన్న రుచ్యమని వర్ణించెను గోపికాకృష్ణు లిట్టి త్రాగుఁబోతులుగారు త్రాగుఁబోతులకు నట్టి నాయికానాయకులు గాక మతెవ్వరు లభింతురు ? దీనికి వారంతరార్థముగల దందురేని యా యంతరార్థము గోపికా కృష్ణుల విషయమున నేల గ్రహింపరాదు ?

ప్రయుక్తమైన కామమునే విజృంభింపఁజేసి దానిఁ దనయందు వినియోగింపఁజేసి దానియందలి విషమును హరించెను. ప్రాకృతపదార్థములందలి ప్రేమకామము. అప్రాకృత భగవంతుని యందలి ప్రేమ భక్తి. మొదటిది ప్రాకృతిక సంసారహేతువు. రెండవది ప్రకృత్యతీత ముక్తిహేతువు. పదార్థమొక్కటే ప్రేమయే వినియోగభేదముచే ఫలభేదము. పాలొక్కటే. సీసపాత్రములోనుంచిన విషమగును. బంగారుపాత్రలోనుంచిన ప్రాణధారకమగును. సాహిత్యరత్నాకరమునందలి ధర్మసూరి వాక్యము లీవిషయమునే స్థాపించుచున్నవి. రసము లెన్నియను చర్చయందు "రతిర్హి కామినీవిషయా విభావాదిసముల్లసితా శృంగార రసతామాపద్యతే సైవ దేవతా గురునృప పుత్రమిత్ర విషయాచేద్భావశబ్దభావినీ భవతి ఏవంవ్యవస్థాపితే వత్సలస్నేహ భక్తీనాం రతిభావాంతర్భూతానాం విషయభేదమాత్రోద్భేదవ్యపదేశాన్నరసభూమికావిన్యాసేన రసనవత్వవిఘటనపటుతా"యని యాయన వ్రాసెను. రస్యతే స్వాద్యతే యను వ్యుత్పత్తిచొప్పున నాస్వాదింపఁబడునది రసము రతియనఁగాఁ బ్రేమ. ఇది కామినీవిషయమైనపుడు శృంగార రసమనఁబడును. అదే పుత్రవిషయమైనచో వాత్సల్యరసంబనియు, మిత్రవిషయంబున స్నేహరసమనియు దేవతాదులవిషయమైనపుడు భక్తిరసమనియుఁ బేర్కొందును. కావునఁ గృష్ణుఁడు భగవంతుఁడని తలఁచువారు గోపికలకుఁ గృష్ణునియందుఁగల ప్రేమ భక్తియందురు. కృష్ణునిఁ దమవలెఁ బ్రాకృతపురుషుఁడని తలఁచువారు శృంగారమందురు. కృష్ణుని సమకాలికులు నారద భీష్మ వ్యాస శుకాదులు దదనంతరము జనించిన శంకరరామానుజమధ్వ చైతన్యాది మహాత్ములును గృష్ణుని భగవంతునిగ వచించిరి విశ్వసించిరి భజించిరి ధన్యులైరి. ఇప్పటి కొందఱు కామదాసులు దుష్కామమందురు. అభిప్రాయభేదమునకు దృష్టిభేదము కారణము. దృష్టిభేదమునకు వారివారి చిత్తవృత్తిభేదము కారణము. చిత్తవృత్తిభేదమునను స్వాచారభేదము కారణము. ఆత్మవత్సర్వభూతాని, యనునది వారికిఁ బ్రమాణము.

గోపికలకు స్మరోదయమైనట్టు కృ. లీ. పుటలు ౧౩౭-౧౩౮-౧౩౯ చదివిన స్పష్టంబగు. దివ్యసుందరమూర్తియు నన్నివిధముల మనోహరుఁడును పెద్దవారిచే దేవుఁడని భావింపఁబడువాఁడును నైన కృష్ణుఁడు చేయులంతినుండెను ఇఁక వారు చేయవలసిన కార్యమేమి ? "కన్యావరయతేరూప"మ్మని కలదుకదా. కావునఁ గృష్ణునినే మగనిఁగా మనస్సుల వారు వచించిరి. అట్లని పరువునఁబోయి కృష్ణునిఁ గౌఁగిలించినవారుగారు. ధర్మమార్గమునసే వర్తింపనెంచి కృష్ణునిఁ దమకు భర్తగాఁ జేయుమని రుక్మిణీదేవివలెనే వారును గాత్యాయనిపూజ గావించిరి. "తేషాంసతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం, దదామి బుద్ధియోగంతం, యేనమా ముపయాంతి తే" "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే౽ర్జునతిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢానిమాయయా" యన్నట్టులు వారికిబుద్ధి నిచ్చినవాఁడు భగవంతుఁడు కృష్ణుఁడేకదా.

మార్గశిరమునఁ బ్రతిపత్తుమొదలు నియతాహారలై గౌరీపూజ సలుపుచు గోపికలు "మచ్చిత్తాః మద్గత ప్రాణాః బోధయంతః పరస్పర"మ్మన్నట్టు తచ్చిత్తలు తద్గతప్రాణలైన గోపిక లుషఃకాలంబున లేచి యొకరినొకరు పిలిచి (పుట 141) యమునకుఁబోయి "కథయం తశ్చమాంనిత్యం తుష్యంతి చ రమంతిచ" యన్నట్టు కృష్ణగీతంబులు పాడుచుఁ గృష్ణకథలే చెప్పకొనుచు పలువలు రేవునసుంచి సంతోషముతో జలక్రీడలాడి యావలఁ దమకుఁ గృష్ణుని బతిసేయుమని గౌరిని బూజించుచుండిరి. అట్టులే యావ్రతాంతదినమందును జలిపిరి. "సకీర్త్యమానః శీఘ్రమేవా విర్భవంత్యనుభావయంతిభక్తాన్" అన్నట్లు యోగేశ్వరేశ్వరుండైన కృష్ణుఁడు 'తేషామే వానుకంపార్థ మన్నట్టు వారి యభిప్రాయము లెఱింగి వారి ననుగ్రహించి వారి కోర్కి సఫలంబుఁజేయఁ గొందఱఁ జెలికాండ్రంగూడి యచ్చటికివచ్చి వారి వస్త్రముల నపహరించుకొనిపోయి చెట్టెక్కి యావల నాదిసమొలలవారిచే మ్రొక్కించుకొని వారి మనస్సులను బరీక్షించి బోధించి వారు కోరినవరంబును వారి వస్త్రములను వారి కిచ్చి

పంపెను*. ఇప్పటికిఁ గృష్ణుని వయస్సు ౬ సంవత్సరములు. గోపిక లందఱు వివాహములుకాని కన్యలు. రమారమి ౧౪-౧౫ సంవత్సరముల యీడువా రనుకొనవచ్చును అమాత్రము ప్రాయములేక స్మరోదయము కాదుకదా.

"త్వం త్వానురూప మభజం జగతామధీశ మాత్మాన మత్ర చ పరత్ర చ కామపూర్ణమ్, స్యాన్మేతవాంఘ్రిరరణం సృతిభిర్భ్రమన్త్యా యావై భజ న్త ముపయాత్యనృతాపవర్గః" లోనగు రుక్మిణీదేవి వాక్యంబులు స్మరించిన (మూ. సం-3. పుట 119) చో గోపాలికలు కృష్ణుని మగనిఁగా వరించుట ప్రశస్తకార్యమనియే యేర్పడుచున్నది. కృష్ణుఁడు వారి వస్త్రముల నపహరించుట యేటికో విచారింపవలయును.

---

*Some may ask, why Sri Krishna selected such an awkward and unseasonable time to preach His short service on love to the shepherd girls. In the third chapter of the Genesis we find that Adam and Eve were in their pristine purity, before their fall, although they were really naked, still they did not appear to be naked and awkward to each other. As soon as they disobeyed their Father in heaven, and allowed themselves to be led away by the wily temptations of the arch enemy, and thus learned to split up their one idea of goodness into two such as good and evil, seasonable and unseasonable, attractive and awkward, etc., then they thought fit to cover their nakedness with big leaves of tree, to appear in a more becoming way before their father, for. at that time, shame brought the blush on their countenance even to think of going into thei former child like simplicity before the most High, Just before this, they were carnality purer than even the gods. But when they lost that glory, they had to labour like all their futu e progeny, to most of whom, unfortunately, they bequeathed more of what they got from the prince of darkness than what they got from their legitimate and internal father. As Sri Krishna was above all idea of carnality, He could do nothing which might bring shame to Him, and as He wan ed the shepherd girls to got the real love which is above all sensual motive, and as their minds were at that time filled with an intense love towards Himself, He rightly hoped that His words would be fully impressive and effective. So he is not in any way blameable for His conduct which in an ordinary man of the world, cannot but be culpable.

వయస్సుపిల్లలు చీరలు విడిచి యేటినీట బహిరంగముగ స్నానము చేయు దురాచారమును మాన్పు నుద్దేశముతోఁ గృష్ణుఁ డట్లు చేసె ననియు, నాయన సదుద్దేశముతోఁ జేసియుండఁగా సరిపోయెఁగాని యట్టులే దుష్టులు పదుగురు ప్రోగై కృష్ణుఁడు చేసినంతమాత్రముతోఁ బోక వారిని జెఱిచియుండవచ్చునుగదా. వారు వివేకహీనలై చేసిన కార్యమందు నట్టి యభిప్రాయము కలదని వారి మనస్సున కెక్కునట్లు కృష్ణుఁ డట్లుకావించెనని యొకరు సమాధానము చెప్పిరి. భక్తిజ్ఞాన హీను లగువారి కీయుక్తి దృప్తికరముగ నుండును గాక. భక్తురాండ్రగు గోపిక లూరక స్నానముచేసినవారు కారే. కృష్ణుని మగనిఁగాఁ గోరిరే. ఆయనయు దాని నంగీకరించెనే. తాను భార్యలుగా గ్రహించినవారిని దోడిగొల్లవాండ్రయెదుట దిసమొలలతో నిలువఁజేసెనే యిదియేమి నీతి? భర్త భార్యల నిట్లే చేయవలయునని బోధించుటకా ? చేతులతోనైన మానము కాపాడుకొననీక మ్రొక్కమను టెందునకు ? అందువారు దిసమొలలతో స్నానము చేయరాదను నీతిని బోధించుటకు భగవంతుఁ డవతార మెత్తవలయునా ? యను సందేహము భక్తుల బాధించునుగదా ? భార్యలగుట యనఁగా నేమి ? భగవంతునితో సమానలగుట యనికదా అప్రాకృతునితో సమానలగుట యనఁగానేమి ? గుణాతీత లగుటయేగదా ? కావునఁ దనతో సమానస్కంధమున నుండఁ గోరువారు “మాంమదీయం చ నిఖిలం చేతనా చేతనాత్మకం, స్వకైంకర్యోప కరణం వరదస్వీ కురుస్వ” యని చెప్పుట వాచాకైంకర్యమాత్రమా ? లేక వారి మనస్సు లట్టి పరిపక్వదశనొందినవా ? యని భగవంతుఁడు పరీక్షించు టావశ్యకమే కదా ? మన మేవస్తువైనను బరీక్షింపక గ్రహింతుమా ? అట్టి పరీక్షయే కృష్ణుఁడు గావించెను. వారి మనస్సులు పరిపక్వమౌట గోపకన్యక లాపరీక్షయందుఁ గృతార్థులైరి. గోపికలు కృష్ణుని ప్రార్థించు వాక్యములలో “మేము నీ దాసీజనులము. నీవేపనిఁ జెప్పినఁ జేయఁగల వార”మను వాక్యములు గానవచ్చెడిని (కృ. లీ. 142 పు) ఇది చండ కౌశికములలోని విశ్వామిత్ర హరిశ్చంద్ర సంభాషణమును స్మృతికిఁ

దెచ్చుచున్నది. విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని విక్రయించు సమయంబున నొక చండాలుఁడు తాను గొనెదనని వచ్చెను. అప్పుడు హరిశ్చంద్రుఁడు విశ్వామిత్రునిఁ జూచి "మునీంద్రా! యుభయలోక హానికరమగు చండాలదాస్యమును నుత్తమ క్షత్రియుఁడనై యెట్లు సేయుదును ? నేను దాసుఁడనయ్యెద. నాచేతఁ బనిగొనుము క్షమింపుమని ప్రార్థించెను. విశ్వామిత్రుఁడు "తపస్వులు స్వయందాసులు. నీవు దాసుఁడవై నాకేమి చేసెదవు?" అనెను. నీవేమి చెప్పిన నది చేసెదనని హరిశ్చంద్రుఁ డనెను. "చేసెదవా ?" "చేసెదను" అని మాట తీసికొని నీవు నా దాసుఁడవై నేను జెప్పినట్లు చేయుట సత్యమేని నీవీ మాలవానికే యమ్ముడు పొమ్ము. లేదా యసత్యమాడితి ననుమని విశ్వామిత్రుఁ డనెను. అసత్యభీతిని హరిశ్చంద్రుఁడు మాలని దాస్యమంగీకరించెను. హరిశ్చంద్రుని సత్యవ్రతమెట్టిదో పరీక్షింపవలయు నని విశ్వామిత్రుని పట్టుదలగాని యాయనను స్వరూపనాశము చేయవలయు నని గాదు. హరిశ్చంద్రుఁ డేమిచేసెను ? సత్యభాషణము శ్రేష్ఠమా ? కులము మాన మాచారము గౌరవము శ్రేష్ఠమా ? యని యాలోచించి కులాది రక్షణముకంటె సత్యవ్రతరక్షణమే శ్రేష్ఠమని నిశ్చయించి సత్యవ్రతము నిలిపికొనెను. అట్లులే గోపికలకును విషమసంకటము ప్రాప్తించెను. గోపికలు గోరినది భగవత్ప్రాప్తి. కృష్ణుఁ డడిగిన దేమి ? సర్వసంగపరిత్యాగసూచకముగా మీ కత్యంత ప్రియగుప్త ధనము సిగ్గైనను విడువుఁడు. భగవంతునైన విడువుఁడని యడిగెను. మానరక్షణమును సామాన్యధర్మముకంటె భగవత్ప్రాప్తి యను విశేషధర్మము శ్రేష్ఠమనియు, సామాన్య ధర్మములు స్వర్గమునకేకాని భగవత్ప్రాప్తికి సాధనములు కాఁజాలవనియు, నుద్దిష్ట వస్తువు భగవత్ప్రాప్తి లభించినపు డేఱుదాఁటినవాఁడు తెప్పను వదలినట్లు ధర్మసాధనము త్యాజ్యమనియు "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" యను పరమరహస్యము నెఱింగి భగవత్ప్రాప్తికై గోపకన్యకలు దైహికలజ్జను వదలి కృతార్థులైరి.

దాస్యము సర్వస్వాతంత్ర్యశూన్యము. దాసులకుఁ దాము కట్టిన వస్త్రములమీఁదను స్వాతంత్ర్యము లేదు. దుర్యోధనుఁడు ద్యూతమం దోడి దాసులైన పాండవులయు ద్రౌపదియు వస్త్రము లొలిచిన కథ స్మరింపుఁడు. పాండవులు దాసులుగావునఁ దమంతటఁ దామే వస్త్రము లావల నుంచిరి. ద్రౌపదియు ధర్మవిజితనై యుండెనేని యటు చేసి యుండును. ఆమె యధర్మవిజిత కావున మీకు నేను దాసురాలఁ గానని తిరస్కరించెను. ఇక్కడ గోపికలు తమంతటఁ దామే మేము నీ దాసికలమని చెప్పుకొనిరి. మీమాట నిజమేని నాకు నమస్కరింపుఁడని కృష్ణుఁ డనెను. వారు నమస్కరించిరి.

కృష్ణుని భర్తగాఁ గామించిరి గావున గోపకన్యకలు భర్త యెదుట విగతవస్త్రలై నిలుచుట యేమి త్యాగమది యేమి కష్టకార్యమని సందేహము గలుగవచ్చును. బాలనాయిక శయ్యాగృహమందుఁ గూడ వెలతురుండ వివస్త్రయై భర్తతో రమింపదు. అట్లుండఁ బట్ట పగలు వివస్త్రయై భర్త యెదుట నిలువ నొప్పుకొనునా? అదిగాక యిచట నుండినవాఁడు కృష్ణుఁ డొక్కఁడేకాఁడు. తోడ గోపాలురు కొందఱున్నట్లు గ్రంథమున నున్నది. ఇతరులు చూచుచుండ నేస్త్రీ భర్త యెదుట నంగమొలతో నిలఁబడును. కేవల భర్తృభావ ముండి నను వారట్లు నిలిచియుండరు. భగవంతుఁ డనుభావము వారియందు బలిష్ఠమై యుండవలయును. భగవత్సన్నిధానమందైనను నలువురి యెదుటఁ దోలుతోలు విసమొలలలో నిలుచుటకు వారు దైహిక లజ్జను సమూలము నాశము చేసి యుండవలయును గదా.

"విసృజ్యస్మయమానాన్ స్వాన్ దంభంలజ్జాంచ దైహికీమ్
ప్రణమేదీశ్వ రకలా మాశ్వచండాల గోఖరమ్"

అని దైహికలజ్జ త్యాజ్యమని భగవంతుఁడే యుద్ధవున కుపదేశించెఁ గదా. (కృ.లీ.సం-3.పు-241-242) ఇట్టి యనన్య జనసామాన్య సాహసము చేయుటచేతనే వారు భగవంతునిఁ గలయఁగలిగిరి. వివస్త్రలై కృష్ణు నెదుట నిలిచిన గోపకన్యకలకు నవధూతలకు దిగంబరసన్న్యాసులకు భేదముగలదేమో పరికింపుఁడు. అయ్యో యీ యేటు పిడకలెత్తు

గొల్లపిల్లలకుండు భక్తిసాహసములలో శతాంశముండినను నే నీనీచ స్థితియందుండనుగదా. భగవంతుఁడా! యెప్పుడు నాకిట్టిస్థితి కలిగించెదవో. ఇట్టి పరీక్షయందు ధర్మరాజార్జునుల యట్టిపురుషులును నుత్తీర్ణులుగారైరి. స్త్రీలగు గోపికలు రుక్మిణి ద్రౌపది యుత్తీర్ణలైరి. గోపికలు భక్తిచేతఁగాదట్లు నిలిచినది చలికిఁదాళలేక యని యేల తలఁపరాదందురేమో. అట్లైనచో నీ దాసికలమనిన మాట యథార్థమెకదా యగును ప్రథమచుంబనములోనే దంతభగ్నమన్నట్లు తొలుతనే యసత్యసంభాషణమా! భర్త కసత్యము చెప్పినను భ్రాంయ్యకసత్యము చెప్పరాదను నఱివసామెత వారు నేర్చియుండిరా! చలి కారణము గాదు. నీటిలో నుండినఁ జలియుండదు. ఒడ్డునకు వచ్చిననే చలిబాధ. కావున నీరకఁ గొంతసేపు నీటనుండిన నెవరైన వారిని వెతకుచు వచ్చియుందురు. చీర లిప్పించియుందురు. గోపికా వస్త్రాపహరణ లీలవలన మనము గ్రహింపవలసిన వేవన :—

౧. "ఆకాశా త్పతితంతోయం, యథాగచ్ఛతి సాగరమ్
సర్వదేవ నమస్కారః, కేశవం ప్రతిగచ్ఛతి."

యన్నట్లు లేదేవున కెవ్వరు మ్రొక్కినను నవి విష్ణునకే చేరును. కావున నీ దేవుఁడు తక్కువ నాదేవుఁ డెక్కువయని వాదించుట బుద్ధిమాలిన పని.

౨. ఏదేవతను నెవరు పూజించినను ఫలమిచ్చువాఁడు విష్ణువే.

౩. విగ్రహారాధనము ఫలవంతము శాస్త్రీయము భగవత్సమ్మతమే కాని వ్యర్థము కాదు.

౪. భగవత్కైంకర్యమునకు విఘ్నకరమైన సామాన్యధర్మము త్యాజ్యమెకాని గ్రాహ్యముకాదు. సామాన్య ధర్మమునకంటె విశేష ధర్మమే బలవత్తరము. సామాన్యధర్మము గౌణము. విశేషధర్మము పరము. విశేషధర్మమునకు సామాన్యధర్మ ముపకారకము సామాన్యధర్మ ముపాయము. విశేషధర్మ ముపేయము.

౫. "అజ్ఞుండు చేసిన యపరాధములను జేపట్టఁ డీశ్వరుఁడు కృపాలుఁడగుట" యని యుండుటచే భగవంతునియెడ నిందు మనస్సు

తోఁ జేయు భక్తిపూర్వక నమస్కారమే యజ్ఞతంజేసిన యపరాధము లకుఁ బ్రాయశ్చిత్తము.

౬. "ననగ్నాస్నాతి చ క్వచి" త్తని స్మృతిచెప్పుడును నగ్నలై జలకమాడరాదు. "తడుపుకట్టక నీళ్లాడఁదగవు గాదు." అట్లుండ ప్రతి దినములందు దిస మొలలఁ బట్టపగ లేట స్నానముచేయుట దేవ హేళనముచేయుట కావున దోషము.

కృష్ణుఁడు కాముకుఁడై చీర లపహరించెనను వారు (146 పు.) కృష్ణుఁడు కడపట గోపకన్యకల కుపదేశించిన విషయంబు మనస్సున కెక్కఁ బఱింపవలయు.

గోపికావస్త్రాపహరణము మార్గశిరము కడపట జరిగిన వృత్తాంతము. ఆవలి వేసంగియందుఁ గృష్ణుఁడు బ్రాహ్మణభార్యల ననుగ్రహించెను. వీరు కేవలభక్తి కారణముగ వచ్చినవారేకాని కాముకలై వచ్చినవారుగారు. వీరు భరతునివంటి భగవత్పరతంత్రలు. గోపికలు లక్ష్మణునివంటి కైంకర్యపరులు. కావునఁ గృష్ణుఁ డుపదేశించి మరలి పొమ్మనిన బ్రాహ్మణస్త్రీ లాజ్ఞమీఱక పోయిరి. ఆవల నింద్రయాగ భంజన లీల. ఇది గోపికావస్త్రాపహరణము నేడవసంవత్సరము వృత్తాంతమని ముందు చెప్పఁబడెను. గోవర్ధనపర్వతమెత్తుటయు నేడవసంవత్సరము వృత్తాంతము.* కృష్ణుని జన్మమాసము శ్రావణముగుటచే నిది యేడవయేఁడు. గోవర్ధనోద్ధారణ మాషాఢమందైనచో నెనిమిదవ యేఁటఁ గార్తికమందు రాసలీల. కావున గోపికా వస్త్రాపహరణమునకు నడుమఁ బదిమాసములైన జరగియుండవలయును. ఒకానొకరు "నాతోడ నీరాత్రులందుఁ గ్రీడింపఁగలుగుదు"రని కృష్ణుఁడు గోపికలకు వరమిచ్చెఁగదా. ఈరాత్రు లన్నప్పుడు వరప్రదాన దినమున కవ్యవహిత రాత్రులు చెప్పవలయును గాని పదిమాసములు చెప్ప

* ఇందుఁ బూజింపఁబడు దేవత వర్షాధిదేవత యని చెప్పఁబడెను. వర్షము చక్కఁగఁ గురిసినఁగదా పశువులకుఁ బచ్చిక దండిగనుండును. కావున వర్షము చక్కఁగఁ గురియవలయునని వర్షర్తువు ప్రారంభమందే యనఁగా నాషాఢమందే యిది జరుపఁబడి యుండవచ్చును. కావున నిది యేడవయేఁడగుట నిశ్చయము.

యని యాక్షేపించిరి. మార్గశిరము కడపటిదినమున వర
ము. అవలఁ బౌష్యము నిషిద్ధమాసముగుట యటుండ నిది
ంటి చలికాలము. మంచు క్రమ్ముటచే గ్రుడ్డివెన్నెలయే కాని
న్నెల కాయదు. ఇంతటి చలికాలములో నెవరైన రాత్రు
నవిహారము చేయుదురా ? స్పష్టముగ శరదృతువని చెప్పి
బుష్యమాసమెట్లు గ్రహింపనగు ? శరదృతువనఁగాఁ గార్తిక
ంనే గ్రహింపవలయును. 'చత్వారో వార్షికామాసా' యన్న
ుజముకూడ వర్షర్తువులోఁ జేరినది. "కార్తికీ తిథియామినీ
ర్ణ చంద్రమండల సంకాశ చారువదన" యన్నట్లు పండు
ు కార్తికమాసమునందే ముందు కార్తిక మావల మార్గశిరము
రాసలీల ముందని వస్త్రాపహరణ మావలనని యొకరు చెప్పిరి
ంనిని విమర్శించు పనియే లేదు. వస్త్రాపహరణమునకు రాస
డుమనున్న పదినెలల కాలములోఁ గొందఱు గోపకన్యకలకు
్లిదండ్రులు బలవంతముగ వారి యిష్టమునకు విరోధముగ
ములు గావించినట్లు తోఁచెడిని. ఏలన ? వస్త్రాపహరణము
నందఱు కన్యకలే. రాసలీలలోఁ గొందఱు వివాహిత
చెప్పఁబడెను గావునఁ గొందఱు వివాహితలని యూహింప
చ్చును. "తాను గోపికలకిచ్చిన మాట స్మరించి" యనుటచే
ముందలి గోపికలు వస్త్రాపహరణమునాఁటి గోపికలే యై
లయును. వీరి నాకర్షింపఁ గృష్ణుఁడు వేణుగాన మొనర్చెను.*
ోపిక లామురళీగానంబు విని చేయుచున్న పనులు చాలించి
ిదు లెవ్వరు వారించినను నిలువక కృష్ణునొద్దకు వచ్చిరి.
ంనిచే నాకర్షింపఁబడిన మనస్సెట్లు సర్వము మఱచి స్పృహ
మెట్లు గలిగించునో యావిషయము గోపికల యాత్మఖ్యాతి
ు (178-179)లు పఠించిన స్పష్టమగు. ఈ మనోహరగానము

---

* Music is a divine influence which stirs the heart to seek. Those who listen to it spiritually attain unto God and who listen to it sensually fall into unbelief."

DHUL NUN THE EGYPTIAN.

కొందఱు నాకర్షింపఁ జాలుటెట్లు కొందఱు నాకర్షింప కుండుటెట్లు ?* అను సందేహము కలుగవచ్చును. గాన రసానుభవమున నానందించు శక్తి యందఱకుఁ గలుగదు. అందుఁ గొందఱకుఁ గృష్ణవేణునాదము ప్రతిదినము వినుచున్న దేయగుటచే దేవాలయ సమీపమునందుండు భక్తిహీనులకు దేవాలయమందును, దివ్యక్షేత్రంబుల నుండువారి కాయా క్షేత్రంబునందునుబోలె నుదాసీనత గలుగును. అతిపరిచితి యవజ్ఞతకుఁ గారణముగదా. 'నచాత్మా ప్రవచనేనలభ్యో' యన్నట్లు భగవంతుఁ డెవరి ననుగ్రహింపఁ దలఁచునో వారికిమాత్రమే భగవద్విషయము రుచించునుగాని తక్కిన వారికి రుచింపదు. అనాఁటి గానము సంకేతయుక్తము. ఎవరి నుద్దేశించి గానమొనర్చెనో వారికి మాత్రమే కృష్ణుఁడు తమ్ముఁ బిలుచుచున్నాఁడని యర్థమగునుగాని యితరులకు దెలియ సాధ్యపడదు యమకింకర పాశంబులనైన వారింపవచ్చునుగాని భగవంతునిచే నాకర్షింపఁబడిన మనస్సు నిలుప నెవరి తరము ?

ఇట్లు వచ్చిన గోపికల చిత్తస్థైర్యముఁ దెలియఁగోరి బ్రాహ్మణస్త్రీలకుఁ జెప్పినట్లే యుండ్లకుఁబొండని కృష్ణుఁడు వారికి నుపదేశించెను. భక్తిరసముకాఁచి యార్చి తేర్చి యొడియఁబోసి ముకుబంటిగఁ ద్రావిన ఘటములవియా చెవులు వ్రేలవ్రేసికొని వెనుకకుఁ బోవును ? భగవత్కింకరులు కైంకర్యమునకు విరోధమైన కార్యమును జేయుఁడని భగవంతుఁడే చెప్పినను లక్ష్మణునివలె నిరాకరింతురుగాని చేయరు. వస్త్రాప

---

* శ్లో॥ దేవానాం గుణలింగానా మానుశ్రవిక కర్మణామ్
సత్త్వ ఏవైక మనసో, వృత్తి స్స్వాభావికీతుయా॥ భాగ. ౩. 25.32.

“ప్రకాశ్యతే క్వాపిపాత్రే” నాసూ. 53. సూర్యుఁడే సూర్యుని మనము చూడఁ గలుగునట్లు చేయుచున్నాఁడను సామెత ననుసంధింపఁదగు.

Man's love to God is a quality which manifests itself, in the heart of the pious believer, in the form of veneration and magnification, so that he sees to satisfy the Beloved and becomes impatient and restless in his desire for vision of Him and abjures the recollection of everything besides.

HUGWIN ISLAMI MYSTIC.

హరణానంతరము జరగిన గోవర్ధనోద్ధారణము లోనగు లీలలవలనను నిరంతర తదేకధ్యానమువలనను వారి మనస్సు మఱింత దృఢపడి యెను. ఇట్లు దృఢపడుటకుఁగానే కృష్ణుఁడు కాలవిలంబనము గావించెను. లజ్జ తమస్వాధీనము గావునఁ గన్యకలు దానినివదలిపెట్ట సాహసింపఁగలిగిరి. దేహములు పరాధీనములు. ఇంటిలోఁ బెద్దలున్నవారు రాత్రులందు వారిని నిరాకరించి రావలయుననిన నెక్కువ సాహసము కావలయును. ఈ నడిమికాలములో వారిమనస్సు పర్యాలోచనము మీఁద దృఢపడుటచే వేణునాదము వినఁగానే బంధువులనెల్లఁ దృణీకరింపఁ గలిగిరి. స్త్రీలకు మానము ప్రాణాధికము. శ్రీకృష్ణునకుఁ బ్రీతిగ మానమును మున్నే వదలినవారిప్పుడు ప్రాణములనయిన విడుతురుగాని మరలిపోదురా. పోరైరి. పతుల నిర్బంధముచే రాను వలనుపడని గోపికలు కృష్ణుని భావమునందే నిలిపి కన్నులు మోడ్చి తద్ధ్యానయుక్తలై సహింపరాని ప్రియతమ విరహతాపంబునఁ బ్రారబ్ధ మెల్ల నణఁచి ధ్యానప్రాప్తుండైన నచ్యుతు నాలింగనంబు గావించి యమంగళంబులెల్ల క్షయింపఁజేసి యప్పుడే బంధనిర్ముక్తలై గుణమయదేహమును వదలి యా పరమాత్మఁ జేరిరి.

విరహతీవ్రతాపంబునం బ్రారబ్ధంబు క్షయించుట వింతగాదు. సంచితము ప్రారబ్ధము ఆగామియని కర్మఫలంబు త్రివిధము. మన మనేకజన్మంబుల సంపాదించిన కర్మమంతయు సంచితము. ఇది నిన్నటి రాత్రివఱకు మనము సంపాదించిన ధనమువంటిది. ఇం దీజన్మంబున ననుభవింపవలసినది ప్రారబ్ధము. ఇది యీదినము మన మనుభవించు ధనము. సంచితములోఁ బ్రారబ్ధముపోను మిగిలినది యాగామి. ఇది రాఁబోవు జన్మంబుల ననుభవింపవలయును. భగవంతుఁడు తనయం దత్యంత భక్తికలిగి తన్నే నమ్మినవారి సంచితమును(దీనినే పూర్వాఘ మందురు) నాగామిని (ఉత్తరాఘము) నశింపఁజేయును. మిగిలిన ప్రారబ్ధలేశమును మాత్ర మనుభవింపవలయును. ఇదియైనను దీవ్ర రోగబాధ గలిగించియో దుష్టభార్య దుష్టపుత్రులు లోనగు వారి నిచ్చి వారిచేత తీవ్రమనోదుఃఖము కలిగించియో శీఘ్రముగ నశిం

షఁజేసి జన్మాంతమున భగవంతుఁడు దన్ను జేర్చుకొనును. ఇది భైరవయాతన వంటిది. కాశిలోఁ జచ్చినవారికి ముక్తిగలదనిగదా ప్రమాణము. అట్టివారి కర్మబంధములు వదలు టెట్లు? దుఃఖాను భవముచేతనే తీఱవలయును. అనిమిత్తమై మరణకాలమున భైరవుఁడు త్రిశూలమున నొకపోటు పొడుచును. క్షణమాత్రముండినను నా బాధ యనేక వేల సంవత్సరముల నరకబాధకు సమానముగ నుండును. ఆవల ముక్తి. అట్లులే గోపికలును నతీవ తీవ్ర తాపంబునఁ బ్రారబ్ధంబు క్షయింపఁజేసి తీవ్రధ్యానబలంబున హరిం జేరిరి. ఖట్వాంగుఁ డేడుగడియ లలో ముక్తిసంపాదించినది తీవ్రధ్యానంబుననేకదా. నడచి గంటలోఁ జేరు స్థలమును బరువెత్తి కాలుగంటలోఁ జేరినట్లు లిదియు. కాంత భావముతోఁ గృష్ణుఁ స్మరించినవారికి మోక్షమెట్లు లభించును? కాంతాసక్తిని వివరించుచోటఁ గాంతశబ్దమునకు భర్తయుఁ బ్రియుఁడు నని రెండర్థములును వ్రాయఁబడియె వీరు వస్త్రాపహరణ కాలమునఁ గృష్ణునిచే వరమునొందిన వారైరేని వీరికి శీలహాని లేదు. అటుగాక వీరందుఁ జేరియుండియు నావల వివాహితలైరేనియుఁ బరకీయలుగారు. ఏలనఁ గన్యకలకు యుక్తవయస్సురాకముందు వివాహము చేసిరేని వరుని నియమించుటకుఁ దల్లిదండ్రుల కధికారము గలదుగాని కన్యకలు యుక్తవయస్సువచ్చినవారైనచో నాయధికారము వారిదే. వారు కోరినవారికిచ్చి వివాహముచేయుట పెద్దవారికి విధి. కన్యక తొలుత నెవనిని వరించెనో వాఁడే బ్రతికినను జచ్చినను దానికిఁ బతిగాని వేఱొకని మనస్సునన్నైన స్మరింపరాదు. అట్లు స్మరించునది ఱంకుటాలు. కావున ముందుగ నొకనిని మనస్సుచే వరించినపిమ్మట వేఱొకనిని వివాహమాడినచో వివాహముచేసికొన్న భర్త యుపపతి యగును గాని శాస్త్రీయభర్త కాఁజాలఁడు. అట్టిది శీలవతియగుట సందిగ్ధ విషయమే. (ఆర్యచరిత్రరత్నావళియందలి సావిత్రీవాక్యములు పఠింపుఁడు) రుక్మిణివిషయంబునను నిదికొంత గ్రంథంబునఁ జర్చింపఁబడియె. వీరు సాధనసిద్ధలైన యితరగోపికలు పరకీయలనియే తలంచినను వారొనర్చినది యకార్యముగాదు. మహాపాతకులందఱు భగవద్ధ్యానము

చేయుటేల ? పాపము క్షయించి భగవత్ప్రాప్తి కలుగునని కదా. అట్లుండ భగవంతుఁడు ప్రత్యక్షముగవచ్చి యెదుటనుండినపుడాయనను గలియఁగోరుట దోషమెట్లగు ? ఎవరైన నేయుపాయముచేనైన మనస్సును భగవంతునియందు నిలుపుట ప్రధానముగాని యుపాయము ప్రధానముగాదు. గంగలో స్నానముచేయఁ గోరువాఁడు దేహమును గాళిఁజేర్చుట ప్రధానముగాని నడచిపోయిననేమి ? పొగబండిలోఁ బోయిననేమి ? శ్రద్ధాభక్తులకుఁ గొఱఁతలేకుండినఁ జాలు. అట్లులే మనస్సును భగవంతునియందుఁ జేర్చుటకుఁ గర్మయోగము రాజయోగము జ్ఞానయోగము నట్టియుపాయములో కామక్రోధాదులు నట్టి యుపాయములే. కావుననే

శ్లో॥ మాంచయో వ్యభిచారేణ, భక్తియోగేన సేవతే।
సగుణాన్ సమతీత్యైతాన్, బ్రహ్మభూయాయ కల్పతే ౧౪-౨౬
కృష్ణలీల. నం-౨. ౪౧౧

పరభక్తియందు నిలిచి యితర ధర్మకార్యములు చేయకుండుట దోషముగాదుగాని యితరకర్మముల నిష్ఠవహించి భక్తిసలుపనివాఁడు వ్యర్థుఁడు.

శ్లో॥ సంధ్యాయేన నవిజ్ఞాత, స్సంధ్యాయేనా నుపాసితః
జీవమానో భవేచ్ఛూద్రో, మృతశ్శ్వానోభి జాయతే॥
సంధ్యాహీనోఽశుచిర్నిత్య, మనర్హస్సర్వ కర్మసు
యదన్య త్కురుతేకర్మ, నతస్య ఫలభాగ్భవేత్॥
ఉపతిష్ఠంతి యేసంధ్యాం, యేనపూర్వాం నపశ్చిమాన్
వ్రజంతితే దురాత్మానః స్తామిస్ర నరకంనృప॥

ఎవఁడు సంధ్యనెఱుఁగఁడో, యెవఁడు సంధ్యవారువఁడో వాఁడు బ్రతికినంతకాలము శూద్రుఁడు. చచ్చి మఱుజన్మమునఁ గుక్కయైపుట్టును. సంధ్యవారువనివాఁ డెల్లప్పుడు నశుచియే. వీఁడేకర్మముచేయ నర్హుఁడుకాఁడు. అట్టివాఁ డేపుణ్యకర్మమును జేసినను దానిఫలము నొందఁజాలఁడు. సాయంకాలమున నుదయమున నెవఁడు సంధ్యవారువఁడో యట్టి దుర్బుద్ధి తమిస్రనరకమునఁ గూలును,

అట్టులే పైతృకకర్మము లాచరింపనివాఁడు భ్రష్టుఁడే. నిత్యనైమిత్తిక కర్మము లవశ్యకర్తవ్యములై, చేయకుండినఁ బ్రత్యవాయము కలిగించునవియై యుండినను సమాధియందుండువారు దినములకొలఁది నేఁడుఁ గొలఁది సంధ్యాహీనులై యుందురు. వారు భ్రష్టులా ?

శ్లో॥ సంధ్యావందన ! భద్రమస్తుభవతే, భోస్నాన తుభ్యంనమో
భోదేవా ! పితరశ్చ ! తర్పణవిధౌ నాహంక్షమః క్షమ్యతామ్
యత్రక్వాపి నిషద్య చేతసి యదూత్తంసస్య కంసద్విషః
స్మారంస్మార మఘంహరామి తదలం మన్యే కి మన్యేన మే॥

అని సంధ్యావందనాది నిత్యనైమిత్తిక క్రియలకెల్ల నొక్కసారిగ సెలవొసంగిన లీలాశుకులు పతితుఁడా ? అత్యంత భక్తియుక్తానాం, నచశాస్త్రం నచక్రమ' యనికదా శాస్త్రోక్తి. రెండుమార్లు మూఁడుమార్లు స్నానము చేయుమని యేల విధిపుట్టెను ? మలభాండమగు దేహమున మీఁద నెంత కడిగినను నిష్ప్రయోజనమని విరక్తి జనించి స్నానము చాలింపఁజేయుటకే యనికదా పతంజలి వచించెను. అట్టులేసామాన్య ధర్మములన్నియుఁ బరభక్తి యుదయించువఱకే కర్తవ్యములు. అవి నైచ్ఛికములు. చేయకుండిన దోషములేదు. భక్తికి విఘ్నమును గలిగించునవి యగునేని చేయనేరాదు. సామాన్యధర్మము లన్నియుఁ బరభక్తియను గంగా ప్రవాహమున నుపనదులు. సముద్రముఁ జేరఁగోరువాఁ డీయుపనదుల మూలమున గంగానదిని బ్రవేశించినపిమ్మట మరల నుపనదులలోనికి వచ్చుట వివేకమా ?

అట్టులే పాతివ్రత్యము భగవత్ప్రాప్తికి సాధనము. ప్రత్యక్షదైవము లభింపనికాలమునఁ బతియే దైవముగ భజించి భగవంతుని గలయవలయును. అట్టి భగవంతుఁడే ప్రత్యక్షముగ లభించినప్పుడాయనను విడిచి వేఱొకని నాశ్రయించుట తప్పు. పొలముదున్నుట పైర్లు పండించుట ధాన్యము సేకరించుట వండుట యివన్ని దేనికి ? ఆఁకలి నణఁచుటకుఁగదా. యోగాభ్యాసముచే నాఁకలిని జంపినవాఁడు మరలఁబోయి మడకకట్టి దున్నవలయునా ? వంట చేయవలయునా ? కావున సాక్షాద్భగవంతుఁడు కరగతుఁడై యుండ నాయనను

విడిచి మరలఁ బ్రాకృతపురుషుఁడై దేవరులాడుట పక్వక్షేత్రమును వదలి యరణ్యమున కున్నఁబోవుట కావున గోపికలు సాక్షాద్విష్ణుఁ గృష్ణుని జారభావముతోఁ దలఁచి వలచియుండినను వారియందు దోషములేదు *

నా మిత్రులొకరు తారాశశాంక చరిత్రమునకు గోపికాకృష్ణ చరిత్రమునకు భేదమేమని ప్రశ్నించిరి. రెంటికినిగల భేద మిదివఱకు గ్రంథములోను నిందును వ్రాసిన విషయమునుబట్టియే స్పష్టమై యుండఁగలదు. మఱియొక దృష్టాంతమునఁ దారతమ్యము విశదము కాఁగలదు.

మహాప్రవాహమునఁ గొట్టుకొనిపోవు కొందఱు తీరముననున్న చింతచెట్లయు మునగచెట్లయుఁ గొమ్మలు నీటిలోఁ వ్రేలాడుచుండుటఁ గని వానిని బట్టుకొనిరి. అందొకఁడు మునగకొమ్మను మునగకొమ్మయని యెఱిఁగియే పట్టుకొనెను. వీఁడు తారవంటివాఁడు. రెండవవాఁడు మునగకొమ్మను జింతకొమ్మ యనుకొని పట్టుకొనెను. వీఁడు క్రైస్తవుని వంటివాఁడు. మూఁడవవాఁడు చింతకొమ్మ లభించినను నది మునగకొమ్మయని తలఁచి యిది మనల నేమిరక్షించునని విడిచెను. వీఁడవ తారతమ్య మెఱుఁగనివాఁడు. నాలవవాఁడు చింతకొమ్మను మునగ

*"He (Sri Ramakrishna Paramahamsa) placed himself in all manners of relationship to God, now as the servant now as the lover, now as the child of the most High Again, he would attain the divine state of consciousness, when he saw God as all in all, beyond thought, beyond form, beyond personality, forgetting himself, and was conscious only of that Reality which is the most High. His powers were remarkable, with a touch, with a look. With but a wish he made others conscious of what he was conscious, The thoughts of others he could see as one sees an object. By his will he could find the chief tendency, the leading purpose the prevailing characteristic of any personality.

Life of SWAMI VIVEKANANDA.

ఆళ్వారులను దమ్ము నాయికలఁగ భగవంతు నాయకునిఁగ భావించి గానమొనర్చిరి.

కొమ్మయని తలఁచి దానిమూలమున నొడ్డుచేరఁదలఁచి పట్టుకొనెను° ఐదవవాఁడు ప్రవాహములోఁ బోవుచున్నాము. ఆఁకలియగుచున్నది చిగురైనఁ దినుదమని చింతకొమ్మను బట్టుకొనెను. వీఁడర్థార్థి యార్తుని వంటివాఁడు. దానిని బట్టుకొనుటచేఁ దా నేటిలోఁ బోవకనిలుచుట యెఱిఁగి దీనిమూలమున నొడ్డుచేరవచ్చునని యావల మనస్సునకు రాఁగా దాని నాధారముఁ జేసికొని మెల్లగ నొడ్డుచేరువాఁడు. ఆఱవ వాఁడు చింతకొమ్మను జింతకొమ్మయని యెఱిఁగి యుభయవిధఫల ములు దానివలననే లభించునను జ్ఞానముగలిగి పట్టుకొనెను. మఱి యొకఁడు తీరముఁ జేరుటే ప్రధానముగ నెంచి చింతకొమ్మను జింత కొమ్మయని యెఱిఁగి పట్టుకొనెను.

ఇందు మొదటితరగతిలోనివారు తారవంటి జారస్త్రీలు* వీరు నరకయాతన ననుభవించి సంసారమునఁ గూలవలసినవారే. రెండవ తరగతిలోనివా రావేశావతారములను క్షుద్రదేవతలను బూజించు వారు. వీరికి ముక్తి లేదు. మూఁడతరగతిలోనివారు

శ్లో॥ అవజానంతి మాం మూఢా, మానుషీం తనుమాశ్రితమ్
పరంభావ మజానంతో°, మమభూత మహేశ్వరమ్॥ ౯-౧౧.
(కృ. లీ. సం-౨ పుట-౩౮౫)

అని కృష్ణుఁడు చెప్పిన తరగతిలోనివారు. జరాసంధ పౌండ్రక వాసు దేవునివంటి యవతారతత్త్వమెఱుఁగనివారు. నాలవవారు పతివ్రతలు.

---

* తార యనఁగా నక్షత్రము. వసిష్ఠనక్షత్రమునకు నరుంధతివలె బృహస్పతి కొక యుపగ్రహము కలదు. అప్పుడప్పుడు ఖగోళములో జరుగు సల్లకల్లోలములలో నొకానొక కాలమున నది బృహస్పతికి నుపగ్రహముగ నుండక చెదరిపోయి చంద్రునిఁ జుట్టి తిరుగుచు నాయన కుపగ్రహమైయుండి యావల మఱియొక కాల మున మరల బృహస్పతి కుపగ్రహముగఁ జేరెనని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. తారాశశాంకవిజయతత్త్వ మిది. ఈ తత్త్వార్థమును గ్రహించినచో గోపికల కననేల భక్తులకుఁ దారకు భేదములేదు. భగవదంశములైన జీవులు మరల భగవంతునిఁజేరుట దోషమా : భగవంతుని విడిచి ప్రాకృతపురుషులఁజేరుట వ్యభిచారముగాని మరల భగవంతునిఁజేరుట వ్యభిచారముగాదు బృహస్పతిని విడిచి చంద్రునొద్దఁజేరుట వ్యభి చారమనిరికాని చంద్రుని విడిచి బృహస్పతియొద్దఁ జేరుటవ్యభిచారమందురా ?

వీరు మనుష్యులను వివాహమాడినను సంసారమును దరింపవలయునను కోరికగలిగి భర్తయే దైవమని శ్రద్ధాభక్తులచేఁ బూజించుటచేఁ దరించువారు. విగ్రహారాధనపరు లీ తరగతిలోనివారే. ఐదవవారు కామ్యమే ప్రధానముగ భగవంతు నాశ్రయించువారు. వీరికి ముక్తి మీఁద దృష్టిలేదు. వీరికిఁ గ్రమముగఁ గాలాంతరమున ముక్తి. భగవంతుఁడు భుక్తిముక్తి రెంటిని నొసంగునని భగవన్మాహాత్మ్య మెఱిఁగి భక్తిఁ జేయువా రాఱవతరగతివారు. వీరు గోపికలవంటివారు. ఏడవ తరగతివారు కుచేలునివంటివారు.

నాల్గవతరగతివారినిగుఱించి యొకమాట మఱియొకసారి చెప్ప వలసియున్నది. స్త్రీలు భర్తలను మనుష్యులని, భక్తులు దేవతావిగ్రహములను మృచ్ఛిలాదారు లోహవికారములని తలఁచుచుండువఱకు వీరు కడతేఱఁజాలరు. ఇట్టి యభిప్రాయము వాస్తవమునకును విరోధము. భగవంతుఁడు తనశరీరముతోనే సమస్త ప్రపంచమును గల్పించెను. తానే దానిలోఁ బ్రవేశించి రూపనామక్రియలు గలదానినిగా నానావిధములుగఁ జేసెను. అప్పుడు తాయి అప్ప చెట్టు గుట్ట మనుష్యుఁడు పశువు సర్వము భగవత్స్వరూపమేకదా. వీనిని మఱియొక విధముగాఁ దలఁచుట యజ్ఞానముచేతనే. ఉన్నదున్నట్లు తెలిసికొనుట జ్ఞానము. ఇట్టి జ్ఞానముకలిగి యిది స్థిరపడుటకై యుపాసనచేయువాఁడు ముక్తుఁడు కావున భక్తికొలఁది ముక్తి. కావున భర్తలను దైవముగా స్త్రీలెంచుటయందును నర్చావిగ్రహములను భక్తులు దైవములుగా నెంచుటయందును సత్యవ్యతిక్రమ మేదియుఁ గానరాదు. మఱియొక విధముగ నెంచుట దోషము. పతి దేవతలని చెప్పఁబడిన సీతాదుల వృత్తాంతమును, నేకలవ్యచరిత్రమును, రామదాసాది భక్తుల మహిమను స్మరింపుఁడు. "దైవే మంత్రే ద్విజే తీర్థే, దైవజ్ఞే భేషజే గురౌ। యాదృశీ భావనా యత్ర, సిద్ధిర్భవతి తాదృశీ॥" యని కలదుగదా సూక్తి*

* క్రైస్తవులు మనదేశమునఁ బ్రవేశించిన క్రొత్తలో నొక క్రైస్తవమతకుఁడు దాక్షిణాత్యదేశంబున నెలకొనియుండెను. వీఁడొక గ్రామమునకుఁ గొంచెము దూరమునఁ గొంతభూమి సంపాదించి దానినడుమ గుడిసెవేసికొని యుండెను. వీఁ

డప్పుడప్పుడు చుట్టునుండు గ్రామములకుఁబోవుట మన మతమును దూషించివచ్చుట వీని యాచారము. ఈ బోధకుల కందఱకు జీవనోపాయ మిదియేకదా ? ఒకనాఁ డొక పల్లెకుఁబోయి యింటికి వచ్చుసమయంబునఁ ద్రోవలో విశేషముగ గుంపు చేరి యుండెను. ఏమిదియని విచారింప నందొక గ్రామదేవతగుడియుండనందు భక్తులు భక్తురాండ్రు మ్రొక్కుబడులు చెల్లింపవచ్చియుండిరి. అప్పుడు వారినందఱ నేలవచ్చితిరని విచారించెను ఒకతె యాదేవతకు మ్రొక్కుటచే బిడ్డలు కలిగెనని మ్రొక్కుబడి చెల్లింపవచ్చితినని చెప్పెను. ఒకతె తనమగనికి రోగము నివర్తించెనని చెప్పెను. ఒకఁడు తనకార్యము గెలిచెనని చెప్పెను. ఇట్లొకరొక రొక్కొక్క కారణముచెప్పిరి. అప్పుడా బోధకుఁడు దేవాలయములో నేమున్నదో చూతమని తనయొద్దనున్న దూరదర్శిని (దుర్భిణి)తోఁ జూడఁగా నొక భయంకరశక్తి విగ్రహము శిశువుమీఁద నిలఁబడి వధించుచున్నట్టు కానవచ్చెను. అపుడాతఁ డిట్టు లాలోచించెను శిశువునుజంపు చున్నట్టు చెక్కఁబడిన యీవిగ్రహమేమి బిడ్డల నిచ్చుటయేమి? ఈ హిందువు లెంత మూఢులు కాని వీరికిఁ దగిన ప్రాయశ్చిత్తముచేఁ దెలివివచ్చునట్లు చేసి వీరి నందఱను మనమతములోఁ గలుపుకొనవలయునని యాలోచించి యింటికిఁబోయి తన యొద్ద భృత్యుఁడుగానున్న మాలవానినొకని మతభ్రష్టునిఁబిలిచి యోరీ నీవీప్రక్క చేనిలో మడకడున్నుచుండుము. అందు నీ వీ రాతిస్తంభమును నడుములోఁతు గుంత తీసి పూడిచియుంచుము. ఆ దేవాలయమునుండి జనులు గుంపులుగుంపులుగా నీబాట వెంటఁ బోవుసమయముఁ జూచి నెత్తురుగ్రక్కి యావేశము వచ్చినవారివలె నటించి హాఁహూఁ యని కేకలు వేయుము. ఏమని విచారించుటకు వారందఱువత్తురు అప్పుడు నీవు "నే నీశ్వరుఁడను. ఇందు నడుములోఁతులో నున్నాను. నన్ను విచారించువారు లేరు. నన్ను వెలుపలికిఁదీసి ప్రతిష్ఠచేసి కోవెలకట్టింపవలయు"నని చెప్పుము. ఆవల నే వేడుక జరుగునో చూతమని బోధించెను. వాఁడు నెత్తురు గొంత తుత్తుకలో నుంచుకొనియుండి యాగుంపు మరలి యాత్రోవఁ బోవు సమయమునఁ గ్రైస్తవగురువు చెప్పినట్లు చేసెను. ఆభక్తులందఱు త్రవ్విచూడ లింగాకారమున రాయియొకటి కానవచ్చెను. వెంటనే వారందఱు చందాలువేసికొని యా భూమిని నాక్రైస్తవబోధకుని వలన విక్రయించుకొని తత్కాలమునకొక చిన్నగుడికట్టించి పూజజరుగు నేర్పాటులు చేసిరి. ఇట్లొక సంవత్సరము జరిగెను. మఱుసటి సంవత్సరమున నా సమయమునకు సరిగ నూర్లకొలఁది స్త్రీపురుషు లా దేవళమునొద్దకువచ్చి ముడుపులు చెల్లించుచుండిరి. ఆ వచ్చెడివారందఱ నాక్రైస్తవుఁడు కారణము విచారించెను ఒక్కొక్కరు బిడ్డలు గలిగిరని రోగములు నివర్తించెనని యిట్లొక్కొక్క విధముగఁదమకుఁగలిగిన మేలు చెప్పసాగిరి. ఒకరిద్దఱైన బుద్ధిహీను లనవచ్చును. నూర్లకొలఁది యిందఱు నసత్య

పాదులా? నిష్కారణముగ నేలవచ్చి యిచ్చట వెలగలముడుపులు చెల్లింతురు? చంత నుండు బిడ్డల ననత్యమని యెటు చెప్పవచ్చును ? దానిచే వీరికి రాఁగల లాభమేమి ? యని యాలోచించి యా క్రైస్తవుఁ డింతయు సత్యమేయని తీర్మానించుకొని యా వృత్తాంతమంతయు వ్రాయుచుఁ గడపట "హిందువులు భక్తిబలముచే శిలలనుగూడ దేవతలఁగాఁ చేయఁగల"రని వ్రాసెను. ఇది అంటిక్వేరియను గ్రంథమునఁ గనవచ్చు నని నా మిత్రులు ఆర్. వి. వేంకటసుబ్బయ్య, ఎం.ఏ. గారు చెప్పిరి.

విషవైద్యుఁ డొక గొల్లవాఁ డుండెను. ఎట్టిపాము విషమైనను వీనిపేరు చెప్పిన దిగిపోవును ఆ కారణమున వీనిప్రసిద్ధి దేశమంతట వ్యాపించెను. ఒక చోట నొక బ్రాహ్మణుఁడు శాస్త్రాధ్యయనసంపన్నుఁడు జపతత్పరుఁడు మంత్రవేత్త యుండెను. ఈతఁ డొకగంట మంత్రించినఁగాని పాముదిషము దిగదు. అప్పు డీ బ్రాహ్మణుఁ డిట్లాలోచించెను. వాఁడు చదువు సంధ్య లేక పశువుల మేపుచు శుచి త్వమనుట యెట్టిదో యెఱుఁగని గొల్లవాఁడు. వాని పేరుచెప్పిన విషము హరించు టేమి నే నుత్తమ బ్రాహ్మణుఁడను, మంత్రవేత్తను, సదాచార పరాయణుఁడను, జప తపోనుష్ఠాన పరుఁడను, నేను గంటసేపు శ్రమించినఁగాని దిగకుండుట యేమి యని యాలోచించి యా గొల్లవానియొద్దకుఁ బోయి యతని నాశ్రయించెను. కొన్నాళ్ళ కా గొల్లవాఁడు "ఏల బాఁపనయ్యా! నాచుట్టు తిరుగుచున్నా"వనెను. ఆ బ్రాహ్మణుఁడు తన వృత్తాంతము దెలిపి నీ మంత్రము నాకు నేర్పుమని ప్రార్థించెను. వాఁడు దాని కిష్టపడక కాలహరణముచేసియు నా బ్రాహ్మణుఁ డెప్పటికి వదలక పీడించుటచే నొకనాఁ డిట్లు చెప్పెను అయ్యా! పామునకు మూఁడు కోఱలుండును. ఆ మూఁటి పేర్లు చెప్పిన విషము పోవును. అంతే అంతకంటె మఱేమి లేదనెను. పామునకు రెండేకదా కోఱలు మూఁడనెదవేమని బ్రాహ్మణుఁడనెను. లేదులేదు మూఁడుకోఱలు, అకోరబ్బ తకోరబ్బ కోరకోరబ్బ యీ మూఁడుపేర్లు చెప్పిన నెట్టిపాము విషమైన హరించిపోవునని గొల్లవాఁ డనెను. ఓరి మంచిమంత్రము నీనోరఁబడి పాడైపోయెఁ గదా. అఘోరేభ్యః తఘోరేభ్యః ఘోరఘోరేభ్య యనవలయునురా యని యా పండితుఁ డనెను. ఛీ బాఁపననాయాలా నీవు చెడితివి నన్నుఁ జెఱిచితివి ఛీ పొమ్మని గొల్లవాఁడనెను. అదిమొదలా గొల్లవాఁడు మంత్రించిన విషము దిగుట లేదు బ్రాహ్మణున కామంత్రము ప్రయోజనపడినదికాదు. భక్తిప్రభావ మిట్టిది. కావుననే కృష్ణమూర్తి శ్రద్ధగలవాఁడు జ్ఞానియై మోక్షము గను ననియు నజ్ఞుఁడు శ్రద్ధలేనివాఁడు ఫలము కలదో లేదో యని సంశయించువాఁడు నశించుననియుఁ జెప్పెను. భ.గీ. ౪-౪౦.

కావున నింటియందుండి విరహతాపాతిశయంబున వేఁగి భావనాబలంబున గోచరించిన కృష్ణస్వరూపమును కౌఁగిలించి తదేక ధ్యాననిష్ఠచేఁ బ్రాణములువిడిచిన గోపికలకు ముక్తి కలుగుటకు

శ్లో॥ అంతకాలేచ మామేవ, స్మరన్ముక్త్వా కళేబరమ్
యః ప్రయాతి సమద్భావం, యాతినాస్త్యత్ర సంశయః॥
భ. గీ. అ-౫. కృ. లీ. సం-౨. పుట-౩౧౦.

యంయంవాపి స్మరన్ భావం, త్యజత్యంతే కళేబరమ్
తం తమేవైతి కౌంతేయ! సదాతద్భావ భావిత॥ అ-౬.
కృ. లీ. సం-౨. పుట-౩౧౦.

యను వాక్యము లే ప్రమాణము.* జింకను ధ్యానించిన భరతుఁడు జింకగాఁబుట్టెను. కృష్ణునిధ్యానించిన గోపికలు కృష్ణునిఁజేరిరి. కావునఁ కుక్కల సాఁకువారు కుక్కలుగాను గ్రోఁతులను సాఁకువారు గ్రోఁతులుగాను బుట్టుదురు. స్వీయకుఁ (మగనాలికిఁ) గాని పరకీయకుఁ (అంకుటాలికిఁ) గాని సామాన్య (వేశ్య)కుఁ గాని గోపికాచర్యయే యనుసరింపఁ దగినది. కృష్ణుఁ డీకాలమున లేఁడే యని విచారపడఁ

---

* "Thus the aim of the writer was to hold before his readers as illustrations of the maxim that Faith and Love are the only means of salvation, and to show how these can be kindled in the human heart,—by seeing Him by touching Him, by singing His glory—the three usual processes described in the Hindu Sastras. These different processes the writer has shown in succession in the various actions of the Gopis Finally, he points out what the nature of the Love that blinds man to God should be In one word, the renunciation of the whole world is the price that has to be paid for this love; and this the writer has shown by the example of Gopis, who, although they were but weak women, possessed indomitable will Even when prohibited by their fathers, brothers, nay even by their husbands, they would not be dissuaded from their purpose. Some of them even died in their ecstasy, which means one must purchase the love of God with his own life if necessary."

BABU HIRENDRA NATH DUTT, M.A., B.L.

బనిలేదు. ప్రత్యుత కృష్ణునియెడ ద్వేషబుద్ధి వహించి నిందించిన శిశుపాలుఁడు, విషమిచ్చిన పూతన, దర్శన స్పర్శనాదుల ముక్తిని గాంచినట్లు తమ సర్వస్వము ప్రీతితో నర్పించిన గోపికలు భావమున దర్శించి స్పృశించి ముక్తిఁగాంచిరి. ఫల మిరువురకు సమానమైనను ప్రత్యుతమునకన్నఁ బరోక్షమే శ్రేయస్కరమని కృష్ణాభిప్రాయము.

గోపికలు చేసినట్లు ఈకాలపు స్త్రీలు చేయవచ్చునా యందురేమో. వాడవదినె లగుటకో కడుపుకూడు సంపాదించుకొనుటకో యట్లు చేయరాదుగాని వాస్తవమైన పరమవిరహాసక్తి యుదయించెనేని చేయవచ్చును. ఇంతకు గోపికలు చేసినదేమి? ప్రత్యుత భగవంతుఁడు పిలిచిన కారణమునఁ దత్కాలమున నిల్లువాకిలి విడిచి పోయిరిగాని శాశ్వతముగ విడిచిపోయినవారు కారు. ఇప్పటివారట్లు పోవుటకు సాక్షాద్భగవంతుఁ డెందుండివచ్చును? ఈ పరభక్తిచేఁ గన్యకలు వేఱొక మగనిని గోరినవారు కారు. వివాహితలు భర్తలతో సాంగత్యము చేసినవారు కారు. అంతటి భక్తురాండ్రను మగలు తాఁకుటకును భయపడుదురు. ఈ బ్రహ్మచర్యము పాశ్చాత్య బ్రహ్మచర్యము గాదు. వివాహము మానుటమాత్రమే వారి బ్రహ్మచర్య లక్షణము. కావునఁ బెండ్లి చేసికొనక యితరుల స్త్రీలతోఁ దృప్తిపడి యుండువాఁడు బ్రహ్మచారియేయఁట.* ఇట్టి నీతివిశారదులు చుఁడీ గోపికాకృష్ణుల నాక్షేపించువారు.

ఇఁక కృష్ణునిఁ జేరఁబోయిన గోపికలస్థితి విచారింతము. వారు పాతివ్రత్యోపదేశరూపమునఁ గృష్ణునిచే నిరాకరింపఁబడి యిట్లనిరి.

పతులను సుతులను సమస్త భోగపదార్థములను నిశ్శేషముగ వదలి నీ పాదమూలంబుఁ జేరి భక్తురాండ్రమని తమ మనస్సులఁ గల దెల్ల వచించిరి. (పుటలు ౧౯౩ మొదలు ౧౯౭ వఱకుఁ జూడుఁడు.) ఈ వాక్యములను ౧౦౭-వ పుటలోని ౨ పంక్తులను ౨౧౨ లోని

---

*"CELIBACY." The Tin Trumpet gives the following definition: "Celibacy, a vow by which the priesthood in some countries swear to content thamselves with the wives of other men."

C. P. BROWN'S. DIC: FIRST EDITION.

౮-౯-౬ పంక్తులును, బఠించినయెడలఁ గృష్ణుఁడు సాక్షాద్భగవంతుఁ డను జ్ఞానము వారికి సంపూర్ణముగ నుండుట తెలియనగు.

కృష్ణుఁడు సాక్షాద్భగవంతుఁడని పూర్వవ్యాసంబుల సిద్ధాంతిత మయ్యెను. కావున "తద్విహీనానాం జారాణామివ"యను నారద.సూ. ౨౩-కి గోపికలు లక్ష్యభూతలుగాక భక్తురాండ్రేయైరి. ఇట్లు తన్నుఁ గోరి వచ్చినవారిని భగవంతుఁ డనుగ్రహింపఁగనే వారికి నభిమాన ముదయించెను. తామే భక్తులు తామే సదాచారసంపన్నులు తక్కినవా రధములను దురభిమానము సామాన్యముగఁ దొలుతొల్త ననేకుల కుదయించును. దేహాప్రయుక్తమైన యీ దుర్గుణము స్వభావ సిద్ధమగుట దుస్త్యజము. అది కనఁబడకపోదు. అయినను దీనిజీవిత మత్యల్పకాలము. 'నమేభక్తః ప్రణశ్యతి' యని యుండుటచే దీనివలన స్వరూపహానిలేదుగాని యిది యుదయింపఁగానే భగవంతుఁడు దూర స్థుఁడగును. ఈశ్వర స్యాప్యభిమాని ద్వేషిత్వా, ద్దైన్యప్రియత్వాచ్చ నా ౨౭ ప్రకారము భగవంతుఁడు దీనజనప్రియుఁడుగాని యభిమాని ప్రియుఁడుగాఁడు. భగవద్వియోగమే భక్తులకు మరణప్రాయము. కావున వెంటనే వారు మేల్కొని బాగుపడుదురు. ఆ గర్వలేశము పోఁగానే భగవంతుఁడు మరలఁ బ్రసన్నుఁడై వారికి గోచరించును. గోపికలగతియు నట్టిదే యయ్యెనుగదా. కావుననే 'అభిమాన దంభాది కం త్యాజ్య'మ్మని నారదుఁడు సూత్రించెను. నా ౬౪. యయాతి స్వర్గభ్రష్టుఁడై మరల సాధుసాంగత్యముచేఁగదా స్వర్గస్థుఁడయ్యెను. ఈవోపలవము తొలఁగిన పిమ్మటఁ గృష్ణమూర్తి వారితో రాసలీల సలిపెను.

ఇప్పుడు వీరిభక్తి యెట్టిది ? వీ రేతరగతిలోఁ జేరియున్నారో చూతము. ఇప్పటి వీరిభక్తి యేకాంతభక్తి.గుఱికాఁడువిడిచిన యమ్ము త్రోవలో నిలువక యిటునటు తొలఁగక చక్కఁగ లక్ష్యమునకై యెట్లు పోవునో, యెట్లు హనుమంతుఁడు మిత్ర, హిత, శత్రు, రూపక

ప్రతిబంధములు* భేదించికొనిపోయి యావలితీరము చేరెనో యట్టులే ప్రారబ్ధత్రయముల• నీసడించి యవ్యాహతముగ భగవంతునకై యేకోద్దేశముతో గుట్టలు మిట్టలు గుంతలు పల్లములు లోయలు దాటి నిరాఘాటముగ సముద్రమునకై గంగవలెఁ బాఱు ప్రేమరస ప్రవాహామే యేకాంతభక్తి.

---

*మైనాక సురసా సింహికలు.

•ప్రారబ్ధము, స్వేచ్ఛాప్రారబ్ధము పరేచ్ఛాప్రారబ్ధము ఆగంతుకమని మూఁడు విధములు. తనంతటఁ దాను గోరితెచ్చుకొనునది స్వేచ్ఛాప్రారబ్ధము. ఇతరుల కోరికచొప్పున వచ్చునది పరేచ్ఛాప్రారబ్ధము. తనంతటఁ దానే దైవికముగ వచ్చునది యాగంతుకము వస్త్రాపహరణమునాఁ డంగమొలలతో భగవంతునకెదురుగ నిలువఁబడి లజ్జను ద్యజించిన కారణముచే గోపకన్యకలు స్వేచ్ఛాప్రారబ్ధమును దిరస్కరించిన వారైరి ఇదితమ స్వాధీనమందుండు కార్యము కావున సాహసించి చేయవచ్చును. మనోవ్యాపారమైన లజ్జను మనోబలముచేతనే జయించిరి. రెండవది పరేచ్ఛ. భర్తలు మామలు పోవలదని యడ్డుపడుట. వీరందఱు వలదువలదను నోటిమాటలు వినకుండుటే గాక వారు క్రోవకడ్డము వచ్చినను నిప్పుడు మన మిల్లువిడిచి పోయిన మరల నింటికి రానిత్తురోరానీయరో కూడుపెట్టుదురో పెట్టరో కొట్టుదురో తిట్టుదురో యను భీతి విచారము లేక వారిని ద్రోచికొనివచ్చుట. ఇది శత్రురూపకము. రెండవది మిత్రరూపకము తల్లిదండ్రులు నన్నదమ్ములు హితులు బోధించుట. దీనిని నిరాకరించుటకు మొదటిదానికన్న నెక్కువతెంపు కావలయును. దీనియందుఁ రాఁబోవునది ముందుగనే యూహించి దానికిఁ బ్రతిక్రియ యాలోచింపవచ్చును. మూఁడవది యాగంతుకము దైవకృతము. భగవంతుని భక్తితోఁ బ్రార్థించిన నది తొలఁగిపోవును. ఇచ్చట గోపికలు బంధువులను దిరస్కరించి కృష్ణునిఁ జేరఁబోవుట దోషమని నిందించు క్రైస్తవమత బోధకులు "If any man come to me and hate not his father and mother and wife and children and brothers and sisters—yea—and his own life also he cannot be my disciple." అను తమ బైబిల్‌లోని యీ క్రీస్తువాక్యములఁ బఠించి తలలు వంచు కొందురుగాక. గోపికలకు బంధువులయెడ ద్వేషబుద్ధి లేదు. భగవంతునియందుఁ బ్రీతియెక్కువ. ఎవరిని ద్వేషింపవలదని కృష్ణబోధము. ద్వేషబుద్ధి వలయునని క్రీస్తు బోధించెను. తారతమ్య మాలోచింపుఁడు. రాగము లేకుండుటయే ద్వేషము గాదు. అది యుదాసీన భావము.

శ్లో॥ సాలోక్య, సార్ష్టి, సామీప్య, సారూప్యై కత్వమిత్యుత
దీయమానం నగృహ్ణంతి, జనామత్సేవనం వినా॥ ౧౩.
సయేవభక్తి యోగాఖ్య, ఆత్యంతిక ఉదాహృతః
యేనాతివ్రజ్య త్రిగుణా, న్మద్భావాయోపపద్యతే ౧౪.
భాగ ౩-౨౯. అధ్యా.

యని శ్రీభాగవతమునఁ జెప్పఁబడినట్లు లీ యేకాంతభక్తులు భగవద్దాస్యమును భగవంతు ననుభవించుటవలనఁ గలిగిన యానందమును దప్ప భగవంతుఁడు తానై యిచ్చెదనన్నను "సారూప్య సాయుజ్య, సాలోక్య సామీప్య" ముక్తులఁగూడఁ గొననొల్లరు. కావున వారు త్రిగుణముల దాఁటి భగవత్స్వభావమును బొంద నర్హులగుచున్నారు. ఇది గోపికల యెడ సత్యమేకదా. వారెన్నిమార్లు చెప్పినను సంతతదాస్యము నొసంగుము. కింకరీ జనులఁగాఁ బరిగ్రహింపుమని సాంగత్యమున సేవ కోరిరిగాని మఱిదేని గోరినవారుగారు. "మోక్షంబులఁగోరి భజించు భక్తులను భగవంతుఁ డనుగ్రహించునట్లు మా యందనుగ్రహింపు" మని చెప్పిరిగదా. దీనికేమి యర్థము. మోక్షమునుగోరిన వారికి నీవు మోక్ష మెట్లిచ్చెదవో యట్లే మేము గోరిన నీదాస్యమును మాకిమ్మని గదా. దీనివలన వారు మోక్షమునుగూడఁ గోరినవారు కారైరి. అధరామృతమును గోరిరిగదా యందులేని యది భగవదనుభవమును గోరుటగాని ముక్తిని గోరుటగాదు. మాధుర్యము ననుభవించు టెట్లు? మధురపదార్థమును నోరవేసికొనక యాస్వాదించు టెట్లు? రుచి చూడఁబడునదేకదా రసము. స్వరమాధుర్యము వీనులచే, రూప మాధుర్యము కనులచేఁ గ్రోలఁబడు నట్లిదియు దదీయమాధుర్య సేవనమే. తల్లిదండ్రులు బిడ్డలను బిడ్డలు తల్లిదండ్రులను ముద్దిడుకొని యానందించుట లేదా. ఇంతకుఁ గామము వాహనముగాఁ గైకొని వారి మనస్సు భగవంతునకై పోయెనని మున్నే చెప్పఁబడెను గదా. వాహన మింటి ముందరివఱకే వచ్చునుగాని యింటిలోనికి రానట్లు వారి కామవాహనము కృష్ణుని డాయువఱకే. అవలఁ బోవునది మనస్సు మాత్రమే. కావున గోపికలభక్తి యేకాంత భక్తియే.

కావుననే యిక్కడికి వచ్చిన గోపికలును నింట మరణించిన గోపికలు కూడ, గుణాతీతలై భగవద్భావమును బొందిరి.

శ్లో॥ మాంచయో వ్యభిచారేణ, భక్తియోగేన సేవతే
సగుణా న్సమతీత్యైతాన్, బ్రహ్మభూయాయ కల్పతే॥

భగ. ౧౪-౨౬. కృ. లీ. సం-౨ ౪౧౧.

ఇంక వీరిభక్తి యేదశయం దున్నదో చూతము. లజ్జ నేగడియయందు భగవదర్పణము గావించిరో యప్పుడే వారు దేహసంబంధములన్నియుఁ బ్రాణమునుగూడ భగవంతున కర్పించిరనియు వారియందాత్మ నివేదనాసక్తి యంకురించెననియు వస్త్రాపహరణము గుఱించి వ్రాయునపుడె చెప్పఁబడెను. గోపికలు బంధువులనెల్ల నిరాకరించి యిల్లువాకిలి ప్రియపదార్థములనెల్ల వదలి వచ్చుటచేతను నీవు మమ్మును గ్రహింపవేని నీయెడఁబాటువలనఁ గలిగిన విరహాగ్నిచే దగ్ధదేహలమై ధ్యానబలంబున నీ పాదపదవినే పొందఁగలవారమనియుఁ జెప్పుటచే* నదియు భగవంతుఁడు తిరోహితుఁడైన కాలమునఁ దన్మయాసక్తిగఁ బరిణమించెను. ఆత్మనివేదనాసక్తి యుండువఱకుఁ దాము వేఱు కృష్ణుఁడు వేఱు తాము దాసికలు కృష్ణుఁడు స్వామి యను భేదభావముండెను. దానివలన మనోవ్యాపారము జరుగుచుండెను. భగవంతుఁడు కానరాక పోఁగానే వారు పిచ్చిపట్టినవారలవలెనై తమ్ముఁ దాము మఱచి తామే కృష్ణుఁడని భావించి యాయనవలెనే వర్తించిరి. ఇదియే తన్మయాసక్తి. మనస్సు లయించుటచే భేదభావము లయించిన మిగిలిన దొక్కటే కదా. కావున సర్వము భగవంతుఁడుగానే కానవచ్చును. ఇదియే యద్వైతసిద్ధి. ♦ యోగుల యసంప్రజ్ఞాతసమాధి

---

* ఇష్టవస్తునష్టి యెంతబలిష్ఠమో యార్బతునేటుకంపెని మునిఁగిపోయినపుడు తమ ధనమును దలఁచుకొని మతిచెడినవారిని జచ్చినవారిని స్మరించి తెలిసికొనవచ్చును. అర్థనష్టి యిట్టులైయుండఁ బరమార్థనష్టి యెంత సంతాపకరమో భక్తులకేయెఱుక.

♦ ఇట్టిదశ వచ్చువఱకు నెట్టివాఁడును 'అహంబ్రహ్మాస్మి' 'శివోహ' మిత్యాది యద్వైత వాక్యములు పలుక నధికారములేదు. ఆత్మ దెలియనియోగి కద్వైతములు మెందన్నట్టు లంతకుమును దామాట లనుట యాత్మవంచనము లోకవంచనము మా

దశ యిదియే. కాని భక్తుల కిది పరాకాష్ఠ కాదు. వారీదశను దాఁటి పోదురు. దీని యావలిదశయే పరమవిరహాసక్తి. యావజ్జీవము గోపికలీ దశయందే యుండిరని వేణుగీతలు (పుట 228) భ్రమరగీతలు (పుట 289) కృష్ణుడు యుద్ధవునికిఁ జెప్పిన మాటలు సం-3. పుట-౧౫౪ తెలుపుచున్నవి.

గోపికలు తన్మయాసక్తినుండి మేలుకొనిన పిమ్మట రసలీల జరిగెను. అందఱియందును బరమవిరహాసక్తి జనించిన కారణముచేఁ బ్రతి గోపికయుఁ దానే కృష్ణుని ప్రక్కను యుండఁగోరెను. కృష్ణునకు వారి కోరిక నెఱవేర్పక తప్పదు. ఇంతవఱకు భగవంతుఁడు స్వతంత్రుఁడే కాని యీదశయందుఁ గేవల భక్తపరాధీనుఁడై వారి యిష్టప్రకారము వాత్సల్యాతిశయంబున వర్తింపవలసినవాఁడై యుండును. ఈ వాత్సల్యముననేగదా యశోదచే ఱోటికిఁ గట్టఁబడినది. అట్లు తే

---

త్రమే. అట్టి దశవచ్చువఱకు భగవదంశము తానని భగవంతునకుఁ దాను దాసుఁడనని భావింపవలయును.

"A certain brahm chari named Ramachendra one day visited Sri Ramakrishna at tha temple of Dakshinesvar. The aspirant had allowed his hair to grow into long matted tresses after the way of Sanyasins. Having taken his seat he began to exclaim from time to time "Sivoham Sivoham" but wos dumb otherwise; Sri Ramakrishna observed him silently for some time and then remarked. "What is the good of merely repeating the word 'Sivoham'? It is only when one, by perfect meditation of the Lord in the temple of one's heart, has lost all idea of self and realised the Lord Siva within, that one is entitled to utter this sacred word What good can this mere repetition of the formula do without realisation? So long as the stage of realisation is not reached, it is better to regard the Lord as the master and oneself as His humble servant." The aspirant came to see his mistake and became wiser by this advice and other similar teachings. Before he left the place, he wrote down on the wall of Sri Ramakrishna's room "Taught by the Swami, from this day forwards Ramachandra Brahmachari regards the Lord as his master and himself as His humble servant?

WORDS OF THE MASTER.

యిప్పుడును గావున వారికోరిక నెఱవేర్ప యోగమాయ నాశ్రయించి యందఱ కన్నిరూపులై వారితోడఁ రసలీలఁ గ్రీడించెను.

కనుకలక వారిని దీపమువలె భక్తిహీనులైన నవనాగరకశీలాగ్రేసరులను బాధించునది యీరాసలీలయే కదా. కావున దీని లక్షణమేమో దీనియం దేమిజరగెనో పరిశీలింపవలసి యున్నది.

రాసలీల యనునది కోలాటమువంటి యాట. ఇది హల్లీసకమని హరివంశమునఁ జెప్పఁబడెను. ఇందు స్త్రీలు పురుషులు కలసి యొకరి భుజములమీఁద నొకరు చేతులువైచి గుండ్రముగాఁ దిరుగుచుఁ బాడుచు నృత్యము సలుపుదురు. గుంపుగాఁ గూడిన కారణము చేతఁ బరస్పరదేహ స్పర్శముకాక మానదు.* వినోదక్రీడ కావున నొకరికొకరు ముద్దిడుకొనుటయుఁ గౌఁగిలించుకొనుటయుఁ గలదు. ఇంతియకాని యింత కెక్కువ యేమియు లేదు.

కొందఱు పాశ్చాత్యుల 'బాల్' అను నాటనుస్మరించి రాసలీలయనఁగా బురుషులు గోఁచులను, స్త్రీలు చీరలును రవికలను విచ్చి పాఱవైచి యొకరినొకరు కట్టుకొని నేలపైఁ బొరలాడుటయని యర్థము

---

* "However much I may glorify myself in the idea that I am a man (male principle) in reality I am nothing but Prakriti (material force) and cannot be anything else. Gold, silver diamond ruby & c., are nothing but earth; similiarly, men, women dog, cat, tree, leaf, insect and fly, whatever are visible, are Prakriti and nothing else. With this base Prakriti (passive principle) Krishna, the only Purusha manifested as consciousness (male principle) is eternally at grand play. This play is without beginning or end and is eternal. This is called the sublimest sport *Maharasa*). The only active or male agent, Krishna, incessantly, at play with Prakriti in some way or other. This play knows no stop and is unending. Even Brahma and Siva have foundered in the ocean of thoughts, in order to solve the secret of this play. Save and except Krishna no one is capable of penetrating into it. The real object of this bewildering game is known only to Sri Krishna and to Sri Radhika (Maha Prakriti). To any other it is a sealed book."

PAGAL HARANATH.

చేసికొని పిచ్చిపిచ్చికూఁతలు కూసి భగవంతుని భక్తులను దూషించిరి. కాని యట్టికార్యము వారితలలలో నున్నదికాని రాసలీలయందు లేదు. కుచపట్టికలు పోకముడులు వదులయినట్లు చెప్పఁబడెను. ఇట్టి నృత్యమున వస్త్రములు వదులుపడుట వింతగాదు కుచపట్టికలు రవికలుగావు. జేనెఁడు వెడలుపున మడఁచిన నిడుపాటివస్త్రమును స్తనముల కడ్డముగవేసి వీఁపునముడివైచుట పూర్వుఁలయాచారము. దీనివిధము తెలియుటకై పురాతన స్త్రీప్రతిమల విగ్రహములను బట్టి వ్రాయించిన పటమును దీనికి జతపఱుపఁబడెను. చీర లూడలేదు కుచపట్టికలు వీడలేదు. పైఁటలు దొలఁగలేదు. సంభోగమనుపద మొందునుగాన రాదు. సహాసానఖంపచలయు, నటదుత్తుంగ పయోధరంబులయు స్మరణముకూడలేదు. ఇఁకఁ గృష్ణుఁడేమి పాపకార్యముచేసెనో గోపికలేమి చేయరానిపనిచేసిరో యెఱుఁగరాదు. వారిని దూషించు పాపాత్ములయందుఁ బాపముగలదుగాని వారియందు లేదు.*

* పెక్కురు స్త్రీలు పురుషులు కలసి వలయాకారముగాఁ దిరుగుచు నాడు నాటకు (కోలాటము) రాసమని హల్లీసకమని పేరు. ఇది కేవలము పురుషులే యాడుటయుఁ గలదు.

"A kind of dance practised by Krishna and the cowherds but particularly the Gopis or cowherdesses of Brindavan." Apte.

'రాసస్తు గోదుహీంక్రీడా' యని హారావళి.

"It is a kind of dance which still prevails in sundry tracts of Upper India in which the dancers, male and female, perform their feats in a circle by holding one another's hands."

BULLORAM MULLICK, B.A.

అన్యోన్యవ్యతిషక్తహస్తంగాయతాం స్త్రీపుంసాం మండలీభూయ భ్రమణప్రవృత్తంరాసః॥—విష్ణుచిత్తులు.

జయదేవుని గీత గోవిందము కేవల శృంగారమనియు నీయనయు భాగవతగ్రంథకర్తయు దివ్యభక్తిని నైహికదుష్కామముగ నీచస్థితికిఁ దెచ్చిరనికదా పూర్వపక్షుల యభిప్రాయము. ఈవిషయము వేఱొకచోటఁ జర్చింతము. ఇప్పు డీ గీత గోవిందమందు రాసశబ్దము రెండుస్థలములఁ బ్రయోగింపఁబడినది. కృష్ణుఁడు గోపికలతో రాసక్రీడ సలుపుచున్నాఁడని సఖిరాధికతోఁ జెప్పెడి యొకచోట, రాధ

ఈ రాసలీల సర్వకాల సర్వావస్థలయందు ననాదిగ జరగుచుండునదే. పరమాత్మ యొక్కఁడేపురుషుఁడు. జీవకోటులు ప్రకృతి సర్వము స్త్రీప్రాయము కావున జీవాత్మ పరమాత్మలకుఁ గల

శ్లో॥ "పితాచ రక్షకశ్శేషీ, భర్తా జ్ఞేయో రమాపతిః

స్వామ్యాధారో మమాత్మాచ భోక్తాఽచాద్య మనూదితః॥

---

దాను గృష్ణునితో రాసక్రీడ సలిపిన విధమును స్మరించి యనుకొనుట యొకచోట యీ రెండు స్థలములందు సంభోగము వర్ణింపఁబడియెనేమో చూతము.

"కరతలతాల తరల వలయా వలికలిత కనస్వనవంశే
రాసరసే సహ నృత్యపరా హరిణా యువతిః ప్రశశంసే
శ్లిష్యతి కామపి చుంబతికామపి కామపి రమయతి రామామ్
పశ్యతి సస్మిత చారుతరా మపరా మనుగచ్ఛతి వామామ్॥ గీ. ౧.

రెండవది రాధ సఖికిఁ జెప్పుట.

సంచరదధరసుధామధురిధ్వని ముఖరితమోహనవంశమ్
చలితదృగంచల చంచలమౌళి కపోలవిలోల వతంసమ్
రాసే హరిమిహ విహితవిలాసమ్,
స్మరతి మనో మమ కృతపరిహాసమ్॥
చంద్రకచారు మయూరశిఖండక మండలవలయితకేశమ్
ప్రచురపురందర ధనురనురంజిత మేదురముదిత సువేశమ్॥ రాసే.
గోపకదంబ నితంబవతీముఖ చుంబనలంభితలోభమ్
బంధుజీవ మధురాధరపల్లవ ముల్లసితస్మితశోభమ్॥ రాసే.
విపులపులకభుజ పల్లవవలయిత వల్లవయువతిసహస్రమ్
కరచరణోరసి మణిగణభూషణ కిరణవిభిన్నతమిస్రమ్॥ రాసే.
జలదపటలవల దిందువినిందక చందనతిలకలలాటమ్
పీనపయోధర పరిసరమర్దన నిర్దయహృదయక పాటమ్॥ రాసే.
మణిమయమకర మనోహరకుండల మండితగండముదారమ్
పీతవసనమనుగతముని మనుజ సురాసురవరపరివారమ్॥ రాసే.
విశదకదంబతలేమిలితం కలికలుషభయంశమయంతమ్
మామపి కిమపి తరంగదనంగదృశామనసారమయంతమ్॥ రాసే.
శ్రీజయదేవ భణితమతిసుందర మోహనమధురిపురూపమ్
హరిచరణస్మరణం ప్రతిసంప్రతి పుణ్యవతామనురూపమ్॥ రాసే.

ఇం దెందైన సంభోగమును స్మరింపఁజేయు పదమైనఁ గలదేమో పరిశీలింపుఁడు.

యను నవవిధ సంబంధములందు భార్యాభర్తృ సంబంధ మొకటి. భరించువాఁడు (భర్త) యీశ్వరుఁడు. భరింపఁబడునది (భార్య) జీవాత్మ. ఈ భార్యాభర్త లిరువురు ప్రతిజీవి హృదయకమలమందు నృత్యము త్రొక్కుచునే యున్నారు. రాసమండలమునఁ గర్ణికమధ్యమునసుండు రెండుమూర్తులు లక్ష్మియుఁ బరవాసుదేవుఁడు. నృత్యము త్రొక్కు గోపికాకృష్ణులు ప్రతిదేహి హృదయకమలమం దుండు జీవాత్మయు నంతర్యామియైన పరమాత్మయు. ఈ నృత్య మనాదికాల ప్రవృత్తము అనంతము కావున వలయాకారము. ఏష హ్యేవానంద యాతి (తై. ౭; ౧) త న్నారాధించు జీవుని నానందపఱుచుటయే పరమాత్మ కృత్యము. రాసలీల తత్త్వమిది. "రసోవైస" యని యుపనిషత్తు ఘోషించుచున్నది.*

* మనుష్యులు న్యాయమైన కోరిక కోరిన నెఱవేర్పవచ్చునుగాని చెడుకోరిక గోరిన దేవుఁడు నెఱవేర్పవచ్చునా ? గోపికల కామము చెడ్డదిగదా ? యందురేని భగవంతుఁడు సర్వసముఁడనియు సర్వఫలప్రదాతయనియు సర్వశరణ్యుఁడనియు మఱవవలదు. భగవంతుఁ డెవ్వరేమికోరిన నిచ్చును. దాని ఫలము మీరే యనుభవింపుఁడని చెప్పును. కావున దొంగలు మంచి దోఁపుదొరకవలయునని ప్రార్థించిన వారి కోరిక నెఱవేర్చును. ఫల మనుభవింపఁజేయును. న్యాయ్యమైన కోరికలే భగవంతుఁడు నెఱవేర్చునేని యొకరి రాజ్యము లొక రాక్రమించుట, జనులఁ బీడించుట లోనగు కార్యములు జరగక నిలిచిపోవలయునుగదా. లోకతంత్ర మట్లు జరుగదు. జీవి యావిధముగ బాగుపడఁడు. చెడుకోరికలు గోరి వానిఫల మనుభవించిననే మరల జీవి వానిని దలపెట్టకుండును. ఇంతకు గోపికలు గోరినదేమి, భగవత్సాంగత్యము. ఇది చెడుకోరిక యని తెలివిగలవాఁ డెవ్వఁడు చెప్పును ? భగవంతుఁడు భక్తాభీష్టవరదుఁడను విషయమున స్వామి రామకృష్ణానందు లిట్లు వచించిరి.

"If an extremely rich man who has ample money to spare without entailing on him any loss, injury, or harm, drives a starving beggar who asks only a two-anna bit of him to buy some food with, and thus appease his hunger, how do we generally regard such a mean and monstrous being? We never condescend to utter his name even—so hateful and detestable he appears to us. If Sri Krishna had not met the intense cravings of the shepherd girls, while He possessed ample powe of meeting all such demands, which was almost nothing to

మానుషభావంబునఁ జూచినపుడు కర పరస్త్రీ కుచ సంయోగము దోషముగాదాయందురేమో. అట్లైనచో గోపికల కుచములకుఁ గృష్ణుని పాదములకు సంయోగము చెప్పఁబడెనే దానికేమి చెప్పెదరు? భావము దుష్టముగాదేని పరస్త్రీల కుచముల నంటుట దోషముగాదు. స్తనస్పర్శము చెప్పనేల? భావము దుష్టముగునేని పరస్త్రీనిజూచుటయు దుష్టమే. నగ్నలైన రాక్షసస్త్రీలను జూచిన హనుమంతునివాక్యముల స్మరింపుఁడు. భావము కామదూషితముకాదేని కుచముల నననేల మఱియే యంగమునైనను స్పృశించుటయు దోషముగాదు అటు దోషమగునేని స్త్రీలకు చికిత్సచేయు వైద్యులందఱు నరకగాములు కావలసివచ్చును. ఏటఁ గొట్టుకొని పోవుచునో లేక యిల్లు కాలిపోవునెడనో యే యపాయదశయందో యుండు స్త్రీలను గట్టుకొని యెత్తుకొని వచ్చి యొడ్డునఁజేర్చిన పుత్రునిఁ గౌఁగిలించు తల్లియుఁ బాపాత్మురాలు కావలసివచ్చును. కుంతి కృష్ణునిఁ గౌఁగిలింప

---

Him He would have been similarly blameable for His heartlessness and cruelty We have seen how wordly charm had no influence over Him, how instead of being a slave to His senses, He was master of them. The great sage, Suka Deva, describes Him as *A ptakama* and *Atmarama*, i e, having no want, or perfect and finding sole enjoyment in His self and self alone. Such a being should never be affected in any way by associating and coming in contact with all sorts of temptations, since they had lost all their charms for Him. — — A chamber like him can get no injury in freely playing with them, but ordinary people, even if they attempt to do so, are sure to die at the very outset."

PASTORAL—SRI KRISHNA.

"Faith not works, is the road to salvation; and passionate longing for God, at times rising to heights of unearthly ecstasy, at others swooning away into dreamy religious voluptousness, is the frame of mind which all should seek. Hand in hand with faith goes love as a servant may have for his master or a friend for a friend will suffice, but it should gradually ascend to that higher affection which a father has for his children; ending at last in the perfect love of husband and wife."

HUNTER'S ORISSA.

లేదా. ఒకవేళ స్త్రీయందు దుష్టభావముండినను గూడఁ బురుషుని యందు లేదేని యట్టివానిఁ దాఁకినంతమాత్రమునఁ బురుషుఁడు పాపి గాఁడు. దుష్టభావము లేక తాఁకుటయుఁ బాపమేని దేవోత్సవసమయం బుల వేనవేలు స్త్రీపురుషులు గుంపులు చేరి పోవుసమయమున నెందఱు పురుషులు పాపభాజులు కావలసివచ్చునో * తన్నుద్ధరించునది ముంచు నది తనమనస్సుగాని యితరులమనస్సుగాదు. అటుగా దేని విరోధ రాస

---

* కాంతాసక్తి దశ లభించిన భక్తులు తమయందు స్త్రీత్వ మారోపించుకొని తమ స్తనములందు భగవంతుని పాదములున్నట్టు తమ స్తనములు భగవంతునిసోఁకఁ గౌఁగిలించునట్టు చెప్పుట సాంప్రదాయము హృదయములోపల నుండుదానిని వెలు పలికి గోచరించుదానిఁగాఁ జెప్పవలసివచ్చినప్పుడు వక్షమునను న్నట్టు చెప్పుట యా చారము. హృదయస్థానమునఁ గుచములఁ జెప్పుటకు 'స్త్రీలహృదయమున విషము గలదు గావునఁ గుచములు పీడింపఁబడుచున్న'వను భర్తృహరి ప్రయోగమును మఱొ కచోఁ జూపఁబడెనుగదా. అట్టులే భగవంతుని ప్రేమస్వరూపిణియైన లక్ష్మి భగ వంతుని వక్షమున నున్నట్టు చెప్పుట లోకవిదితమేకదా. అట్టులే భగవంతునియందలి భక్తిని స్తనములుగాఁ బూర్వులు చెప్పియున్నారు.

శ్లో॥ "నసందృశేతి ష్ఠతిరూపమస్య, నచక్షుషా పశ్యతి కశ్చనైనమ్
హృదామనీషా మనసాభిక్లప్తో యఏనంవిదురమృతాస్తే భవంతి॥"

తై. నా. ౧—౧౦-౧౧.

ఇతి హృదితిభక్తిః. శ్రుత్యంతరేణ స్మృతిభిశ్చ "నసందృశే తిష్ఠతీత్యుపక్రమ్య భక్త్యాచ ధృత్యాచ సమాహితాత్మా జ్ఞానస్వరూపం పరిపశ్యతీహ." భార. మోక్ష.

ఇతి "హృచ్ఛబ్దస్థానే భక్తిపదప్రయోగాత్" సహస్రనామభాష్యము.

భక్తిహృదయమునఁ బుట్టుటచే హృదయము చెప్పుచోట స్తనములను జెప్పుట దోషముగాదు. సత్సంప్రదాయము యుక్తమే యగు. భక్తికి స్తనములకుఁ గల సామ్యము కవిభూషణు లిట్లు చెప్పిరి.

శ్లో॥ ప్రథమ ముదితాకించిత్, పశ్చాద్వివృద్ధి ముపేయుషీ
హరతిహృదయంపుంసః, కాఠిన్యభాగపిభోగదా
యదియమనఘాభక్తిః కాలేన యాత్యపి మార్దవం
తదగణిబుద్ధేః గౌణ్యావృత్తా కుచాదిపదైః ధ్రువమ్॥

కావున గోపికల స్తనములనఁగా గోపికలభక్తియని బుద్ధిమంతులుగ్రహింతురు.

ణులు స్పృశించినసీతకు, కీచకదుశ్శాసనులు స్పృశించిన ద్రౌపదికి శీలహాని చెప్పవలసివచ్చును. 'మానుషభావంబునఁజూచిన' నని పీఠిక వేసికొంటిరిగదా. ౮; ౧౦ సంవత్సరముల బాలునందుఁ గామోదయమగునా? యనుప్రశ్న కేమిప్రత్యుత్తరమిచ్చెదరు. ఆ యీడు బాలుఁడంద ఱాఁడు వారితో నేకరాత్రమున భోగింపఁగలఁడాయనిన నేమిప్రత్యుత్తరము? అయినచోఁ గృష్ణుఁడు నకామబుద్ధిని గ్రీడింపలేదా యని యడిగితిరేని స్పష్టముగ లేదని ఘంటాఘోషముగఁ బ్రత్యుత్తరము వలనఁ బరశ్శతస్థలంబుల జితేంద్రియుఁడు నూర్ధ్వరేతస్కుఁడు యోగీశ్వరుఁడు నాత్మారాముఁడు యోగమాయ నాశ్రయించినాఁడని చెప్పఁబడియున్నది. అయినఁ గృష్ణుఁడు క్రీడించుటయం దుద్దేశమేమందురేని "భక్తజనవాంఛాప్రదాతయు నాశ్రితబాధాహరణుఁడు గావున దయాలుఁడై గోపికలతోఁ గ్రీడింపఁజొచ్చెను." (కృష్ణలీల పుట ౧౯౭.) ఈ క్రీడవలనఁ గృష్ణుఁ డానందింపలేదా యనినఁ గ్రీడవలన నానందింపలేదుగాని తన భక్తురాండ్రానందించుచున్నారుగదా యని యానందించెను. ఎట్లన:—

తండ్రి తన చిన్నకుమారునితో నాడునప్పు డాటవలన బాలుఁడు సంతోషించును. బాలుఁడు సంతోషించెనని తండ్రి సంతోషించును. తండ్రి యుద్దేశము బాలుని నానందింపఁజేయవలయుననియె కాని యాటవలనఁ దా నానందింపవలయుననికాదు. పిల్లవాని సంతోషమే తండ్రిసంతోషము. అట్లులే గోపికలు క్రీడవలన నానందింపఁగాఁ దనభక్తురాండ్రానందించుటవలనఁ గలిగిన యానందము కృష్ణుఁడనుభవించెను. శ్రీరాము లరణ్యమునకుఁ బోవలసివచ్చెనని శోకింపలేదు. తనకై తనవారు శోకించుచున్నారే తన నిమిత్తముగ వారికింత కష్టము వచ్చెనేయని వారిదుఃఖముకై తాను దుఃఖించెను. ఇచ్చట నట్లులే కావునఁ గృష్ణునం దేదోషము లేదు. గోపికలయందును లేదని మున్నే చెప్పఁబడెను. గోపికలకుమాత్రము కృష్ణునందుఁ గామముకలిగి కృష్ణునకు వారియందు లేదేని రసాభాసముగాదా యందురేమో. ఎన్నఁటికిని గాదు.

శ్లో॥ ఏకత్రైవాను రాగశ్చే, త్తిర్యఙ్మ్లేచ్ఛగతోపివా
యోషితో బహుసక్తి శ్చే, ద్రసాభాస స్త్రిధామతః॥

యని రసాభాసలక్షణము. "అత్రావధారణేనా న్యత్రానురాగా త్యం తాభావ స్సూచ్యతే యథారావణే సీతాయాం" యని యుండుటచేఁ కృష్ణునకు గోపికలయం దనురాగమత్యంతాభావమని యెవరు చెప్ప గలరు ! బిడ్డలతోడ నాడుకొను తండ్రికిఁ గందుకాదులయందుఁ బ్రీతి లేదు గాని బిడ్డలయందుఁ బ్రీతిలేదా ! అట్టులే కృష్ణ విషయంబునను.

శ్లో॥ యద్యదాచర త్రిశ్రేష్ఠ స్తత్తదేవే తరోజనాః
సయత్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే"॥

భగ. ౩-౨౧ పుట. 628.

అని తానే చెప్పెనుగదా. కృష్ణునకంటె శ్రేష్ఠుఁడు వేఱొకఁడు లేఁడు కదా అట్లుండియు నాయన గోపికలను యథేచ్ఛముగఁ గాఁగిలించెను. చుంబించెను. ఆయన చేసినట్లు మనమేల చేయరాదు ? ఇది వక్రమార్గ ప్రదర్శనముగదా.

విశృంఖలముగ వర్తింపక యాయన చేసినట్లు నియతికి లోఁబడి యుంటిమేని సుఖముగ నాయన చేసినట్లు చేయవచ్చును. ఆయన చేసినదేమో యది ముందుగఁ దెలిసికొనవలయును. రాసలీల నాఁటికిఁ గృష్ణుఁడు ౮-౯ వత్సరములవాఁడు. ఇట్టివాఁడు తనయందుఁ బ్రీతిగలవారిని నవశ్యము కౌఁగిలింపవచ్చును. చుంబింపవచ్చును. అది దోషావహము గాదు. కృష్ణుఁ డూర్ధ్వరేతస్కుఁడై జితేంద్రియుఁడై వారితోఁ గ్రీడించెను. మన మట్టివారమైతిమేని యట్టులే చేయవచ్చును. మార్గదర్శియని పేరాయనకుఁ బెట్టి మన యిష్టము వచ్చినట్టు మనము పోవరాదు. మార్గదర్శి చూపిన మార్గమునఁ గదా పోవలెను. లోకమంత విమర్శించునా యందురేని విమర్శింపక దోషముమాత్ర మెట్లారోపించెదరు ? విమర్శింపక యాయన చేసినట్టని యేల చెప్పెదరు ! ఆయన యేమి చేసెనో తెలిసికొని కదా యట్టులు చేయవలెను. అట్లు కృష్ణుఁ డూర్ధ్వరేతస్కుఁడై జితేంద్రి

యుండై బిఱ్ఱ బిగిసికొనియుండినచో గోపికల కోరికపూజకుఁ గృష్ణుఁడు చేసిన వాగ్దానమునకు గతియేమి ? యందురు కాఁబోలు.

వారికిఁ గలుగవలసిన యానందమునకుఁ గొఱఁత గలుగలేదు. వారి కోరిన యానందమునకన్న నుత్తమానందమునే వారు పొందిరి. కృష్ణస్పర్శ మాత్రముననే వా రానందపరవశలై బ్రహ్మానందమున మునిఁగి దేహవిస్మృతిని గనిరి. ఇట్టి బ్రహ్మానందమునకన్న క్షణభంగుర మైనతుచ్ఛ విషయానందనామక కందూతి నివారణము శ్రేష్ఠమా ! కృష్ణుఁడు వారితో వాస్తవముగ సంభోగించియె యుండినఁ గుబ్జవలె నందఱు గోపికలలో నొక్కతైయైన వేఁకటియయ్యెనా ప్రసవించె నా ? అందఱు గొడ్డుపోతులా ? కావున రాసలీలయందుఁ దుచ్ఛకామ సంతర్పణమున కెడము లేదుగాని భక్తి జ్ఞాన హీనమై కామరస పూరితమైన పూర్వపక్షుల మనస్సునందుఁ గలదు.

బమ్మెరపోతన చౌశీతి బంధములనెల్ల వర్ణింపలేదా యందురేని దాని కాయన యుత్తరవాదిగాని కృష్ణుఁడు గాఁడు. ఆయన యత్యంత భక్తుఁడు. భక్తి పారవశ్యమున భగవద్విషయమున నెట్లు చెప్పినను దోషము లేదని తలఁచినవాఁడు. వ్యాసమహర్షి జరగినది జరగినట్లు వ్రాసెను. ఈవలివారు భక్త్యతిశయముచే వారివారి యిష్టము చొప్పునఁ బెంచి వ్రాసిరి. రెండు పంచాంగములలో భిన్నముగాఁ దిథులుండిన నా దోషము గ్రహములదా ?

ముముక్షువులకై వ్రాయంబడిన గ్రంథము లనధికారులు చదివినఁ జెడిపోదురనియే

శ్లో॥ ఇదం తే నా తపస్కాయ, నాభక్తాయ కదాచన
నచాశు శ్రూషవే వాచ్యం, నచమాం యోభ్యసూయతి॥
౧౮. ౬౭.

యని యిత్యాది హెచ్చరిక వాక్యములు చేర్పఁబడును. బలిష్ఠులై జీర్ణ శక్తిగలవారికిఁగాఁ జేసిన స్థిరపదార్థములను జీర్ణశక్తి లేని మందాగ్నులు చంటిబిడ్డలు తిననేల ? అవి తినినఁ దమవలె లోకమునకంతయుఁ గడుపునొప్పి వచ్చునని మొఱలు పెట్టనేల ? జీర్ణశక్తిగలవారు తమ్ముఁ

జూచి సవ్వుదురని యైన జ్ఞానము వలదా? కొన్ని యౌషధములు వైద్యులకు మాత్రమే విక్రయింపఁబడును. అట్టి వానిని వేడుకకై పామరుఁ డెట్టిలో సంపాదించి తినిచచ్చిన దోష మెవరిది? లోకోప కారార్థము త్రవ్వించిన గుంటలో దూఁకి యెవరైనఁ జచ్చిన దానిని త్రవ్వించినవారు నింద్యులా? అందలి నీరు నింద్యమా? నిర్మలమైన యద్దమునందుఁ దమ ముఖమే ప్రతిఫలింపఁగా నది వికారముగ నున్నదని యద్దమును దూషించుట వివేకయుక్తమా?

భాగవత పఠనమునకు ముముక్షు వధికారి. రాసక్రీడ ఫల శ్రుతియందుఁ "గామవిజయరూప రాసక్రీడను శ్రద్ధతో వినువాఁడును వినుపించువాఁడును భగవంతునియందుఁ గామంబు జయింపఁగల పర భక్తినొంది శీఘ్రకాలంబునఁ బూర్ణంబుగ హృదయతాపంబు లెల్లఁ బాయు" నని శుకయోగి యంతటివాఁడు చావ సిద్ధముగానుండి మోక్షాసక్తిగల రాజునకు ఋషులయెదుటఁ జెప్పెనుగదా. దీనియం దేమి విశేషముగలదని పర్యాలోచించు బుద్ధిగాని శ్రద్ధగాని భక్తిగాని లేని విపరీతబుద్ధులకు విపరీతఫలముగాక మఱియేది లభించు!

ఆర్యులారా! పామరదృష్టిఁ జూచినను భక్తదృష్టిఁ జూచినను రాసలీలయందు నింద్యమేదియుఁ గానరాదు. పామరదృష్టిఁ జూత మా? ఎనిమిదిసంవత్సరముల పిల్లవాఁడు ౧౫-౧౬ సంవత్సరముల పిల్ల లతో నాడుకొనుట పల్లెటూరివారికి వింతగఁ గాని విపరీతముగఁ గాని నగపడదు. ఉత్తయాటగా దే దుష్టభావ గర్భితమైన యాటయే యందు లేని దుష్టభావ మెవరియందుఁ గంటిరి? ఎనిమిదిసంవత్సరముల బాలు నందు నేమి దుష్టభావ ముదయింపఁగలదు? "లేజవరాలు చెక్కుఁ గీఁటిన పసవల్చు బాలకుఁ" డన్నట్లు గోపికలకుఁ గామోద్రేకమే కన్నులఁ గప్పియుండెనా యెనిమిసంవత్సరముల బాలుఁ డందఱకు నేక కాలమున నేమి తృప్తిగలిగించునని యూయనకై యేకారిరి? ఎంతటి పిరపతివ్రతయైనను నెనిమిదిసంవత్సరముల బాలుని దర్శనస్పర్శన చుంబనములు శీలహానిగఁ దలంచునా?

ఇంకను మనుష్యభావంబుననే యాలోచింతము. కృష్ణుఁడు వాయించినది పిల్లఁగ్రోవియే కదా. దాని నాద మెంతదూరము వినఁబడఁగలదు ? అరమైలును మించి పోఁగలదా ? ఆ నాదము గోకులమువారికి వినఁబడినపుడు కృష్ణుఁ డరమైలుదూరముననుండే కదా యుండెను. అచ్చటికేకదా గోపికలు పోయిరి. రాసలీల తమ గ్రామమునకు సమీపమందే యించుమించు మైలులోపలనే జరుగుచుండఁగా గోకులవాసులు తమ పిల్లలు దుర్వ్యాపారమునకై పోవుచున్నారని సందేహించి యుండిరా తమ్ము వారు నిరాకరించి పోవునపుడు తామేల వారివెంటఁ బోకుండిరి ! ౮-౯ సంవత్సరముల పిల్లవాఁడు నూర్లకొలఁది స్త్రీలతో నేకకాలమున సంభోగించునని యిప్పటి మేధావులకుఁ దోఁచిన ట్లప్పటివారికిఁ దోఁచినదిగాదు. పిల్లఁగ్రోవినాదము పల్లెకు వినవచ్చినపుడు నూర్లకొలఁది యిష్టమువచ్చినట్లు గొంతులెత్తి పాడుచు నాడుచునుండిన నా నాద మూరికి వినవచ్చి యుండునుగదా. అంతాడఁబోయిన వారిల్లే గ్రామసమీపములఁ జరింతురా ? అట్లైనఁ గొందఱేల తమ భార్యలను బోనీయరైరని యడుగవచ్చును. కామముననో ప్రేమముననో తమ భార్యలనువిడిచి యుండలేకయే కాని వారు దుర్వ్యాపారమునకుఁ బోవుచున్నారని సందేహించి కాదు. ఒక యూరిలో నాటకమాడినప్పుడు తమ యాఁడువారిని బోనిచ్చువారున్నారు. పోనీయనివా రున్నారు. కొందఱు పోరైరి గావునఁ బోయిన వారందఱు అంతాడఁ బోయినారని వారివారు సందేహించి మానిచిరని యర్థమా ?

ఇప్పటికిని బల్లెటూళ్లయందలి వృత్తాంతముఁ దెలిసినవారు గోపికాకృష్ణచర్యల సందేహింపరు. పల్లెయం దూరివెలుపలఁ బశువుల మేపుచుఁ జెట్లక్రింద నెండవేళల బాలురుబాలిక లొకరితో నొకరెంత చనవుగా వర్తింతురో చూచినవారికి గోపికాకృష్ణులయంద విపరీతవృత్తి మేదియుఁ గానరాదు. పొలములలో గుంపులై పనుల చేయునపుడును స్త్రీలుపురుషు లెంతో మచ్చికతోఁగలసి మెలసి నేఁటికిని వర్తింతురు. వెన్నెల రాత్రులలోఁ బల్లెటూళ్లవారు కొందఱు

పురుషులు జేలలో మంచెలమీఁదనో నేలనో పరుండియో కూర్చుండియో పిల్లఁగ్రోవియూఁదుట, పాటలు పాడుట, స్త్రీలు పురుషులు గుంపులుగఁజేరివినుట నేఁటికిని గననగు. ఇది నిప్పునిన నోరుగాలునను నాగరకులకు విపరీతముగఁ దోఁపవచ్చును. ఏల? వారు పాపములోనే పుట్టుదురు. పాపములోనే పెరుఁగుదురు. పాపమునే కనుచుందురు. పాపమునే వినుచుందురు. పాపమునే దినుచుందురు. ఇట్టి భోగశీలురకు సర్వదా కామమే వారి మనస్సులఁ దాండవ మాడుచుండును. వారి యభిప్రాయమున నిరువురు స్త్రీపురుషులు చూచుటయు అంకాడుటకే. మాటలాడుటయు అంకే. తాఁకుట చెప్పవలసినపనియే లేదు. జితేంద్రియత్వ మెట్టిదో యీ కామదాసు లెఱుఁగరు. మనస్సున నేది నిండి యుండునో యిదియేకదా వెలుపల గోచరించును. పచ్చని యద్దములు కన్నులకువేసిన వారికి లోకమంతయుఁ బచ్చనయే. ఇఁకఁ బసరికలు వచ్చిన వానిసమాచార మేమనవలయును? కలుషచిత్తులైన నాగరకులకు నిర్మలమనస్కులైన గ్రామ్యజనుల చరిత్రమందుఁ గలుషమే కానవచ్చును. అద్దమునఁ బ్రతిఫలించునది మన ముఖమేకదా. అన్యాయపురమున నాలికి మగనికి అంకనుట వాస్తవము. "తోడుతోనైన నందనుతోడనైన నొంటిపాటున భాషించు టుడుగవమ్మ" యని నీతి బోధింపవలసివచ్చినపుడు నాగరకుల స్థితి యెట్టిదై యుండవలయును. ఆత్మవిద్యాప్రచారముగల మనదేశమందే యిట్టులుండ ననాత్మ విద్యాప్రవీణులైన పాశ్చాత్యులు గోపికాకృష్ణ చరిత్రమం దెంతటి పిశాచములైనఁ గాంచుటేమివింత? దేహకష్టముగాని మనఃకష్టముగాని చేయువారియందు విశేష కామోద్రేక ముండఁజాలదు. కుక్షింభరుల కని రెండు శూన్యములయినచో భోగచింతగాక మఱియేమిచింత యుండఁ గలదు? శ్రీకృష్ణుఁడు గోపికలతో సంభోగించెనను వారిప్రశ్నములకు సమాధానములు కుదుర్చుకొందురు గాక.

౧. సంభోగార్థమై గోపికలందఱు యత్నించి సిద్ధపడినట్లు భాగవతమున నెందైనఁ జెప్పఁబడెనా? లేకున్న సంభోగ మేబంధమున జరగెను?

౨. గుంపుగఁగాకున్న నొంటరిగనుండిన గోపికకైన సంభోగ చిహ్నములు చెప్పఁబడెనా ?

౩. ౮ సంవత్సరముల బాలుఁ డందఱితో నేకకాలమున సంభోగింప సాధ్యమా ?

౪. సంభోగశబ్దమెందైన భాగవతమున నీ సందర్భమున నుపయోగింపఁబడెనా ?

౫. స్త్రీలకు స్వభావసిద్ధమైన సవతిమచ్చర మెందైన గోపికల విషయమందైనఁ జెప్పఁబడెనా ?

౬. ఒకతెకైన వేఁకటి వచ్చినట్లు చెప్పఁబడెనా ?

౭. ఈ రాసలీల యొకనాఁటి కార్యము కాదు. వెన్నెల రాత్రులందంతట జరగినట్లు చెప్పఁబడెనుగదా. గోపికలు దుష్కార్యమునకై పోవుచుండిరేని వారి చేష్టలను వారి యత్తలు నాఁడుబిడ్డలు పురుషులు నెవరైన నేల యాక్షేపింపలేదు ?

౮. గ్రంథకర్త చెప్పని సంభోగాదులు కృష్ణునం దారోపించువారు గ్రంథకర్త కృష్ణుఁడు యోగేశ్వరుఁడు, ఆత్మారాముఁడు, జితేంద్రియుఁడు, సర్వాత్మ, అస్ఖలితుఁడు నని చెప్పినే యాపదము లెట్లు సార్థకముగ నన్వయించెదరు ?

౯. ఆసన్నమరణుఁడై నిద్రాహారములుమాని ప్రాయోపవేశము చేసి మోక్షకాంక్షనుండు వానికి జారవృత్తము నెవఁడైనఁ జెప్పునా?

౧౦. అట్లు చెప్పుటకు వినుటకు శుక పరీక్షిత్తులలో నెవరు కాముదాసులు ?

౧౧. కృష్ణుఁడు జారుఁడని యాయన శత్రువులైన శిశుపాలాదులైన నాయనను దూషించిరా ? (కృ. లీ. సం-౨. పుట-232-233 )

౧౨. కృష్ణుఁ డొనర్చినది యధర్మమేని పరీక్షిత్తెట్లు ప్రతికెను?

౧౩. కృష్ణుఁ డస్ఖలితబ్రహ్మచారి, దుర్వాసుఁడు నిత్యోపవాసి యనుట మీ రెట్లు సమర్థించెదరు ?

౧౪. గోపికాకృష్ణచర్య అంతఃపురాణమేని రామానుజ మధ్వ

శ్రీధరచైతన్యాది సన్న్యాసులును, వేలకొలఁది భక్తులు భక్తురాండ్రు తన్మూర్తులనేల పూజించెదరు ?

౧౬. ఆళ్వారాదులు చూడికుడుత్త లోనగువారు తాము గోపికల వృత్తమేల యనుసరించి వారివలెఁగాఁ గోరిరి ?

౧౭. ఆపత్కాలమందు ద్రౌపది 'గోపీజనప్రియ' యని కృష్ణుని జారుని నేల స్మరించెను ?

౧౮. శుకులు చెప్పిన ఫలశ్రుతి యెట్లు సార్థకము ?

౧౯. కృష్ణవియోగానంతరము గోపికలు మరల వివాహమాడి నట్టు లెందైనఁ జెప్పఁబడెనా ?

౨౦. అంకుటాండ్రు తమవిటుల తల్లులయొద్దకుఁ బోయి మీ కొడుకులు మాకు దొంగమగలని చెప్పుదురా ?

౨౦. గోపికలు కులటలేని యశోదతోఁ గృష్ణునందుఁ దమకుఁ గామముగలదని యెట్లు చెప్పిరి. (చూ. కృ. లీ. పుట 230.)

౨౧. పల్లెటూళ్లలోఁ గాని పట్టనములందుఁ గాని స్త్రీపురుషులు అంకాడునపు డాకాశమునుండి దేవతలు పుష్పవృష్టి గురియింతురా ?

౨౨. ఎంతటి నీచనాయికయైనను విటుని కాళ్లను దన స్తనములం దుంచఁగోరునా ?

ఈయనసత్ప్రసంగ మింతతోఁజాలించి యీదోషముపోవ మరల గోపికాకృష్ణచరిత్రము స్మరింతము.

పామరదృష్టిఁజూచినను గోపికాకృష్ణులవృత్తము దుర్వృత్తము గాదని యేర్పడెను. ఇఁక భక్తదృష్టి కెట్లు గోచరించునో సంగ్రహముగఁ జూతము. వారి యభిప్రాయమున భక్తిస్థాపక గ్రంథములు భాగవత విష్ణుపురాణ రామాయణములు భగవద్గీత నారద శాండిల్యసూత్రములు లక్షణగ్రంథములు. గోపికాకృష్ణచర్య లక్ష్యగ్రంథము. "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" యను విధిచొప్పున గోపికలు నడచిరని భక్తుల మతము. సర్వధర్మముల ననఁగా నీవాక్యము చెప్పుటకుఁ బూర్వము మోక్షసాధనములని చెప్పిన కర్మయోగము

జ్ఞానయోగము. ఈ రెంటితోఁ గూడిన భక్తియోగము, అవతార రహస్యజ్ఞానము, పురుషోత్తమత్వజ్ఞానము, పుణ్యక్షేత్రవాస, దివ్య నామసంకీర్తన, దీపారోపణ, మాల్యసమర్పణములాదిగా నన్నియు సాధనములుగాఁ గొనక విడిచిపెట్టి నీ కన్నుల కెదురుగఁ గానవచ్చు నన్నునొకనిని మాత్రమే శరణుసారు" మని దేనిని నుపదేశించెనో దానినే గోపిక లాచరించిరి. నన్నొకనినే శరణుసారుమనఁగా నన్నుఁ బొందుటకు నన్నే యుపాయముగా స్వీకరింపవలయునుగాని యిష్ట పదార్థలాభమునకై నన్ను సాధనము చేయక యిష్టపదార్థము నేనే, యది లభించునుపాయము నేనే యని నన్ను స్వీకరింపుఁడని తాత్ప ర్యము. నన్నొకనినే యనుటచే సాధనాంతరమేదియుఁ గూడదని యేర్పడెను. ఇష్టప్రాప్తికి భగవంతుని నుపాయముగ స్వీకరించిన పదియు వేఱుసాధనము గ్రహించినట్లే యగును గావున నట్టి తలం పును గూడదు.

దీనిని గోపికలయం దన్వయించి చూతము. గోపికలు కర్మ యోగ జ్ఞానయోగ మిశ్రభక్తియోగముల సాధనములుగాఁ గొనిన వారుగారు. కృష్ణుఁడు సాక్షాద్భగవంతుఁడని యెఱుఁగుదురుగాని యవతార రహస్య మెట్టిదో వారెఱుఁగరు. కావునఁ బురుషోత్తమత్వ జ్ఞానము వారికి లేదు. మోక్షార్థినులై పుణ్యతీర్థ క్షేత్రములకై పోయినవారును గారు. గంధమాల్యాదుల నర్చించినవారును గారు. ఇష్టపదార్థమును బలుమఱు స్మరించుట యానందస్వభావముగావునఁ గృష్ణగీతంబులు పాడుచు నాయనను స్మరించుచుండిరిగాని యిట్లు చేసిన భగవంతుఁడు సంతోషించి తమకు వశపడునని నామసంకీర్త నము చేసినవారు గారు. వారికిఁ బ్రాప్యము కృష్ణుఁడే. కావునఁ దత్సిద్ధికిఁ గృష్ణునే యుపాయముగఁ గొనిరికాని యితరోపాయముల వెదకినవారు కారు. తమ కోరికలు నెఱవేఱఁ గృష్ణుని సాధనము చేసినవారు గారు. భగవంతుఁడు తమ్ము విడనాడఁడని వారికి దృఢ విశ్వాసము కలదు. యాదృచ్ఛికముగ నొకసారి కృష్ణుని చరణముల స్పృశించినప్పటినుండి తమ మనస్సులను గృష్ణుఁ డాకర్షించుట చూచి

తాము కృష్ణునిఁ బ్రేమించుటకుముందే తమ్ముఁ గృష్ణుఁడు ప్రేమించుచున్నాఁడని యెఱింగి యట్టివాని దయగలుగుటకు నితరసాధన సాహాయ్యము వెదకుట వ్యర్థముగుటయేగాక విశ్వాసము లేమిని సూచించునని వారు తలంచిరి ఒకఁడు మనకు రక్షకుఁడని మనము నమ్మియు నాయనతో మనలఁగుఱించి మీరు చెప్పుఁడు మీరు చెప్పుఁడని యితరులఁ బ్రార్థించుచుండిన నాయన యేమితలంచును ? మనయందు వీనికి నమ్మకము లేదనికదా తలంచును. కావున నితరోపాయముల స్మరింపక గోపికలు "మాకుఁ గావలసినపదార్థము నీవే. దాని నీయఁవలసిన వాఁడవు నీవే" యని యాయన చెప్పినట్టు చేయుచుండిరి. ఆయనయు వారికోరిక నెఱవేఱుటకు విఘ్నములుగా నుండువానినెల్లఁ బరిహరించి వారిని స్వీకరించెను. కావున మనముకూడ గోపికలవలె వర్తించితిమేని భగవంతుఁడు తప్పక మనల ననుగ్రహించును.

మోక్షదాత భగవంతుఁ డొక్కఁడేకాని పెక్కురు లేరు (ఘంటాకర్ణుని చరిత్రఁ జదువుఁడు) కావున మోక్షము గోరువారు తన యభీష్టమును భగవంతుఁడే తప్పక నెఱవేర్చునను దృఢవిశ్వాసము కలవారై యుండవలెయును. ఈ నిమిత్తమై భగవంతునినే యుపాయముగాఁ గొనవలయునుగాని యితరోపాయ మేదియుఁ బరిగ్రహింపరాదు. బ్రహ్మాస్త్రబద్ధుఁడైన హనుమంతుని రాక్షసులు త్రాళ్లతోఁ గట్టఁగానే యస్త్రబంధము లూడినట్టు లితరసాధనములు వెదకితిమేని భగవత్సహాయము తొలఁగిపోవును. ఇట్టి చేఁత విశ్వాసము లేమిని సూచించునుగదా. ఇట్లు భగవంతునినే యుపాయముగాఁగొని శరణాగతుఁడు కావలయును.

భక్తుఁడుగా నుండఁగోరువారికిఁ దొలుత మోక్షేచ్ఛ యుండవలయును. ఆవల దానికి ననుకూలమైనవి పరిగ్రహింపవలయును. ప్రతికూలమైనవి విడువవలయును. భగవంతుఁడు రక్షించునను దృఢవిశ్వాస ముండవలయును. నీవే నాకు రక్షకుఁడవని భగవంతునే రక్షకుఁడుగాఁ గోరవలయును. ఆత్మనిక్షేపము గావింపవలయును. అనఁగాఁ దన్ను సంపూర్ణముగా భగవంతునికి స్వాధీనపఱిచి స్వస్వాతంత్ర్యము

వదలవలయును. కృపణత్వ (దీనుఁడై) ముండవలయును. ఇట్టివాఁడు తప్పక ముక్తుఁడగును. ఈయర్థమే

ఆనుకూల్యస్య సంకల్పః। ప్రాతికూల్యస్య వర్జనం
రక్షిష్యతీతి విశ్వాసో, గోప్తృత్వ వరణంతథా
ఆత్మనిక్షేప కార్పణ్యే, షడ్విధా శరణాగతిః
అనన్యసాధ్యే స్వాభీష్టే, మహావిశ్వాస రూపకమ్
తదేకోపాయ తాయాచ్నా, ప్రపత్తి శ్శరణాగతిః।

అను వాక్యములందుఁ జెప్పఁబడినది. ఈ విషయము పూర్వవ్యాసములఁ గననగు.

ఈవిధముగఁ బ్రపన్నులైన వారికిని గోపికలకును భేదంబుగలదేమో పరిశీలింతము. విభీషణుఁడు శరణాగతుఁడైనపుడు చెప్పిన వాక్యములు.

చం. అనుజుఁడ రావణాసురున, కాతఁడు నన్నవమానపెట్టఁ డెం
పునఁ జనుదెంచి నే సకల భూతశరణ్యుని నిన్నుఁ జేరితిన్
నిను శరణంబుఁ జొచ్చితిని, నెయ్యుర లంక సిరిం ద్యజించితిక్
మనుజవరా ! భవద్గతము మత్సుఖజీవిత రాజ్యభోగముల్.

ఆంధ్రవాల్మీకి రామాయణము.

ఈ పలుకులకును, "స్వచ్ఛందుఁడా! పతులను సుతులను సమస్త భోగ్యపదార్థములను నిశ్శేషముగ వదలి నీ పాదమూలంబు నాశ్రయించిన భర్తృరాండ్రము. మమ్ముఁ జేవిడనాడకుము." అనిన గోపికల వాక్యములకు భేదమున్న నరయుఁడు.

అట్టులే రుక్మిణి కృష్ణునికిఁ బంపిన సందేశము (సం—౨. పుటలు—77–78) నర్మాలాప సమయమందలి యీమె వాక్యములను (సం–౩. పు. 118-120) బఠించి వానిని గోపికల వాక్యములతోఁ బోల్చి చూడుఁడు.

రుక్మిణీ గోపికా విభీషణులు ముగ్గురును భగవంతుని భర్తగాఁ గోరినవారే. ముగ్గురును దన్నిమిత్తమై స్వబంధు తిరస్కారము గావించినవారే. ముగ్గురు తాము శరణుచొచ్చినవాఁడు భగవంతుఁడని విశ్వసించినవారే. ముగ్గురు నా భగవంతుఁడు తమ్ము రక్షించునని మహా

విశ్వాసము గలవారే. ముమ్వురు నాత్మనిక్షేపముఁ గావించినవారే. ముమ్వురు దైన్య మవలంబించినవారే. ఇట్లీ ముమ్వురిలో రుక్మిణీ విభీష ణుల వృత్తము సాధువయ్యె నేని గోపికావృత్తమును సాధువే రుక్మిణి మగనిఁగానే కృష్ణుని వరించెఁగదా యందురేని గోపిక లట్లే చేసిరి. గదా. ఇది రహస్యవృత్తముగా వా రుంచినవారు గారే. (పుట 230) వస్త్రాపహరణ కాలమునాఁటికే వివాహితలై బహిరంగముగాఁ దన్ను మగనిఁగాఁ గోర వలనుపడకున్నను దనయందే మనస్సు నిలిపి యుండిన సాధనసిద్ధులగు గోపికలకు వారు తనయొద్దనుండ రాకుండు నట్లే ప్రతిబంధములు గల్పించి వారి భావముఁ దోఁచి వారిని ముక్తలఁ జేసెను.

వరముఁ బొందినపిదప వివాహితలైన వారిని, గన్యకలుగానే యున్నవారిని గూడ వినోదక్రీడలచేతనే దర్శన స్పర్శనాలాపములచే వారి కపరిమితానందము కలిగించెను. సంభోగించి వారిని దృప్తలఁ జేయలేదు. భర్తగాఁ గోరికన్యకలుగానే యున్నవారితో సంభోగించి యుండవచ్చునే యందురేమో. గోపికలు కామినులయినను గాముకీ జనులలోఁ జేరినవారుగారు. కుబ్జ కాముకి. భక్తురాలుగాదు. కావున నది సురతము గోరెను. దాని కాఫలమే కృష్ణుఁ డిచ్చెను. గోపికలు భక్తియుక్తలై భగవత్సాంగత్యమును గోరిరి కావున వారిని దుచ్ఛదై హిక కామముచేఁ దృప్తినొందింపఁ దలంపక శాశ్వత సాంగత్యము లభింపఁజేయఁ గృష్ణుఁడు దలఁచెను. కావున వారి ధ్యానవేగము దేహపాతమువఱకు క్షయింపకుండునట్లు చేసెను. ఇష్టవస్తువు ప్రాప్తిం చినఁ గామము నశించును. కావున నట్లు చేయఁడయ్యె.

కృష్ణుఁడు జారుఁడనువా రాయన బ్రాహ్మణస్త్రీలకు బోధించిన విధము (పుట 151-152)ను గోపస్త్రీలకు బోధించిన విధమును (పుట 192-218) నుద్ధవసందేశమును (సం-౨. పు-38-39) ను గృష్ణబోధము (సం-౨.పు-179)ను బఠించి యవి విటుఁడు విటకత్తెలకుఁ జేయు నుపదేశ మేమో యాలోచింతురుగాక. గోపికలతోడ నంత కలసిమెలసియుం డిన వాఁడు బృందావనము విడిచిన యావల నొక్కపూఁటనైన మరలి

యచ్చుటికి వచ్చెనా ? కాముకుఁ డట్లు రాకుండ నిలువఁగలఁడా! దాని వలననే శ్రీకృష్ణుఁడు జితకాముఁడో కామజితుఁడో ప్రాజ్ఞులు తెలిసి కొందురు.

కామజయము రెండువిధముల నగు. శివుఁడు యోగబలముచే జ్ఞానదృష్టిచే మన్మథుని దహించెనుగాని తుదకుఁ గామదాసుఁడై శిరస్థ్సదారుఁడు కావలసివచ్చెను. జ్ఞానులు యోగులు కామప్రవాహమును నింద్రియములఁ బీడించి యాహారాదులమాని యడ్డగట్టువారు. ఇం దేమాత్రము క్షణార్ధము ప్రమాదపడినను గట్టతెంచుకొని కామ ప్రవాహము వీరిని ముంచివైచును. విశ్వామిత్రాదులు నిట్టివారే. కావున జ్ఞానమార్గము యోగమార్గము సాపాయములు.

గీ "పవన పర్ణాంబు భక్షులై నవసి యినుప
గచ్చడాల్ గట్టుకొను మునిముచ్చు లెల్లఁ
దామరసనేత్ర లిండ్ల బందాలుగారె."

యనుటయు వాతాంబు పర్ణాశనులైన విశ్వామిత్ర పరాశర ప్రభృతులు కామవశులుగాఁగా శాల్యన్నము దధిఘృతాదులు భుజించు వారుఁ కాముని జయింతురేని వింధ్యము సముద్రములోఁ దేలదా యనుటయుఁ సత్యము.

విష్ణువో కామజనకుఁడు. తన బిడ్డను దండించు భారము తన యందే యుంచుకొన్నవాఁడు. కామసుఖము మానక యున్నను మనస్సున నారాయణు ధ్యానించు చుండినయెడలఁ గ్రమక్రమముగఁ గామజయము కలుగును. కావున విష్ణుభక్తులు కామమును జంపక యథాశక్తి యనుభవించుచుండినను మనస్సున మాత్రము విష్ణువును ధ్యానించుచుఁ గీర్తించుచు నుందురు. ఇట్లు చేసిన కామము తనంతఁ దానే చెప్పక తొలఁగిపోవును. బాలుఁడు తక్కినచోట్ల దుష్టుడైనను దండ్రి యున్నచోట భయపడి యణఁగియుండును గదా. గీతోపదేశ మిదియే.

వస్త్రాపహరణమునాఁడు భగవంతుని భర్తగాఁ గోరినది మొద లానియతినే నిలిచిరిగాని యితరపురుష సాంగత్యమును గోపికల

గోరినవారు గారు. పరమవిరహాసక్తి చేతనే సర్వదా వారు తమ ప్రాణేశ్వరునే ధ్యానించుచుండిరి గాని యెట్టి యైహికసుఖ మపేక్షించినవారు గారు. వీరెట్టి దశయందుండినది కృష్ణవాక్యమువలనఁ (పు. 284) దెలియనగు. ఇందు మగనాండ్రుగూడఁ బతిసంయోగము వదలినట్లు చెప్పఁబడెను. ఉత్తమపదార్థమును రుచిచూచిన పిమ్మట నధమపదార్థమున రోఁతపుట్టుట వింతగాదు. పరమాత్మునందు దృష్టి నిలిపినవారికి విషయవాంఛయుండదని కృష్ణుఁడే తెలిపెనుగదా. ఇట్టివారు భర్తురాండ్రనిగాక జారిణులని వీరిపతులు దలఁచియుండిన వీరి నిండ్లలో నుండనిచ్చి యుందురా ? వారు భర్తురాండ్రు గనుకనే వారిని భర్తలు తల్లిదండ్రులు నెవ్వరేమనక యూరకుండిరి. గోపికల భక్తికిఁ గామము వాహనమని ముందు చెప్పఁబడెను. ఆ కామాగ్ని చల్లారకుండునట్లు భగవంతుఁడు క్షముఁజేసి చేపి తుదకది చల్లారునట్లును భక్తిమార్గమే మిగులునట్లుచేసెను. (కృ.లీ.సం-౨. 132.) వాహనము గూలినపుడు వాహనములో నున్నవారును గూలవలయును గావున భక్తియుఁ గూలవలసినదే. లేక విఘ్నహతమైన కామము క్రోధముగానైనఁ బరిణమింపవలయును. భగవత్కృపవలన నిట్టి విపరీతఫలము లుదయింపలేదు. చిరకాలాభ్యాసముచేతను వయస్సు మీఱుటచేతను క్రోధము నుత్పత్తి కెడము లేదయ్యెను. మోసగాని స్మరించి ఫలమేమని నిస్పృహాచే ధ్యానమే మాని యుండవచ్చును. తుచ్ఛకాముకీ జనులందైన నిది యవశ్యము కలిగియుండును. అటుగాక వారు పరిపక్వమనస్కులై నిష్కామముగ నీ పాదారవిందముల యందు మనస్సు నిలువనీయుమని వరముగోరి ముక్తులైరి. కావున నందు మందయందలి మందయానలు స్వీయలైనను బరకీయలైనను*

---

* 'Man experiences in his life different kinds of love of a servant for his master, of a child for its mother and father, of the parents for their child of the husband for his wife and of the wife for her husband. of the woman in love for her lover the last being the most fervid, intense and unselfish It is therefore natural that philosophers should often speak of the love of the human soul for the divine soul as love of the woman in love for

శీలహానిచేఁ జెడక భక్తిమార్గ దర్శినులై యనింద్యలై భక్తవంద్యలై లోకాభినందలై వెలసిరి. కావున

శ్లో॥ వందేనంద వ్రజస్త్రీణాం, పాదరేణు మభీక్ష్ణశః
యాసాంహరి కథోద్గీతం, పునాతి భువనత్రయమ్॥
కృ. లీ. 305-ల౯ వం.

మ్మని యుద్ధవునితోపాటు వీఁడును నందవ్రజసుందరీ పాదారవిందపరాగ బృందమునకుఁ బరమానందంబున వందనబృందంబు లర్పించి ధన్యుఁ డగుచున్నాఁడు.

—◆ శ్రీరాధాకృష్ణ ప్రశంస. ◆—

కొందఱు రాధ నందుని చెల్లెలనియు నాకారణంబునఁ గృష్ణుఁ నకు మేనత్తయనియుఁ దలఁచుచున్నారు. దీని కారణమేమియో తెలి యలేదు. శ్రీభాగవత విష్ణుపురాణ భారత హరివంశాది పురాణము లందు రాధ పేరే లేదు. బ్రహ్మవైవర్తపురాణమందును బృహద్బ్రహ్మ సంహితయందును రాధ పేర్కొనఁబడినది. ఈ రెంటియందును రాధ కృష్ణునకు భార్యగఁ జెప్పఁబడెనుగాని పరకీయగాఁ జెప్పఁబడ లేదు. బ్రహ్మవైవర్తమందు వీరికిరువురకు వివాహము జరిగినట్లు చెప్పఁ

---

her lover. In fact the Greek legend of Pysche is based on this ve.y similitude. Pysche or the human soul having lost the love of cupid the divine soul suffers va ious trials and afflctions to re-gain the affection of his lover. In India also the Vedantic Philo-sophers sometimes measured the divine bliss by the idea of sexual bliss."

"We shall content ourselves with stating our firm conviction that there is no historical basis for the modern theory that Krishna's love for the Gopis or the latter's devotion to him par-took anything of an unhallowed character. The mahabharata does not support this idea nor does the sublime character which the epic portrays of the man seem consistent with an immoral early life. The stem cannot but be of the same quantity as the tree and one can scarcely believe that that most fragrant flower the Bhagavedgita came out of a tree which was rotten at its root."

G. V. VAIDYA, M. A., L. L. B.

బడియున్నది. ఏగ్రంథములందు నీమె నామధేయము చెప్పఁబడినదో యాగ్రంథమునఁ జెప్పఁబడిన విషయముల నాధారముగఁ గైకొనక తేరకు దూషించుకారణ మా పురోభాగులకే తెలియవలయును. రాధ సాక్షాల్లక్ష్మియని మూర్తీభవించిన భక్తియని పురాణములు చెప్పు చున్నవి. లక్ష్మిదేవికంటెను రాధ ప్రియురాలనియు గ్రంథములు ఘోషించెడిని. మాతృదేహముకంటె మాతృత్వము శ్రేష్ఠమైనట్లు భక్తిమతియైన లక్ష్మిదేవికంటె భక్తిహరికిఁ బ్రియమను టేమివింత. ఈ విషయములను స్థాపింప గ్రంథప్రమాణములు పేర్కొనఁబడు చున్నవి.

బ్రహ్మవైవర్తపురాణంబున నిట్లు చెప్పఁబడియున్నది :—

భగవంతుఁడు గోలోకంబునఁ గృష్ణరూపము ధరించియే యుం డును. అచ్చటి మూర్తి కదియే పేరు. ఈయన కత్యంతప్రియురాలు రాధ. పరస్పర వియోగము కించిత్కాలమైన వీరు సైఁపరు. వీరు లక్ష్మీనారాయణులకంటె భిన్నమూర్తులు. అంతకంటె నుత్తములు. ప్రభు వేవిధముగఁ దన రాజ్యనిర్వాహకభార మితరులపై నుంచి స్వేచ్ఛగాఁ గ్రీడించుచుండునో యట్లే లోకపాలనకార్యము విష్ణువు నందుంచి కృష్ణుఁడు గోలోకమందలి రాసమండలమున రాధతోను నితర గోపికలతోడను సర్వదా క్రీడించుచు సంతోషముగఁ గాలము గడపుచుండును. గోలోకమందలి శ్రీదాముఁడను కృష్ణభక్తునిచే రాధ గోపికగాఁ బుట్టునట్లు శపింపఁబడియె. ఆశాపము కారణమున రాధ నందగోకులంబున వృషభానుఁడను గోపకునకుఁ గళావతియను నతని భార్యయందుఁ బుత్రికయై జనించెను. ఆమె వియోగమును సహింపఁ జాలని కృష్ణుఁడు గోపికలతోడి రాసమండలమును భూమిపైఁ బుట్టఁ జేసి తానును వసుదేవనందనుఁడై యథాస్వరూపముతోఁ గృష్ణుఁడై భూభారమణఁచుకొఱకుఁబుట్టి బాల్యమున రాధతోఁ గ్రీడింప గోకులంబుఁ జేరెను.

ఒకనాఁడు నందుఁడు కుమారుఁడగు కృష్ణునితోడ మందయుం డుండుసమయంబున నాకాశంబున మేఘుంబు లావరించి చీఁకట్లు

క్రమ్మి రేయియగుట భయంకరమయ్యెను. బాలుఁడైన కృష్ణుఁడు
రోదనము గావించెను. అప్పుడు గర్గునిచే వీరి పూర్వవృత్తాంత మెఱిఁ
గిన నందుఁడు చింతనున్న రాధను గనుఁగొని నీవీకృష్ణుని నిల్లు చేర్పు
మని కృష్ణు నామె కప్పగించెను. ఆమె కృష్ణుని దోడుకొనిపోవునెడఁ
ద్రోవలోఁ గృష్ణుడు నిజస్వరూపముఁ గనఁబఱిచి రాధతో నిట్లనియె.

"ఓ యిందువదనా! గోలోకవృత్తాంతము స్మరింపుము. అ
నాఁడు దేవసభలో శాపమునకై వగచు నీకు నేమిచెప్పితి దాని
సార్థకము చేయ వచ్చితి. నీవు నా ప్రాణాధికవు. ప్రియురాండ్రలోఁ గడు
ప్రియురాలవు. మన కిర్వురకు భేదము లేదు. భూమియందు గంధ
మగ్నియందు వేఁడిమి, నీరమందు రసము, క్షీరమందుఁ దెలుపు నెవిధ
ముగనుండునో యట్లు నీవు నాయందుందువు. బంగారము లేక కమసాలి
స్వర్ణ భూషణములఁ జేయఁజాలనట్లు, మన్ను లేక కుమ్మరి కుండల
చేయంజాలనట్లు నీవు లేకున్న నేను సృష్టిసలుపఁజాలను. నీవు
క్షేత్రమవు. నేను బీజమును. నీవు నన్ను విడిచియుండిన నన్నుఁ గృష్ణు
డందురు. నీవు నాతోడనుండిన శ్రీకృష్ణుఁ డందురు. నీవు లక్ష్మి
సంపదవు భువనములకెల్ల నాధారము నీవ. నీవు నాకు నిత్యానపాయి
నివి నీవు సర్వశక్తి స్వరూపిణివి. నీవు సర్వస్వరూపవు. నేనక్షరుఁడనై
సర్వస్వరూపుండనై యుండును. నేను బురుషుఁడనని నీవు ప్రకృతివ
వేదములు చెప్పుచున్నవి. లోకమునఁ బురుషాకారములన్నియు నేన
క్షేత్రమవుగావున స్త్రీరూపమంతయు నీవు. నా యర్ధాంశమున నీ
జనించితివి. నీవు సర్వేశ్వరివి. మూలప్రకృతివి. జ్ఞాన తేజోబుద్ధి శ
కౌశలములందు నాతో సమానురాలవు. నీవు స్త్రీవని నేను బురుషుఁ
నని యెవరు భేదము చెప్పుదురో వారు నరకముల పాలగుదురు.
యను నక్షరము పఠించినవానికి భక్తి నొసంగుదును. ధ యని క
పలికినవానివెంట నాశబ్దము వినుటకై తిరుగుచుండును. నేను వైకుం
ఠమందుఁ జతుర్భుజుఁడనై లక్ష్మిని నురమందుఁ దాల్చితిని. శ్రీకృష్ణు
డనై నిన్ను నురమందు ధరించుదును" అనిన రాధ యిట్లనియె.

దేవా! గోలోకవృత్తాంతము స్మరణంబునం గలదు. నీ మాయచే నన్ను ముంపకుము శ్రీదాముఁ డిచ్చిన శాపము బలమున నిట్లు జన్మించి నూఱు సంవత్సరములు నీ వియోగదుఃఖ మనుభవింప వలసియున్నది అని చెప్పి కౌఁగిలింపఁగోరఁగాఁ గొంచెము నిలుమని చెప్పి బ్రహ్మను దలఁపఁగా నాయనవచ్చి వారి కిరువురకు వివాహంబు జరపె అవల వారిచ్ఛావిహారముఁ గావించుచుండిరి. నిర్యాణకాలంబున రాధయుఁ దక్కిన గోపికలు గోలోకమునకుఁ బోయిరి. కృష్ణునం దొకయంశము వైకుంఠమునకు నొకయంశము గోలోకమునకుఁ బోయెను.

ఇఁక బృహద్బ్రహ్మ సంహితయ దలి కొన్ని విషయములు వ్రాయఁబడును :—

శ్లో॥ మథ్నాతి సర్వపాపాని, రాతినే ప్రేమవారిధిమ్
చకాస్తి చక్రవిస్తారే, మత్రప్తిర్భావవేదికా॥

పాపముల క్షయింపఁజేసి భగవద్భక్తి గలిగించునదిగాన మధుర యని పేరు గలిగెను.

శ్లో॥ తత్రబృందా వనంనామ, మత్కేళి నిలయమ్మతమ్
బృందాభిధానయాభక్త్యా, మూర్తిమత్యా నిషేవితమ్॥

అచ్చట బృందావనమునునది నా కేళి నిలయము. స్త్రీరూపమును ధరించి భక్తి బృందయను పేరుతో నందు సేవించుచుండును. అక్కడ ముక్తియే నాతల్లి. అందు వసించువారికి జ్ఞానము ధ్యానము ఇంద్రియనిగ్రహము లేకున్నను ముక్తి గలదు. ఇఁక నందే మరణించువారల సంగతి చెప్పనేల! లక్ష్మీదేవీ! నీవు నాప్రీతికై వనమవుగమ్మ. భక్తిబృందయై జనించి నిన్నాశ్రయించియుండును. విరజానది యమున యయ్యెను. ఇదియే సుషుమ్న. యశోద ముక్తిరూపిణి. నందుఁడు పరమానందము. నీలస్వాంశ శక్తులతో బృందావనమునకుఁ బోవును. నేను నీలామయుఁడను. నీలాదేవి నామయుపాలు. ఆ నీలాదేవికే బృందావనమున రాధ యనిపేరు. ప్రపన్నులైన వారిని దోషములనుండి రక్షించును. (గోపాయతి) గావునఁ బరదేవత నీలాదేవి

గోపియనఁబడు. వసుదేవుఁడు వేదములు : దేవకి బ్రహ్మవిద్య. వీరికిఁ దనయుండనై జనించెదను : నేను మూఁడవరూపంబున ద్వారక యందుఁ గృష్ణుఁడనై ప్రకాశింతును. అప్పుడు నీవు రుక్మిణివి గమ్ము. భూదేవి సత్యభామ యగును.

దీనివలన రాధాకృష్ణులు విటీవిటులో భార్యాభర్తలో విజ్ఞ లెఱుంగుదురుగాక.

ఇఁక శబ్దముల వ్యుత్పత్తినిబట్టి యాలోచింతము.

కృష్ణుఁడనఁగాఁ గృశింపఁజేయువాఁడని యొక యర్థము. ఆక రించువాఁడని యొక యర్థము. రధ ధాతువునకు (రధహింసా సం రాధ్యోః) హింసించుట సిద్ధించుట యని యర్థములు గావున రాధ యనఁగా హింసించునది సిద్ధించునది యని యర్థము. కృష్ణుఁడు (పాపములను) గృశింపఁజేసిన నాయనభార్య హింసించుట చిత్రము గాదు. కృష్ణుఁ డాకర్షించువాఁ డైనచో రాధ (మోక్షలక్ష్మి) సిద్ధిం చుటయు వింతగాదు. రాధ శబ్దము, ఆరాధనశబ్ద మొకధాతువు వలనఁ గలిగినవే. ఆరాధనమే రాధ. భగవంతుఁడే కృష్ణుఁడు. కృష్ణవిలేఖనే యని కృష్ ధాతువునకు దున్నుటయని యర్థము. నకా రమునకు నిర్వృతి (సుఖము) యని యర్థము. ఏ ప్రకార మనుష్ ములికి భూమినిదున్ని దానియందుఁ బడినవిత్తనము బాగుగ ఫలిం చుట కుపకరించునో యట్లే కృష్ణుఁడు మనుష్యుల మనస్సులన నిర్వేదాదుల దున్ని దానియందు నాటఁబడిన (రాధ) ప్రేమ ఫలిం మోక్షసుఖము నిచ్చునట్లు చేయును. దీనివలన రాధాకృష్ణ సంబం మెట్టిదో యెఱుఁగనగు.

కొందఱు రాధ రాయణుఁడనువాని భార్యయనియుఁ గావున బరకీయయనియుఁ జెప్పుదురు. అగును గాక. రాయణునకును రా కును బొంతనము లేనాఁటికిని జెల్లవు. రాయణుఁడనఁగా వదర బోతు. "రాశ్శబ్దాః అయంతే నిర్గచ్ఛంతే యస్మాత్స రాయణ ఎవనివలన శబ్దములు వెడలుచున్నవో వాఁడు రాయణుఁడు" వ్య ప్రలాపియని యర్థము. ఇట్టివానికిని సర్వదా భగవదారాధనశీల

నెక్కడ సాంగత్యము కుదురును? భగవదారాధనమున కేకాంతము వలయును. జనసాంగత్యము కూడదు. భక్తుఁడుగా నుండువాఁడు సంగవర్జితుఁడు మౌనిగా నేకాంతముగ నుండవలయునని భగవంతుఁడే చెప్పెనుగదా. రాయణులను వదలి రాధ లిట్టి భగవంతు నాశ్రయించుట దోషమా? ఈ యర్థమునే జయదేవుఁడు చెలిక త్తెచే రాధ కిట్లు చెప్పించెను.

శ్లో॥ ముఖర మధీరం త్యజ మంజీరం రిపు మివ కేళి సులోలమ్
చల సఖి కుంజం సతిమిరపుంజం, శీలయ నీలనిచోలమ్॥

"ఓసఖి! తెలివిలేనిదియు, ధ్వనించునదియుఁ గేళియందుఁ జలించునదియునగు నూపురమును శత్రువువలె వదలిపెట్టుము. చీఁకటిచే నిండిన పొదలోనికిఁ బొమ్ము. ఎఱుపు నలుపు కలసిన వస్త్రమును ధరింపుము." ఇది యభిసారికా పర్యాయమున నర్థము. భక్తిపర్యాయమునఁ దెలివిలేని వానిని, మనోహరముగా నిచ్చకపు మాటలాడుచున్నను నూరక వదురుచుండు వానిని, క్రీడయందే యాసక్తిగలవానిని శత్రువువలె వదలి, యందమైన తెల్లనివస్త్రము మాని మలిన వస్త్రమును ధరించి, చీఁకటిగానుండు పొదలోనికిఁ బొమ్ము. అక్కడ నీవు నిశ్చలచిత్తముతో నొంటిగ ధ్యానింపవచ్చునని భావము. దీనివలనఁ గృష్ణుఁ డేకాంత లీలాప్రియుఁడని యేర్పడును గదా. అదియునుగాక త్రివర్గపరాయణులకే సామాన్యధర్మానుష్ఠాన నియతిగాని యత్యంత భక్తులకు జ్ఞానులకు సామాన్య ధర్మము లనుష్ఠేయములు గావని గోపికల విషయమునఁ జెప్పఁబడెనుగదా. ఇరువురు ముముక్షువులై భక్తిపరులో జ్ఞానులోయైనఁ దప్ప నొకరు ప్రవృత్తిమార్గముననుండి యొకరు నివృత్తిమార్గనిష్ఠులై రేని యట్టివారు స్త్రీలైనను బురుషులైనను రెండవవారిని వదలుటయే శ్రేయస్కరము. కావున రాధ పరకీయయే యైనఁగూడ దోషయుక్త గాదు. మఱియు "ఏకాంత లీలారసతో నిర్వృతః కృష్ణ ఉచ్యతే" యను నిర్వచనము స్మరింపవలయును. రాధాకృష్ణ భక్తులు లక్ష్మీదేవి భక్తిని మెచ్చరు, లక్ష్మీదేవి భగవత్సేవ చేయుటకు నీశ్వర భావము భగవంతుని మాహాత్మ్యమంతటి మాహాత్మ్య

మును గోరెను గావున నామె భక్తి సకామభక్తియే. కావున నుత్తమ భక్తిగాదు. రాధయో యటువంటి కోరిక కోరినదికాదు. పొందినది గాదు. ఆమె సర్వకాల సర్వావస్థల భగవత్సేవ సేవ సేవ తప్ప వేఱొం డెఱుఁగదు. ఎప్పుడును గృష్ణునితోఁ గూడఁ గ్రీడించుచు నాయనను సంతోష పెట్టుటే యామె కార్యము. కావున రాధ భక్తియే యత్యుత్తమము. భగవంతునిలోని సారము లక్ష్మి. లక్ష్మిలో నొడియఁగట్టిన సారము రాధ* యని రాధాకృష్ణభక్తుల మతము.

---

* "*Sri Radha* or *Sri Radhika* is represented as the picture of *Prema* or altruistic love. It is customary with people who have not carefully studied our Scriptures to identify *Sri Radha* with a profligate woman, who surrendered her womanly virtuer on the altar of Krishna's lust. I have certainly no objection to the thing being understood in an esoteric sense, but I must strongly protest against its being understood literally, Krishna being really the sweetheart of *Sri Radha*. ... ... Radha is not our Lord's wife—because a wife is the personification of self-love. Radha is described as being untrue to her husband, Rayan or Ayan Gosh. This is an apposite figure, because according to our sages, prayerfulness must be absolute and thorough, which it cannot be when it has to attend to mundane things. Radha's love for Krishna is a secret business. It ought to be so, because true prayerfulness is not Pharisaic in its character. Communion is and ought to be a secret businses--prayers must not be gonged from the housetop. *Radha* does not yearn for any temporal or celestial thing. She longs only for Divine companionship. She does not care so much for the Person of her Divine Lover as for his blessed feet. For doing what? To put them on her breast and thereby feel the effect of a soothing full-blown lotuses round which she moves and moves as the honey-sucking bee. *Radha's* love for her Divine Lover is so thorough that she compares herself to a horse who is ridden on by fiv riders at the same time. They are five senses. The ear is never wearied to hear the celestial music of his lute, the eye is never wearied with seeing His form, as all beautiful, beckoning her to come unto Him to have peace and rest, hope and joy; the tongue is never wearied with the tasting of the nectar of His lips, the nose is not wearied with the scent of His lotus-feet, exhaling the most odoriferous of celestial perfumes. Then the feeling is supremely roused by the touch of the Divine Balm *Sri Radh*

సీతారాములలో నొకరినే యెట్లు పూజింపరాదో యట్లు రాధాకృష్ణులం దొకరినే పూజింపరాదు. దంపతుల నిరువురిని బూజించుటకే యుగళపూజ యని పేరు. కావున గృష్ణభక్తుల శ్రేయస్సుగోరి రాధాకృష్ణ స్తుతి బృహద్బ్రహ్మ సంహితయందుఁ జెప్పఁబడిన ప్రకార మనువదించి 'యావత్తైలం తావ ద్వ్యాఖ్యాన'మ్మను న్యాయమున నీవ్యాస మతి సంగ్రహముగ ముగింపవలసి వచ్చెనని విచారముతో విరమింపఁబడుచున్నది.

శ్లో॥ జయతి శ్రీపరానంద కృష్ణపాదప వల్లరీ
శ్రీకృష్ణ వదనాంభోజ మధుపాన మధువ్రతీ
శ్రీకృష్ణ నయనానంద రసకర్పూర వర్తికా
శ్రీకృష్ణానన పూర్ణేందో రాధికా చారుచంద్రికా॥
శ్రీకృష్ణ రూపపాథోధి లహరీ హేమవైభవా
శ్రీకృష్ణ పరమానంద సరః పంకజకుండలా
శ్రీకృష్ణ యామినీరమ్య చంద్రోదయ ముఖోదయా
శ్రీకృష్ణ హృల్లతామూల విశాసామలదోహదా
శ్రీకృష్ణ బాల్యకౌమార కేళిరూపా యశస్వినీ
శ్రీకృష్ణ భవకైశోర రసకేళీ కలాప్రియా
శ్రీకృష్ణ లోలనయన విలోలామల తారకా
కృష్ణప్రాణః కృష్ణహృచ్ఛ కృష్ణచైతన్యరూపిణీ
కృష్ణానందా కృష్ణముఖీ కృష్ణోద్భవభయాపహా
కృష్ణహాసా కృష్ణరసా కృష్ణలీలాకృశోదరీ
కృష్ణప్రియా కృష్ణభరా కృష్ణాకృష్ణ విలాసినీ

---

feels the full force of beatitude Here is, however, not the *nirvana* of the Vedantins, nor the quiesence of rationalism. Nirvana and quiesence are merely negations. The beatitude of the followers of Sri Radha is a positive something. They do not aspire for unification with the Divine Essence. They prefer hell with its torments to such unification, 'Let us be ants' say they 'and thou O Lord! the sweet of sweets' that we may taste thee through eternity"

BULLORAM MULLICK, B.A.

కృష్ణకాంతా కృష్ణదైవా కృష్ణాంగీ కృష్ణజీవనా
కృష్ణతృట్కృష్ణభోగ్యాచ కృష్ణతుట్కృష్ణసాధనా
కృష్ణాశ్రయా కృష్ణపరా కృష్ణాభాకజ్జలప్రియా
కృష్ణశేషా కృష్ణసాధ్యా కృష్ణజీమూతచాతకీ
కృష్ణకేళీ కలాభిజ్ఞా కృష్ణపాదపమంజరీ
కృష్ణకాసారమకరీ కృష్ణమాతంగసంగినీ
కృష్ణతుష్టా కృష్ణపుష్టా కృష్ణతోషవిధాయినీ
కృష్ణనేత్రా కృష్ణకేశీ కృష్ణకుంతలమండితా
కృష్ణగీతా కృష్ణరాసా కృష్ణనృత్యా రసేశ్వరీ
కృష్ణపూజ్యా కృష్ణభక్తా కృష్ణలీలా కలావతీ
కృష్ణవిద్యా కృష్ణబుద్ధిః కృష్ణసంకల్పసిద్ధిదా
కృష్ణమానసకల్లోల కృష్ణమానసపంకజా
కృష్ణమాన్యా కృష్ణవంద్యా కృష్ణసంతాపచంద్రికా
కృష్ణసంగీతగమనా కృష్ణస్తోభవిధాయినీ
కృష్ణాననాబ్జమార్తాండ కృష్ణనేత్రాంజన ప్రభా
కృష్ణలావణ్యనిలయా కృష్ణసౌభాగ్యసేవధిః
శ్రీకృష్ణాకర్షిణీ కృష్ణకథారసనిషేవికా
కృష్ణతల్పా కృష్ణకల్పా కృష్ణతుల్యకలస్వనా
కృష్ణకేళిప్రియా కృష్ణకేళిసంతానదోహదా
కృష్ణశుద్ధా కృష్ణబుద్ధా కృష్ణముగ్ధా కళంకినీ
కృష్ణభామా కృష్ణవామా కృష్ణకామా మనోహరా
కృష్ణైశ్వర్యా కృష్ణవిత్తా కృష్ణస్మిత విఘూర్ణితా
కృష్ణాధర రసాభిజ్ఞా కృష్ణకౌతుక సాధనా
కృష్ణక్రీడా సుధాసింధుః కృష్ణనామ పరాయణా
కృష్ణశ్రీః కృష్ణభూతిశ్చ, కృష్ణర్ధిః కృష్ణమంగళా
కృష్ణశ్రేణీ కృష్ణగతిః కృష్ణకామ దుఘూహితా
కృష్ణమాలా కృష్ణశాలా కృష్ణహృత్పద్మకర్ణికా

కృష్ణజీవాతుకా రాధా వృషభాను తనూద్భవా
ఇతి శ్రీరాధికానామ స్తవరాజ మనుత్తమమ్
సంపత్ప్రదం దివ్యం కామదం పుణ్యవర్ధనమ్
పూజావసానే సంజప్యం, యుగళధ్యాన సంయుతమ్
ప్రణవాద్య మిదం దేవి, దేవానా మపిదుర్లభమ్
కృషి, ర్భూ వాచకశ్శబ్దో, 'న'శ్చానంద విధాయకః
సదానంద సమావేశః కృష్ణఇత్యభి ధీయతే
సచ్చిదానంద రూపాయ, కృష్ణాయా క్లిష్టకారిణే
నమో వేదాంత వేద్యాయ, బ్రహ్మణే పరమాత్మనే
అనయా రాధ్యతేకృష్ణో, భగవాన్ హరిరీశ్వరః
లీలయా రసవాహిన్యా తేనరాధా ప్రకీర్తితా
రాధికాపి పరాశక్తిః కృష్ణేచ్ఛా నందరూపిణీ
నిత్యాచ నిత్యసత్యస్మిన్ స్వాధారే పురుషోత్తమే
రాధాగాన ప్రియోరాధా, సంగీత హృతమానసః
రాధాలావణ్య నిలయో, రాధా ప్రేమ సరోరుహః
రాధాశృంగార పులకో, రాధాశృంగార కారకః
రాధాముఖాబ్జ మధుపో, రాధా స్మితనిరీక్షకః
రాధా ధరసుధామోదీ, రాధా కంఠవిభూషణః
రాధా మనస్సరోహంసో, రాధా మానవిమోచకః
రాధా విలాసగర్విష్ఠో, రాధా రూపాసలోన్మదః
రాధారూప లతాభృంగో, రాధా చంద్రచకోరకః
రాధారస సరోమంథీ, రాధా సర్వాంగసంశ్రయః
రాధా రత్నావళీకంఠో, రాధా సౌభాగ్యమందిరః
రాధా గంభీరతత్త్వజ్ఞో, రాధా జీమూతచాతకః
రాధా విద్యోతితోరస్కో, రాధితో రాధికాప్రియః
నిత్యోక్షరో నరారాతా, నిర్గుణో నీరదచ్ఛవిః
నిరాకారో హరోహారీ విహార విపినప్రియః
వేణు విస్ఫూర్జితముఖో, విశుద్ధ స్మితభూషితః

గుంజావళీ విభూషాఢ్యో, బర్హిపింఛ విభూషణః
గోవర్ధన ధరో గోపీ మండలీ మధ్యగో హరిః
గోపాలో గోకులస్వామీ, గోవిందో గోకులేశ్వరః
త్రిభంగ సుందరగ్రీవో, మదాఘూర్ణిత లోచనః
రక్తోష్ఠో రక్తచరణో, రక్తనేత్రో రసాయనః
రసప్రియో రసావిష్టో, రాకాచంద్ర వినోదకృత్
త్రయ్యంత బోధితో వేద, వేద్యోవిద్యా వినోదకృత్
వివేకభూమ్యో ధౌరేయో, ధరణీ భృద్ధనాధిపః
కౌమోదరః క్షమాసారో, దీనో దామోదరోదమీ
దయార్ద్రచిత్తః ప్రతాపః, శ్రీధర శ్రీకరో హరిః
దివ్యలోక గతో దివ్యో, దివ్యాయుధ ధరోచ్యుతః
నిత్యముక్త జనారాధ్యో, జగదానంద కారకః
కల్యాణ నిలయః కల్యః, కల్పపాదప సంశ్రయః
కాళిందీ కేళి కృత్కంస, బలవిధ్వంస కృత్కృతీ
కళంకర హితః కామీ, కామినీ కేళిదక్షిణః
బృందావనస్థో గోబృంద పాలకో బాలకేళికృత్
బలభద్ర ప్రియః శ్రీమాన్, వారణో ధ్ధానవో బలః
తాండవీ పాండవశ్రేష్ఠో, యాదవో నందనందనః
జనార్దనో జనావాసో, వాసుదేవో జనేశ్వరః
వంశీనటీ నటో నాదీ నాదాకృష్ణ జగత్ప్రియః
నాదాతీతో నదీకూల, కేళికృద్ధూళి ధూసరః
నారదోదిత సంగీత, సామగాన ప్రియః కలః
ఇతినామ శతంనిత్యం, జపతాం కిం సుదుర్లభమ్
స్వాపకాలే ప్రబోధేచ, పుణ్యాహే పుణ్యకర్మణి
పుణ్యక్షేత్రే ప్రజపతః స్యాద్భక్తి రసపాయినీ
ఏతన్నామామృతస్తోత్రే శ్రీరాధాకృష్ణయోః ప్రియే
పఠేద్వి చింతయన్నిత్య మచిరాద్విందతేహి మామ్॥

భుక్తిభక్తిముక్తిప్రదంబైన యీ రాధాకృష్ణ స్తోత్రంబును భక్తులు పఠించి కృతార్థులగుదురుగాక. పురాణాదులును దర్శనంగులును దదనువర్తులును రాధాకృష్ణసంబంధము తన్మహిమ మెట్టిదో యీ స్తోత్రరత్నమువలన నెఱిఁగి వారిని దూషించుటవలనఁ గలుగు మహాపాతకమునకు లోనై శాశ్వతనరకగాములు గాకుందురుగాత.

## —♦ శ్రీకృష్ణభక్త ప్రశంస. ♦—

గోపికా కృష్ణులను దూషించువారు వారిభక్తుల దూషించుట వింతగాదు. ఇట్టి వారి నుద్దేశించియే కదా "నాకఁబూనిన కుక్కకు లింగమేమి పానవట్టమేమి!" యను సామెతపుట్టెను. కృష్ణుని గోపికలను నాసేతుశీతాచలము లోకులంద ఱాబాలగోపాలము దేవుఁడని భక్తులని భావించుటకు బలిష్ఠమైన కారణము లేకుండునా? అది యేదో తెలిసికొందమనుజ్ఞానమైన దోషైకదృక్కుల కేలలేదో. సర్వజ్ఞత్వము కన్నులఁ గప్పియుండ నేదియు నిట్టులు తోఁచు.

"ఈభాషయందు బమ్మెరపోతనవంటి సాత్త్వికస్వభావమును సారాసార విచారమును తత్త్వవిజ్ఞానమును గల కవి యొక్క లేఖిని (కలము) కూడ శ్రీకృష్ణుని జారశిరోమణిగఁ జూపుటయందు జంకక స్వేచ్ఛావిహార మొనర్చుట దలఁచుకొనిన సిగ్గువోడవక మానదు." ...."వచనాంధ్ర విష్ణుపురాణమందలి "రాసక్రీడా" ఘట్టమునుగాని ఎఱ్ఱాప్రగ్గడ కృతమగు హరివంశమునందలి ప్రథమభాగములోని యెనిమిదవ యాశ్వాసమునుగాని బఠించువారికి సిగ్గుచే దలవంచుకొను నంతటి యవస్థ ప్రాప్తించును" అని సిగ్గుమాలిన వ్రాఁత యొక కృష్ణ చరిత్రమునఁ గానవచ్చెడిని. ఇట్టివారిచే పడి భాష యెట్లు చెడు చున్నదో సద్విషయ మట్లు చెడుచున్నది. పుత్తెలోఁబడిన పాలు గర్హ్యమే కదా.

బమ్మెరపోతన సాత్త్వికస్వభావము సారాసార విచారము తత్త్వ విజ్ఞానము గలవాఁడని యీ వ్రాయసకానికి విశ్వాసముండినచో నంత టివాఁ డిట్లు వ్రాయుటకు నేదేని ప్రబలకారణ ముండవలయు. అది యేదో తెలిసికొందమను వివేకమేల కలుగదాయెనో కదా. విష్ణుపురా

ణము శంభుదాసుని హరివంశమున నెనిమిదవయాశ్వాసము మరల బఠించి సిగ్గుచేఁ దలవంచుకొంటి. ఏల ? ఈవిమర్శయంతటి పనికిమాలిన పుస్తకములుకూడ మనదేశమునఁ బుట్టెనుగదాయని. ఆంధ్రభాష నటుండనిచ్చి మూలమైన సంస్కృతభాషకుఁ బోదము. శ్రీభాగవత గ్రంథకర్తయగు వ్యాసమహర్షియు భక్తాగ్రేసరుఁడైన జయదేవుఁడును దివ్యమైన నిర్మలభక్తిని దుష్టముగ వర్ణించి దుస్థితికిఁ దెచ్చిరని కొందఱు నిందించుచున్నారు. భాగవతమును గుఱించి 'విబుధవరుల వలన విన్నంతఁగన్నంతఁ దెలియవచ్చినంత' నిదివఱకే తేటపఱిచితిని.

జయదేవకృతమైన గీతగోవిందమును గుఱించియు గోపికా గీతలను గుఱించియు విశేషముగ వ్రాయఁ దలంపుండెనుగాని యిదివఱకే గ్రంథము విశేషబహుళమగుటచే గీత గోవిందమును గుఱించిమాత్రము దిక్ప్రదర్శనముగఁ గొంచెము వ్రాయఁబూనుటయ్యెను.

అష్టపదులనఁబడు గీతగోవిందమునందు రాధాకృష్ణ విప్రలంభ శృంగారమే విశేషించి వ్రాయఁబడెను. శృంగారరసమునకు భక్తిరసమునకును భేదములేమియు మనుష్యులకు గోచరమగు ప్రాకృతవిషయములను దృష్టాంతముగఁగొని యప్రాకృతవిషయమును బోధించుట సాత్త్విక సంప్రదాయమనియు మున్నే యుపన్యస్తమయ్యెను గదా జయదేవుఁ డొనర్చినది యీకార్యమే. భక్తియనెడు దివ్యౌషధ ఘుటికకుఁ బామరజనులకుఁ జక్కఁగఁ దెలిసిన శృంగారమను చక్కెరతో బూఁతపూసి లోకులకర్పించెను. భక్తులు తత్త్వమునెఱిఁగి భక్తి గ్రంథముగనే దానిని బఠింతురు. శృంగారలోలురు శృంగార గ్రంథము చదివినను గర్భితమైనభక్తి క్రమక్రమముగ లోపలఁ బనిచేసి కొన్నినాళ్ళకుఁ గ్రమముగ వారిని భక్తిమార్గమునకుఁ ద్రిప్పును. కన్నుఁ వివేకముగలిగి యీగ్రంథమును బఠించిన యందఱకిది తేటతెల్లవగాకపోదు. 'రోచనార్థా ఫలశ్రుతి' యని భాగవతమునఁ గలదుగద రుచికల్పింపఁ బూర్వులీమార్గ మవలంబించిరి.

శ్లో॥ వాగ్దేవతా చరిత చిత్రిత చిత్తసద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ

శ్రీ వాసుదేవ రతికేళి కథాసమేత
మేతం కరోతి జయదేవకవిః ప్రబంధమ్॥

ఈశ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాసిన యిరువురు వ్యాఖ్యాతలు "అత్రరాగి ముముక్షు సాధారణ ప్రవృత్తిం సకలజనమనోహారం శృంగారరసగర్భం భగవత్కేలివర్ణనరూపం కావ్యంక్రియత ఇత్యభిధేయం ప్రతిజానీతే" యనియు "కవిరిదానీం సకల కలికలుష హారిహారి హరిచరితానుస్మరణ సరసతాపాదనేన తద్భక్తాననుగృహ్ణా న్స్వముచితేష్ట దేవతా భావనా భావితాంతఃకరణ స్తత్ఫలభూతం శృంగారోత్తరం ప్రబంధం కర్తుం ప్రతిజానీతే" యనియు వ్రాసిరి. కవియే,

శ్లో॥ యదిహరిస్మరణే సరసంమనో యదివిలాసకలాసు కుతూహలమ్
మధురకోమలకాంతపదావళీం శృణుతదాజయదేవసరస్వతీమ్॥

అని ప్రధానవస్తువైన హరిస్మరణమును ప్రథమమున వచించెను. ఆయా గీతముల యంత్యమందు,

శ్లో॥ శ్రీజయదేవభణితమిదముదయతి హరిచరణస్మృతిసారమ్॥

శ్లో॥ శ్రీజయదేవభణితమతిసుందర మోహనమధురిపురూపమ్॥

శ్లో॥ హరిచరణస్మరణం ప్రతిసంప్రతి పుణ్యవతామనురూపమ్॥

శ్లో॥ శ్రీజయదేవ భణితమితిగీతమ్
సుఖయతు కేశవపద ముపనీతమ్॥

శ్లో॥ శ్రీజయదేవే కృతహరిసేవే భణతిపరమరమణీయమ్
ప్రముదితహృదయంహరిమతిసదయంనమతసుకృతకమనీయమ్

శ్లో॥ శ్రీజయదేవ కవేరిద ముదితమ్
రసికజనం తనుతా మతిముదితమ్॥

రసికజనం శృంగారరసాస్వాద పురస్సర భగవద్భక్తిరూప రసాస్వాదగ్రాహిణ మతిముదిత మతిశయేన నందితం తనుతాం విస్తారయతు అని వ్యాఖ్య.

శ్లో॥ హరిచరణశరణ జయదేవ కవిభారతీ।

ఈవిధముగ గీతములం గడపట స్పష్టముగ వ్రాసియుండ నిది దుష్కామమును బోధించునని వ్రాయుట యెంతటి తెంపరితనమో. ఇవిగాక,

గీ. ధీరసమీరే యమునాతీరే వసతివనే వనమాలీ.

ఇడాపింగలల నడుమనుండు సుషుమ్నయందు నేనుందునని భగవంతుఁడు చెప్పినవాక్యమునకు దీనికి భేదమున్నదేమో యోగవిదులు భావింపుఁడు.

గీ. విగళితవసనం పరిహృతరశనం ఘటయ జఘన మపిధానమ్
కిసలయశయనే పంకజనయనే నిధిమివహర్ష నిధానమ్.
అవధూతస్థితికి దీనికి భేదముకలదేమో పరిశీలింపుఁడు.

గీ. హరి రభిమానీ రజనిరిదానీ మిదమపియాతి విరామమ్
కురుమమవచనం సత్వరరచనం పూరయమధురిపుకామమ్.

అభిమాని=జీవకోటుల రక్షించుటయం దభిమానముగల వాఁడు. రజనిరిదానీం = అజ్ఞానబద్ధమైన యీ జన్మము. ఎన్నిజన్మములో వ్యర్థములైనవి. ఈజన్మముకూడ వ్యర్థము చేసికొనక నిన్ను రక్షింప నెదురుచూచు భగవంతునికోరిక దీర్పుము.

గీ. ముహురవలోకిత మండనలీలా
మధురిపు రహ మితి భావనశీలా.
ఇది తన్మయాసక్తిగదా.

గీ. శ్లిష్యతి చుంబతి జలధర కల్పమ్
హరి రుపగత ఇతి తిమిర మనల్పమ్.
ఇది సర్వబ్రహ్మోపాసనముగదా.

గీ. భవతి విలంబిని విగళితలజ్జా
విలపతి రోదితి వాసకసజ్జా.
ఇది పరమవిరహాసక్తిగదా.

ఇట్టి వెన్నియోని గ్రంథమునం గలవు. కన్నులు తెలివిగల వారికి గోచరించును. నిర్మలదివ్యభక్తిని వ్యాస జయదేవులు క్షుద్ర

కామముగా మార్చిరో, క్షుద్రకామము పరభక్తిగాఁ బరిణమింపఁ జేయు విధానములు వారు తెలిపిరో పూర్వవ్యాసము చదివినవా రెఱుంగుదురు. కామక్రోధాదులుగూడ ముక్తిసాధనములుగఁ జేసి కోనవచ్చునని వారు ఘంటాఘోషముగఁ జెప్పియుండినను విపరీతముగఁ బూర్వపక్షులు భావించుటకు వారి తామసబుద్ధియే కారణము.

శ్లో॥ అధర్మం ధర్మమితియా, మన్యతే తమసావృతా
సర్వార్థా, న్విపరీతాంశ్చ, బుద్ధి స్సాపార్థతామసీ॥
గీ. ౧౮-౩౨.

## —♦ భక్తియోగము. ♦—

ఆహారనిద్రాభయ మైథునములు పశువులకు మనుష్యులకు సమానములు. మనుష్యునియందు జ్ఞానమొక్కటి యెక్కువగఁగలదు. దానివలనఁ బశువులకంటె మనుష్యుఁ డధికుఁడు. ఎవనియందుజ్ఞానము లేదో, యుండినను సరియైనమార్గమున నుపయోగింపఁబడదో, వాఁడు రెండుకాళ్ళ పశువు. తప్పుతప్పు.

కం. కసవుఁదినుఁ, గూడు తెమ్మని
కసరదు, బరువిడిన మోయుఁ గర్శనమునకున్
విసువదు, మాఱొడ్డాడదు
పసరమునకు సరియె మనుజపశు వెన్నఁటికిన్.

అని యొకానొక కవి చెప్పినట్లు వీఁడు పసరమునకన్న నికృష్టుఁడు కావునఁ బ్రతిమనుష్యుఁడు జ్ఞాన మార్జించి దానిని సరియైన మార్గమున వినియోగింపవలయును.

జ్ఞాన మనఁగా నేమి ? నీవెవ్వఁడవని యొకనినొకఁడు ప్రశ్నించినపుడు విజ్ఞులకుఁ బట్టరాని నవ్వుదయించును. తానెవఁడో తనకుఁ దెలిసినట్లు వీఁడు పరుల నడుగుచున్నాఁడే యేమి వీని మౌఢ్యాతిశయమని వారు తలపోయుచుందురు. మన కన్నులయెదుటనే బిడ్డలు జన్మించుట చూచుచున్నారము. ఒకబిడ్డ కడుపులోనే చచ్చును. ఒకటి నేలమీఁదఁబడి చచ్చును. ఒకటి మఱికొన్నినాళ్ళకుఁ జచ్చును. కొందఱు బిడ్డలు పెద్దవారై వారు మరల బిడ్డలఁగని చత్తురు. ఈ

పుట్టినవారందఱు నెవరు ? ఎక్కడనుండి వచ్చిరి ? ఎచ్చటికిఁ బోయిరి? కొందఱు కొంతకాలము బ్రతుకనేల ? కొందఱు వెంటనే చావనేల ? వీరి యట్టివాఁడనేకదా నేను, నే నెక్కడనుండి వచ్చితిని ? ఎచ్చటికిఁ బోదును ? ఇట్లు పుట్టక చావకయుండు మార్గమేదైనఁ గలదాయని యాలోచించుచు సరియైన మార్గము తెలిసికొను వివేకమే జ్ఞానము. తక్కిన తెలివిని జ్ఞానమనుట రాక్షసులను బుణ్యాజను లనుటయే.

ఇట్టి జ్ఞానదృష్టిని లోకమువంకఁ జూఱఁజూచినఁ బ్రపంచమంతయు దుఃఖమయముగానే కానిపించును. ఈ నిమిషమున సంతోషమునఁ దిరుగుచుండినవారు మఱుసటి నిమిషమునఁ దల్రవేల్వైచి కన్నీరుగాఱ లబలబ మొత్తికొనుచు బొబ్బలు కొట్టుకొనుచు నేలఁబడి పొరలాడుచు నాయనాయని యొకరు, బిడ్డాయని యొకరు, నమ్మాయని యొకరు, మగనిఁదలఁచి యొకతె, పెండ్లామునుదలఁచి యొకఁడు నేడ్చుచుందురు, కొన్నిచోటుల వాకిటఁ గంచుతాళాలు, లోపల నోటితాళాలుగా నుండును. ధనములేదని యొకఁడేడ్చును. ఉన్నదెట్లు కాపాడుదునాయని యొకఁడేడ్చును. పోవునేమోయని యొకఁడేడ్చును. పోయెనేయని యొకఁడేడ్చును. బిడ్డపుట్టిననాఁటి సంతోష మావల వానికి రోగమో నొప్పియో వచ్చిన నుండదు. పెండ్లామింటికి వచ్చిన నాఁటి సంతోష మావలనుండదు. ఇట్టు లేయేవి తొలుత సుఖమును గొందుమో యవియే యావల దుఃఖకారణమగును. బ్రహ్మ మొదలు స్థావరపర్యంత మేదేశమునకుఁ బోయిన నీయేడుపే కానవచ్చును. కావున శాశ్వత సుఖమేదియని యాలోచింపవలయును ? 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యనుదాని కిష్టు డన్వయము. ఈ దుఃఖమునుండి విడివడుటే సుఖము. దానికే మోక్షమని పేరు.

బృందావనంబున గోపికాకృష్ణు లెట్లో, రథంబున నరనారాయణు లెట్లో యట్లు దేహంబున జీవాత్మ పరమాత్మ లున్నవారు.అగ్నిహోత్రునివంటివాఁడు పరమాత్ముఁడు. అందుండి చిట్లివచ్చిన మిణుగురులంటివారు జీవాత్మలు.

"సీ. పావకుం డర్చుల భానుండు దీప్తుల
నెబ్భంగి నిగిడింతు రెట్ల డంతు
రాక్రియ నాత్మ కరావళిచేత బ్ర
హ్మాదుల వేల్పుల నఖిలజంతు
గణముల జగముల ఘననామరూపభే
దములతో మెఱయించి తగనడంచు" గజేంద్రమోక్షణము.

తమకుఁగల కించిత్స్వాతంత్ర్యమును దుర్వినియోగపఱిచి ప్రకృతికి వశులై యనాదిగఁ జక్రమునకుఁ దగులుకొనిన పదార్థములవలె జనన మరణముల నడుమఁ జుట్లుపెట్టుచున్నారు. జననమరణమునకే సంసార మనిపేరు. దేహముండువఱకు సంసారముండును. ప్రకృతి పరిణామ మైన దేహముతోడను దత్సంబంధి సుఖదుఃఖములతోడను సంబంధము వీడిపోవుటయే ముక్తి.

జీవులకు సంసారము స్ఫటికమునఁ బ్రతిఫలించిన దాసానిపువ్వు కాంతివలె నారోపితముకాని సహజముకాదు. సూర్యునికి భూమికి నడుమ వేఱొకగ్రహ మడ్డమువచ్చుటచే సూర్యుఁడు గానరానట్లు జీవాత్మ పరమాత్మలకు నడుమ మనస్సను తెఱ యడ్డము వచ్చుటచేఁ బరమాత్మ గానరాకున్నవాఁడు. త్రిగుణాత్మకమైన మనస్సును లయింపఁజేసినఁ బరమాత్మ గోచరించును.

మనస్సును లయింపఁజేయు ముఖ్యసాధనము భక్తియొకటియే గాని కొందఱు తలంచునట్లు జ్ఞానముకాదు.

సంసారమున కజ్ఞానము కారణముకాదు. కావున జ్ఞానము వలన సంసారము తొలఁగదు. ఎట్లన, స్ఫటికమునఁ బ్రతిఫలించిన యెఱ్ఱనికాంతి దాసానిపువ్వు కాంతియేకాని స్ఫటికమునకు సహజ కాంతి కాదని యెంత తెలిసికొని బుద్ధిని శ్రమింపఁజేసినను స్ఫటికము నందలి రక్తవర్ణము పోదుగదా. అట్టులే జీవునకు సంసారము మనస్సుచే నారోపితమని తెలిపి యదిపోవ బుద్ధిచే నెంత శ్రమించినను నది పోఁజాలదు. స్ఫటికమునందలి రక్తవర్ణము పోవలయుననిన స్ఫటిక మైన నశించిపోవలయును, లేదా దాసానిపూవైన నశింపవలయును,

లేదా రెంటి సంబంధమైన నశింపవలయును. స్ఫటికము (జీవుఁడు) నశించునదికాదు. స్ఫటికమునకుఁ బుష్పమునకుఁ గల సంబంధము నశింపవలయును. పుష్పము (మనస్సు)ండువఱకు సంబంధము పోదు. కావునఁ బుష్పము(మనస్సు)ను లయింపఁజేసిననే స్ఫటికమునందలి రక్త వర్ణము (సంసారము) పోవును. కావున మనస్సును లయింపఁజేయునది జ్ఞానముకాదు. వేఱొండై యుండవలయు. అదియే భక్తి. భక్తి లేమియే సంసారహేతువు. భక్తివలననే సంసారము నశింపవలయును.

శ్లో॥ తత్రసత్త్వం నిర్మలత్వాత్, ప్రకాశక మనామయమ్
సుఖసంగేన బధ్నాతి, జ్ఞానసంగేన చానఘ
తన్నిబధ్నాతి కౌంతేయ, కర్మసంగేన దేహినమ్
తమ స్త్వజ్ఞానజం సిద్ధి, మోహనం సర్వదేహినామ్
ప్రమాదాలస్య నిద్రాది, స్తన్నిబధ్నాతి భారత॥

అని ప్రారంభించి

మాంచయో వ్యభిచారేణ, భక్తియోగే నసేవతే
సగుణాన్ సమతీత్యైతాన్, బ్రహ్మభూయాయ కల్పతే।
భగ. ౧౪-౬. కృష్ణలీల సం-౨. ౪౦౮.

అని శ్రీకృష్ణుఁ డుపసంహరించెను. ఇట్లు భగవంతుఁడే త్రిగుణాత్మకమైన యంతఃకరణము (మనస్సు) లయముమూలమున బ్రహ్మానందము లభించునని చెప్పెనుగదా.

ఇంతమాత్రమున జ్ఞానము వ్యర్థమని తలంపరాదు. అశ్రద్ధయను మనోమాలిన్యమును గడిగివేయుటచే జ్ఞానము భక్తికి సహాయపడును గాని ప్రత్యక్షముగనున్న యంతఃకరణరూపకమైన యుపాధి ధర్మమును నిరసింప సమర్థముగాదని మీఁది వాక్యమువలన నేర్పడుచున్నది. కావుననే, శ్లో॥ గుణేభ్యశ్చ పరంవేత్తి, మద్భావం సోధిగచ్ఛతి॥ భ ౧౪-౨౭. జ్ఞానసంఛిన్న సంశయమ్॥ ౧౪ - 41. అని భగవంతుఁడు చెప్పెను. జ్ఞానమువలన సంసారనివృత్తి యగుననుటకు సంసార మజ్ఞానకారణమనుట నిరాకరము. అదియునుగాక శుక్తిరజతన్యాయమునఁ భ్రాంతికారణమైన వెండియె లేనపుడు ముత్తెపుఁజిప్ప వెండి

యనఃభ్రాంతి యెట్లు గలుగును ? స్ఫటికమునందలి రక్తవర్ణ మెట్లు సత్యమో యట్లే సంసారము సత్యము. ఆరోపితము గావున నిత్యము గాదు. అంతియగాక "కుతస్తుఖలు సౌమ్యైవం స్యాదసతః" ఓయి సౌమ్యుఁడా! యీాసత్తునుండి యిసత్తెట్లు పుట్టెను? అనుఛాందోగ్యోప నిషద్వాక్యము కార్యము సత్తని చెప్పుటచేఁ గారణము సత్తని నిర్ధా రించుటచే సంసారము సత్తని సిద్ధాంతీకరించెఁగదా. అంతియగాక సత్య సంకల్పః (ఛా. iii_14) డిత్యాది శ్రుతివాక్యములు భగవత్సృష్టి సత్యమని స్థాపించుచున్న విగదా. మహాభారతమున

శ్లో॥ బ్రహ్మసత్యం తపస్సత్యం, సత్యంచైవ ప్రజాపతిః
సత్యాద్భూతాని జాతాని, సత్యంభూత మయంజగత్॥

అశ్వమేధపర్వము 35 అ. కృష్ణశీల పుట.

అనియును గృష్ణుఁడే వచించెను. పంచమవేదమైన మహాభారతము తదంతర్గతమై సాక్షాద్భగవన్ముఖోద్గతమైన భగవద్గీతయు శ్రుతులుగాని స్మృతులుగావు. అదియునుగాక బ్రహ్మసూత్రములం దెందును బాద రాయణుఁడు సంసార మజ్ఞానకల్పితమని చెప్పకపోవుటయేగాక స్వప్న సృష్టిని నిరాకరించుటచే జాగ్రత్సృష్టి సత్యత్వమును స్థాపించెను. అది దృష్టాంతము నిమిత్తమై యందమా యనిన నటు చెప్పుటకుఁ బ్రమా ణము లేదు. సుఖాదిధర్మము లాత్మకు సహజములని సిద్ధాంతపడ లేదు. సుఖాదులు సాక్షాదాత్మవికారములు గావు. గౌరవర్ణములోనగు వాని వలె నాత్మయం దివియు నారోపితములే. ఎట్లన నేను సుందరుఁడనని యొకఁడు చెప్పినపుడు దేహము సుందరమని యర్థము కాని యాత్మ సుందరమని యెట్లుకాదో నిద్రించినవాఁడు మేల్కని నేను సుఖముగా నిద్రించితి నన్నప్పుడును సుఖము దేహసంబంధమైనదని యర్థము గ్రహింపవలయును. సుఖాదిజ్ఞానము క్రియయో వికారమో యగు టచే నిమిత్తకారణమొకటి యుండవలయును. ఇటు లాలోచించిన లాఘవమునిమిత్తమై శబ్దమునకు శ్రోత్రజన్యత్వము చెప్పినట్లే సుఖాదు లకుఁ గరణజన్యత్వము నిత్యసంబంధముచేతనే యని యేర్పడుచున్నది.

శబ్దమునకును సాధనమైన చెవికిని, నిత్యసంబంధముండుటచే నెట్లు శబ్దము గ్రహింపఁబడుచున్నదో యట్లే సుఖాదులకు నంతఃకరణములకు నిత్యసంబంధముండుటచే నవి గ్రహింపఁబడుచున్నవి. స్పష్టముగాని యాకాశము నంశమున ధ్వని గ్రహింపఁబడునట్లే యనాదియగు నింద్రియము (మనస్సు) చేతనే సుఖాదులు గ్రహింపఁబడు చున్నవని కొంద ఱందురు. సాధనమూలమున జన్యత్వము నిత్యసంబంధమున నే యనెడు నుభయమతముల చొప్పునఁ జూచినను స్పర్శజన్యమైన యింద్రియముయొక్క గ్రాహ్యగుణత్వము వలననే యని యేర్పడు చున్నది. అయినను సర్వము ప్రకాశింపఁజేయుటచే నాత్మ యున్నదని సిద్ధాంతమగుచున్నది. ఏలనఁ దెలిసికొనువాఁడు లేనిచో నేదియుఁ దెలియఁబడదు. కావునఁ బురుషార్థమనుటచే ధర్మ మెట్లెఱుంగఁదగి నదో యట్లే మోక్షసాధకమైన భక్తియు నెఱుఁగఁదగినది.

౧. నే నెవఁడను ?

నే నెవఁడనను ప్రశ్నయందు నే ననునది జీవాత్మ కన్వయింప వలయునుగాని దేహమున కన్వయింపరాదు. ఈ విషయము కృష్ణ లీలామృతమందును నార్యచరిత్రరత్నావళి గ్రంథములందును విపుల ముగ సదృష్టాంతముగఁ జర్చించి బోధించియుండుటచే నిచటఁ జర్చిం చుట చర్వితచర్వణము,

౨. సంసారమున నేల తగులుకొని దుఃఖించుచున్నారము ?

భగవంతుఁడును దనకు భర్తయు సర్వసుఖదాతయుఁ బతియు నగు రామచంద్రుఁడు తనతోడనుండినను నంతతో సంతుష్టిపడియుండక సీతాదేవి మాయామృగమును బ్రేమించి దానిని దనకు లభ్యపడఁ జేయఁగోరి తన్మూలమున భగవంతునెడఁ బాసి రావణునకుఁజిక్కి లంకలో దుఃఖించుచుండినట్లే మనము మనకు భగవంతుఁడిచ్చిన కించిత్స్వాతంత్ర్యమును దుర్వినియోగపఱిచి ప్రకృతిని వలచిన కారణ ముచే భగవంతునకు దూరమై ప్రకృతికిఁజిక్కి సంసారమున దుఃఖించు చున్నారము.

3. ఈ సంసారమునుండి తప్పించుకొను మార్గమెట్లు?

సీతాదేవి లంకలోనుండి తప్పించుకొనిన మార్గమేదియో యదియే మనకును మార్గము. సీతాదేవి యేమి చేసెను? రామరామ యని నిరంతరము ధ్యానించుచుండెను. రామునినే నమ్మియుండెను. ఎట్లైనను రాముఁడు తన్ను రక్షించునను దృఢవిశ్వాసము కలదై యుండెను. కాని రాముఁడు తన్ను రక్షించుటకు రావలయునని కోరి యాయన ప్రీతికై యజ్ఞాదులు చేయలేదు. దానధర్మములు చేయలేదు (కర్మయోగము). ఆత్మవిచారము చేయలేదు (రాజయోగము). ఆయన యెంతలా వెంతపొడుగున్నాఁడని యాలోచించుచుండినదియుఁ గాదు. (జ్ఞానయోగము) కావున భక్తితో సీతాదేవి చరించినట్లు మనము చరించిన నావెంకవలె మనకును సాయుజ్యప్రాప్తి గలదు. సీతారాముల కూడికవంటిదే సాయుజ్యము.

ముక్తి సాధనములని చెప్పఁబడు కర్మ, జ్ఞాన, యోగ, భక్తి మార్గములలో భక్తిమార్గమే యుత్తమోత్తమ మార్గము.

౧. భక్తి స్వతంత్రము. తక్కిన మూఁడుమార్గముల సాహాయ్యమిది యపేక్షింపదు. తక్కిన మూఁడును భక్తిసాహాయ్యము లేకుండిన ఫలవంతములుగావు.

౨. భక్తికి నధికారనియతి లేదు.

౩. భక్తికి భక్తియే ఫలముగాని వేఱుఫలము నది యపేక్షింపదు.

౪. భక్తుఁడు దీనుఁడు. భగవంతుఁడు దీనజన పక్షపాతి.

౫. సుకరము.

ప్రథమాధిక్యము—౧. భక్తి స్వతంత్రము.

భక్తి గంగా ప్రవాహమువంటిది. అది భగవత్పాదములనుండి యుత్పన్నము. ఉపనదుల సాహాయ్యము లేకున్నను నది యెండిపోక సాగరంబునఁ గలయఁగలదు. ఉపనదులు వచ్చి కలసి ప్రవాహమును మఱింత యధికముచేసి వేగమును హెచ్చించును. పరభక్తికిని జ్ఞాన కర్మ యోగాది గౌణభక్తులవలన సాహాయ్య మంతమాత్రమే. గంగా ప్రవాహమునఁ గలియకున్నను యుపనదులెట్లు సాగరమును జేరఁజా

లవో యట్లు భక్తిలేని జ్ఞానకర్మాదులు వ్యర్థంబులగును. కావుననే నారదుఁడు "మునీంద్రా నిర్గతకర్మంబై నిరుపాధికంబైన జ్ఞానంబు హరి భక్తి లేకున్న శోభితంబుగాదు. భక్తిహీనంబులయిన జ్ఞానవాచాకర్మ కౌశలంబులు నిరర్థకంబులని వ్యాసున కుపదేశించె.

మ. ఉపవాసవ్రత శౌచశీల మఖ సంధ్యోపాసనాగ్ని క్రియా
జపదానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తి సేకూర; ద
చ్చపుభక్తిఁ హరిఁ బుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమా
ధిపుఁ బాపఘ్నుఁ బరేశునచ్యుతుని నర్థిం గొల్వలేకుండినన్.

భాగవతము.

కావునఁ బరభక్తి ముఖ్యమని తక్కినవి గౌణములని యేర్పడు చున్నవి. జ్ఞానము గౌణముగనుకనే బ్రహ్మజ్ఞాన హీనమైన భక్తిముక్తి ప్రదమని గోపికలవృత్తాంతము దెలుపుచున్నది. (కృ. లీ. పుట 179-152) విష్ణుపురాణమున

శ్లో॥ తచ్చింతా విపులాహ్లాద, క్షీణపుణ్యా చయాసతీ
తదప్రాప్తి మహాదుఃఖ, విలీనాశేష పాతకా
చింతయంతీ జగత్సూతిం, పరబ్రహ్మ స్వరూపిణం
నిరుచ్ఛ్వాసతయాముక్తిం గతాన్యాగోపకన్యకా॥విష్ణుఅంశ ౫.

అచింతయను మహాసంతోషముచేఁ బుణ్యములనెల్ల నశింపఁజేసి కృష్ణుఁడు ప్రాప్తింపకపోయెనే యను దుఃఖముచేఁ బాపములనెల్లఁ దొలఁగించి జగత్కారణుఁడు పరబ్రహ్మస్వరూపుఁడు నగు కృష్ణుని జింతించుచు శ్వాసముమాని వేఱొక గోపకన్యక ముక్తిని బొందెను. ఇట్లులే బ్రాహ్మణస్త్రీయును ముక్తిని గాంచెను. గోపికలుగాని బ్రాహ్మణస్త్రీలుగాని కర్మజ్ఞానయోగము లభ్యాసముచేసినవారు గారనుట స్పష్టము నిరుచ్ఛ్వాసలైయనుట యోగాభ్యాసమును దెలుపదు. మనస్సునకు శ్వాసము వాహనము. మనస్సేకాగ్రమై యొక విష యము తీవ్రముగ నాలోచించినపుడు శ్వాసము చలింపదు. ఇది యనుభవసిద్ధము. నిరుచ్ఛ్వాసలని చెప్పుటచే వారి చిత్తైకాగత యెట్టిదో తెలుపును. కృష్ణుఁడు సాక్షాద్భగవంతుఁడని మాత్ర మెఱిఁ

యాయనయందే భక్తితోడి మనస్సు నిలుపుటచే ముక్తింగాంచిరి గావున నితరసాహాయ్యము లేని కేవల భక్తిచేతనే మోక్షము సంపాదింపవచ్చును. అంతటి శక్తి లేనివారు దానిని లభింపఁజేసికొన నితర సాహాయ్య మపేక్షింతురు. కావునఁ బ్రధానము భక్తియే.

ద్వితీయాధిక్యము—౨. భక్తికి నందఱు నధికారులే.

"అనింద్యయోన్యధిక్రియతే పారంపర్యాత్" (శాం. సూ. ౭౮.) వేదశాస్త్రజ్ఞానము గలవాఁడు గాని జ్ఞానయోగాధికారి కాఁజాలఁడు. శాంకరమతమున సన్న్యాసియై సాధనచతుష్టయ సంపత్తి గలవాఁడే జ్ఞానాభ్యాసాధికారి.* స్త్రీ శూద్రులకు శాస్త్రపఠనాధికారము లేదు. కావున జ్ఞానమువలననే ముక్తి యందురేని యద్వైత సన్న్యాసులు తప్పఁ దక్కినయందఱు ముక్తి నాశింపవలసిన పనియే యుండదు. భగవంతుని నియమ మది కాదు. స్త్రీశూద్రాదులే గాక పశుపక్షి వృక్షాదులకైనను భగవద్భక్తి యుండిన మోక్షముగన నర్హత గలుగును. కావున భక్తియోగమున కెట్టివారైన నర్హులె.

ఆస్తంబ బ్రహ్మపర్యంతము సర్వము ప్రకృతిపురుష మిశ్రమే. జీవుల కందఱకుఁ బ్రేమ స్వభావసిద్ధము. ఆ సర్వసామాన్య సహజ ప్రేమను విషయములందు వినియోగించుటకు మాఱు భగవంతుని యందు వినియోగించిన నెట్టిజీవికైన ముక్తి లభించును.

తే. దనుజభుజగ యక్షదైత్య మృగాభీర
సుందరీ విహంగ శూద్రశబరు
లైనఁ బాపజీవులైన ముక్తికిఁబోదు
రఖిలజగము విష్ణుఁ డనుచుఁ దలఁచి.

---

*ఆత్మానాత్మ వివేకము, శమదమాది సాధనసంపత్తి, ఇహలోక పరలోక భోగములందు వైరాగ్యము, మోక్షమునందుఁ గోరిక. ఈ నాలిగింటికిని సాధన చతుష్టయమని పేరు. సన్న్యాసియై ఈ నాలుగు సాధించిన పదపడి బ్రహ్మజ్ఞానార్జనమున కధికారము గలుగును. తరువాత దానిని జిరకాల మభ్యసించిన మోక్షము గలుగుననినచో నెన్ని కల్పములకైన స్త్రీలు సూద్రులు ముక్తికి నధికారు లగుదురా?

శ్లో॥ మాంహిపార్థ వ్యపాశ్రిత్య, యేపిస్యుః పాపయోనయః
స్త్రియోవైశ్యా స్తథాశూద్రా, స్తేపియాంతి పరాంగతిమ్॥
భగవద్గీత. ౯-౩౨.

కావుననేకదా ప్రహ్లాద విభీషణాఘాసుర గోపికా జటాయు విదుర కరిరాజ గుహ శబర్యాదులకును నయోధ్యాపురవాసుల కెల్ల రకు ముక్తి ప్రసంగింపఁబడెను.

తృతీయాధిక్యము-3. భక్తి యన్యఫల మపేక్షింపదు.

జ్ఞానయోగ, కర్మయోగాభ్యాసకులు, సాయుజ్య కైవల్యాది ఫలము లపేక్షింతురుగాని భక్తుఁడు భక్తిని దప్ప మఱిదేనిని గోరఁడు. నిరంతర భగవద్ధ్యానా లోకచింతనామృతపానంబునఁ గలిగిన యా నందమునే యనుభవింపఁ గోరునుగాని భగవంతుఁ డెదురవచ్చి మోక్ష మిచ్చెదనినను వలదనును. భక్తుఁ లేకోరికలు లేక భగవన్నామమును గీర్తించుచుందురు.

కం. ధీరులు నిరపేక్షులు నా
త్మారాములు నైనమునులు హరిభజనము ని
ష్కారణము సేయుచుందురు
నారాయణుఁ డట్టివాఁడ నవ్యచరిత్రా.

(మఱియుఁ జూడు. కృష్ణలీల 120 పుట ౫-వ పద్యము.)

కలకండ మధురపదార్థము. దానిని భుజించుటవలన మనస్సున కొక యానందము గలదు. కలకండవేఱు మనము వేఱుగా నుండి దానిని ననుభవించి యానందించుటకుమాఱు మనమే కలకండగా నైన మన మాధుర్యము మనకెట్లు తెలియఁగలదు? భార్య తాను భిన్న ముగానుండుటచే భర్తృసేవాదులు రమించును. భర్తవలన నెక్కువగ భార్యకే యానందమనుభవింపఁగలదు. రసాస్వాదనమున నానంద మనుభవింపఁగోరు భక్తులు భక్తినే కోరుదురు. పాషాణప్రాయమైన యద్వైత సాయుజ్యముఁ గోరరు.

చతుర్థాధిక్యము—

౭. భక్తుఁడు దీనుఁడు. భగవంతుఁడు దీనజన పక్షపాతి.

రాజును నాలుగువిధముల పురుషు లాశ్రయింతురు. పండితులై మేధావులై శాస్త్రజ్ఞానముగలవారు మంత్రులయి న్యాయాన్యాయములు దిద్దువారు మొదటి తరగతివారు రెండవ తరగతివా రమాత్యులు, ప్రాడ్వివాకులు, దండనాయకులు. వీరు దేశమునఁ గలహములు లేక యితరరాజుల బాధలేక దండింపవలసినవారిని దండించుచు శాంతి నెలకొల్పువారు. మూఁడవతరగతివారు రాజు సొంతకార్యములను దేహరక్షణాది కార్యములను విచారించువారు. నాలుగవ తరగతివారు కాళ్లుపిసుకుట విసరుట తాంబూలమిచ్చుట లోనగు కార్యములు చేయు పరిచారకులు, భిక్షుకులు లోనగువారు.

"రాజునకుఁగల తెలివితేటలు బుద్ధిబలము జ్ఞానము మనకును గలవు. మనము రాజుగానుండిన నీపని చేయఁజాలమా? ఏమో వీని యదృష్టముకొలఁది వీఁడు రాజయ్యెను" అనుభావ మొకప్పుడు గాకున్నను నొకప్పుడైన నుదయింప నవకాశముండుటచే మొదటి తరగతివారియం దహంకారము గలుగును.

రెండవతరగతివారో "మనములేకున్న న్యాయరక్షణ మెక్కడ? దుష్టశిక్షణ మెక్కడ? శాంతి యెక్కడ? దేశమంతయు నరాజకమై పోదా? శత్రువులువచ్చి రాష్ట్రము నాక్రమింపరా? కావున నీ రాజు రాజత్వము మనచేతిలో నున్న"దని తలంతురు.

మూఁడవ తరగతివారో యంతర్గృహచ్ఛిద్రము లెఱింగినవారును రాజు లోపాలోపములు మర్మములు తెలిసినవారునగుట రాజు మానము ప్రాణము తమచేతిలోనున్నట్లు తమతో విరోధించెనేని నాఁటితో రాజుపని ముగిసినట్లు తలపోయుచుందురు.

నాలుగవ తరగతివారి కిట్టి చిత్తవికారకారణము లేదు. రాజైయనుగ్రహించి యే యల్పము నిచ్చినను నదియే పదివేలని పరమానుగ్రహమని సంతోషముతో గ్రహింతురు. రాజొకవేళ యేదియు నియ్యకుండినను మన కేయోగ్యతయు లేదే యేమిచూచి మనకు

రాజిచ్చును. ఆయనకై దయవచ్చి యిచ్చినపుడే యియ్యనిమ్మని విసుగుకొనక యణఁగి పడియుందురుగాని తక్కినవారివలె నల్పమిచ్చిన నసంతుష్టిపడి, యియ్యకుండినఁ దమ్మవమానించెనని యంతతోఁ దమకు గౌరవహాని కలిగెనని తలంపరు, శోకింపరు, దుఃఖింపరు. మొదటి మువ్వుర కుండు గర్వలేశలేపము నాలుగవ వారికిఁ గలుగదు.

ఇందు మొదటివారు జ్ఞానయోగులు. రెండవవారు కర్మ యోగులు. మూఁడవవారు రాజయోగులు. నాలుగవవారు భక్తులు. వీరికి మొదటివారివలె రాజుతోఁ దాము సమానస్కంధమున నుండు వారమను చిత్తౌన్నత్యము గాని తాము లేకుండిన లోకము మునిఁగి పోవునని కావునఁ దామే ముఖ్యులమని స్వాధిక్యభావలేపముగాని, రాజు తమ చేతిలోనివాఁడని మూఁడవవానికిఁగల స్వాతంత్ర్యసూచన గాని, కలుగదు. తాము దీనులని కేవలము దిక్కులేనివారని రాజును విడిచిన వేఱుగతి లేనివారని యన్నిటికి నాయనే శరణమని యా యనయే తల్లిదండ్రులవలెఁ దమ సుఖదుఃఖము లరయునని వీరు విశ్వ సించి యుందురు. కావున నిర్మల రాజానుగ్రహ పూరము వీరివంకఁ బాఱినట్టు తక్కిన వారివంకఁ బాఱదు. వారహంకారము, స్వాతి శయ భావము, స్వశక్తి జ్ఞానము వీనిచే స్వయముగ సృష్టించుకొనిన శృంఖలములచే బద్ధులై తా మెవనినిగొలిచి జీవించి సంచరించి సత్త గలవారై యున్నారో వాని విషయమందే సంకుచితదృష్టు లగు చున్నారు. కావున నిట్టివారిని గౌరవించుటయందుఁ బ్రభువునకు విశేష సంతోషముండదు. గౌరవింపఁబడు వారికిఁ దృప్తియుండదు.* కావునఁ గర్మ, జ్ఞాన, యోగమార్గములకంటె భక్తిమార్గమే శ్రేష్ఠము.• అదియే ముముక్షువులకు గ్రాహ్యము॰ వేల ?

*రాజగృహ భోజనాదిషు, తథైవ దృష్టత్వాత్॥ నాసూ. ౩౧.
నతేన రాజపరితోషః క్షుచ్ఛాంతిర్వా॥ నాసూ. ౩౨.
• సాతు కర్మ జ్ఞానయోగేభ్యో ప్యధికతరా॥ నాసూ. ౨౫.
॰ తస్మాత్ సైవగ్రాహ్యా ముముక్షుభిః॥ నాసూ. ౩౩.

ఈశ్వరుఁ డభిమానిద్వేషి. దైన్యప్రియుఁడు * ఈ యభిమాన ద్వేషములు భగవంతుని పక్షపాత బుద్ధిచేఁ గలుగునవి కావు. వస్తు స్వభావములు. ఏలన భగవంతుఁడే భగవద్గీతయందు.

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు, నమేద్వేష్యోస్తి నప్రియః
యేభజంతితుమాంభక్త్యా, మయితే తేషుచాప్యహమ్। ౯-౨౯.

అని వచించెనుగదా. దీనికి శ్రీశంకరాచార్య వ్యాఖ్యానమందు నిట్లు గానవచ్చెడి "నేనగ్నిహోత్రుని వంటివాఁడను. అగ్ని యెట్లు దూరస్థులుగ నుండువారి చలి పోఁగొట్టక తన్ను సమీపించినవారి చలిని పోఁగొట్టుచున్నదో యట్లు నేనును భక్తుల ననుగ్రహించుచున్నాను గాని యితరుల ననుగ్రహింపను." నాయనురాగము నిమిత్తమై గాక భక్తులెట్లు నన్ను నీశ్వరు భక్తిచే సేవించుచున్నారో యట్లే నేను స్వభావముచే వారియెడ వర్తించుచున్నాను గాని యితరులయందుఁ గాదు కావున వారియందు నాకు ద్వేషము లేదు.

భగవంతునియందుఁ బక్షపాతము లేమి మఱియొకవిధముగను గాననగు. సూర్యరశ్మి ప్రపంచమందంతట సమానముగఁ వ్యాపించుచున్నదిగాని గృహములలోఁ గూర్చుండి తలుపులు మూసికొనువారి మీఁదను గొడుగులు పట్టుకొని పోవువారిమీఁదను నెట్లు వ్యాపింపఁ గలదు? అట్లులే భగవంతునకు విముఖులుగా నుండువారియందును జ్ఞానాభిమానాదులచే నావృతులై వారియందును భగవదనుగ్రహ మెట్లు ప్రసరింపఁగలదు? సూర్యరశ్మి తగులని వృక్షములు మనుష్యులెట్లు చెడుదురో యట్లు భగవదనుగ్రహము తగులనీయనివారును జెడుదురు. ఇట్లు వారు చెడుటకు వారే కారణభూతులు గాని భగవంతుఁడు కాఁడు. అట్లులే భగవంతుఁడు దీనప్రియుఁడు.

భక్తుఁ డితరసాధనములందు దేనిని బరిగ్రహింపక భగవంతుఁడే దిక్కని యాత్మరక్షాభారము సర్వమూయునయందువైచి నిశ్చింతుఁడై తల్లి విషయమునఁ బాలుద్రావు బిడ్డవలె వర్తించుచుండును.

* ఫలరూపత్వాత్॥ ౨౬.

ఈశ్వర స్యాభిమానిద్వేషి త్వాద్దైన్య ప్రియత్వాచ్చ॥ ౨౭.

తక్కినవారో తెక్కలువచ్చి సంపాదించుకొని తిన నేర్చిన బిడ్డలవంటి వారు. అట్టులే జ్ఞానకర్మ రాజయోగులు స్వసామర్థ్యముచే మోక్షము సాధింపఁ జూచువారు. కొందఱు తమ జ్ఞాన మభివృద్ధి చేసిచేసి తుదకు నించుమించు భగవంతు నంత జ్ఞానము సంపాదించుచుఁ దమ కోరికలనెల్ల నిర్మూలించువారు. కొందఱు తమ ప్రాబల్యము బాహ్య ప్రపంచమందంతట వ్యాపి పఁజేసి సమస్త పదార్థములు తమకు సులభముఁ జేసికొనువారు. మఱికొందఱు యోగసిద్ధులై నానా శక్తులు సంపాదించి వాని మూలమునఁ దమ సర్వాభీష్టములు తలఁచినంత మాత్రములో నెఱవేర్పఁ గోరువారు. మొదటి వారు జ్ఞానయోగులు. రెండవవారు కర్మయోగులు. మూఁడవవారు రాజ యోగులు. ఇఁక భక్తియోగులో కేవల భగవత్పరతంత్రులై కైంకర్య రతులగుట గడియ గడియకు భగవత్సాంగత్యము గలవారయి మొదటినుండి భగవంతుని సమీపమందే యుందురు. తక్కినవారు వారివారి కోరికలవెంటఁ బోయి పోయి క్రమక్రమముగ భగవంతు నకు దవ్వగుచున్నారు. కావున శంకరాచార్యుల వారు వ్రాసిన యితరశబ్దము భగవత్పరాఙ్ముఖులకే కాక భక్తితర మార్గనిష్ఠులకు నన్వయించుచున్నది. మీఁద వివరించిన రాజగృహోపమానముచే నిది స్పష్టపడుచున్నది. అన్ని యుపాయములలో భక్తియే శ్రేష్ఠమని భక్త్యాచార్యులే గాక జ్ఞానమార్గ శ్రైష్ఠ్యమును ప్రతిపాదించిన శంకరా చార్యులవారును దుదకు 'ముక్తిసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' యని వక్కాణించి భజగోవిందం భజగోవిందమని శిష్యుల కుపదే శించుటయే గాక ప్రాణాపాయ సమయమున 'లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబ'మ్మని ధ్యానించి సుఖపడిరి. అంతియగాక పంచా యతనపూజముఁ గావించుచుండిరి.

పంచమాధిక్యము—౨. సుకరము.

జ్ఞానకర్మయోగములకంటె భక్తిసుకరము. అది దేహికి స్వభావ సిద్ధము. ప్రయత్నించి సంపాదించవలసినది లేదు. ఏలన భగవం తుఁడు ప్రేమస్వరూపుఁడు. జీవకోటియంతయు భగవదంశము. కావున

నా స్తంబ బ్రహ్మపర్యంతము జీవుఁ డున్నచోటఁ బ్రేమము సహజముగ నుండును. పూర్ణమం దుండునది యంశమందుండునుగదా. భగవద్విషయమున వర్తింపఁజేసిన యాప్రేమకే భక్తి యనిపేరు. తనచేత నుండు పదార్థము నొకఁగూట నుంచుటకుమాఱు వేఱొకగూఁట నుంచినట్లు దారపుత్రాదులయందలి ప్రేమ భగవంతునియం దుంచుటే భక్తిసేయుట.

అట్లైన నోయీ! భగవంతుఁడు జ్ఞానస్వరూపుఁడుగదా? అన్ని జీవులయందుఁ బ్రేమవలెనే జ్ఞానము సంకుచితమై యుండలేదా. ప్రేమ సహజమైనపుడు జ్ఞాన మేలకాదని జ్ఞానవాదు లడుగవచ్చును. దాని కిది ప్రత్యుత్తరము.

ప్రతి బద్ధజీవునందు జ్ఞానశక్తి ప్రేమాదులు సంకుచితములై యుండుట సత్యము. ఈశక్తులు శక్యములుగాకున్న వానికి నుత్తరకాలమునఁ బరిణామమే యుండదు. మొలకయెత్త శక్తిలేని విత్తనముల భూమిలోఁ బాఁతి నీళ్లుపోయఁగానే మొలకయెత్తునా? వేయించికాని యుడకఁ బెట్టిగాని విత్తనము నాటిన మొలకయెత్తురా? అట్టులే జీవునందు శక్యములుగనున్నవే వెనుక విస్తారముగఁ బరిణమించి వ్యక్తముగ గోచరించును. స్త్రీ శిశువునందు గర్భధారణశక్తి యెట్లు శక్యమో యట్లే బద్ధజీవునందు జ్ఞానము శక్యము. కాలాంతరమునఁ గృషివలనఁగాని యాశక్తి వెలువడదు. వృక్షాదులకుఁ బశుపక్ష్యాదులకు జ్ఞానము గలదా? మనుష్యజన్మమెత్తినను నిజమైన బ్రాహ్మణుఁడుగాఁ బుట్టినను నెందఱు లవమైనను మోక్షజ్ఞానము గలవారున్నారో విచారింపుఁడు.

ప్రేమయో యట్టిదికాదు. భూతకోటిలో లతాగుల్మవృక్షాదులలోను నాత్మరక్షణమందు వంశరక్షణమందుఁ బ్రేమలేనిది కలదా. పశువులు పక్షులుకూడ నపాయము సంభవించినపుడు పరువెత్తుటతో తిరుగఁబడుటతో యాత్మప్రీతిచేఁగదా? పోతు పెంటి కలయుట ప్రేమచేఁగదా? బిడ్డల రక్షించుట ప్రేమచేఁగదా. ఇంతయేల? ఆహారము గొనుటయేల? ఈప్రేమ లతాగుల్మాదులందును గాన నగు.

కావుననేకదా తమయందలి ప్రేమగుణము భగవంతున కర్పించి మృగమైన గజేంద్రుఁడు, పక్షియైన జటాయువు, బోయెతయగు శబరి, బాలుఁడైన ధ్రువుఁడు, రాక్షసుఁడైన ప్రహ్లాదుఁడు, మూఢలైన గొల్లయిల్లాండ్రు ముక్తిగన యోగ్యతగలవారైరి. జ్ఞానులయందిట్టివా రెవరైనఁ గలరా ?

శ్లో॥ యాప్రీతి రవివేకానాం, విషయే ష్వనపాయినీ
త్వామను స్మరతస్సామే, హృదయాన్మాప సర్పతు॥ విష్ణుపురా.

అవివేకులకు నేప్రీతి విడువక విషయములందుండునో యా ప్రీతిని నిన్ను స్మరించు నా హృదయముననుండి తొలఁగిపోకుండును గాక యనియేకదా ప్రహ్లాదుఁడు కోరెను.

చ తనకులధర్మమున్ విడిచి దానవవైరి పదారవిందముల్
పనివడి సేవచేసి పరిపాకము నొందక యెవ్వఁడేనిఁ జ
చ్చిన మఱుమేననైన నది సిద్ధివహించుఁ, దదీయసేవఁ బా
సినఁ గులధర్మగౌరవము సిద్ధివహించునె యెన్ని మేనులన్.
పోతనరత్నములు పుట ౧౮.

అన్నట్లు భక్తి స్వభావధర్మము గావున నీజన్మమున విచ్ఛిత్తియైనను మఱుజన్మమునఁ దప్పక ఫలించును. జ్ఞానమున కిచ్ఛాపూర్వక ప్రబల ప్రయత్నమువలయును. సాధనసంపత్తి యుండవలయును. అది స్వప్రయత్న లభ్యముగావున నాపాయముగుట స్వరూపహాని గలిగినఁ గలుగవచ్చును. హానికలిగెనా కృషియంతయు వ్యర్థము. అంతియగాక జ్ఞానయోగము దుష్కరమని దేహధారులకు దుఃఖైకసాధ్యమనియు నింత సాధించినను భక్తివలన నేదిలభ్యమో యదియే దానివలన లభ్యమని కావున నిర్గుణోపాసనమునకన్న సగుణోపాసనమే శ్రేష్ఠమని భగవంతుఁడగు కృష్ణుఁడే భగవద్గీతలయందు ౧౨-వ యధ్యాయంబున స్పష్టముగ నుపదేశించెను. అంతియకాక,

శ్లో॥ తపస్విభ్యో ధికో యోగీ, జ్ఞానిభ్యోపి మతో ధికః
కర్మిభ్యశ్చా ధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున॥

యోగినామపి సర్వేషాం, మద్గతేనాం తరాత్మనా
శ్రద్ధావాన్ భజతేయోమాం, సమేయుక్త తమోమతః॥
భ. గీ. ౬-౪౭. కృ. లీ. సం-౨. పుట 373.

కావుననే నారదమహర్షి "సాతు కర్మ, జ్ఞాన, యోగేభ్యోప్యధికతరా" నా. సూ. ౨౫. అది (భక్తి) కర్మమునకంటెను, జ్ఞానమునకంటెను, యోగమునకంటెను మిక్కిలి యధికమైనదని సూత్రించెను.

ఛాందోగ్యమందు "బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి" యని బ్రహ్మజ్ఞానమువలన ముక్తి చెప్పఁబడలేదా యందురేని యిచ్చట సంస్థ (స్థిరత్వము) యనఁగా భక్తియేకాని జ్ఞానముగాదు. ఏలనః— ఒక రాజునుగుఱించి యతనియం దనురాగముగల యమాత్యభృత్యాదులకువలె నతని శత్రువులకును దెలిసియుండును. ఆ జ్ఞానమువలననే యమాత్యాదులకుఁ గలుగు ఫలము శత్రువులకుఁ గలుగునా? అమాత్యాదులవలె శత్రువు లతనియందు సంస్థ గలవారనవచ్చునా? శబ్దార్థనిర్ణయము లోకమునందువలెనే వేదమునందును గావుననే చిరకారికథయందు (ఆర్యకథానిధి చూడుఁడు.)

శ్లో॥ విమృశ్యతేనకాలేన, పత్నీసంస్థావ్యతిక్రమః
సోబ్రవీచ్ఛ భృశంతప్తో, దుఃఖేనాశ్రూణివర్తయన్॥ శాంతి.

భార్యయందలి సంస్థావ్యతిక్రమ మాలోచించి ఋషి మిగులఁ బరితప్తుఁడై యిట్లు వచించెను. ఇది యహల్యాగౌతముల వృత్తాంతము. ఇచ్చట సంస్థ యనఁగా భక్తియన నొప్పునుగాని జ్ఞానార్థము పొసఁగదు. "తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్" బ్రహ్మసూ. ౧-౭. అను బ్రహ్మసూత్రమందును నిష్ఠయనఁగా భక్తియే. "దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతిమామపి" భ. గీ. ౭-౨౩. అనియు,

శ్లో॥ యథాతే నిశ్చలంచేతో, మయిభక్తి సమన్వితమ్
తథాత్వం మత్ప్రసాదేన, నిర్వాణ మపియాస్యసి॥ విష్ణుపురా.

భక్తితోఁగూడిన మనస్సు నాయందు నీకు స్థిరముగానుండుటచే నా యనుగ్రహమువలన నీవు మోక్షమునుగూడ నొందఁగలవు. అనియుఁ గలవుగదా.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు "తమేవవిదిత్వాఽతి మృత్యుమేతినాన్యః పంథావిద్యతేఽయనాయ" యని జ్ఞానమువలననే మృత్యువు నతిక్రమించునని చెప్పఁబడలేదా యందు వేని యందు వేదనము (తెలియుట) యనఁగా భక్తియనియే యర్థము. ఏలన,

శ్లో॥ తేషామహం సముద్ధర్తా, మృత్యుసంసార సాగరాత్
భవామి నచిరాత్పార్థ!, మయ్యావేశిత చేతసామ్॥ భగ.౧౨-౭.

అని మృత్యువునుదాఁటి పోవుట భక్తివలన ననియే చెప్పుటచే నుప యర్థము. 'వేదన ముపాసనంస్యాత్త ద్విషయే శ్రవణా'త్తని వాక్యకారులు.

శ్లో॥ త్ర్యంబకం యజామహే, సుగంధిం పుష్టివర్ధనమ్
ఉర్వారుక మివబంధనా, న్మృత్యోర్ముక్షీయమామృతాత్॥

త్తను తైత్తిరీయ మంత్రభాగంబున యజనమనఁగా భక్తియె యని యాకల్పమందు వ్యాఖ్యానము చేయఁబడినది

ఇట్టులే "జ్ఞానీత్వాత్మైవమేమత" (భగవద్గీత ౭-౧౮) మ్మను చోటను జ్ఞానియనఁగా భక్తుఁడనియే యర్థము. వీల యందు వేని జ్ఞాని యనఁగాఁ దెలిసినవాఁడనికదా యర్థము. ఏమి తెలిసినవాఁడు? వేదాంతవాక్యములను నర్థము తెలిసినవాఁడనియా? అట్లైనచోఁ దత్త్వమసి. అదే నీవను నీ రెండుమాటల కర్థము దెలియఁగానే మోక్షాధికారి యగునా? కాఁడు గదా. ఎప్పుడగును. దీని యర్థమును మనస్సునకుఁ దెచ్చుకొని బహుకాల ముపాసన చేయఁగాఁ జేయఁగాఁ గొంతకాలమునకుఁదా నాత్మయేకాని ప్రకృతిసంబంధమైన దేహముకాదని సర్వకాల సర్వావస్థల దృఢనిశ్చయము గలుగును. కావున జ్ఞానియనఁగా నిట్లుపాసనము చేసినవాఁడని యర్థము. ఇట్టి యుపాసనమే భక్తి. ఉపాసకుఁడే భక్తుఁడు. చక్కెర తీపని విని తెలిసి నంత మాత్రమున నోరు తీపగునా?

శ్లో॥ భక్త్యా మా మభిజానాతి, యావాన్ యశ్చాస్మి తత్త్వతః
తతోమాం తత్త్వతో జ్ఞాత్వా, విశతే తదనంతరమ్॥ గీ.౧౮-౫౫.

కృ. లీ. సం-౨. పుట-427-428.

ఇచ్చట భక్త్యా=భక్తిచే, అభిజానాతి=చక్కఁగాఁ దెలిసికొనుచున్నాఁ డనుటచే భక్తి జ్ఞానమునకు సాధన మాత్రమేకదా యగు నందురేని యట్లుగాదు. ఏ న గీతలయందు 'జానాతి' తెలిసికొనుచున్నాఁడని మాత్రముండిన భక్తిజ్ఞానమునకు సాధనమని చెప్పవచ్చును. అభిజానాతి=చక్కఁగాఁ దెలిసికొనుట యనఁగా ముందు తెలిసిన దానినే మరలమరల స్మరించి చక్కఁగాఁ దెలిసికొనుటయని యర్థము. పరభక్తికి నంగమైన పూర్వజ్ఞానము భక్తికినుపకారమయి దానిని దృఢపఱుచును. కావున భక్తివలన ఫలము భక్తియేయని యేర్పడుచున్నది. కావుననే "స్వయంఫల రూపత్వేతి బ్రహ్మకుమారః (నా. సూ. 30) భక్తికి భక్తియే ఫలమని నారదమహర్షి వచించెను. వడ్లు బియ్యమగు వఱకు నెట్లు దంచెదరో యట్లు భక్తి దృఢపడువఱకు నిరంతర స్మృతి యనెడి యభిజ్ఞానము సాహాయ్యము కావలసియుండును. భక్తిఫలమునకు జ్ఞాన ముపకారకమని చెప్పుటకొఱకే 'తత' = అవల నని చెప్పఁబడెను. అనఁగా దృఢజ్ఞానముచే భక్తి స్థిరపడినపిమ్మట నన్నుఁ బ్రవేశించునని యర్థము. కావున నిది న్యాయప్రాప్తానువాదమే కాని శ్రుతివాక్యము గాదు. అంతియగాక

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా, నశోచతి నకాంక్షతి
సమస్సర్వేషుభూతేషు, మద్భక్తింలభతేపరామ్॥ గీ ౧౮-౫౪
కృ. లీ. సం-౨. పుట-౪౨౮.

ఇది మీఁద ననువదించిన 'భక్త్యా మా మభి జానాతి' యను శ్లోకమునకుఁ బూర్వ శ్లోకము. ఇందు భక్తుఁడు బ్రహ్మభూతుఁడైనట్లు చెప్పఁబడెను. అట్టివానికి మరల బ్రహ్మజ్ఞానముతోఁ బనిలేదు. కావున దాని కావలిశ్లోక (౫౫) మనువాదమే కాని నూతనవిషయ స్థాపనమునకై చెప్పఁబడినది కాదు.

కావున జ్ఞానము భక్తికి వికల్పమునుగాదు. అనఁగా జ్ఞానము చేతఁగూడ మోక్షము గలుగవచ్చునని చెప్పరాదు. ఏలనఁగా జ్ఞానము గౌణభక్తి. పరభక్తి ప్రధానము. కావున గౌణము ప్రధానము సమానములని చెప్పరాదు. కావుననే "ఏతేనవికల్పోఽపిప్రత్యుక్త"

(శాండిల్య. సూ. ౧౭) యని సూత్రింపఁబడెను. దీనివలన జ్ఞానవి
వికల్పమనుటకూడ ఖండింపఁబడెను. ఇచట 'అపి'=కూడ ననుట
జ్ఞానభక్తులు రెండునుగలసి ముక్తికి సాధనములగు ననువాదముకూ
నిరస్తమయ్యెను.

మనస్సు నేకాగ్రము చేయుటయే యోగము. ఇది జ్ఞానము
కును భక్తికినిగూడ నుపకారకమగును. ఏకాగ్రచిత్తత రెంటికి నావశ
కమే. అయినను జ్ఞానము సాధించుటకే యోగ మభ్యసింపఁబ
నేని యది భక్తి కుపకారము కాఁజాలదు. అట్లులే వైరాగ్యముకూ
రెంటికి వలసియుండును.

ఓయి "ఈశ్వరప్రణిధానాద్వా" యను (౧–౨౩) పాతం
సూత్రమీశ్వరధ్యానము సమాధిని గలిగించునని చెప్పుచుండ
వెట్లు మోక్షమునకు భక్తి ముఖ్యసాధనమని సాధించెదవందురేని పత
జలిచెప్పిన భక్తి గౌణభక్తిగాని పరభక్తిగాదు. గౌణభక్తివలన
సమాధి ప్రాప్తి. కావుననే కదా యాయనయే "తస్యవాచకః ప్రణవ
"తజ్జపస్తదర్థభావన" మ్మని (౨౭–౨౮) సూత్రించెను. భగవద్వా
కము ప్రణవము. దాని జపము దాని యర్థమును భావించుట మ
స్సును నిలుకడ పఱుచును.

భక్తి రాగమేకాని జ్ఞానముగాదు.

ద్వేషమునకు విరుద్ధమగుటను, రసమని చెప్పఁబడుట చేత
భక్తి రాగమేయగును. భక్తి ద్వేషములు పరస్పర విరోధములని వీ
దేవద్వేషి వీఁడు దైవభక్తుఁడునను లోకవ్యవహారమువలననే యెఱు
నగు. అంతియుకాక "అయంహి భగవాన్ కీర్తితః సంస్మృతశ్చ
షానుబంధేనాపి అఖిలసురాసుర దుర్లభం ఫలప్రయచ్ఛతి కిమ
సమ్యగ్భక్తిమతా" మ్మని విష్ణుపురాణమందును.

శ్లో॥ విద్వేషాదపి గోవిందం, దమఘోషాత్మజస్స్మరన్
శిశుపాలో గతస్స్వర్గం, కింపునస్తత్పరాయణః॥

యని యత్రిస్మృతియందును ప్రయోగములు గలవు.

ద్వేషించినవారు నసూయాపరులు నరకము పాలగుదురని గీత ౧౬-౧౯ యందును జెప్పఁబడెను.

భక్తి ద్వేషముగాదు. భగవంతునియందలి యనురాగమగును.

"రసం హ్యేవాయం లబ్ధ్వానందీభవతి" యను తైత్తిరీయ శ్రుతి రసమువలన ముక్తి చెప్పుటచే రసమనఁగా రాగమే.

'రసో వై స' యనియుఁ గలదు గదా.

శ్లో॥ విషయా వినివర్తంతే, నిరాహారస్య దేహినః

రసవర్జ్యం; రసోప్యస్య, పరందృష్ట్వా నివర్తతే॥ భగ. ౨-౫౯.

యను శ్లోకమందును రసమనఁగా రాగమే. అయినను నిందు విషయ రాగము పేర్కొనఁబడెను. "రసశబ్దో రాగేప్రసిద్ధః సరసేనప్రవృత్తో రసికోరసజ్ఞః ఇత్యాది దర్శనా"త్తని శంకరభాష్యము "యేపితేషు భగవదంశేష్వనురాగిణః, కోసలనగరజానపదా స్తేపి 'తన్మనసస్తత్స లోకతామాపుః" శ్రీరాములయందు ననురాగముగల కోసలపుర వాసులు పల్లెలవారును నాయనయందు మనస్సునిలిపి సాలోక్యమును బ్రాపించిరని విష్ణుపురాణము అంశ ర నందుఁ జెప్పఁబడెను. ఇచ్చట ననురాగము గలవారని భక్తులే చెప్పఁబడిరి.

శ్లో॥ నిగమకల్పతరోర్గళితంఫలం, శుకముఖాదమృతద్రవసంయుతమ్ ।

పిబతభాగవతంరసమాలయం, ముహురహోరసికాభువిభావుకాః॥

గీ. వేదకల్పవృక్ష విగళితమయి శుక
ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణ ఫలరసాస్వాదన
పదవిఁగనుఁడు రసికభావవిదులు. భాగ.

ఇందును రసికులనఁగా భక్తులే. కావుననే భక్తాగ్రగణ్యుఁడైన జయ దేవుఁడు "యదిహరిస్మరణే సరసం మనో" యని వచించెను. ఇచ్చట సరసమనఁగా సరాగమనియే వ్యాఖ్యాతలు వ్రాసిరి. "రసికజనం తనుతామతిముదిత" మ్మను చోటను రసికజనులన "భగవద్భక్తిరూప రసాస్వాదగ్రహి"ణులని వ్యాఖ్యాతము. "శృంగారాదౌ రసేవీర్యే గుణేరాగేద్రవేరస" యని యమరుఁడు, రసలీలయే రాసలీల. ఆనంద

లీల. అది జీవాత్మ పరమాత్మల కేళీవిలాసముగాని తుచ్ఛకామిక క(
డూతి నివారక వ్యాపారము కాదు.

మీమాంసకుల మతమున రాగ మిచ్ఛయే. ఇష్టసిద్ధికి యజ్ఞ
ము లోనగు కార్యములు సాధనములను జ్ఞాన ముదయించుటచే నా
కార్యమునందు రాగముగలుగును గావున వారు రాగ మిచ్ఛయనిరి
కాని భక్తిమతమున నటుగాదు. ఒక సుందరపదార్థము చూచినపుడ
రాగము తనంతటదానే యుదయించునుగాని యిది సుందరము గావు(
దీనిని మనము ప్రేమింపవలయునని సంకల్ప ముదయించుటచే రాగ
మునకుఁ బ్రయత్నపడుట లేదు. అనురాగము కలవాఁడు నేను సంతో
షించితిననునే కాని నేను సంతోషింప నిచ్ఛగించుచున్నాననఁడు
అదియునుగాక యిప్పటికి సిద్ధికాకుండు దాని విషయమున నిచ్ఛ
జనించును. సిద్ధించినది సిద్ధింపనిదికూడ ననురాగమునకు విషయమే
భక్తి క్రియగదా. "నకర్మణా నప్రజయా ధనేన త్యాగే నైకే(
అమృతత్వమానశుః" (తైత్తిరీయారణ్యకము ఖిలప్రశ్నము ఋక్కు
౧-౨) అని యుండుటచే భక్తివలన మోక్షమెట్లు కలుగునని సం(
హింపరాదు. ప్రయత్న విధానముగలది క్రియ. అట్టి ప్రయత్న విధా
నము లేనిది క్రియగాదు. జ్ఞాన మట్టిదేకదా. జ్ఞానముప్రమాణ సంపత్తి
నధీనమై యున్నది. ప్రమాణసంపత్తి లభించినపుడు జ్ఞానము తనంతట
దానే జనించును. దానిని జేయుటకుఁ జేయకుండుటకు మార్చుటక
మనుష్యుఁడు స్వతంత్రుఁడు కాఁడు. భక్తియు నట్టిదే. పురుషునక
భార్యయందుఁ బిడ్డలయందుఁ గలప్రీతి పురుషప్రయత్న లబ్ధముగాదు
భార్యయందు నేనిట్టి ప్రేమగలవాఁడనై యుండవలయు బిడ్డలయం దిట్టి
ప్రేమగలవాఁడనై యుండవలయు నని ముందుగ నేర్పాటుచేసి దాని(
గొనసాగింపఁ బురుషుఁడు యత్నింపఁడు గదా. అట్లైన భక్తి యెట్ల
గలుగునందురేని యది పూర్వసుకృతమునకు గౌణభక్త్యాది సాధనము
లకు నధీనపడియున్నది. భక్తి క్రియాత్మకము గాదు కావుననే దానిఫ(
మనంతము.

జ్ఞానము భక్తి కాదు. ఏలన,

శ్లో॥ బహూనాం జన్మనామంతే, జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వమితి, సమహాత్మా సుదుర్లభః॥ గీ. ౭-౧౯.

అనేకజన్మములకుఁ గడపట జ్ఞానవంతుఁడు నన్నుఁ బ్రపత్తి చేసి భక్తుఁ డగునని చెప్పఁబడెను. జ్ఞానమునకు భక్తి కారణమగునేని యితర ప్రపత్తివలె నీవాక్యము పపన్నముగాదు. కావుననే యీవలి శ్లోకంబున "కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేన్యదేవతాః" ౭-౨౦ కామముచే నపహరింపఁబడిన జ్ఞానముగలవా రితరదేవతలయెడ భక్తి చేయుదురని దేవతాంతరభక్తి నిందించుటచే పరస్వభక్తి సాధింపఁబడియె. ఈశ్లోకమందు నిందింపఁబడినది యితర దేవతాభక్తియే కాని జ్ఞానముగాదు. రెండు శ్లోకములలో నొక్కయర్థమునే ప్రపత్తి శబ్దముపయోగింపఁబడెనని యెఱుఁగనగు.* 'ప్రపత్తిశబ్దాచ్చ' ప్రపత్తి శబ్దమువలనఁ జూడ నని సూత్రమున జ్ఞానశబ్దమునకు సమీపమందే యుండుటచేతను భక్తియందు జ్ఞానత్వాభావము చెప్పఁ గారణ మయ్యెను.

శ్లో॥ యో మా మేవ మసంమూఢో, జానాతి పురుషోత్తమమ్
సపర్వవిద్భజతి మాం, సర్వభావేన భారత॥ ౧౫-౧౯.
భజంత్య నన్యమనసో, జ్ఞాత్వాభూతాది మవ్యయమ్॥ ౯-౧౩.
ఇతిమత్వా భజంతేమాం, బుధాభావ సమన్వితాః॥ ౧౦-౮.

ఇట్టి గీతావాక్యములవలన భక్తి జ్ఞానాత్మకమని చెప్ప వలనుపడదు. భక్తికి రాగము చిహ్నమని చెప్పుటచేతనే యది జ్ఞానముకాదని మున్నే సిద్ధించెను. అయినను బ్రహ్మజ్ఞానమునకు భక్తి గౌణముగ నయినను నుండునేమో యను సందేహ మిప్పుడు నిరసింపఁబడెను. కావున భక్తికి జ్ఞానము గౌణసాధనముగాని జ్ఞానమునకు భక్తి సాధనముగాదని సిద్ధాంతము.

ఓయీ! భక్తి రాగమని సాధించితివిగదా. "అవిద్యాస్మితా రాగ ద్వేషాభినివేశ"మని హేయములైన పంచక్లేశములలోఁ బతంజలి రాగమునుగూడఁ జేర్చెనుగదా. అట్టి హేయరాగము ముక్తికి సాధన

* తన్వతః ప్రపత్తిశబ్దాచ్చ నజ్ఞాన మితరప్రపత్తివత్॥ శాం. సూ. 9.

మెట్లగును ? సంసార విషయకరాగము హేయముగాని భగవంతుని యందలి రాగము హేయముగాదు. రాగము రాగత్వమాత్రమున హేయముగాదు. సంసారము హేయముగావున దాని విషయకమైన రాగము హేయము. భగవంతుఁడు హేయముకాఁడు కావున భగవంతునియందలి యనురాగము హేయముకాదు. ద్వేష మిట్టిదగుటచేఁ గదా భగవద్ద్వేషి శిశుపాలుఁడు ముక్తుఁడయ్యెను. భగవదర్పితమైన దెద్దియు హేయముగాదు. ఎట్లన, సాంగత్యము త్యాజ్యమనునపుడు దుష్టసాంగత్యమని భావముగాని సాధుసాంగత్యము కాదుగదా. "యజంతే సాత్త్వికా దేవాన్" గీత ౧౭-౪ అని యుండుటచే నీ రాగము సాత్త్వికరాగమే యగు.

కర్మ జ్ఞాన యోగ భక్తులలో నేది యుత్తమమో దానిని భగవంతుఁడే నిరూపించి యున్నవాఁడు.

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ, జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ, తస్మాద్యోగీ భవార్జున
యోగినామపి సర్వేషాం, మద్గతే నాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మాం, స మే యుక్తతమో మతః॥
గీ. ౬-౪౬, ౪౭.

కావున భక్తియే ప్రధానము. ఇది యర్థవాదము కాదు. ఎట్లన, ౧౨-వ యధ్యాయమంతయు ప్రశ్నోత్తర రూపమున నీ యాధిక్యమునే సాధించుచున్నదిగదా.

కావున క్లేశమునందే జ్ఞానమున కాధిక్యము భక్తి శ్రద్ధ[నమ్మిక] గాదు. ఏలన, "శ్రద్ధాభక్తులు" "వానికి శ్రద్ధ భక్తి లేదు." ఇత్యాది వాక్యములే యివి రెండు భిన్నములని తెలుపుచున్నవి.

అదియునుగాక గీత ౬-౪౭. "శ్రద్ధావాన్ భజతే యో మాం, స మే యుక్తతమో మత" అనియుండుటచే భక్తికి శ్రద్ధ యంగమగుచున్నది.

భక్తి క్రియాయోగము.

ఇఁక భక్తి నభ్యసించుమార్గము వివరింపఁబడును.

సా త్వస్మిన్ పరమప్రేమరూపా. నా. సూ. ౨.

సా పరానురక్తి రీశ్వరే. శాం. సూ. ౨.

స్నేహపూర్వ మనుధ్యానం భక్తి రిత్యభిధీయతే.

యని భక్తిలక్షణము వచింపఁబడెను.

భగవంతునియందే యెడఁదెగక యుంచఁబడు నత్యంతప్రేమకు భక్తియని పేరు. భగవంతునియందని చెప్పుటచేఁ దదితరులయందుంచఁబడు ప్రేమకు భక్తియను పేరులేదు. జననీజనకాచార్య భర్తలయందుంచఁబడు ప్రేమ [మాతృభక్తి పితృభక్తి గురుభక్తి పతిభక్తి] గౌణభక్తి యనఁబడును. మాతృదేవో భవేత్యాది వాక్యములు తల్లిలోనగువారు దైవములని చెప్పుటచే వారియందలి ప్రేమయు భక్తి యనఁబడునుగాని యీభక్తి గౌణభక్తియగు.

భక్తి రెండు విధములు. గౌణమని పరమని. గౌణ మధమము. పరభక్తి యుత్తమము. గౌణభక్తి పరభక్తికి సహాయకారి. గౌణభక్తి క్రమక్రమాభివృద్ధిఁగాంచి పరభక్తిగఁ బరిణమించును. భగవంతునియందని చెప్పుటచే నితరదేశములయందలి భక్తియు గౌణభక్తియే. ఇచ్చట భగవంతునియందని చెప్పుటచేఁ ప్రకృతివిశిష్ట జీవసంబంధములేక నిత్యమై నిరవద్యమైన భగవత్స్వరూపములన్నియు గ్రాహ్యములే. కావున ముఖ్యావతార మూర్తులయందలి యత్యంత ప్రేమయు భక్తియనఁబడును.

ఎడఁదెగక యని చెప్పుటచేఁ దీరిక యున్నప్పుడు రామరామ కృష్ణకృష్ణ యని భక్తిసేయుచుఁ దక్కినవేళఁగార్యాంతరాసక్తినుండుట భక్తియనఁబడదు, దేహ మేపని చేయుచున్నను మేలుకని యుండు నంతకాలమున యావజ్జీవ మరనిమిషమైన విరామములేక నూనెధార వలెఁ దెఱపిలేకయుండు ప్రేమయే భక్తియనఁబడును.* దీనికి దృష్టాంతముగ "యోషాజార మివప్రియ"మ్మని శ్రుతి చెప్పెడు. పరపురు

*కావుననె ప్రహ్లాదుఁడు "నాథః యోని సహస్రేషు యేషుయేషు వ్రజామ్యహమ్। తేషుతే ష్వచలాభక్తి రచ్యుతాస్తు పదాత్వయి" నే నేజన్మమెత్తియుండినను నరక స్వర్గాదిలోకములం దెందుండినను నాయా జన్మముల నాయాదశల నచ్యుతా! నీయందు నాకు భక్తి చలింపకుండిన ట్లనుగ్రహింపుమని కోరెను.

షుని మనమున సర్వదా స్మరించుచునే జారిణి యెప్పుడెప్పు డతని కూటమి కలుగునాయని పరితాపపడుచునే గృహకార్యములెల్ల నిర్వర్తించుటయేగాక మగనిఁ గరఁగించునో యావిధముగఁ జేతులుకాళ్ళుపని చేయుచున్నను మనస్సు భగవంతునియందే యుండవలయును. (ఆర్యచరిత్రమాలికలో జనకమహారాజు బ్రహ్మచారికథ చదువుఁడు.) కృ. లీ. సం-౨. పుట ౧౭౬ పంక్తి ౯-౧౦ చూడుఁడు.

అత్యంతప్రేమ యనుటచే నెన్నివిఘ్నములు వచ్చినను నెన్ని విపత్తులు వచ్చినను దుదకుఁ దన ప్రాణమే పోవునట్లుండినను భక్తిని మాత్రము మానరాదు. కావున బంధువులందఱు వదలినను, దారపుత్రాదులు చచ్చినను, దారిద్ర్య మనుభవింపవలసి వచ్చినను భక్తిని మాత్రము మానరాదు వీరందఱు వలదువలదనినను జన్మజన్మమున వచ్చుచుందురు భక్తి యట్లు వచ్చునదికాదు కావున దానిని వదలరాదు. భగవంతునియందే యనునవధారణార్థకము భక్తి యవిభజ్యమని తెలుపుచున్నది. అనఁగా భక్తి భాగములుగఁ బంచఁబడునని కాదు ధనమునందుఁ బ్రేమయుంచెదను. భగవంతునియందును బ్రేమ యుంచెద ననరాదు. కాముఁడు రాముఁడు నొకచోట నిలువరు. కావున భక్తి భగవంతునియందే యేకాగ్రమై యుండవలయును. ఇతర కార్యాలోచనములచే నది యాక్రమింపఁబడరాదు. దాని కదియే ఫలము. అది జడముకాదు. కార్యయుక్తమైనది. అనఁగా ధ్యానమో కీర్తనమో పూజయో యేదియో యొకటి మనోవాక్కాయముల మూలముగ భగవద్విషయమైన కార్యము చేయుచుండునది కాని యూరకుండదు. భగవత్కార్యములే యన్నియుఁ జేయ వలనుపడనప్పుడు చేయునట్టి కార్యములనెల్ల భగవత్కైంకర్యముగ నెంచుట సులువు.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి, యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌంతేయ ! తత్కురుష్వ మదర్పణమ్। ౯-౨౭.
శుభాశుభ ఫలై రేవం, మోక్ష్యసే కర్మబంధనైః
సన్న్యాసయోగ యుక్తాత్మా, విముక్తోమాముపైష్యసి॥ ౯-౨౮
కృష్ణలీల. సం-౨. పుట-౩౮౮.

ఇట్టి భక్తివలన సంసారనివృత్తియు మోక్షసుఖము లభించును. (కృ.లీ. సం-౨. పుట-178 పంక్తి-23.) ఇది యమృతస్వరూపము. ఇది లభించినవాఁడు సిద్ధుఁడు నమృతుఁడుఁ దృప్తుఁడు నయి వేఱొండు దేనిని గోంచమైనఁ గోరఁడు. దేనికి శోకింపఁడు. దేనిని ద్వేషింపఁడు. మఱి దేనియందును రమింపఁడు. మఱి దేనియందు నుత్సాహము వహింపఁడు. దీనిని దెలిసినవాఁడు సంతోషపరవశుఁడగును. స్తబ్ధుఁడగును. తన యాత్మయందే క్రీడించువాఁడగును.

దీనికిఁ గామము కారణముగాదు. దీనివలనఁ గామములు త్యజింపఁబడును. త్యజించుటయనఁ గ్రియలు మానుటగాదు. కర్మఫలములను భగవంతున కర్పించుచు భగవంతునిఁదప్ప వేఱాశ్రయముఁ గోరకయు భగవంతుని యొక్కనియందే మనస్సుంచి దానికి విరోధములగు వానియం దన్నిట నుదాసీనుఁడై యుండుట యని యర్థము భగవత్కార్యము లనఁగా భగవత్కథాశ్రవణము, నామకీర్తనము, ధ్యానము, దేవపూజ లోనగునవి. వీనిని చేయవలయును గాని మోక్షసాధనములను నభిప్రాయముతో యజ్ఞదాన హోమాదులేవియు నాచరింపరాదు. కాని భగవత్కైంకర్యబుద్ధితోఁ జేయవచ్చును. భక్తి కుదిరినపిమ్మట నివియన్నియు ననావశ్యకములే యైనను బెకుర విషయమున నివి పరస్పరోపకారకములు. భక్తి యతిశయించు కొలఁది భగవత్కైంకర్యబుద్ధితోఁ గర్మములు చేయును. భగవత్కైంకర్యబుద్ధితోఁ గర్మములు చేయుకొలఁది భక్తియతిశయించును. అత్యంత భక్తి స్థిరపడినపిమ్మట సర్వకర్మములు పరిత్యజింప వచ్చునుగాని సందిగ్ధదశలోఁ బతనభీతిచే నాచరించుటే శ్రేయస్కరము. భక్తి కుదిరిన పిమ్మట వేదోక్త కర్మములు వదలినను భోజనాది దేహరక్షణ కార్యములను శరీరముండు వఱకుఁ జేయుచుండవలయును. 'శరీర మాద్యంఖలు ధర్మసాధన' మన్నట్లు శరీరము నిలువకున్న భక్తి యోగము సాధించు టెట్లు ? కావున దేహధారణమునకుఁ గావలసినంతమాత్రము శారీర కార్యములు సలుపవచ్చును. కర్మములు పరిత్యజింపవచ్చు ననఁగా భక్తునిమనస్సుభక్తితో నిండితన్మయుఁడైన కారణమున నిత్యనైమిత్తిక

ములు తమంతటఁదామే వదలిపోవును, అట్టి తన్మయత్వ దశయందుఁ గర్మములు చేయకుండుట దోషముగాదు.

భక్తి యోగము నభ్యసింపఁగోరు ముముక్షువు తొలుత భగవద్గుణముల గుఱించియుఁ బ్రపంచమునకు నాయనకుఁ గల సంబంధమును గుఱించియుఁ దత్త్వమెఱుంగఁ బరిశీలింపవలయును. ఇవి తెలిసిన పిమ్మటఁ గర్మములు చేయుటయం దాసక్తి కలుగును. ఆసక్తితోఁ జేయు గర్మములవలనఁ బ్రేమ జనించును. ఈ ప్రేమ పరభక్తిగాఁ బరిణమించినపిమ్మట ముందు చేయుచున్న నిత్యనైమిత్తిక కార్యములన్నియు మానవచ్చునుగాని శరీరపాతమువఱకు దేహరక్షాకార్యము మానరాదు. పడవను మంచిస్థితిలో నుంచనివాఁడు సముద్రమెట్లు తరించును.

భక్తి లక్షణములు.

పూజాదులం దనురాగము భక్తి లక్షణమని పారాశర్యుఁడు. కథాదులం దనురాగమని గర్గుఁడు. ఆత్మరతి కవిరోధముగనుండు పూజాదులు శ్రవణాదులని శాండిల్యుఁడు. ఆచరించు నవి యన్నియు భగవదర్పణము సేయుటయు మఱపుదగిలినయెడఁ బరమవ్యాకులత్వము భక్తిలక్షణమని నారదమహర్షియు* నభిప్రాయపడిరి. భక్తి భగవంతుని మనతోడి సమానదశకుఁ దెచ్చి యతిపరిచయము గలిగించును. తండ్రియని మిత్రుఁడని భర్తయని భగవంతుని భావించుటచే మిక్కిలి చనవుగలుగును. అతిపరిచితి యవజ్ఞతకుఁ గారణమన్నట్లు లీ చనవువలన నుపేక్ష జనించుటకు మాఱుగా సాక్షాత్కారమువలన భగవన్మహిమజ్ఞాన మెక్కువయై పూజాగౌరవములతిశయింపఁజేయును. దీనికి గోపికలే దృష్టాంతము గోపికలు కృష్ణుని భర్తగావరించి తమతో సమానునిగ నెంచినను నాయన భగవంతుఁడని మహామహిముఁడని మఱచినవారు గారు. అట్టి బుద్ధి వారియందు లేకున్న వారు జారిణులే. జారత్వమునందు నెదుటివారి సుఖమే తన సుఖమను భావము గలుగదు. జారుఁడు తన కామసంతర్పణమునకై జారుఁడగునుగాని

*నారదస్తు తదర్పితాఖిలా చారతా, తద్విస్మరణే పరమవ్యాకులతా. నా. సూ. 19. పునర్విశ్లేష భీరుత్వం పరమాభక్తి రుచ్యతే.

జారిణుల నుద్ధరించు తలంపునం గాదు. కృష్ణుఁడో గోపికలసుఖము తన సుఖముగాఁ జూచుకొనెనుగాని తనకామతృప్తికిఁ దాను వారితోఁ గ్రీడించినవాఁడు కాఁడు. అదియునుగాక జారులయందుఁ బ్రేమ మాఱుచుండును. జారుఁడొకస్త్రీనివిడిచి మఱియొకస్త్రీతో దానిని విడిచి వేఱొకస్త్రీతో భోగించును. జారిణియుఁ బురుషుల మార్చుచుండును. గోపికలు కృష్ణునిదప్ప మఱియొకనిని వలచిన వారుగారు.

మీఁదఁ జెప్పినవి గాక మఱికొన్ని భక్తిచిహ్నములు గలవు.

సమ్మానము, బహుమానము, ప్రీతి, విరహము, ఇతరవిచికిత్స, మహిమఖ్యాతి, తదర్థప్రాణస్థానము, తదీయత్వము, సర్వతద్భావము, అప్రాతికూల్యము, లోనగునవి.

౧. సమ్మానమనఁగా గౌరవము. దీని నభ్యసించినవాఁ డర్జునుఁడు.

శ్లో॥ ప్రత్యుత్థానంతు కృష్ణస్య, సర్వావస్థో ధనంజయః
నలంఘు యతిధర్మాత్మా, భక్త్యాప్రేమ్ణాచ సర్వదా॥ భార.ద్రోణ.

సర్వకాల సర్వావస్థలయందుఁ గృష్ణుఁడు వచ్చినపుడంతయు నర్జునుఁడు భక్తితోడను ప్రేమతోడను లేచి యెదురుగఁబోవుట మానినవాఁడు గాఁడు.

౨. బహుమానము. దీని నభ్యసించినవాఁ డిక్ష్వాకువు.

శ్లో॥ పక్షపాతేన తన్నామ్ని, మృగేపద్మేచ తాదృశి
బభారమేఘే తద్వర్ణే, బహుమాన మతింనృపః॥ నృసింహ పు.

ఆయన పేరునందలి పక్షపాతముచేత నాయన కన్నులవంటి కన్నులుగల జింకలు గమలములను, నాయన వర్ణమువంటి వర్ణముగల మేఘమును రాజు బహుమానించుచుండెను.

3. ప్రీతికి విదురుఁడు. (మహాభారతము. ఉద్యోగపర్వము.)

శ్లో॥ యాప్రీతిః పుండరీకాక్ష ! తవాగమన కారణాత్
సాకిమాఖ్యాయతే తుభ్యం, మంతరాత్మాసి దేహినామ్॥

పుండరీకాక్షా ! నీ వచ్చుటవలనఁ గలిగినప్రీతి దేహులయందున్నట నంతరాత్మవై యుండు నీ కేమని చెప్పుదును.

౮. విరహమునకు గోపికలు (విష్ణుపురాణము ౫-వ యంశము.)

శ్లో॥ గురుణా మగ్రతో వక్తుం, కింబ్రవీమి న నః క్షమమ్
గురవః కింకరిష్యంతి, దగ్ధానాం విరహాగ్నినా॥

పెద్దవారియెదుట నిటులు మాటలాడుట మాకుఁ దగదని చెప్పెదవా? విరహమనెడి యగ్నిచే దగ్ధులమైన మమ్ముఁ బెద్దవాఁ రేమి చేయఁగలరు.

౯. ఇతర విచికిత్సకు శ్వేతద్వీపవాసులు. నారదుఁడు తమ ద్వీపమునకు వచ్చినను నాయన దర్శనముకూడఁ దమ భగవత్సేవకు విఘ్నమని తలంచుచుండిరి.

౧౦. మహిమఖ్యాతికి యముఁడు (నృసింహపురాణము.)

శ్లో॥ నరకే పచ్యమానస్తు, యమేన పరిభాషితః
కింత్వయా నార్చితో దేవః, కేశవః క్లేశనాశనః॥

నరకమున బాధపడువానిని జూచి యముఁ డిట్లనియెను. సర్వ దుఃఖ నివారకుఁడై భగవంతుఁడైన విష్ణువును నీవేల యర్చింపక పోయితివి. విష్ణుపురాణము (౩-వ యంశము.)

శ్లో॥ స్వపురుష మభివీక్ష్య పాశహస్తమ్
వదతియమః కిలతస్య కర్ణమూలే
పరిహార మధుసూదన ప్రపన్నాన్
ప్రభురహ మన్యనృణాం నవైష్ణవానామ్॥

పాశముఁ జేతఁబట్టుకొని నిలఁబడిన తన కింకరునిజూచి వాని చెవిలో యముఁ డిట్లు చెప్పెను. ఓరి! విష్ణువును నమ్మియుండువారిని వదలిపెట్టుము. నే నితరమనుష్యుల కందఱకుఁ బ్రభువనేకాని విష్ణు భక్తులదండింప నధికారము నాకు లేదు.

౧౧. తదర్థ ప్రాణస్థితియనఁగా నాయన నిమిత్తమై ప్రాణములు

ధరించియుండుట. ఇట్టివాఁడు హనుమంతుఁడు. (రామాయణము ఉత్తరకాండము.)

శ్లో॥ యావత్తవ కథాలోకే, విచరిష్యంతి పావనీ
తావత్ స్థాస్యామి మేదిన్యాం, తవాజ్ఞా మనుపాలయన్॥

లోకములోఁ బావనమైన నీకథ యెంతకాలముండునో యంతకాల మది విని యానందించుచుండుటకై నీయాజ్ఞ పాలించుచు భూమిమీఁద నుందును.

మఱియు నారదాదులు ముక్తులయ్యును భగవంతు నారాధించుటకయియే కదా భూమిమీఁదఁ బ్రాణములతో నున్నవారు. కావుననే నృసింహతాపన్యుపనిషత్తునందు "యం సర్వే దేవానమంతి ముముక్షవో బ్రహ్మవాదినశ్చ" యని చెప్పఁబడుట.

౮. తదీయభావమునకు నుపరిచరవసువు. (మహాభారతము శాంతిపర్వము, నారాయణీయము.)

శ్లో॥ ఆత్మరాజ్యం ధనంచైవ, కళత్రం వాహనంతథా
ఏత ద్భాగవతం సర్వ, మితి తత్ప్రేక్షతే సదా॥

భాగవత మనఁగా భగవంతునకు సంబంధించినదని తలఁచుట. తనరాజ్యము, ధనము, భార్య, వాహనము లోనగునవి సర్వము భగవంతునివనియే యాయన యెల్లవేళలఁ దలఁచుచుండెను.

౯. సర్వము భగవన్మయమనుటకుఁ బ్రహ్లాదుఁడు (విష్ణుపురాణము) ప్రహ్లాదోక్తి.

శ్లో. ఏవం సర్వేషు భూతేషు, భక్తిరవ్యభిచారిణీ
కర్తవ్యా పండితైర్జ్ఞాత్వా, సర్వభూత మయంహరిమ్॥

హరి సర్వభూతమయుండని యెఱిఁగి పండితు లన్నిభూతము లందున నన్యమైన భక్తి నుంచవలయును.

౧౦. భగవంతునియం దప్రతికూలబుద్ధి. తన్నుఁ జంపవచ్చిన కృష్ణునిఁజూచి భీష్ముఁడు.

శ్లో॥ ఏహ్యేహి దేవేశ! జగన్నివాస
నమోస్తుతే శార్ఙ్గ గదాసిపాణే
ప్రసహ్యమాం పాతయ లోకనాథ!
రథాదుద గ్రాద్భుతశౌర్యసంఖ్యే॥ కృ.లీ. సం-2. పుట 433.

వీరుగాక యక్రూరోద్ధవ శబరి జటాయువులు గుహుఁడు లో నగువారి చరిత్రములు స్మరింపనగు. ఇవి యన్నియు భక్తిలక్షణములే.

మీఁద వివరించిన గౌణభక్తి లక్షణములన్నియుఁ బరభక్తికి సాధనములు. భగవద్గీతయందు నవమాధ్యాయము ౧౪-౨౮ శ్లోకములఁ జెప్పఁబడినవియు నిట్టివే. భగవంతుని నామములు కీర్తించుటయు నాయనచేసిన కార్యములను బాటలుగాఁ బాడుటయు నెట్లు లనురాగ ముదయింపఁజేసి పరభక్తి గలిగించునో యట్లే తక్కినవి కూడఁ బరభక్తిని గలిగించును.

శ్లో॥ స్థానే హృషీకేశ తవప్రకీర్త్యా
జగత్ప్రహృష్య త్యనురజ్యతేచ॥ భగవద్గీత ౧౧-౩౬.

నీగుణములు కీర్తించుటచే లోకమంతయు సంతోషించి యను రాగము కలదగుచున్నదని యర్జునుఁడు చెప్పెనుగదా. ఈ గౌణభక్తి లక్షణము లభ్యసించుటవలనఁ బరభక్తికి విఘ్నకారణములయిన ప్రతి బంధములన్నియుఁ దొలఁగిపోవును. మనస్సు నిర్మలమగును. పరభక్తి కివియేకదా ద్వారము

ఈ చెప్పిన భక్తిలక్షణములన్నియు నేకకాలముననే యభ్య సింపవలయునా? ఒక దానివెనుక నన్నియు నభ్యసింపవలయునా వీనిలో నేదైన నొకకొన్ని యభ్యసించినఁ జాలునా యని సందేహము కలుగవచ్చును.

శాస్త్రము దేశకాలమున నొనర్పవలయునని చెప్పఁబడిన యట్లే చేయవలయును. దేవపూజ చేయునపుడు గంధము ధూపదీప నైవేద్యాదులు పూజముగియులోపలఁ జేయవలసినవే కాని యుదయ మున నొకటి సాయంకాలమున నొకటి చేయరాదు. ఇట్టి విధిలేని చోట వారివారి యనుకూలతకొలఁది సందర్భములకొలఁది యక్క ఱకొలఁది చేయవచ్చును. ఇల్లు కట్టునపుడు గోడ లొకసారి పెట్ట బడును. దూలా లొకసారి యెత్తుదురు. వాసము లొకసారి పఱతురు సున్న మొకసారి పూయుదురు. అట్టులే యివియు నక్కఱలవసరము కొలఁది చేయఁ గలయును. ఏకాలమందైన నొకకాలమందుఁ గ్రమము

మీఁదఁ జెప్పిన వన్నియుఁ బూర్ణముగ సాధింపవలయునా? అక్కఱ లేదు. అత్యంత భక్తిశ్రద్ధలతో నొక దానిని విడువక పూర్ణముగ సాధించుచుఁ దక్కినవి యనుకూలపడినఁ జేయుచుఁ బడకుండిన విడుచుచు నుండవచ్చును. బలిష్ఠమైన దొక్కటైనను భగవంతుని సంతోషింపఁజేయును. కావుననే యిప్పటి మనచిత్తస్థైర్యములు తెలిసి పూర్వమహర్షు లిట్లు వచించిరి.

శ్లో॥ ధ్యాయన్కృతే, యజన్యజ్ఞైః త్రేతాయాం ద్వాపరేర్చయన్
యదాప్నోతి తదాప్నోతి, కలౌసంకీర్త్య కేశవమ్॥ విష్ణు పురా.

కృతయుగమున ధ్యానముచేతను, త్రేతాయుగమున యజ్ఞము లాచరించుటచేతను, ద్వాపరయుగమున నర్చనములచేతను, నే ఫలముగలుగునో యట్టి ఫలమే కలియుగమందు నామసంకీర్తనముచేఁ గలుగును. కావున వాఁడువాఁడు తనశక్తి సామర్థ్యములెఱిఁగి నిర్వంచనముగ భక్తి సలుపవలయును. వీనిలో నొకటి యెక్కువఫల మిచ్చునని కాని యొకటి తక్కువఫల మిచ్చునని కాని భ్రాంతి పడరాదు.

శ్లో॥ చేతసా సర్వకర్మాణి, మయిసన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య, మచ్చిత్త స్సతతంభవ
మచ్చిత్తస్సర్వదుర్గాణి, మత్ప్రసాదాత్తరిష్యసి॥ కృ.లీ. పు.428.

అని జ్ఞానయోగి కెట్టిఫలము గలుగునని చెప్పెనో యట్టిఫలమే పత్రిరి పూలు పండ్లు నీళ్లు భక్తితో నిచ్చువాఁడును బొందునని

శ్లో॥ పత్రంపుష్పం ఫలంతోయం, యోమేభక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత, మశ్నామి ప్రయతాత్మనః
యత్కరోషి యదశ్నాసి, యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌంతేయ, తత్కురుష్వ మదర్పణమ్
శుభాశుభ ఫలైరేవం, మోక్ష్యసే కర్మబంధనైః॥
భగవద్గీత ౯-౨౬-౨౮. కృ.లీ. సం-2. పుట 387-388.

కావున భక్తులు వారివారి శక్తికి ననురూపమైన దానిని వంచనములేక యభ్యసింపవలయును. పుణ్యకర్మముల బంధములు పాపకర్మ

ముల బంధములు దొలఁగినఁగాని పరభక్తి కుదురదు. అదియే పర భక్తికి ద్వారము. అవి తొలఁగవలయుననిన సర్వకర్మములు భగవదర్ప ణము చేయుచుండవలయును. అట్లు చేయుటకు మనస్సు సర్వదా భగవంతునియం దుండవలయును. అట్లు మనస్సు భగవంతునియందు నిల్పఁజేయుట దేనిద్వైన సరియే వానిలో నొక్కటి యెక్కువయేమి? మఱొక్కటి తక్కువయేమి?

శ్లో॥ కామతోఽకామతో వాపి, యత్కరోమి శుభాశుభమ్

తత్సర్వం త్వయిసన్న్యస్తం, త్వత్ప్రయుక్తః కరోమ్యహమ్॥

అని పురాణమునఁ గలదు.

పుణ్యకార్యములుగాని పాపకార్యములుగాని తెలిసి చేసినను దెలియక చేసినను సర్వము నీకై యర్పించితిని. నీచేఁ బ్రేరింపఁబడిన వాఁడనై చేయుదును.

శ్లో॥ జానామి ధర్మం నచ మే ప్రవృత్తిః
జానా మ్యధర్మం నచ మే నివృత్తిః
త్వయా హృషీకేశ! హృదిస్థితేన
యథా నియుక్తోఽస్మి తథా కరోమి॥

ధర్మమేదియో తెలియును. చేయుటమాత్రము లేదు. అధర్మ మేదియో తెలియును. మానుటను లేదు. ఇంద్రియముల కీశుఁడవైన భగవంతుఁడా! హృదయమం దుండు నీవెట్లు చేయించెదవో యట్లు చేసెదను.

శ్లో॥ యద్యత్కర్మ కరోమి తత్త దఖిలం శంభో! తవారాధనమ్॥

ఈశ్వరా! నే నేయేకార్యము చేయుచున్నవాఁడనో యది సర్వము నీ యారాధనమే.

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్య త్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి

దేహముచే వాక్కుచే మనస్సుచే నింద్రియములచే బుద్ధిచే మనస్సుచేఁగాని ప్రకృతిస్వభావమువలనఁగాని యేదేది చేయుచున్నానో యా సకలము పరమాత్మయగు శ్రీమన్నారాయణునకయి యర్పించుచున్నాను. కావున నెవ్వఁ డేమార్గ మవలంబించినను నిట్టి సమర్పణ మావశ్యకము. కొందఱు పూర్వవ్యాసములో వివరించినట్లు ప్రపత్తి చేసినవారు "మేమే యకార్యము చేసిన నేమి భయము. సర్వ మాయనయే చూచుకొనును. ఆభార మాయనది" యనగా వింటిని. ఇది కేవలము పొరపా టభిప్రాయము.

"నవేదబల మాశ్రిత్య పాపకర్మ రతిర్భవే"త్తని స్పష్టముగ ననుశాసనము గలదు. ప్రమాదవశమున నెవ్వఁడేని తెలిసియో తెలియకయో యొక యకార్యము చేసిన "స్వామీ యిట్టి యపచారదోషము కలిగె" నని పశ్చాత్తప్తుఁడై దీనుఁడై విన్నవించుకొని మరల నట్లు చేయకుండిన నట్టి దానికి నల్పశిక్షతో విడువఁబడునుగాని నేను భరన్యాసము చేసితినని తినరానివి తినుచుఁ ద్రాగరానివి త్రాగుచుఁ జేయరానివి చేయుచుఁ దాను నిర్దోషిననుకొనుట కేవల సాహసము.

## భక్తిసాధనములు—కర్తవ్యములు.

భక్తి తనంతఁ దాను బుట్టునదే కాని మనుష్యప్రయత్నముచే లభ్యపడునది కాదని మీఁదఁ జెప్పఁబడియెఁగదా. ఇట్లుండ ఒకనియందు భక్తి యుదయింపలేదు. ఇట్టివాఁడు "నా గతియేమి నాయందు భక్తి యుదయింపదయ్యెనే" యని శోకింపఁ గారణము లేదు. మనయందు భక్తి లేదేయను నిర్వేదమే భక్తి యుదయించుట సూచించుచున్నది.

భక్తుండుగాఁ గోరికగలవాఁడు—

౧. తనకుఁ బ్రీతిపాత్రములయిన నైహికపదార్థముల వదలి వేయవలయును. ఇట్లు వానిని నంటక ముట్టక తలఁపక యుండిన వానియం దభిరుచియుఁ గ్రమముగ నశించును. వదలుటకు సాధ్యముగాని దాని విషయమున నిస్పృహుఁడై యుండవలయును. ఈ యభిరుచి శీఘ్రముగ మానవలయునని యుండిన మనస్సును భగ

వంతునియందుంచవలయును. "పరందృష్ట్వా రసోప్యస్య నివర్తతే" యని భగవంతుఁడే చెప్పెనుగదా.

౨. సాధుసాంగత్యము ప్రారంభింపవలయును.* సాధువులు శ్రవణరసాయనముగ భగవంతుని కథలు కీర్తింతురు. అవి వినుటచే మోక్షమార్గమందు శీఘ్రముగఁ గ్రమముగ శ్రద్ధయుఁ బ్రీతియు భక్తియు నుదయించును. శ్రీరామచంద్రమూర్తి శబరి కిట్లుపదేశించెను. "ఓ పుణ్యాత్మురాలా! భక్తిసాధనములు తొమ్మిది అందు, ౧. సాధుసాంగత్యము. ౨. నాకథలు చెప్పుట వినుట పాడుట లోనైనవి. ౩. నా గుణముల వర్ణించుట. ౪. నా మాటలకు వ్యాఖ్యానము చేయుట. ౫. ఆచార్యుఁడు నేనని యుపాసించుట. ౬. నిష్ఠతో నన్నుఁ బూజించుట. ౭. సాంగముగ నామంత్రము నుపాసించుట. ౮. సర్వభూతములు నేనని తలఁచుట, నా భక్తులఁ బూజించుట, వెలుపలి పదార్థములయందు వైరాగ్యము శమము దమము. ౯. నా తత్త్వము విచారించుట. సత్సాంగత్యమువలననే నిస్సంగత్వము గలుగును. నిస్సంగుఁ డగువానికి మోహము దొలఁగిపోవును. ఆవల నిశ్చలతత్త్వజ్ఞానము కుదురును. దానివలన జీవన్ముక్తుఁ డగును. కావున సాధుసాంగత్యము ప్రథమమందే యవశ్యము చేయవలయును.

సాధుకృపవలనఁగాని భగవత్కృపాలేశమువలనఁగాని నిశ్చయముగ భక్తి లభించును. కాని సాధుసాంగత్యము మిగుల దుర్లభము. అగమ్యము. ఏ విధముగ నెప్పుడు లభించునో చెప్ప సాధ్యపడదు. లభించెనా యది యమోఘము. సత్ఫలము తప్పదు. ఇట్టి మహాత్ముల సాంగత్యము భగవత్కృపవలనఁ గలుగవలయునుగాని స్వప్రయత్నముచే లభించునది కాదు. సాధువునందట్టి మహిమ యెట్లువచ్చె

---

* శ్లో॥ నాహం వసామి వైకుంఠే, నయోగి హృదయేషుచ
మద్భక్తా యత్రగాయంతి, తత్రతిష్ఠామి నారద॥

శ్లో॥ సతాంప్రసంగా న్మమవీర్యసంవిదో, భవంతి హృత్కర్ణ రసాయనాః కథాః।
తజ్జోషణా దాశ్వపవర్గవర్త్మని, శ్రద్ధారతిర్భక్తి రనుక్రమిష్యతి॥ భాగ.

యందు లేని భగవంతునకు సాధువులకు భేదము లేదు. సాధువులు ప్రత్యక్ష భగవంతులు. సాధువేషధారులందఱు సాధువులని మాత్రము మోస పోరాదు.

త్యాజ్యములు.

భక్తులుగాఁ గోరువారు కొన్ని వదలవలయును.

దుష్టసాంగత్యము పూర్తిగ మానవలయును. అదియే కామము క్రోధము మోహము స్మృతిభంగము బుద్ధినాశము సర్వనాశము గలిగించును. (భ. గీ. ౨ అధ్యా. ౬౨, ౬౩ శ్లోకములఁ జూడుఁడు. కృ-లీల. సం-౨. పుట 340.

దుష్టసాంగత్యము తొలుత నల్పముగఁ జిన్న యలలవలెఁ బ్రారంభమైనను గడపటఁ దుఫానుతోడి సముద్రమై ముంచును. స్త్రీ ధన నాస్తిక చరిత్రముల వినరాదు. స్త్రీశబ్దము పుణ్యచరిత్రలై పతివ్రతలైన సీతా దమయంతీ చంద్రమతీత్యాదుల కన్వయింపదు.

అభిమానము దుఃఖము లోనైనవి వదలవలయును. ఇవి స్వభావగుణములు వదలుట యసాధ్యము కావున నట్లు వదలలేని వారు వానినెల్ల భగవంతునకు నివేదింపవలయును. అటు చేసినచో వీనివలనఁ గీడుకలుగుటకుమాఱు మేలే కలగును. కోపించిన భగవంతునే కోపింపవలయును. స్త్రీలు కామించిన భగవంతునే కామింపవలయును.

భక్తిపరు లితరులతో భగవద్గుణములను గుఱించిగాని దేవుఁడు కలఁడా లేఁడా యనికాని యెవరితోడను వ్యర్థవాదము చేయరాదు. భక్తులకు భగవంతుని మహిమ యునికియు ననుభవమువలననే తెలియుచుండును భక్తిలేనివారి కది కుంటేటికొమ్ము. వాదముచే గోచరింపఁ జేయునది కాదు. వారివారికి ననుభవమువలన గోచరమగును. కావున వాదము వ్యర్థము.

భక్తిపరుఁడు మమకారము మానవలయును. జనులు లేని స్థలము చేరవలయును. అనఁగా నడవికిఁ బొమ్మని యర్థము కాదు. ధ్యాన సమయమున విఘ్నములు కలుగకుండుచోటికిఁ బోవలయును. తన

యింటియందే యిట్టి ప్రదేశముండిన మేలు. అర్ధరాత్ర సమయము గృహమే నిశ్శబ్దముగ నుండును. పల్లెలయందైనఁ బగళ్ళ నెంతైన వెలుపలఁ బోవచ్చునుగాని పట్టనములం దిట్టిస్థలము దుర్లభము. కావు ననే పట్టనవాసము నిషిద్ధము. ఏకాగ్రత కుదురునపు డడవియందైనను మేలులేదు. పక్షుల కలకలమైన మనస్సును జలింపఁజేయును. సాధ్య మైనయెడల జనములేనిస్థలము దొరకిన మేలే. ఏకాగ్రతను జెఱుచునది విశేషముగఁ దన యంతరింద్రియమే కాని బాహ్యపదార్థములు కావు. అయినను ప్రారంభదశయందు బాహ్యపదార్థములనుండికూడ రక్షించుకొనవలయును.

లోకబంధ మున్మూలింపవలయును. లోకవ్యవహార మెంత తగ్గించిన నంత మనస్సు చంచలతయు వ్యర్థచింతలు తొలఁగిపోవును.

నిజయోగక్షేమ విచారము మానవలయును. దృఢమైన మనస్సుతో భగవంతుని నమ్మిన నాయనయే మన యోగక్షేమముల విచారించును, వానికై మనము శ్రమింపనక్కఱలేదు. ఆర్యకథా నిధులందు బాలబ్రహ్మచారి చరిత్రముఁ బఠింపుఁడు. (భ. గీ. ౯—౨౨ కృ. లీ. సం—౨. పుట 887.

త్రిగుణములకు లోఁపడరాదు. (భ.గీ.౨—౪౫ కృ. లీ. పు. 337.)

కర్మఫలముల నాశింపరాదు. శాస్త్రీయకర్మముల మాత్రము చేయుచు వానిని భగవదర్పితము కావింపవలయును. కర్మములు భగవత్ప్రీతిగ భగవత్కైంకర్యబుద్ధిఁ గావింపవలయును. ఆకారణమున నిర్ద్వంద్వుఁడు కావలయును. పరభక్తి ముదిరినపిమ్మట వేదవిహిత క్రియలుకూడ మానవచ్చును. క్రియలఁ దానుగ వేనిని సంకల్పపూర్వకముగ మానరాదు అత్యంతభక్తి ముదిరినపుడు వీని కెఱుకలేకయే తామంతట నవియే ముదిరిన పండుటాకులవలె రాలిపోవును. సారాయి త్రాగి మత్తెక్కినవానికి మొలమీఁదిగుడ్డ జాఱిపోవుట తెలియనట్లు భక్తిరసముచే మైమఱచి యుండువానికి నేకార్యము చేసినది యేది చేయనిదికూడఁ దెలియదు. ఆ విధముగఁ గర్మములు దొలఁగి పోవలయును.

భగవంతునియందుఁ గేవల మవిచ్ఛిన్నానురాగము కలవాఁడై యుండవలయును. ఇట్టి గుణములుగలవారు సాధువులు. ఇట్టివారి సాంగత్యము సాధుసాంగత్యము. ఇట్టివాఁడు సంసారమునుండి తాను తరించును, ఇతరులను దరింపఁజేయును. ఈప్రేమస్వరూపము మూఁగ దినిన మధురపదార్థము రుచివలె ననిర్వాచ్యము. నోర నుచ్చరించుటకు వలనుపడకుండిన నొకరికొక రెట్లుపదేశింతురనిఁ ప్రేమయును నది పరులవలన నేర్చుకొనిన వచ్చునదికాదు అది భగవత్కృపవలన రావలసినదే. యోగ్యతగల పాత్రమునందుఁ దనంతటఁ దానే ప్రకాశించును. సూర్యరశ్మి కలిగినఁగదా సూర్యునిఁ జూడఁగలుగుదుము. అట్టులే భగవత్కృప మనయందుఁ బ్రసరింపకుండిన భగవంతునిఁ జూడఁజాలము.

భక్తిపరుఁడు భక్తిని సిద్ధాంతముసేయు గీతలు శ్రీభాగవతము వాల్మీకిరామాయణము అధ్యాత్మరామాయణము విష్ణుపురాణము లోనగు గ్రంథములఁ బఠించుచుండవలయును. భక్తి స్థిరపడువఱకు సుఖదుఃఖేచ్ఛాలాభాదివ్యాపారములకుఁ బోఁగా మిగిలిన కాలమందొక యర్ధక్షణమైన వ్యర్థపఱుపక భగవచ్చింతనము కావింపవలయు. స్థిరపడినవెనుక వీనినెల్ల వదలి యదియొకటే చేయుచుండవలయును.

ఈ భక్తి గుణరహితమై, కామనారహితమై, ప్రతిక్షణము వృద్ధియగుచు నవిచ్ఛిన్నమై సూక్ష్మతరమై యనుభవరూపమై యుండును. ఈభక్తి లభించినవాఁడు తన యిష్టపదార్థమును భగవత్స్వరూపమునే సదా చూచుచుండును. దానినే వినుచుండును. దానినే చింతించుచుండును. ఇట్టి స్థితిక్రమముగ వచ్చునుగాని యొకపూఁట నొకనాఁట రాదు. తొలుత నొక యుద్దిష్టఫలమునోరి పురుషుఁడు భగవంతుని సేవించును. తరువాతఁ గొంతకాలమున కుద్దిష్ట విషయములందుంచిన ప్రీతిని భగవంతునికై మార్చి భగవంతునివలనఁ బ్రతిఫల మాశింపక భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడు గావున సేవయే యొక పరమానందమును గలిగించును గావునను భగవంతునిఁ బ్రేమించును. తల్లిబిడ్డన్యాయము స్మరించునది. కోరికలుకోరుట యనునది గుణభేద

మును బట్టియుండును.* అదియునుగాక భక్తిమార్గము తక్కిన యన్నిటికంటె సుగమమని మఱింతే చెప్పఁబడెను.♦ దీని కిదియే ప్రమాణముగాని వేఱొక ప్రమాణ మక్కఱలేదు. ఏలన భక్తి శాంతి రూపము పరమానందరూపము ఇట్లు శాంతుఁడై పరమానంద భరితుఁడై యుండువానికి లోకతంత్ర మెట్లు? లోకవ్యవహారము మానవలయునా యని సందేహింపఁ బనిలేదు. ఏలన వీఁడాత్మను లోకమును వేదమునుగూడ భగవదర్పితము గావించెను. భక్తి పరిణమించుచుండ లోకవ్యవహారము మానరాదు. సమస్త కర్మములు దేహముండువఱకు చేయవలయునే కాని వానివలనఁ గలుగు ఫలముమాత్రము భగవదర్పితము గావింపవలయు. "ఆప్రయాణాత్ తత్రాపిహిదృష్టమ్। అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్." బ్రహ్మసూత్రము ౪-౧ ౧౨-౧౬.

ఆర్తుఁడు జిజ్ఞాసువు అర్థార్థి చేయుభక్తి గౌణభక్తిగావున దానిని దాఁటి నిత్యదాస్య, నిత్యకాంతా భజనాత్మకమైన ప్రేమయే చేయఁ

---

*గీత 7-16, 19. కృ. లీ. సం-౨ పుట 376-377.

*"The path of devotion is easier than that of knowledge or action or concentration Because:

i Action and concentration do not diractly lead to salvation but only help on the progress of knowledge and devotion.

ii. Again, they are beset with difficulties and dangers of their own, as the followers of them gradually come to acquire 'powers' which are often liable to abuse

iii Indifference to worldly desire is a condition precedent to the employment of knowledge So is also the arrest of all wordly activity. But one may safely and successfully pursue the path of devotion, provided only that one believes in the existence, nature and attributes of God and dedicates the fruite of one's action to Him, in other words, does the will of god in everything.

iv. Again the pursuit of knowledge is dry and not very interesting in itself, while that of devotion is sweet and enjoyable.

SRISH CHANDRA BASU VIDYARNAYA.

దగినది. ప్రేమయే చేయఁదగినది. నిత్యదాస్యాసక్తి లక్ష్మణునియందును నిత్యకాంతాసక్తి గోపికలయందును గాననగు.

ఇట్టివారిలో నేకాంతభక్తులు ముఖ్యులు. ఈ యేకాంత భక్తులు ఫల ముద్దేశింపరు. మోక్షాదులు భగవంతుఁడు తానై యిచ్చెద ననినను నంగీకరింపరు. వీరే జ్ఞానులని గీతలో ౭-౧౬-౧౯ లోఁ జెప్పఁబడిరి. కృ. లీ. సం-౨. 376-377 పుటలు.

"Although sacrifices and the like are enjoined with a view to the origination of knowledge (in accordance with the passage 'They desire to know' Bri. Up. IV 4-22) it is only knowledge in the form of meditation which--being daily practised, constantly improved by repetition and continued up to death--is the means of reaching Brahman, and hence all the works connected with the different conditions of life are to be performed throughout life only for the purpose of originating such knowledge. This the Sutrakara declares in Ve. Su. IV, 1-12; 16; III, 4-33 and other places.] Thibauts translation S. B. E. Vol. XLVIII, page 16.

ఇట్టి సాధువులు పరస్పరము సంభాషించునపుడు డగ్గుత్తికయు గగ్గురుపాటు గానవచ్చును. వీరు తమకులము నేగాక భూమినే పావనము గావింతురు. (కృ. లీ. సం-2390-౨౧.) వీరు తీర్థములను దీర్థములుగా [పుణ్యజలముగా] కర్మములు కర్మములుగా [సత్ఫలముల నొసంగునవిగా] శాస్త్రములను సచ్ఛాస్త్రములుగాఁ జేయుదురు. వీరు తన్మయులు గావున వీరి కట్టిమహిమ కలుగుచున్నది. తన్మయత్వము సాధ్యమా యందురేని గోపికలయందు దానిఁ గననగు. అంతియగాక దేహతన్మయత్వము నొంది దేహము తానని దేహి తలఁచును గదా. ఎట్టి యాసక్తితో దేహతన్మయత్వము గలుగుచున్నదో యట్టిదానితో భగవంతుని సేవించిన భగవత్తన్మయత్వము గలుగును. వీరి భక్తికిఁ బితరులు హర్షింతురు. దేవతలు నర్తనము సేయుదురు. గోపికల భక్తికి దేవత లిట్లు చేసిరిగదా. (కృ. లీ. పుట 219, 10-11-12 పంక్తులు) వీ రుండుటఁబట్టి భూమియు రక్షకుఁడుగలదగును.

ఇట్టి యేకాంతభక్తులందు జాతి, విద్యా, రూప, కుల, ధన, క్రియాభేదములు లేవు.* ఏకాంతభక్తులకు సర్వము భగవన్మయము గానే కానవచ్చుచుండును. వారికిఁ గోరికలు లేవు. ఇట్టి సర్వబ్రహ్మభావము కుదిరి విరక్తి భక్తి ముదిరినవారి విషయమున జాతినీత్యాదులు పాటింపఁ బనిలేదు. అంతవఱకు వానిని వదలినఁ బతితుఁడగును.

ఈ యభేదమునకుఁ గారణ మేమన నందఱు తదీయులే. ◆ భక్తులందఱు భగవంతునికి స్వజనులే కావున వారిలోవారు భేదించుట భగవంతుఁడు సైఁపఁడు. కావుననేకదా రావణవధానంతరము రామదర్శనకాంక్ష సీత వచ్చుసమయంబున బరాబరిచేయుచు వానరులఁ గదుముచున్న విభీషణుని జూచి వీరందఱు నాకు స్వజనులు సుమా యని శ్రీరాములు విభీషణునిఁ గోపించెను.

భక్తులకుఁ గర్తవ్యములు మఱికొన్ని గలవు. వీనివలన సత్త్వగుణ మభివృద్ధియై మనస్సు నిలుకడ చెంది ధ్యానము స్థిరపడును. అవి యేవన: వివేకము, విమోకము, అభ్యాసము, క్రియ, కల్యాణము, అనవసాదము, అనుద్ధర్షము.

వివేకమనఁగా నాహారనియమము. పరిశుద్ధాహార భక్షణము వలన దేహము శుద్ధమగును. దేహము శుద్ధమైన మనస్సు శుద్ధ

---

* "Man advances in perfection in proportion to the perfection of that object which he loves above all other things and which loves him in return." SPINOZA.

నాస్తితేషుజాతివిద్యారూపకులధనక్రియావిభేదః 72 నా. సూ.

అధ్యాత్మరామాయణము ఆరణ్యకాండము ౧౦-వ అధ్యాయము.

పుంస్త్వే, స్త్రీత్వే, విశేషోవా, జాతినామాశ్రమాదయః
నకారణం మద్భజనే, భక్తిరేవహి కారణమ్.

పుంస్త్వము, స్త్రీత్వము, జాతి, పేరు, నను నివి యేవియు నాభజనమునకుఁ గారణములు కావు. భక్తియొక్కటే కారణము. "నశూద్రా విష్ణుభక్తాశ్చ" విష్ణుభక్తులు శూద్రులు కారు. కృష్ణుఁడు విదురునింట భుజించుట కిదియే కారణము. ఈ భక్తి నిర్గుణభక్తి యని మాత్రము మఱువరాదు. అంతవఱకు జాత్యాచారములు మానరాదు.

◆ యతస్తదీయాః.

మగును. సాత్త్వికాహారము దినువారి మనస్సు సత్త్వభూయిష్ఠమై యుండును గావున భక్తిపరులు సాత్త్వికాహారమునే భుజింపవలయును. పరిశుద్ధముగ నుండవలసినవి యాహారపదార్థములు మాత్రమే కావు. వంటచేయువారు వడ్డించువారుకూడ దేహము మనస్సు పరిశుద్ధముగ నుండువారై యుండవలయు. అనాచారులు దురాచారులుగ నుండ రాదు. ఈవిషయము రుక్మాంగదచరిత్రయందు విపులముగ వ్రాయఁబడియుండుటచే నిందు వ్రాయఁబడదయ్యెను. ఎట్టిది సాత్త్వికాహారమో, సాత్త్వికాహారముకూడ నెప్పుడు దుష్టమగునో, యెట్టివారి చేతియన్నము దినవచ్చునో యివి యన్నియు దానియందుఁ గననగు. దీనికిఁ బ్రమాణము ఛాందోగ్యోపనిషత్తు సప్తప్రపాఠకము ౨౬వ ఖండము. "ఆహారశుద్ధౌ* సత్త్వశుద్ధి స్సత్త్వశుద్ధౌ ధ్రువాస్మృతిః।

*"ఆహ్రియత ఇత్యాహారః, శబ్దాదివిషయజ్ఞానం, భోక్తుర్భోగాయాహ్రియ తేతస్య విషయోపలబ్ధిలక్షణస్య విజ్ఞానస్యశుద్ధిః ఆహారశుద్ధిః రాగద్వేషమోహదోషై సంస్పృష్ట విషయవిజ్ఞానమిత్యర్థ" యని శంకరాచార్యులవారు వ్యాఖ్యానము చేసిరి. వీరి మతమున నాహారమనఁగా శబ్దాదివిషయజ్ఞానము. రామానుజాచార్యులవారు భోజన పదార్థమనియే వ్రాసిరి. దీనిపై

"He (Ramanuja) has given a peculiar meaning to viveka, but does not mean the discrimination of the real and the unreal: but purity of food. Though no one can deny that purity of food is necessary, flesh snd wine are not conducive to meditation, yet great and undue prominence is given to it in this system, with the result which every one knows."

STUDIES IN THE VEDANTA SUTRAS

అని యొకరు వ్రాసిరి కొందఱు రామానుజీయులం దిది విపరీతముగ వికారముగఁ బరిణమించుట సత్యమేకాని దాని కెవ రుత్తరవాదులు ? జారులు చోరులు సర్వము బ్రహ్మమనినచో దాని కుత్తరవాదు లెవ్వరు ? ఆహారశబ్దమునకు శంకరాచార్యులవా రొక యర్థమునుమాత్రమే వ్రాసిరి. అదియొకటే యర్థమని నాహారనియతిలేక చరించిన లోకము పాడగును. కావున రెండవయర్థముకూడ రామానుజాచార్యులవారు చెప్పిరి. రెండర్థములు గ్రహించిననే పూర్ణము. ఏ యొకటియైనను వ్యర్థమే. శంకరాచార్యులవారి యభిప్రాయము సరిగాదని తోఁచినచోట రామానుజాచార్యులవారు స్పష్టముగఁ బూర్వపక్షమే చేసిరి కాని యసంపూర్ణమని తోఁచినచోట విశేషవిష

స్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః" పరిశుద్ధాహారము భుజించుట వలన సంతఃకరణము నిర్మలమగును. అంతఃకరణము శుద్ధమైనయెడ స్మృతి యనఁగా విచ్ఛిన్నముగాని స్మృతి సంతానరూపాత్మధ్యానము సిద్ధించును ఆ స్మృతి లభించినా దానివలన నన్నిచిక్కులు (అవిద్యా రాగాదులు) వదలిపోవును.

వివేకమనఁగా, విషయములందు రాగము లేమి. ఛాందో, ౧౪-౧. "శాంత ఉపాసీత." నిశ్చలమై రాగద్వేషాది రహితమైన మనస్సుతో నుపాసింపవలయునని చెప్పుచున్నది.

అభ్యాసమనఁగా, విడువక మనస్సున భావించుచుండుట. "సదా తద్భావ భావిత" యని గీత ౮-౬, కృ.లీ. సం-౨. పుట 379.

క్రియలనఁగా, యథాశక్తి పంచమహాయజ్ఞము లాచరించుట. "క్రియావానేవ బ్రహ్మవిదాంవరిష్ఠః" (ముండ. 3, ౧-౪) క్రియలు చేయువాఁడు బ్రహ్మవిదులలో శ్రేష్ఠుఁడు. క్రియలనఁగా ఫలకాంక్ష లేక చేయు కృత్యములని గ్రహింపవలయును.

కల్యాణగుణములనఁగా, సత్యము ఆర్జవము దయ ఔదార్యము అసూయలేమి లోనైనవి. "సత్యేనలభ్య స్తపసా హ్యేష ఆత్మాసమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణనిత్యం" ముండ. 3, ౧-౫. "తేషామసౌ విరజో బ్రహ్మలోకః" ప్రశ్నోప. ౧-౧౬.

అవసాదమనఁగా, ప్రతికూల దేశకాల దుఃఖ స్మరణాదుల వలనఁ గలుగు దైన్యము. అదిలేమి యనవసాదము. "నాయమాత్మా బలహీనేనలభ్యో నచప్రమాదాత్తపసో వాప్యలింగాత్, ఏతై రుపాయై ర్యతతేయ స్తువిద్వాం స్తస్యైషఆత్మా విశతే బ్రహ్మధామ" ముండ. 3, ౨-౪. ఆత్మ బలహీనులచేఁ బొందఁబడునది కాదు. ప్రమాదమునఁ

యము నూరక చెప్పిరి. ఒకరు చెప్పినదానినే మరలఁ దాము చెప్పవలయునని వారి యభిప్రాయము గాదు. అంతియేకాని శంకరాభిప్రాయము తప్పని రామానుజాభిప్రాయము కాదు. శంకరాచార్యాభిప్రాయములు ఖండింపవలసినవి గీతాభాష్యమందును బ్రహ్మసూత్రభాష్యమందును ఖండించియుండుటచే మరల నుపనిషత్తులను రామానుజాచార్యులవారు భాష్యము వ్రాయరైరి. వారు పూర్వపక్షముచేయని శంకరాభిప్రాయము వారికి సమ్మతమే యని గ్రహింపవలయును.

గాని తపస్సుచేఁగాని యాశ్రమచిహ్నహీనులచేఁగాని పొందఁబడునది కాదు. బలవంతులు, ప్రమాదరహితులు, సలింగాశ్రములునగు విద్వాంసులు ప్రయత్నించినయెడల వారియాత్మ బ్రహ్మధామము ప్రవేశించును.

ఉద్ధర్షమనఁగా, నత్యంత సంతోషము. ఉద్ధర్షముగానిది యనుద్ధర్షము. మీఁద వివరించిన లోపములు తనయందు లేవుగదాయని మిక్కిలి సంతోషించుట. ఇదియును ధ్యానమునకు భంగము కలిగించును. ఏదియు మితిమించరాదు. "తస్మాదేవం విచ్ఛాంతో దాంత ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యతి" బృహ. ౪, ౪-౨౩. కావున నహింస సత్యము అస్తేయము బ్రహ్మచర్యము అప్రతిగ్రహము లోనగు యమనియమములు విడువరాదు.

చంచలమైన మనస్సును భగవంతునందే నిలుపుట రెండువిధముల సుకరమగును. ౧. సర్వకాల సర్వావస్థల నిశ్చింతుఁడై యితర విచారము లేక నిండుమనస్సుతో భగవంతునే భజింపవలయును. ౨. ఇది సాధ్యపడదయ్యేనేని భగవన్నామము సర్వకాలములఁ గీర్తించుచుండవలయును. ఇట్లు కీర్తింపఁబడినవాఁడై భగవంతుఁడు శీఘ్రముగ భక్తులకుఁ బ్రత్యక్షమై తన మహిమచే నించును. చూ. భగ. ౧౧-౪౫, కృ-లీ స-౨ పు-130. కావున భగవద్భక్తియే శ్రేష్ఠమైనది. "త్రిసత్యస్య భక్తిరేవగరీయసీ భక్తిరేవగరీయసీ" నా. సూ. ౮౧. అని నారదమహర్షి ద్విరుక్తిగఁ జాటించెను. కావున భక్తియే గ్రహింపఁదగినది.

భక్తియొక్కటియే యైనను నది వృద్ధియగుకొలఁది పెక్కుతరగతుల నొందుచున్నది. అవి యేవన: ౧. గుణమాహాత్మ్యాసక్తి, ౨. రూపాసక్తి, ౩. పూజాసక్తి, ౪. స్మరణాసక్తి, ౫. దాస్యాసక్తి, ౬. సఖ్యాసక్తి, ౭. వాత్సల్యాసక్తి, ౮. కాంతాసక్తి, ౯. ఆత్మనివేదనాసక్తి, ౧౦. తన్మయాసక్తి, ౧౧. పరమవిరహాసక్తి.

మీఁదఁ జెప్పినట్లు భగవన్నామసంకీర్తనము చేయుకొలఁది నామముల యర్థము విచారించుకొలఁది భగవత్కథలు వినుకొలఁది

మనస్సున నొకవిధమైన యానంద ముదయించును. ఈ యానంద మునకు రెండు కారణములు. ౧. భగవంతుఁడు సృష్టిస్థితిలయకర్త, సర్వజ్ఞుఁడు, సర్వవ్యాపి, సర్వశక్తి, సర్వేశ్వరుఁడు, సత్యకాముఁడు, సత్య సంకల్పుఁడు నని యీ మొదలగు భగవద్గుణమాహాత్మ్యములు తెలి యుటచే నాయన యింతటి మహిమకలవాఁడుకదా యను జ్ఞానము. ౨ భగవంతుఁడు త్రిజగన్మోహనరూపశీలుఁడు మన్మథమన్మథుఁడు దయా సింధువు భక్తవత్సలుఁడు దివ్యసుందరవిగ్రహుఁడు నని యాయన రూపము సౌందర్యము మాధుర్యములోనగు నవి తెలియుటచేఁ గలుగు ప్రేమచే మనస్సు గరఁగిపోవుట. ఇందు మొదటిది గుణ మాహాత్మ్యాసక్తి. రెండవది రూపాసక్తి. మొదటిది జ్ఞానమార్గము. రెండవది భక్తిమార్గము ఈత్రోవ నడచుచు భగవంతుని బూజిం చుచు ధ్యానించుకొలఁది భగవంతునకు మనకు నొకవిధమైన దేహ సంబంధ బంధ మేర్పడు. ఈ శరీరసంబంధ మేర్పడఁగానే యంత వఱకుఁ బ్రేమయుండియు భయముతో దూరదూరముగ నుండు వాఁడు కొంచెము సమీపమునకువచ్చి భగవంతుఁడు స్వామియని తాను దాసుఁడని పూజింప నారంభించును. దాసునందు భయము భక్తి రెండును గలసియుండుటచే స్వామికిఁ గొంచెము దూరస్థుఁ డయియే యుండును. ఇట్లు తొలుతొలుత దూరమునందుండి పూజించుచుండినను గ్రమక్రమముగ స్మరణము హెచ్చుచుండుటచే జనవుహెచ్చి భయముతగ్గి ప్రేమ హెచ్చుచురాఁగా స్నేహభావము కుదురును. ఇదియే సఖ్యాసక్తి. ఇందు భయముతగ్గుటచేఁ బరస్పర దూరస్థితి నశించుటయేగాక యిరువురు స్నేహితులనుభావ ముద యించుటచే సమనస్కులైన యిరువురు మిత్రులవలె నభేదముగ గోపబాలురు కృష్ణునితో నుండినట్లు వర్తించుట కలుగును. ఈ స్నేహము హెచ్చుకొలఁది సమానబుద్ధియుఁబోయి యశోదానందుల వలె భగవంతుఁడు కుమారుఁడని తాను తల్లియో తండ్రియో యను భావ ముదయింపఁగా దల్లిదండ్రులు పసిబాలురతో నెట్లో యట్లు వర్తింతురు. ఈ వాత్సల్యాసక్తియందును బిడ్డవేఱు తామువేఱని తల్లి

దండ్రులు తలఁచునట్లే తాను వేఱు భగవంతుఁడు వేఱను భావము దొలఁగకుండును. ఈవాత్సల్యాసక్తి వృద్ధికాఁగాఁ గాంతాసక్తి యుదయించును. ఈ కాంతాసక్తి రెండు విధములు. ౧ భార్యాసక్తి. ౨. ప్రియాసక్తి. తొలుత భార్యాసక్తి యుదయించును. అది ముదిరి ప్రియాసక్తి యగును. సీతారాములవలె రుక్మిణీకృష్ణులవలె నెంత ప్రేమగల భార్యాభర్తలయందైనను బ్రియాప్రియులయందువలెఁ బ్రేమ యవిచ్ఛిన్నమై యతితీక్ష్ణమై యుండదు. ఎంత ప్రేమవతియగు భార్యయైనను భర్త నవ్వులాటకైన నిష్ఠుర మాడిన నాఁడు సేమా కాని ప్రియుఁడు ప్రియురాలి మనస్సెప్పుడును నొప్పింపఁడు. దానియందు దోషమున్నను బ్రియునకు నది దోషముగా నే కానరాదు. కావున యర్జునుఁడు "పితేవపుత్రస్య సఖేవసఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవసోఢు"మ్మని వేఁడెను. కుమారుని యందుఁ దండ్రికి, మిత్రునియందు మిత్రునికి దోషము కానవచ్చుట క్షమించుట గలుగును. ఈ యిరువుర ప్రీతికంటె బలిష్ఠమగుట ప్రియస్నేహము కడపటఁ జెప్పఁబడెను. అనఁగా దోషమును నీవు మనస్సునకే తేవలదని యర్జునుఁడు ప్రార్థించెను. కృ.లీ సం-౨. పుట-౬98, 24. భార్యాసక్తి గోపికావస్త్రాపహరణమందును ప్రియాసక్తి రాధాకృష్ణుల యందును గననగు.* ఈకాంతాసక్తి వృద్ధియై యాత్మనివేదనాసక్తిగఁ

* ప్రియాసక్తి యందెంత చనువుగలుగునో యది గీతగోవిందము. ౨౪-వ గీతమునందుఁ గాననగు

కురుయదునందన చందనశిశిరతరేణకరేణ పయోధరే
మృగమదపత్రక మత్రమనోభవ మంగళకలశ సహోదరే॥

*          *          *          *

సరసఘనే జఘనే మమ శంబరదారణవారణ కందరే
మణిరసనా వసనా భరణాని శుభాశయ ! వాసయ సుందరే॥

సంభోగానంతరము రాధ కృష్ణునిఁగని తాను మునుపున్న విధముగ సింగారింపుమని చెప్పుటలో మకరికాపత్రరచనాదు లట్లుండఁగాఁ దాను విప్పి పాఱవైచిన చీరను దెచ్చి నడుమునకుఁగట్టి యొడ్డాణములు పెట్టుమని యడుగుచున్నది.

బరిణమించును. దీనియందు భక్తులు తమవని యేవి యెంచియుండిరో యర్థము, దేహము, ప్రాణము, సర్వము భగవంతునకే యర్పింతురు. ఇది నాదియను భావమే యుదయించదు. ఇది ముదిరి తన్మయాసక్తిగఁ బరిణమించును. ఇందు భగవంతునియందే మనస్సంతయు నుంచి తమ్ముఁ దామే మఱచి తాము భగవంతునినే యనుకరింతురు. (కృ.లీ. పుట 202) కృష్ణుఁడు మఱుఁగైనపుడు గోపికల కిట్టిదశ పట్టెను. ఇదియును ముదిరి పరమవిరహాసక్తియై పయ్యెదకొంగడ్డమైనఁ బ్రాణమే పోవునన్న స్థితికి వచ్చును. ఈ విషయము గోపికలవిషయమున వ్రాయునపుడు వివరింపఁబడెనుగాన నందుఁగాననగు. పరమవిరహాసక్తియే భక్తికిఁ బరకాష్ఠ. భక్త్యాచార్యులైన సనత్కుమారుఁడు [కుమారస్వామి] వ్యాసమహర్షి శుకులు శాండిల్య గర్గ విష్ణు కౌండిల్య శేషోద్ధవారుణి బలి హనుమ ద్విభీషణాంబరీష రుక్మాంగదాదు లనేకు లేకమతమున వచించి చరించిరని నారదమహర్షి వచించెను. మఱియు పార్వతికి శ్రీరామమంత్రము సప్తాక్షరి యుపదేశించుటచేతను నిది శివానుశాసనమనియు వచించెను. కావుననే యిది శివానుశాసనమనఁగా శుభకరమైన యనుశాసనము. ఈ మార్గముగాక తక్కిన యేమార్గమైన నశివమని నారదాభిప్రాయము.

"ఇత్యేవం వదంతి జనజల్పనిర్భయా ఏకమతాః కుమారవ్యాస శుక శాండిల్య గర్గ విష్ణు కౌండిల్య శేషోద్ధవారుణి బలి హనుమ ద్విభీషణాదయో భక్త్యాచార్యాః॥

య ఇదం నారదప్రోక్తం శివానుశాసనం విశ్వసితి శ్రద్ధత్తే సభక్తిమాన్ భవతి స ప్రేష్ఠంలభతే స ప్రేష్ఠంలభత ఇతి॥

భక్తియోగవైశిష్ట్యము, విధినిషేధములు లోనైనవి నారద శాండిల్య సూత్రముల ప్రకారము మీఁద వివరింపఁబడియెను. అది ప్రకారాంతమున నభ్యాసికి వలయు విధంబున సంగ్రహంబుగ నింక వివరింపఁబడును.

అవివేకు లగువారికి విషయములం దెట్టి ప్రీతిగలదో యట్టి ప్రీతిని భగవంతునియం దుంచుట భక్తియని ప్రహ్లాద మతము. ఈ

భక్తికి దేశ కాల పాత్రాది నియమములు లేవు. భక్తునకుఁ గోరికలు లేవు. మరలమరల జన్మింపవలయునే, మరణించిన నరకమునకే పోదునో స్వర్గమునకే పోదునో, మనుష్యుఁడుగానే పుట్టుదునో మృగముగానే పుట్టుదునో దేవతగానే పుట్టుదునో యను విచారము లేదు. శ్రీమంతుఁడుగ నగుదునో దరిద్రుఁడనగుదునో, బ్రాహ్మణుఁడుగా నుందునో చండాలుఁడుగా నుందునో యనియు సందేహింపఁడు. ఏలోకమం దుండనీ, యేదశయం దుండనీ, యతఁడు కోరునది భగవత్పాదారవిందములందలి భక్తి యొకటియే. అన్ని లోకములందు, నన్ని దశలందు, నన్ని పదార్థములందుఁ దన తోడునీడయై తనతోపాటు సుఖదుఃఖము లనుభవించుచుఁ దన్నుద్ధరింపఁగోరి భగవంతుఁ డున్నవాఁడు కావున నిఁకఁ దనకేమి భయమని యతని దృఢనిశ్చయము.

శ్లో॥ నాస్థా ధర్మేన వసునిచయే, నైవ కామోపభోగే
యద్యద్భవ్యం భవతు భగవన్! పూర్వకర్మానురూపమ్
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం, జన్మజన్మాంతరేపి
త్వత్పాదాంభోరుహ యుగగతా నిశ్చలాభక్తిరస్తు॥

శ్లో॥ దివివా భువివా మమాస్తు వాసో
నరకేవా నరకాంతక ప్రకామమ్
అవధీరిత శారదారవిందౌ
చరణౌ తే మరణేపి చింతయామి॥ ముకుందమాల.

శ్లో॥ నాథ! యోనిసహస్రేషు, యేషుయేషు వ్రజామ్యహమ్
తేషు తేష్వచలాభక్తి, రచ్యుతాస్తు సదాత్వయి॥ ప్రహ్లాదుఁడు.

భక్తుఁడు నిశ్చలచిత్తుఁడై చింతాభయములు లేక యుండును. ట్టులే దారిద్ర్యమువచ్చినా "అక్కా! భగవంతునిచే నాకు గుణ ంతము నేర్పవచ్చితివా? రా రమ్మని తోడఁబుట్టిన దానినివలె స్వీక ంచునేకాని బంధువులరాకకు లోభివలె నేడువఁడు. సుఖము చ్చినను నట్లే తలంచును. పులి యెదురుగవచ్చినను నది భగవం ని చిద్విలాసవేషమని యతనికిఁ దోఁచునుగాని యది యొక ఘాతుక

ముృగమని తోఁపదు. ఇట్టి భక్తి తొమ్మిదివిధముల సాధింపనగునని ప్రహ్లాద మతము.

శ్లో॥ శ్రవణం, కీర్తనం, విష్ణోః స్మరణం, పాదసేవనమ్
అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, మాత్మ నివేదనమ్।
ఇతిపుంసా ర్పితావిష్ణోః, భక్తిశ్చే న్నవలక్షణా। భాగ.

భగవంతుని చరిత్రము లొకరు చెప్పఁగా వినుట, చెప్పెడు వారు లేనప్పుడు తానే కీర్తించుట, స్మరించుట, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనమునని తొమ్మిది విధములు. వీనిలో నేదేనొకదానిని బ్రధానముగ నుంచుకొని తక్కినవి సందర్భానుసారముగ సమయమునకుఁ దగినట్లు లుపయోగించుకొను చుండవచ్చును. సర్వము భగవత్స్వరూపమను నిశ్చయజ్ఞానము కలుగుటకు భగవంతుఁ డుద్ధవున కుపదేశించినదానికంటె నుత్తమ మార్గంబు వేఱొండులేదు. (చూడు కృ. లీ. సం-3 పుట 242. ౧౦.)

ముక్తి సౌధమునకు మార్గమగు భక్తినిశ్రేణికి మొదటి మెట్టు సాధుసాంగత్యము. సాధువులన నెట్టివారో ముందు వివరింపఁబడెను. అట్టివారిలో నొకని గురువుగా గ్రహింపవలయును. ఈ గురువులలో వంశపరంపరగా వచ్చిన యోగ్యతగల యాచార్యుఁడు శ్రేష్ఠుఁడు. అట్టివాఁడు లేనప్పుడు క్రొత్తగురువును వరింపచ్చును.

ప్రతిమనుష్యుఁ డీ సంసారసాగరమును దాఁటియే యావలి యొడ్డు చేరవలయును. వేఱుపాయము లేదు. అది యెఱిఁగి జీవి స్వప్రయత్నపరుఁడు గావలయును. తన కత్యంత ప్రియము సుఖదము నైన యిష్టపదార్థము దూరమునందున్నప్పుడు దానిని జేరఁబోవు మనుష్యుఁ డెట్లు శ్రమించునో దానినే యెట్లు ధ్యానించునో యట్లు శ్రమింపఁదగు. అట్లు ధ్యానింపవలయు. ఇట్టి సముద్రమును దాఁటుటకు సహాయసంపత్తి కావలయును. ఉత్తమసాధనము భక్తియను నావ. ఇది సాధనముగా లభించినను సముద్రయాన మపాయముతోఁ గూడినది. నీటిలోఁ గొండలుండును. తిమి తిమింగిలాదు లుండును. సుడిగాలి వీచును. ఈ యపాయములపాలు గాకుండఁ

డప్పించుకొని పోవలయుననిన నీ మార్గ మెఱింగినవాఁడు పడవ నడుప నేర్చినవాఁడు సహాయుఁడుగా నుండవలయును. భగవంతునకంటె నుత్తమసహాయుఁడు వేఱొకరుఁడు లేఁడు. ఆయనను మన నావ నడపఁ బ్రార్థించినయెడల నత్యంత దయామయుఁడును దీనరక్షణమందు దుత్కంఠ గలవాఁడునగు నా భగవంతుఁడు తప్పక యంగీకరించి తానే మనుష్యరూపము వహించి సముద్రముఁ దాఁటింపఁ బూనుకొనును. ఇట్టి సహాయుఁడే గురువు. ఈయన మన మేలుగోరి వచ్చిన భగవంతుఁడు గావున నీయనను భగవంతుఁడనియే విశ్వసింపవలయును గాని మనరూపమున నున్నాఁడని మనయట్టి మనుష్యునిగఁ దలఁపరాదు. ఇట్లు మనకు లభించిన గురువు తాను సముద్రమునుదాఁటి యుపాయ స్థలములు సమయములు దెలిసి నావను నడుప సమర్థుఁడుగా నుండవలయును. అటు గాఁడేని తాను మునుఁగును, మనలను ముంచును. కావున సమర్థుఁడుగానుండు గురువునే వరింపవలయును. మనమై వెదకుచుఁబోయిన మన మజ్ఞానముచే నసమర్థుని వరించినను వరింతుము. కావున నాభారము మనయందుంచుకొనక భగవంతుని నమ్మి మన యత్నమున మన ముండిన నాయనయే మనకు నప్పుడప్పుడు కలసినవి స్వప్నములయందో యుపశ్రుతిరూపముగనో ధ్యానమందో గ్రంథపఠన సమయమందో తగుమార్గము స్ఫురింపఁజేయుచు మనుష్యరూపమున సహాయపడవలసిన సమయమునఁ దానైన వచ్చును కాక తగువానిని బంపును.

ఇట్టి నిశ్చయజ్ఞాన మార్పులేక నీవే గురువును గోరితివా యందు వాని గుణములఁ బరిశీలింపుము. ఇట్టివాఁడు పురాణశాస్త్రవాక్యము లప్పగించుచు నుపన్యాసము లొసంగు వాక్శుద్ధి గలవాఁడుగా నుండినంతమాత్రమున మేలు లేదు. నిందుకుండ తోఁచకదు. విషయము దానెఱిఁగి యాప్రకారము గురువు తాను నడచుకొనుచు నితలకు బోధించి నడవఁజేయు శక్తిగలవాఁడుగ నుండవలయును. కావున గురువునందు మొదటిగుణము జ్ఞానము భక్తి. రెండవది దురాచారహీనత సదాచారసంపత్తి. మూఁడవది శిష్యవాత్సల్యము. ఉపదే

శించు గురువు కేవల వాత్సల్యము గలవాఁడై యుండవలయునుగాని ధనాదికామాసక్తుఁడై యుండరాదు. ఈయన నేర్పవలసిన విషయమే భగవంతునియందలి యనురాగమును గుఱించి. అట్టియనురాగము లేనివాఁడును గొంచెముండినను గామాదులను విషముచే నది గలసి యుండువాఁడును గురువుగానుండ నర్హుఁడుగాఁడు. కావున నెవఁడు స్వప్రయోజనమునకై ధనాది కామముచే నుపదేశింపఁ బూనుకొను వానిని గురువుగా గ్రహింపరాదు. ధనార్జనాసక్తి ధనకామి యగుట దోషముకాని కేవల దేహరక్షణమునకో లోకోపకారమునకో దేవతాకార్యమునకో ధనమపేక్షించుట దోషముగాదు. కావున "శ్రోత్రియో, ఽవృజినో, ఽకామహతో యోబ్రహ్మవిత్తమ" యన్నట్లు గురువు విద్యావంతుఁడు, పాపరహితుఁడునై, కామహతుఁడుగానివాఁడుగా నుండవలయును. "అహేతుక దయాసింధు"వన్నట్లు గారణములేక మనయం దత్యంతప్రీతిగల యిట్టి గురువు లభించినా "ఆచార్యం మాం విజానీహి" యన్నట్లు లాగురువును సాక్షాద్భగవంతుఁడుగానే భావింపవలయును. మనుష్య స్వరూపమును ధరించిన యిట్టి గురువులలో నవతారమూర్తులు ప్రథములు. వీరే ప్రథమాచార్యులు. వీరే గురువులకుఁ బరమగురువులు. వీరే ప్రథమపూజార్హులు. మనతోఁ గలసిమెలసి మనకు మంచిచెడ్డలు చెప్పని నిర్గుణ బ్రహ్మ ముండిన నుండనీ లేకుండిన లేకపోనీ. మనకు మేఘునివలె సముద్రుఁడు ప్రయోజనపడఁడు. దేవుఁడు మనుష్యులవలె నగునా? మనుష్యుఁడైనపుడు మనుష్యగుణములేకదా కలుగును? అట్టివారిని గొలిచి లాభమేమి? యనువారు బుద్ధిలేని పశువులని వివేకానంద స్వాములవారు చెప్పిరి.* అది సత్యము. ఎట్లులన, నాలుగు వివిధా

* "Talk as you may, try as you may, you cannot think of God except as a man. You may deliver great intellectual discourses on God and on all things under the sun, become very great nationalists and prove to your satisfaction that all these accounts of the *avataras* of God as man are nonsense. But let us come for a moment to practical common sense. What is

కారములుగల పాత్రముల సముద్రమున ముంచినయెడల వానియం దలి నీళ్లాయాపాత్రముల యాకారమును వహించునుగాని వాని కంటె భిన్నమైన యాకారమును వహింపఁజాలదు. కావున నింద్రియా గోచరముగాని పదార్థము నింద్రియములచే గ్రహింపఁ బూనినప్పుడు మన యింద్రియములకు గోచరించు పదార్థములకంటె భిన్నమైన పదార్థము స్వరూపమును గ్రహించుట యసాధ్యము. శూన్యము

---

there beyond this kind of remarkable intellect? Zero, nothing simply so much froth. When next you hear a man delivering a great intellectual lectu e against this worship of the *Avataras* of God, get hold of him and ask him what *his* idea of god is, and what he knows by "omnipotence," 'omnipresence" and all simiiliar terms beyond the spelling of words He really means nothing by them; he cannot formu ate as their meaning any idea unafected by his own nature, he is no better off in this matter than the man in the street who has not read a single book. The man in the street, however is quiet and does not disturb the peace of the world, while this big talker creates disturbance and misery among mankind Religion is after all realisation, and we must make the sharpest distinction between talk and intutive experience. What are experiences in the depths of our souls is realisation.

By our present constitution we are limited and bound to God as man. If, for instance, the buffaloes want to worship God, they will, in keeping with their own nature, see him as a huge buffalo ... ... When men see Him, they see Him as man, and the animals, if they have any conception of God at all, must see Him as animal, each according to its own ideal. So we cannot help seeing God as man, and, therefore, we are bound to wership Him as man. There is no other way.

Two kinds of men do not worship God as man—the human brute, who has no religion, and the Paramahamsa, who has risen beyond all the weakness as of humanity and has transcen-ded the limits of his own nature ... ... The human brute does not worship because as his ignorance and the *Jivanmuktas* (free souls) do not worship because they have realised God in themselves."

SWAMI VIVEKANANDA'S BHAKTI YOGA.

ధ్యానింతుమనువారు తత్త్వవిషయమునం దోనామాలు తెలియ
మతిశూన్యులు.

కావున నవతారమూర్తులే సేవ్యులు. ఎన్నఁడో యుండిప
యిన యవతారమూర్తులు నేఁటి మనల నెట్లుద్ధరింతురని తలఁ
వలదు. వారి రూపములు మనకుఁ గానరాకపోయినవిగాని వా
తేజస్సు లోకమున నిండియేయున్నది. భగవంతుఁడేకదా యా రూ
ముల గోచరించెను. ఆయన త్రికాలసత్యుఁడుగదా. మనుష్యులు
నుండి మరణించిన మహాత్ములే తమ శిష్యులకు స్వప్నాదుల గో
రించి యోగక్షేమము లరయుచుండ నిఁక భగవదవతారమూ
లరయుట యేమివింత? కావున నవతారమూర్తులే సేవ్యులు. అ
తారపురుషులీ కాలమున లేరుగావున వారికి మాఱుగ భగవదా
రము లెట్టివని శాస్త్రములు చెప్పుచున్నవో యట్టి యాకారముల
గల్పించి దేవతలు మంత్రాధీనులు గావున మంత్రములచేఁ బ్రా
ప్రతిష్ఠాది కార్యము లొనర్చి వానిని శక్తితప్పినను భక్తితప్పకుఁ
గురువు బోధించినట్లు లర్చింపవలయును. ధ్యానింపవలయుఁ
సూర్యుఁ డస్తమించినంత మాత్రమున రాత్రులందు సూర్యతేజస
వేఁడిమి లేకపోలేదు. దీపాగ్నులందలి తేజస్సు సూర్యతేజస్సే.

వరణీయుఁడా యని గురువు నెట్లు శిష్యుండు పరీక్షించు
యట్లే గురువు శిష్యునిఁ బరీక్షింపవలయును. శిష్యుఁడు నిజము
బరమార్థచింతయు శ్రద్ధయు భక్తియు గురువాక్యంబునందు విశ్వ
సము గలిగి గురువే పరదైవతమని నమ్మువాఁడుగా నుండవలయు
సదాచారసంపత్తి గలవాఁడై యుండవలయు. గురు వుపదేశించి
మఱవక యభ్యసించు నోపిక శక్తిగలవాఁడుగ నుండవలయు. అర్థ
ప్రాణము నాచార్యులస్వాధీన మన్నట్లు తన సర్వస్వము గురుష
యని తలపోయువాఁడై యాయన యడిగినను నడుగకుండినను నా
నను ధగురీతి సమ్మానించుచుండవలయును. కలసి తెలియరా
తెలిసి కలయరాదన్నట్లు కలసినపిమ్మట గురువునందు దోషము
గానవచ్చినను నవి మనసునకు రానీయరాదు. తన్నుఁ గాపాడు

తన భక్తియేగాని గురుదేహము గాదు. ఏకలవ్యుఁడు ప్రాణప్రతిష్ఠయు లేని మట్టిద్రోణాచార్యులవలనఁ గదా కృతార్థుఁడయ్యెను. కావునఁ దనమేలు గోరువాఁడు గురువునందు దోషమెన్నరాదు. భక్తి తప్పరాదు.

ఒక గురువును నెనిమిదిమంది శిష్యు లాశ్రయించి తరణసాధనమైన యుపాయ ముపదేశింపుమని పీడింపసాగిరి. వీరు పెనులోభులు, సుగుణసంపత్తియు లేదు. వారి పోరాటము పడఁజాలక రారండని వారికి నొక్కొక్కరికి నొక్కొక్కయక్షర ముపదేశించి యీయక్షరమును మీరు జపించిన ధన్యులగుదురని గురువు బోధించెను. ఆ యుపదేశమునొంది యా లోభులు గురువుచెప్పినట్లు భక్తితో జపించిరి. వారి కందఱ కేకకాలమున మరణము తటస్థించెను. వారినిమిత్తమై దేవదూతలు విమానముఁదెచ్చి యందు వారి నెనమండ్రఁ గూర్చుండఁబెట్టుకొని యాకాశమార్గమునఁ బోవుచుండిరి. అప్పుడు వారు గురువును బ్రశంసించుచు నయ్యో మనకింత మేలొనర్చిన గురువున కేమియు సాహాయ్యము చేయకపోయితిమిగదా యని యాలోచించుచు నీ కేమంత్ర ముపదేశించెనని యొకరినొకరు ప్రశ్నించిరి. అప్పు డొకఁడు నాకు "గా" యనునక్షర ముపదేశించెనని చెప్పెను. మఱియొకఁడు 'డి', యొకఁడు 'ద', యొకఁడు 'కొ', యొకఁడు 'డు', యొకఁడు 'కు', యొకఁడు 'లా', యొకఁడు 'రా', యని యందఱు చెప్పిరి. అన్నియక్షరములు కలియఁబలికిన "గాడిదకొడుకులారా" యని యయ్యెను. అప్పుడు వారు గురువును దూషింపసాగిరి. భక్తి చెడుటచే వారందఱు విమానమునుండి నేలఁద్రెళ్ళిరి. కావున మనలఁ గృతార్థులఁజేయునది మన భక్తియే.

తన యిష్టదేవతను దప్ప వేఱుదేవతను గొలువరాదు. తన గురువునుగాని తన దైవమునుగాని దూషించువారితోఁ గలసి యుండరాదు. అట్లని యితరుల యిష్టదేవతలను గురువులను నిందింపరాదు.

భగవంతుఁ డన్నిటనున్నాఁడని యెఱిఁగి భక్తుఁ డన్నిటిని నందఱను బ్రేమించును. అహింసారతుఁడై తుద కాకో పండో కోయ

వలయుననిన భయపడును. యమ నియమములు పాటించును. ఇంద్రియ జయము ముఖ్యము భగవంతునందచంచలభక్తి యుంచుటకు మనస్సు సత్త్వభూయిష్ఠమై స్థిరమై యుండవలయును. సాత్త్వికాహారము వలననే మనస్సు శుద్ధమగు మనశ్శుద్ధిగలవాఁడే స్థిరమతియగు. స్థిరమతికే సర్వసందేహములు తొలఁగి భగవత్సాక్షాత్కారము లభించును. కావున భక్తుఁడు రాజస తామసాహారములఁ గొనరాదు. మితభుక్తియు బ్రహ్మచర్యము మానరాదు. అపరిగ్రహ మనుష్ఠింపవలయును, అనఁగా దనది కానిదానిని తనది యనుకొనరాదు. దేహము కూడఁ దనది కాదని యెఱిఁగి దేహాభిమానమే మానవలయుననిన నితరములగుఱించి యెఱిఁగ యేమి చెప్పవలయును.

ఇట్టి దశకే వైరాగ్యమని పేరు. సంసారములో నుండినను దానియందు రక్తిగలవాఁడు గారాదు. తనకంటె భగవంతుఁడు బుద్ధిమంతుఁడని యెఱిఁగి "యేకారణముచేతనో మనల నీ సంసారమున భగవంతుఁ డుంచినవాఁడు. ఇది మన మేలునకై యుండవలయు. కాదేని యెప్పుడో యీ సంకెలలను ద్రుంచియుండఁడా. భగవత్సంకల్పమునకు విరోధముగ మనము పోరాదు. మన కట్టియోగ్యత గలిగెనా యాయనయే యీ బంధములనెల్లఁ దొలఁగించు"నని నమ్మి తామరాకు పేరు, కుమ్మరపుర్వు బురద, నాలుక జిడ్డువలె, నుండవలయు. భగవంతుఁడు తొలఁగించినదానిని గాని, తానై మానుకొన్నదిగాని మరల గ్రహింపరాదు. యోగక్షేమభారము భగవంతునిపై వైచి నిశ్చింతుఁడై యుండవలయును. యదృచ్ఛాలాభ సంతుష్టుఁడై యుండవలయును. దేవునితో బేరమాడరాదు. నా కీకార్యము ఫలించిన నీకు రెండుటెంకాయలఁ గొట్టెద ననరాదు. ఇది గౌణభక్తి. ఉత్తమభక్తి కాదు. పరభక్తిలభించువఱకు గౌణభక్తియాచరింపవలయు.

భగవదనుగ్రహము శీఘ్రముగ లభింపవలయునని కోరికగలవాఁ డుత్కంఠయును బ్రేమయును నిమిషమైన విడిచియుండరాదు. కారుచిచ్చునందుఁ దగులుకొనినవానివలె నెప్పుడెప్పుడు తనను భగవంతుఁడు సాక్షాత్కరించునా ముక్తునిఁజేయునా యని తహతహ లాడు

చుండవలయును. ఏపని చేసినను భగవన్నామము సర్వదా స్మరించు చుండవలయును. అంకటాలు గృహమునఁ గార్యములు చేయుచున్నను మనస్సు ప్రియునందే యుంచునట్లు భక్తుఁడే కార్యమును జేసినను మనస్సు భగవంతునియందే యుంచవలయును. నేను నిర్భాగ్యురాలను నాకుఁ జావురాకపోయెనే యని పలుమాఱేడ్చు భార్యయందు మగనికిఁ బ్రీతితొలఁగునట్లు నేను బరమపాపిని నాకు మరణము రాలేదే, నేను బ్రదికి యెవరినుద్ధరింపవలయునని పలుమాఱు భక్తుఁడనిన భగవంతుఁడు సంతోషింపఁడు. భగవంతుఁడు పాపములఁ బోఁగొట్టునను నిశ్చయజ్ఞానము గలవాఁ డిట్టు లనఁడు. ఇదివఱకుఁ దాను జేసిన పాపముల హరించుమని భగవంతునకుఁ బెట్టిన దేచాలును. కావున భగవంతునియందు విశ్వాసముంచితిమిగదా మనమేమిపాపము చేసినను నాయన హరించునని క్రొత్తక్రొత్త దుష్కార్యములఁ జేయుచుండరాదు.

చుట్టు కంపనాటి మొలకను రక్షించునట్లు భక్తుఁ డారంభ దశయందుఁ దన కార్యములు రహస్యముగనే చేయుచుండవలయును. ఎవరేమనుకొనిన నాకేమియని దృఢనిశ్చయము కలిగి లజ్జ దొలఁగి భక్తి కుదుటఁబడిన పిమ్మట నెట్లున్నను భయము లేదు. ఆసక్తి తప్పరాదు. భగవంతుఁడు దీనజనపక్షపాతి గావున భక్తుఁడు దైన్యముకలవాఁడై యుండవలయు. గౌరవమును గోరరాదు. పరులు గౌరవించినను నగౌరవించినను నుపేక్షదగు. గౌరవము చిత్తౌన్నత్యమునకు నహంకారమునకుఁ గారణముకావున దానిని గాలకూటమువలెఁ జూడవలయు. గౌరవకాంక్ష గలచోట భక్తి నిలువదు. ఇతరులఁ దిట్టవలయునని కోరికపుట్టెనా నీ యిష్టదైవమునే తిట్టుము. కోపించిన నాయననే కోపింపుము. హితునికోపము ప్రేమమునే సూచించును. కోపముతోఁ జెప్పువాఁడు మేలుచెప్పును. నవ్వుచుఁ జెప్పువాఁడు చెడఁజెప్పును. ఎప్పుడు నితరుల మేలే కోరుము. సాధుసాంగత్యము మానవలదు. నగరవాసము మానవలయును. గ్రామవాసము క్షేమకరము. అందును జనులులేనిచో టుత్తమము. ఇట్టిచోట నొకరు నిన్ను నవ్వుదు

రను జంకుండదు. సంగీతవిద్వాంసులు పాడు పాటలకంటె నీవు నీ యిష్టముచొప్పున గానముచేయు భగవత్కీర్తనలే వేయంతలు శ్రేష్ఠములని నమ్ముము. రాగము తప్పెనో తాలము తప్పినదేమో యను సం విచారముతోనే నీకుఁ బనిలేదు. మనస్సొక్కటి భగవంతుని యందు నిలిపి నీయిష్టమువచ్చినట్లు లాడుము పాడుము కొఱఁతలేదు. తాలము తప్పినదని రాగముసరిలేదని స్వరము బాగులేదని భగవంతుఁడనఁడు. నందుని మందయందలి గొల్లవాండ్రెంతటి విద్వాంసులు? ఎంతటి గాంధర్వకళానిపుణులు? పిల్లవానితొక్కుపలుకులు తప్పటడుగులు తండ్రిని సంతోషపెట్టినట్లు నర్తకుల యాట పాటలు సంతోషింపఁజేయవు.

మగనిని విడిచి విటుల మరగి యిల్లువాకిలి వదలిపోయి స్త్రీ యెట్లు తుద కుభయలోకముల భ్రష్టురాలగునో యట్లు లిష్టదైవమును వదలి వేఱువేఱు దైవములకుఁ బోవువాఁడు భ్రష్టుఁడగును. అందఱు దేవతలేగదా యందఱియందు మనస్సుంచిన నేమియనుటయు నందఱు మగవారేకదా యందఱియొద్దఁ బరుండిననేమి యని స్త్రీయనుటయు సమానములు. ఇష్టదైవ మొక్కఁడే, యిష్టభర్త యొక్కఁడేకాని చచ్చినను బ్రతికినను మార్పుకూడదు. పతివ్రతయగు స్త్రీ యితరపురుషుల గుణవర్ణనము లెట్లు విననొల్లదో యట్లే భక్తుఁడుకూడ నితరదైవముల వర్ణనములు మనస్సున కెక్కనీయరాదు. రామకృష్ణాద్యవతారములు భిన్నవేషములని గ్రహింపవలయును గాని భిన్నదేవతలుగ నెంచరాదు. ఇతరదేవతలు భగవద్భక్తులని దాసులని యెంచవలయును.

దుష్టస్త్రీ దర్శనస్పర్శన సంభాషణములు నిషిద్ధములు:—

౧. మగని నలక్ష్యముచేసి దేవాలయములవెంటఁ దీర్థముల వెంట హరికథలవెంట గురువులవెంటఁ దిరుగునది. "నెఱ రంకుముండకు నిష్ఠ మెండు"గదా.

౨. సొగసుచేసికొని కులుకుచుఁ దిరుగునది.

3. భర్తృసేవ దేవసేవ విడిచి తన దేహసేవ చేసికొనుచు దైహికసుఖములఁ గోరునది.

౭. మృదుహృదయుగాని కఠినచిత్తురాలు.

౮. పురుషుని ముఖలక్షణములు గుణములు గలది.

౬. యౌవనమదము ధనమదము గలది.

౭. మగఁడు ప్రీతితో నిచ్చినవానితో సంతుష్టిపడక నాకవి కావలయు నివి కావలయునని పీడించునది.

౮. తన మగనిమీఁద నేరములు పరులతోఁ జెప్పునది. (చక్కదిద్దంగల పెద్దలగు నాప్తులతో రహస్యముగఁ జెప్పుకొనుట తప్పుగాదు.)

౯. తన భర్తసొమ్ము తాను దొంగిలించునది.

౧౦. దుష్ట స్త్రీపురుషుల సహవాసము చేయునది.

ఇట్టి స్త్రీలతోడను సహవాసము చేయరాదు. అట్టివారిని జూచిన దూరమునందె తొలఁగవలయు.

జారులు చోరులు ననాచారులు దురాచారులు కాపురుషులు సహవాసయోగ్యులు గారు. తక్కిన సుగుణము లెన్నియుండినను దయాదాక్షిణ్యములు దైవభక్తి లేనివానితోఁ గలసియుండరాదు. నిజమైన భక్తులు జ్ఞానులు దొరకిరా వారిని విడిచియుండరాదు. ఇతరులు చేసిన పాపములనుగుఱించి నీవేమియుఁ బ్రస్తావింపరాదు. ధ్రువ ప్రహ్లాదాది సాధువులయు సావిత్రి సీత దమయంతి చంద్రమతి లోనగు సాధ్వులయు భక్తులయుఁ జరితంబులు పఠింపవలయు స్మరింపవలయు పుణ్యవిషయములు మాటలాడుటవలనఁ బుణ్యము, పాపవిషయములు మాటలాడుటవలనఁ బాపము వచ్చును. ఆనందస్వరూపుఁడైన భగవంతునియెదుట నానందయుక్తుఁడై యుండవలయునుగాని తన గృహకృత్యములు లోనయినవి తలఁచి యేడుచుచుఁ బోవరాదు. తన విషయమున విడుతు నానందబాష్పములకుఁ బరుల కష్టమునకై తపించి విడుచు శోకబాష్పములకు భగవంతుఁడు సంతోషించునుగాని నిర్వేదమునఁగాక స్వవిషయమునుగుఱించి కార్చు శోకబాష్పములకు భగవంతుఁ డానందింపఁడు. మనస్సు భగవంతున కర్పించి యాయన లీలల నొంటరిపాటుల నాడుచుఁ బాడుచు నుంటివేని కన్నీరు తనంతటఁ

దానే ధారలుగఁ గాఱును. మనస్సు కరఁగినఁగాని కన్నీరు కాఱదు. కన్నీరు కాఱువఱకు మనస్సు కరఁగదు. దుఃఖముగాని సంతోషము గాని పూర్ణముగా లేనప్పుడే కన్నీరు కాఱును. పరిపూర్ణముగ నున్నప్పుడు కన్నీరు రాదు. కన్నీరు కాఱుట కొన్నాళ్లకు నిలిచిపోవును. "అన్యథా శరణంనాస్తి త్వమేవ శరణం మమ" "నాకు వేఱుదిక్కు లేదు నీ వేది"క్కని దేవునితోఁ జెప్పి యావలఁబోయి నన్ను విచారించు దిక్కులేదే నాకు దిక్కెవ్వరని భాగ్యవంతులయు నధికారులయుఁ బంచలుకాచి పడియుండవలదు. ఇటు చేయుట భగవంతుని మోసముచేయుట యగును. భక్తి యోగమార్గముల వర్తించువాఁడు తోలుతఁ దనచర్యల నెవరెఱుఁగకుండ రహస్యముగ దాఁపవలయును. లజ్జ దొలఁగి చిత్తము దృఢపడినపిమ్మట నెట్లున్నను భయము లేదు. త్రాగుఁబోతులు సారాయిసీసా మూఁతలను రహస్యముగఁ దీసి త్రాగుదురు. మత్తెక్కినపిమ్మట వీథులలోఁబడి పొరలాడుదురు. భగవచ్చింతనమం దిట్టి మత్తెక్కినవాఁడే ధన్యుఁడు.

ఒక సాధు వొక రాత్రి యొక ధనికునియింటికిఁబోయి యీ రాత్రి యీ వాకిటఁ బండుకొనవచ్చునా యని యడిగెను. ఇది సత్రముగాదు. ఇల్లుసుమా యని భాగ్యవంతుఁడు పలికెను. అయ్యా! నేను సత్రమని పొరపడితిని క్షమింపుము. ఈ యిల్లెవరిదని సాధు వడిగెను. నాది యని శ్రీమంతుఁడు చెప్పెను. ఎవరు కట్టించిరని సాధు వడిగెను. మా ముత్తాత కట్టించెనని ధనవంతుఁడు చెప్పెను. ఆయన యున్నాఁడాయని సాధు వడిగెను. లేఁడు చనిపోయెను. ఆయన కుమారుఁ డిందేయుండి యాయనయు మరణించెను. తరువాత మా తండ్రి యిందే నివసించి పరలోక మేగెను. ఇప్పుడు నేను నాబిడ్డలున్నారము. ఆ కారణమున నిల్లు నాది నావెనుక బిడ్డలదియని సంపన్నుఁడు పలికెను. అట్లైన నయ్యా ముందువచ్చినవారు ముందే పోయిరి క్రొత్తవారు వచ్చిరి. వారుపోయిన మఱిక్రొత్తవారు వచ్చిరి, నీవు పోయిన నీకొడుకులు వారు పోయిన వారికొడుకులు వత్తురు. అట్లైనచో సత్రమునకు దీనికి నేమిభేద మయ్యాయని సాధువడిగెను.

భాగ్యవంతుఁడు తెలివి తెచ్చుకొని యింటిలోనికిఁ దోడుకొనిపోయి యాయనను సత్కరించెను. కావున భక్తు లీప్రపంచమును సత్రమని భావింతురు. పోగబండిలో స్నేహితు లెట్టివారో మన స్నేహితు లట్టివారే.

భగవంతుని కిదియంతయు లీలయందురు. లీలయనఁగా నాట. బారాకట్ట యాడునపు డందఱకు మంచి పందెములుపడి యొకరికాయి లొకరు చంపుకొనక యెవరంతట వారు తమతమ కాయలు సునాయాసముగఁ బండవేసిన నా యాటయందు సారస్యముకలదా? ఈ యాటయందుఁ గొందఱకుఁ బందెములు పడును. కొందఱకుఁ బడవు. కట్టకడపట గ్రుడ్డిలోఁ గాయ పండవలసి యుండఁగాఁ బెద్ద పందెములు పడును. పందెములు కావలసియున్నప్పుడు గ్రుడ్డిపడును. ఒకరి జోడును జంప నుద్దేశించిన మనజోడును నున్నట్టుండి వేఱొక జోడు వచ్చి చంపును. ఇట్లు నానావిధములుగ నుండుటచే నది యాట యనిపించుకొనును గాని లేకున్న నందు వినోద మేమున్నది? ప్రపంచలీల యట్టిదే. మనమే కాయలము, భగవంతుఁడే యాటకాఁడు. చిన్నప్పుడు రుక్మిణమ్మ బారాకట్టయాడి యోడెను. ఎదుటివారు పరిహసింపఁగాఁ "గాయలాడెను కాయలోడెను నాకేమి నడుచు" నని ప్రత్యుత్తర మిచ్చెను. బుద్ధిమంతులు దీనిని బ్రపంచవిషయమున నన్వయించి యిందెంత యర్థమున్నదో గ్రహింతురుగాక. సూత్రధారుఁ డాడించిన నాడునట్టి తోలుబొమ్మలకు సంతోషింపను దుఃఖింపను స్వాతంత్ర్యము గలదా? కావున భగవంతుఁడు మనతో నాడుకొన్నట్లు మనము భగవంతునితో నాడితిమా యప్పుడుగదా వినోదమనుభవింతుము.

ప్రతివ్రత తన భర్తవస్తువుల నెట్లు ప్రేమించునో, తల్లి తన బిడ్డవస్తువుల నెట్లు ప్రేమించునో యట్లు భక్తుఁడును బ్రపంచమంతయుఁ దనకుఁ బ్రియుఁడైన భగవంతుని దను తలంపుతోఁ బ్రేమింపవలయును. పదార్థముల గుణాగుణములు విమర్శనీయములు గావు. ఇట్లు చేసినఁ బ్రేమ విస్తరిల్లును. పరులకై స్వార్థమును వదలుకొనువాఁడే ప్రేమరుచి

తెలిసినవాఁడు. అట్టి ప్రేమయందే యానందము గలదు. కావునఁ దన యానందము నిమిత్తము పరుల ప్రేమింపవలయును. ఏమి లాభము కోరి తల్లి బిడ్డను ప్రేమించును ?

తర్కమునకుఁ బ్రేమకుఁ సంబంధము లేదు. పరాభిప్రాయము తోడ నీకుఁ బనిలేదు. నీ భక్తి కార్యములు నీవు చేసికొను మంతియ కాని యితరుల దూషణములకుఁ జెవిటివాఁడవు గమ్ము.

భగవంతుఁడు మనలఁ బ్రేమించునట్లు మన మాయనను బ్రేమింపఁ జాలము. ఆలోచించి యాకీలెఱిఁగి ప్రేమించువారిని బ్రేమింపకుండుట కృతఘ్నతగదా యనితలఁచి ప్రేమ వృద్ధిచేసికొనుము. ప్రేమచేత నీవు భగవంతునికై యొకబొట్టు కన్నీరుగార్చితివా యాయనయు నీకై బానెఁడు కన్నీరు గార్చును. ఆయన నిమిత్తమై నీవు సర్వము మఱచితివా నీ నిమిత్తమై యాయన సర్వము మఱచును.

బృందావనము ప్రేమభూమి. అందుఁ బ్రేమగలవారికే నిలువ నెలవు దొరకును. శుష్కజ్ఞాననిష్ఠులకుఁ గర్మఠులకందుఁ బ్రవేశమే లభింపదు. నీయందెంతో ప్రేమతో రమింపవచ్చిన భార్యతో నీవు సరసపలాపములాడక "స్తోశ్చునాశ్చుః స్తమ్భుస్తుమ్భుస్కమ్భు అగ్నేర్ఢక్ ఫక్ఫిఞో రన్యతరస్యామ్మనియో స్త్రీభావాదావనిక్తిస్వే ల్లజ్ఞ్వచక్ర్యబ్యజఞ్ ఞ్నశా" యనియో శుష్కతర్క సూత్రములో తత్త్వశాస్త్రములో నుపన్యసింపఁబూనిన నీ ప్రియురాలి కెట్లుండునో యట్లే నిన్నుఁ బ్రేమించు భగవంతునితో నీవు మనస్సువిచ్చి ప్రీతితోడ భాషింపక కర్మజ్ఞానపరుండవై నచో భగవంతుఁడు నీయందు సరసభావము వహింపఁడు. ప్రేమించువిధమును భగవంతుఁడే గోకులమందు మనకు నేర్పియున్నవాఁడు. అన్నివిధముల మన మాయనను బ్రేమింపవచ్చును. అందు గోపికలప్రేమ యుత్తమోత్తమము. అట్లులే మన మాయనను బ్రేమించుట తగును. ఒక వస్తువును మనము విడిచి యుండఁ గలిగితిమేని దానియందు మనకుఁ బ్రేమ లేదనియే యర్థము నిజమైన ప్రేమగలవాఁడు ప్రియవస్తువును విడిచి యుండఁజాలఁడు. ప్రేమాధిక్యము కొలఁది వియోగతాప మధికమయి యుండును. కావున

వియోగతాపము ప్రేమాధిక్యమే. కావుననే పరమవిరహాసక్తి యత్యంత ప్రేమగాఁ జెప్పఁబడెను. కృష్ణుని విడిచియుండిన కాలములో కదా గోపికలప్రేమ యెట్టిదైనది తెలియనయ్యె. శ్రీరామునకై దశరథుఁడు ప్రాణములు విడిచెఁ గదా.

తొలుత సస్వరూపముతోఁ గానరాక యితర రూపములతోఁ గానవచ్చినను భక్తి యతిశయించినకొలఁది మన యిష్టదేవత మనము కోరిన రూపముతో మనతోడు నీడయై మనతోపాటు నిలిచినట్లు కూర్చుండినట్లు నడచినట్లు కన్నులకుఁ గానవచ్చును. మనస్సునకు స్పష్టముగఁ దోఁచును. సంభాషించును. చిత్తభ్రాంతి కల్పితరూపములు సంభాషింపవు. ఇట్లున్నట్లుండి కానరాక పోవును. హృదయము శూన్యమై పాడింటివలెఁ దోఁచును. పెన్నిధిఁ గోలుపోయిన పేదవలెఁ బట్టరాని దుఃఖము వచ్చును. అప్పుడు గోపికలకువలె నేడుపురాక తప్పదు. ఇట్లేడ్పించితిమా మరల యథాప్రకారము గోచరించును. వినోదమునకై బిడ్డల నేడ్పించి వేడుకచూచుట యెట్టిదో యట్టిదే యిదియు. భగవంతుఁడు లీలాప్రియుఁడు. ఇట్టి సమయంబుల నన్యథా భావంబు వహింపరాదు. అగ్ని తన ప్రకాశముచే మిడుతల నాకర్షించును. ఆ ప్రకాశమునకు మోహపడి మిడుతలు దానిలో దుముకును. ఇట్లు లాకర్షించిన మిడుతలను నగ్ని భస్మము చేయును. అట్లులే భగవంతుఁడు తన మహిమచే మన మనస్సుల నాకర్షించి లయింపఁజేయును. ప్రాణము పోవుటకుముందు మిడుత యెట్టితాపము కలదగునో యట్టి తాపమే మనస్సు లయించుటకుముందు మనకును గలుగును. కావున నిట్టి పరితాపము శుభసూచకమే. అతిసంతోషముచేతఁగాని యతిశోకముచేతఁగాని మనస్సు పరవశమై కలఁతచెంది యున్నప్పుడు సిగ్గుగాని భయముగాని తోఁపదు. మగఁడుగాని బిడ్డగాని చచ్చినపు డేడ్చు శీలవతులుఁ బైఁటలు చీరలు దొలఁగుటయు నెఱుంగఁజాలరు. అటులే పిచ్చివాండ్రును దయ్యము పట్టినవారును సారాయముచే మత్తెక్కినవారును లజ్జగాని భయముగాని యెఱుంగక వర్తింతురు. భక్తులును హరిచరణకమలామృతపానము చేయునపుడును వీరివలెనే వర్తింతురు.

విరహతాపము విశేష లాభకరము. ప్రియాప్రియు లెదుర నున్నప్పుడు కామము గలవారగుదురు కాని వేఱువేఱుగ నున్నపుడు వారిని బాధించునది ప్రేమయే కాని కామాతిశయముగాదు. ప్రియు దూరమై పోయెననియే తాపము. పలుచని చెఱకుపాలు బాగుగఁ గాచకున్నఁ గలకండ కాఁజాలదు. అట్టులే కామము ప్రేమముగా మాఱవలసియుండిన విరహతాప మావశ్యకము. పాలలోని నీరువలెఁ బ్రేమమునఁ గామము కలసియుండును. విరహతాపాగ్నికిఁ బాలు పఱిచినప్పుడు కామమనెడి నీరంతయు నింకి ప్రేమమనెడి పాలు గడ్డ కట్టును.

నిజమైన ప్రేమగల భార్యాభర్తలకు నితరులు చూచుటకు దేహములు వేఱుగా నుండునుగాని హృదయములు రెండు నొకటేయగును. ఇరువుర కభేదమగుటచే భార్యయే భర్తయగును. భర్తయే భార్యయగును. వీ రిరువుర నొకటి చేయునది ప్రేమమే. అట్టులే భగవంతునకు మనుష్యునకు నడుమఁ బ్రేమ ప్రవేశించి యొకరివంక కొకరి నిరువుర నాకర్షించి యొకటిగఁ గలుపును. అప్పుడు భక్తుడే భగవంతుఁడగును. భగవంతుఁడే యా భక్తుఁడగును. ఆ కారణము చేతనే భక్తునకు భగవంతునకు భేదము లేదని నారదుఁడు చెప్పెను. ఈ ద్విగుణలాభముచే భగవంతునికంటె భక్తుఁ డెక్కుడయ్యెను. భగవంతుఁడు చెఱుపఁదలఁచినవానిని భక్తుఁడు రక్షింపఁగలఁడు గాని భక్తుఁడు చెఱుపఁదలఁచినవానిని భగవంతుఁడు రక్షింపలేఁడు. కావున భక్తుల నవమానింపరాదు. అంబరీషోపాఖ్యానము స్మరించునది.

కం. సాధుల హృదయము నాయది
సాధుల హృదయంబు నేను జగముల నెల్లన్
సాధువుల నేన యెఱుఁగుదు
సాధు లెఱుఁగుదురు నాదు చరితము విప్రా.

భగవంతునియందలి ప్రేమ నభివృద్ధి చేసికొనఁగోరు స్త్రీలకుఁ బురుషులకు సులభోపాయ మొండుగలదు. మొట్టమొదటఁ దమ యిష్టదైవమును నిశ్చయించుకొనవలయును. ఇది కృష్ణచరిత్రము

కావునఁ గృష్ణునే యిష్టదైవముగ భావింతము. ఇంటిలో నలు ప్రక్కలఁ గృష్ణవిగ్రహములో పటములో యుంచవలయును. ఏదిక్కు దృష్టిపడినను గృష్ణునందుఁ బడునట్లుండ వలయును. ఇదిగాక స్త్రీ గాని పురుషుఁడుగాని తాను పండుకొనునపుడు నేలఁ బండుకొననీ చాఁపమీఁదఁ బండుకొననీ హంసతూలికా తల్పమందుఁ బండుకొననీ తా నొంటరిగాఁ బండుకొనునట్లుండినఁ గృష్ణమూర్తి రూపమును భావనాబలమునఁ గల్పించి యాయన తనతోడఁ బండుకొన్నట్లే యెంచవలయును. బయలనే చేయి యాడించుచు సంకల్పమువలనఁ గలిగిన కృష్ణుని జోకొట్టి పాటలుపాడి నిదురపుచ్చవలయును. మేలుకొన్నప్పుడు తనతో పాటయినను లేపనైన లేపవలయును. లేదా నాయనా! యింకను జీఁకటిగనున్నది పండుకొని యుండుము మరల వచ్చి లేపెదనని చెప్పి పోవలయును. తాను బలుదోముకొనుటకు ముందుగ నాబాలుఁడగు కృష్ణమూర్తికిఁ బలు దోమవలయును. వాస్తవముగ బాలుని కెట్లెట్లు ప్రీతిగల తల్లియో తండ్రియో చేయునో యట్లు చేయవలయును. తాను స్నానము చేయునపుడు ముందు కృష్ణునికి నీళ్లుపోసి దేహము తడియారఁ దుడిచి పట్టువస్త్రము గట్టనిచ్చి సొమ్ములుపెట్టి యాడుకొనఁ బంపవలయును. భోజనము చేయునపుడు తన తొడలమీఁదనో ప్రక్క పీఁటమీఁదనో కూర్చుండఁబెట్టి యన్నము పెట్టవలయును. తనతోపాటు చేయి మూతి కడుగవలయును. ఈ విధముగఁ దా నేమేమి చేయునో యవి యన్నియు ముందు కృష్ణునకుఁ జేసి తరువాతఁ దాను జేసికొన వలయును. తాను వీథిలో నడచిపోవునపుడు కృష్ణుని చంక కెత్తికొనియో చేయిపట్టుకొని నడిపించుకొనియో పోవలయును. తా నేది తినినను ముందు కృష్ణున కీయవలయును. అట్లులే తాను త్రాగునది ధరించునది సర్వము ముందు కృష్ణున కర్పింపవలయును. సర్వకాల సర్వావస్థలయందుఁ గృష్ణుఁడు తనతోడ నున్నట్లులే యెంచవలయును. దీనిని చక్కఁగ సాధించువారికి నచిరకాలములో భక్తి స్థిరపడును. భగవంతుఁడు ప్రసన్నుఁడగును.

ప్రహ్లాదుఁడు చెప్పిన సఖ్యములోనగు తొమ్మిదిటిలో సఖ్యము దాస్యము ఆత్మనివేదనమును నివి భావగతములు. ఒకసారి బాగుగ మనస్సున నాటుకొనిన పిమ్మట మరలమరలఁ జేయవలసిన కార్యము లేదు. మఱవక యుంచుకొనినఁ జాలును. చెప్పెడివారు లభించినపుడు శ్రవణము వందనార్చనములు సేవయు నాయాకాలములందుఁ జేయఁ దగినది. సంకీర్తనము చింతన మెల్లవేళలఁ జేయఁదగినది. మీఁదఁ జెప్పిన కార్యములు చేయుచున్నప్పుడంతయు భగవన్నామము కీర్తించుచుండవలయును. ఇం దొక్కొక్కటియుఁ బరభక్తికిఁ గారణమే యయినను నీకాలమున నామోచ్చారణ చింతనములు విశేషముగ విధింపఁబడినవి. నామోచ్చారణము చింతనంబనునవి సులభకార్యములే. అంతమాత్రముననే శ్రేయస్సుగలదా. ఇంతకు నామోచ్చారణమున నేమి విశేషముగలదని మందమతి తలంచుగాని దాని కష్ట మభ్యాసికి మాత్రమే తెలియును. సర్వకాల సర్వావస్థలయందు మేలుకొనినను నిద్రించినను, నేపని చేయుచున్నను మఱక భగవన్నామము జపింప దీర్ఘకాలాభ్యాసమునఁగాని సాధ్యపడదు. తలలోని పిడికెఁడు వెండ్రుకలు మనచేతఁ జిక్కిన మనుష్యుఁడంతయు మనకు వశపడునట్లు నామస్మరణము మనకు వశపడిన భగవంతుఁడు మనచేతఁ జిక్కినవాఁడే యగును.

రామకృష్ణ గోవింద నారాయణేత్యాది నామములలో నేదైన నుచ్చరింపవచ్చును. ఇట్లుచ్చరించినపు డాశబ్దము నర్థమును మనస్సులో ననుసంధించుచుండవలయును ఈ విధముగ మానసిక వాచిక వ్యాపారముల రెంటను భగవత్సేవ నొనర్చిన వారమగుదుము నామోచ్చారణమం దీ విశేషముండుటచేతనే శ్రీ శంకరాచార్య శిష్యులు.

శ్లో॥ గేయం గీతానామసహస్రం, ధ్యేయం శ్రీపతి రూపమజస్రమ్॥

భగవద్గీతయు విష్ణునామసహస్రము పారాయణము చేయవలయును. లక్ష్మీనారాయణ స్వరూపమును ధ్యానింపవలయును. అని

హితముపదేశించిరి. శ్రీశంకరాచార్యులవారును భజగోవిందం భజ గోవిందమ్మని నామమే స్మరించుట శ్రేయస్కరమని బోధించిరి.

ఈ నామోచ్చారణ చింతనములకు నిషిద్ధసమయములు లేవు. మడుఁగు మైల యను విచారము పనిలేదు.

నామోచ్చారణమందు ఫలము లేదేమో యని సందేహించు వా రొక్క పని చేయవలయును. వీథివెంటఁ బోవునపుడు ముందుగఁ గొందఱు పోవుచుండి రేని వారెవ్వరో వారిపేరు లేవో నీకుఁ దెలియకున్నను నూరక యోరి రామా యనియో కృష్ణాయనియో యేదైన నొకపేర నెవరినో మనము పిలుచునట్టివిధముగ గట్టిగఁ బిలిచిన నా పేరుగలవాఁడు తప్పక తిరిగిచూచును. ఇట్టి యనుభవము పెక్కురకుఁ గలిగియుండవచ్చును. ఈవిధముగనే భగవంతుని మన ముద్దేశింపక యాయనపే రుచ్చరించినను భగవంతుఁ డాయన కటాక్షము మనపైఁ బరఁగించును. ఇఁక బుద్ధి పూర్వకముగ నర్థవంతముగఁ బిలిచినఁ దలఁచినఁ గలుగు ప్రయోజనము చెప్పవలయునా? అజామిళ చరిత్రము స్మరింపుఁడు. బిడ్డలకు దేవతానామము లుంచుట కిదియే కారణము. కావున మనస్సు భగవంతునియందుండక పోయినను నోర భగవన్నామ ముచ్చరించుచునే యుండవలయును. నామస్మరణముచేఁ బ్రేమ లభించుఁ బ్రేమచే భగవంతుఁడు వశుఁడగును.

ఘోరవ్యాధిచే బాధింపఁబడువారు కొంద ఱతికష్టముమీఁద నెవరినో బ్రతిమాలుటకుఁగాను దామును తీసికొన్నట్టు లిష్టము లేక శ్రద్ధయులేక మందు తీసికొందురు. శ్రద్ధతోఁ దీసికొనిన నెక్కువ గుణమిచ్చు నౌషధ మశ్రద్ధతోఁ దీసికొనినఁ గొంతయైన గుణము చూపక తప్పదు. కొంత మేలుకలుగఁగానే పిమ్మట రోగియే యౌషధము నడిగి యిప్పించుకొని తీసికొనును. అట్టులే బాగుపడఁగోరిన సంసారి తొలుత శ్రద్ధలేకయైన భగవన్నామము స్మరింపవలయును. ఇట్లు కొన్నాళ్లు స్మరింపగాఁ నా యుచ్చారణమునందే యొక విధమైన యానందము మనస్సునకు గోచరించును. అవల వలదనినను

మానఁడు. దానికి విఘ్నముకలిగినఁ బరితాపపడును. భగవన్నామ స్మరణము రత్నము. ముక్తి గాజుపెంకు.

స్మరణమునందును ధ్యానమందును దొలుత నితరచింతలు రాక మానవు. వానిని గ్రమక్రమముగ నిలిపివేయువలయును. అంత వఱకు నవివచ్చి విఘ్నముకలిగించునని వ్యసనపడఁబనిలేదు. సర్వము భగవన్మయమే. కావున నవియు భగవన్మయమేయనియు భగవంతుని పనుపున నవి వచ్చునవనియుఁ దలఁచినయెడల వానియందుండు విషము పోయి యాకాలముకూడ భగవద్విషయమందే కడపినట్లగును.

భక్తియనుతీఁగ యల్లుకొనుటకు శ్రద్ధయను ప్రాపుండవలయును,

ఒక ప్రియపదార్థమును నేకాగ్రతఁగఁ దలంచునపుడు కన్నులు చెవులు పనిచేయవు. అట్లులే తక్కిన ప్రపంచమునకంతయు నీవు గ్రుడ్డివాఁడవు చెవిటివాఁడ వగుము. నాలుక మాత్రము విసుఁగు లేక హరిస్మరణ చేయుచుండనిమ్ము. అప్పుడప్పు దర్థానుసంధానము చేయుచుండును.

లోఁతు తెలియరాని నీటిలోని మీను భగవంతుఁడు. గాలము ములికి నామము: మన మనస్సు దానిని గట్టిన దారము. చేఁప యున్నదో లేదో యాగాలమునకుఁ జిక్కునో చిక్కదో యని దారమును వదలినఁ జేఁప చిక్కునాశ లేదు.

ప్రభువును మన యింటికిఁ బిలుచు నుద్దేశము కలదేని యిల్లంతయు శుభ్రముగానుంచి యలంకరింతుముకదా. అట్లులే హరికి వాసస్థానము చేయఁగోరు మన హృదయమును బరిశుభ్రపఱచి నిర్మలముగా నుంచవలయును.

భగవంతునికంటె భగవన్నామము బలీయము. ద్రౌపదీ కరిరాజ నారద ప్రహ్లాదాదుల రక్షించినది నామమేకదా. వాల్మీకి పఠించినది రామనామమేకదా. కృష్ణుఁడు సమీపమందుండియు ద్రౌపదీ పుత్రుల రక్షింపనేరఁడయ్యె. ఆయన నామము ద్రౌపదిని రక్షించె. రాముఁడు శరణుజొచ్చిన సముద్రుఁడు వినఁడయ్యె. రామనామము స్మరించి హనుమంతుఁడు సముద్రము దాఁటెను. కావుననే పెద్దలు

నామస్మరణముకన్న సంసారసాగరముఁ దరింప వేఱుపాయము లేదనిరి. కావున బుద్ధిమంతులగువారు యమనియమములఁ బాటించి సాత్త్వికాహారము మితముగఁ గొనుచు నుభయవిధ బ్రహ్మచర్యములలో నేదైన నొకదానిని గ్రహించి యర్థానుసంధానపూర్వకముగ భగవన్నామము నిరతము స్మరించుచుండుటవలన మోక్షకారణమైన పరభక్తి లభించును.

నిర్మలముగానుండు నద్దమునందే వస్తువులు ప్రతిఫలించును. కదలెడి నీటియందు సూర్యబింబము కానరాదు. కావున హృదయమున భగవంతుఁడు సాక్షాత్కరింపవలయుననిన దానిని నిర్మలముగాను కలఁతజెందనిదానినిగా నుంచుకొనవలయును. దీనికి రాజయోగము సహాయపడఁగలదు. భక్తి యనెడు పక్షికి జ్ఞానయోగరాజయోగములు ఱెక్కలు. కావున వీనిని సహాయముగఁ గొనుట మేలు. యోగవిషయమున స్త్రీలకుఁ బురుషులకు నొక హెచ్చరిక యియ్యవలసియున్నది. ఈకాలమున యోగము పశ్చిమద్వారమున వచ్చుచున్నది. కావున శుద్ధముగా లేదు, యోగము పూర్ణముగఁ దెలియకయు యోగము నేర్పెదమని పెక్కురు మోసగాండ్రు శిష్యుల శిష్యురాండ్రను ధనాశచేతను గామాతిరేకముచేతను జేర్చుకొనుచున్నారు. చెఱుచుచున్నారు. కావున యోగాభిలాషులు హెచ్చరికకలిగి తగినవారిని గురువులుగ వరింపవలయును. లేకుండిన నుభయలోకభ్రష్టులగుదురు. ఇప్పటికే గ్రంథము పెద్దదగుటను ముద్రింప ధనములేమిచేతను వీనినిగుఱించి వ్రాయ సాధ్యపడదయ్యె.

శ్లో॥ హరేర్నామైవ నామైవ భవభేషజమ్
కలౌనాస్త్యేవ నాస్త్యేవ, నాస్త్యేవ గతిరన్యథా॥

న్యూ విజయ ఆర్టు ప్రెస్ - తెనాలి.